# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 17 సంచిక : 10 హైదరాబాద్ 219 అక్టోబర్ 2019 పేజీలు : 68 రు. 25

- ఆర్థిక మాంద్యం అసలు స్వరూపం
- తిరోగమన దిశలో తెలంగాణ బడ్జెట్
- తుమ్మలపల్లె యురేనియం విషాదగాథ
- దేశానికి రానున్నవి చీకటి రోజులు
- అస్సాం జాతీయ పౌరసత్వ జాబితా
- కశ్మీర్ దుర్మార్గంపై మహిళల నివేదిక
- అమెజాన్ కార్చిచ్చుకు కారకులెవరు?

# వీక్షణం విడిప్రతి కొనుగోలు కోసం

## మీ సమీపంలోని ఈ కింది న్యూస్‌స్టాల్స్‌లో వీక్షణం విడిప్రతి కొనుక్కోవచ్చు

| | | |
|---|---|---|
| రైజింగ్ సన్ న్యూస్ ఏజెన్సీ (సోల్ డిస్ట్రిబ్యూటర్) | ఆబిడ్స్, హైదరాబాద్ | 96666 80857 |
| నవోదయ బుక్‌హౌస్ | కాచిగూడ, హైదరాబాద్ | 90004 13413 |
| సహచర బుక్‌మార్క్ | బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ | 98483 48173 |
| బాల రాజేశ్వర బుక్ డిపో | నల్లకుంట బస్ స్టాప్ హైదరాబాద్ | 9705055738 |
| వెంకటేశ్వర బుక్‌స్టాల్, స్టేషనరీ | నల్లకుంట, శంకర్‌మఠ్ హైదరాబాద్ | 040-66131071 |
| ఫస్ట్ లక్కీ పాన్‌షాప్ | విద్యానగర్ సిగ్నల్స్ హైదరాబాద్ | 9848672831 |
| సుధాకర్ బుక్‌స్టాల్ | సన్‌మాన్ హోటల్ పక్కన, తార్నాక హైదరాబాద్ | 9949337605 |
| వెంకటేశ్వర బుక్‌స్టాల్ | రామ్‌నగర్ గుండు హైదరాబాద్ | 9502964995 |
| భవాని బుక్‌స్టాల్ | శివం రోడ్ హైదరాబాద్ | 9849836996 |
| శ్రీభవాని బుక్‌స్టాల్ | శివం రోడ్ (ఇండియన్ బ్యాంక్ దగ్గర) హైదరాబాద్ | 9640712555 |
| ఓరియన్ బుక్‌స్టాల్ | అంబర్‌పేట్ (శ్రీరమణ టాకీస్ దగ్గర) హైదరాబాద్ | 7702535137 |
| అరవింద్ బుక్ స్టాల్ | రామంతాపూర్ (టివి స్టూడియో ఎదురుగా) హైదరాబాద్ | 8977995537 |
| నేషనల్ బుక్‌హౌస్ | అబిడ్స్, హైదరాబాద్ | 9394495189 |
| దుర్గా భవన్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9030656640 |
| డైమండ్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9885127491 |
| రాజు రామ్‌దాస్ బుక్‌స్టాల్ | మెహదీపట్నం, హైదరాబాద్ | 7799244409 |
| రిలయబుల్ బుక్ సెంటర్ | నానల్‌గూడ, హైదరాబాద్ | 040-23512447 |
| ఇస్పెక్ట్రం బుక్‌హౌస్ | లంగర్‌హౌజ్, హైదరాబాద్ | 98486 68354 |
| శ్రీ లక్ష్మి బుక్‌స్టాల్ | హైదర్‌గూడ, హైదరాబాద్ | 98855 81249 |
| మల్లిఖార్జున బుక్‌స్టాల్ | దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ | 90594 40756 |
| సుధీర్ బుక్‌స్టాల్ | తార్మాక, హైదరాబాద్ | 95426 04166 |
| లడ్డు బుక్‌స్టాల్ | పంజగుట్ట, హైదరాబాద్ | 99492 15135 |
| వినోద్ బుక్‌స్టాల్ | సరూర్‌నగర్, హైదరాబాద్ | 95536 03603 |
| రాజారెడ్డి బుక్‌స్టాల్ | చందానగర్ బిఎచ్ఇఎల్ | 93466 07648 |
| నవ తెలంగాణ బుక్ హౌస్ | చిక్కడపల్లి, హైదరాబాద్ | 94900 99373 |
| నవ తెలంగాణ బుక్ హౌస్ | బాగ్‌లింగంపల్లి-సుందరయ్య విజ్ఞాన కేంద్రం, హైదరాబాద్ | 94900 99378 |
| రాజ్ బుక్స్ స్టేషనరీ | ఓల్డ్ బస్‌స్టాండ్ దగ్గర, మెదక్ రోడ్, సిద్దిపేట్ | 87905 60097 |
| అక్షర బుక్ వరల్డ్, ఎటిసి మార్కెటింగ్ | న్యూ టౌన్, మహబూబ్‌నగర్ | 90102 10464 |
| శ్రీ స్వయం రాజరాజేశ్వర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుస్నాబాద్ | 90592 85948 |
| భాస్కర్ పాన్ షాప్ & జనరల్ స్టోర్ | కోహెడ | 95021 82545 |
| గణేష్ బుక్‌స్టాల్ | కళాభారతి ఎదురుగా, కరీంనగర్ | 97019 99007 |
| వినయ్ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మంచిర్యాల | 94407 57503 |
| పాండు బుక్‌స్టాల్, కూల్‌డ్రింక్స్ | ఆర్‌టిసి కాంప్లెక్స్, మిర్యాలగూడ | 98857 38144 |
| సత్యసాయి బుక్‌స్టాల్ | ఖమ్మం | 79890 81728 |
| రాజన్న బుక్ స్టాల్ | హనుమకొండ చౌరస్తా | 93955 07773 |
| మహాకవి శ్రీశ్రీ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, పార్వతీపురం | 73825 60366 |
| మణి బుక్‌స్టాల్ | సండేమార్కెట్, నెల్లూరు | 73862 23538 |
| సురేష్ బుక్‌స్టాల్ | శివాలయం వీథి, ప్రొద్దటూరు | 81210 02112 |
| క్రిసెంట్ న్యూస్ ఏజెన్సీ | కడప | 98852 35846 |
| పద్మావతి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, అనంతపూర్ | 73965 09767 |
| అనేక బుక్‌స్టాల్ | ఏలూరు రోడ్డు, విజయవాడ | 92472 53884 |
| మైత్రి బుక్‌హౌస్ | మజీద్ వీథి, అరండల్‌పేట, విజయవాడ | 98486 31604 |
| రాజేశ్ బుక్‌సర్వీస్ | ఆర్‌టిసి బస్‌స్టేషన్ కాంప్లెక్స్, విశాఖపట్నం | 99483 19842 |
| వి. భాస్కర్ న్యూస్‌పేపర్ ఏజెన్సీ | డాబా గార్డెన్, విశాఖపట్నం | 99482 90318 |
| రాఘవేంద్ర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, ఒంగోల్ | 90595 23091 |
| శ్రీదేవి సాయి కూల్‌డ్రింక్స్, కమ్యూనికేషన్స్ | దేవి చౌక్, రాజమండ్రి | 98489 84394 |
| త్రినాథ్ పాన్ షాప్ | మరిడి మహాలక్ష్మి టెంపుల్, రాజమండ్రి | 99519 76044 |

219 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

అక్టోబర్ 2019
సంపుటి : 17
సంచిక : 10





'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై 'VEEKSHANAM' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

**వీక్షణం ఆర్థిక పరిస్థితిని వివరిస్తూ చేసిన విజ్ఞప్తికి స్పందిస్తూ వీక్షణంను నిలబెట్టుకోవాలనే తపనతో ఆర్థిక సహాయం అందించిన ఉదయ్‌చందు, గుంటూర్ - రు. 500; పావని, ఢిల్లీ - రు. 6,000, బాల్‌రెడ్డి ద్వారా అమెరికా నుంచి సుధీర్‌రెడ్డి - రు.10,000; రిషి - రు. 3,500; విశాల్ గాంధీ రు. 3,127; భాస్కర్‌రెడ్డి కానుకుంట - రు. 14, 000. మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

వీక్షణం పత్రికలో గత నెలలో ప్రచురితమైన వ్యాసాలన్నీ బాగున్నాయి. నాకు తెలియని విషయాలను తెలుసుకున్నాను. ముఖ్యంగా ఉన్నావ్ ఘటనపై రెండు వ్యాసాలు వాస్తవాలను తెలియజేశాయి. అధికార బలంతో ఏం చేసినా చెల్లుతుందనే ధోరణిలో నాయకులు ఇష్టారీతిన వ్యవహరిస్తున్నారు. కేసులను పక్కదారీ పట్టించేందుకు భౌతిక దాడులకు దిగుతున్నారు. ఇది ప్రజాస్వామ్యం లో సహించరాని చర్య. ఒకవైపు మహిళల రక్షణకు చట్టాలను తీసుకొచ్చామని గొప్పలు చెబుతూనే.. వారే ఇలాంటి ఘటనలకు పాల్పడడంతో... కంచే చేను మేసిందన్న సామెత గుర్తుకు వస్తోంది. నిజం నిప్పులాంటిది. ఎన్నటికైనా.. వెలుగులోకి వస్తుంది. నిందితులు ఎంతటి వారైనా.. శిక్షించబడతారు. అధికార ముసుగులో దాక్కున్న వాళ్లందరిని బయటకు రప్పించేందుకు సామాజిక శక్తులు పనిచేస్తాయి. ఇందుకు ఉదాహరణే ఈ వ్యాసాలు. తమ కలంతో యుద్ధం ప్రకటిస్తున్న రచయితకు అభినందనలు.

మీ శ్రేయోభిలాషి..

(వీక్షణం ఈమెయిల్‌కు వచ్చిన ఉత్తరం)

వీక్షణం సెప్టెంబర్ సంచికలో కశ్మీర్‌పై వచ్చిన అన్ని వ్యాసాలు కశ్మీర్‌లో జరుగుతున్న పరిణామాల గురించి, కశ్మీర్ ఎలా ఏర్పడిందో, చరిత్ర గురించి చాలా వివరంగా ఉన్నాయి. కశ్మీర్ ప్రజలపై భారత సైన్యం చేస్తున్న దాడులు, వారు ఎదుర్కొంటున్న సమస్యల గురించి బాగా వివరించారు. అంతర్జాతీయ, ఇతర రాష్ట్రాలకు సంబంధించిన వ్యాసాలు వస్తున్నాయి. కాని, ఎపిలో జరుగుతున్న రాజకీయ పరిణామాల గురించి కాని, ఇక్కడి ప్రజలు ఎదుర్కొంటున్న ఇతర సమస్యల పైన వ్యాసాలు రావాల్సిన అవసరం ఎంతైనా ఉంది. కేంద్ర ప్రభుత్వం నల్లమలలో యురేనియం తవ్వకాలు జరపబోతే అక్కడి ప్రజలు తవ్వకాలకు వ్యతిరేకంగా పోరాడిన దాని గురించి, తవ్వకాలు జరిపితే జరిగే పర్యావరణ విధ్వంసం గురించి, అలాగే సాగునీరు, తాగునీరు అందించే కృష్ణా నదీ జలాలు యురేనియం తవ్వకాల వల్ల కలుషితమవుతాయని రత్నమాల గారు తన వ్యాసంలో చక్కగా వివరించారు. రెండు తెలుగు రాష్ట్రాల ప్రజలకు ప్రాణవాయువు అందించే, అలాగే వన్యప్రాణులు, ఎన్నో జంతు జాతులకు నిలయమైన నల్లమలను కనుమరుగు చేయాలని చూడడం విచారకరం. ఈ అటవీ సంపదపైనే ఆధారపడి ఎన్నో ఏళ్లుగా జీవిస్తున్న చెంచులను నిరాశ్రయులను చేసే ఈ తవ్వకాలను ఆపాలని వీక్షణం ద్వారా ప్రభుత్వానికి తెలియజేస్తున్నాను.

**- కృష్ణహరి**

మహబూబ్‌నగర్

సెప్టెంబర్ వీక్షణంలో 'ఎంత తీవ్ర ఖండనైనా సరిపోదనిపించే - దుర్మార్గం' పేరిట ఎడిటోరియల్ సూపర్బ్. 'కశ్మీర్‌పై భారత పాలకవర్గాల దురాక్రమణ' వ్యాసం తొక్కతీసి పండు నోట్లో పెట్టినట్టుంది. అభినందనలతో.

**- స్పందన**

హైదరాబాద్

యురేనియంపై ప్రజలను మరింత అప్రమత్తం చేయాల్సిన అవసరం ఉంది. ఈ పని వీక్షణం తన కర్తవ్యంగా చేయాలని, వ్యాసాలతో, సమగ్ర సమాచారంతో మరింత పదును పెట్టాలని ఆశిస్తున్నాను. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజలను తప్పుదోవ పట్టించే విధంగా వార్తా పత్రికల్లో వార్తలు వస్తున్నాయి. ఏది సరైనది, నిజమైనది తేల్చుకోలేని క్లిష్ట పరిస్థితుల్లో ప్రజలు ఉన్నారు. వారికి ఒక కరదీపికగా వీక్షణం నిలవాలని కోరుతున్నాను. యురేనియం వెలికితీత వల్ల ఎలాంటి నష్టాలు, ప్రకృతి పర్యావరణ విధ్వంసం, లేదా దాని వల్ల నిజంగా ఏమైనా ప్రయోజనాలున్నాయా పాఠకులకు వివరంగా తెలియజేయాలి.

**- టి. కృష్ణకుమార్**

నల్లగొండ

వీక్షణంలో ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించిన వ్యాసాలు చాలా తక్కువగా వస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో జగన్ పాలనా వ్యవహారాలు, పథకాలు, వాటి అమలు, ప్రజల అభిప్రాయాలు, రాజకీయ విశ్లేషణలపై వ్యాసాలు వీక్షణంలో కూడా ఉండాలి. కేవలం ఒక సంపాదకీయ వ్యాఖ్య మాత్రమే ప్రముఖంగా చదవగలుగుతున్నాం. విభజన తరువాత అక్కడి పరిస్థితులపై ప్రత్యేక వ్యాసాలు వస్తే బాగుంటుంది. ఆలోచించండి.

**- ఎం. శ్రీదేవి**

మహబూబ్‌నగర్

బిజెపి ప్రభుత్వం కశ్మీర్‌కు స్వయం ప్రతిపత్తి కలిగించే ఆర్టికల్ 370, ఆర్టికల్ 35ఎ రద్దు కశ్మీర్ ప్రజల జీవితాలను భయం గుప్పిట్లోకి నెట్టింది. ఈ సందర్భంలో దేశంలోని మీడియా కశ్మీర్ ప్రజల అభిప్రాయాలను, ఆకాంక్షలను ప్రకటించలేకపోయింది. అదే సందర్భంలో వీక్షణంలో కశ్మీర్ ప్రజల హృదయస్పందనను వ్యక్తం చేసే విశ్లేషణలు, రిపోర్టులు అందించి తన ప్రజాపక్షపాత వైఖరిని నిలుపుకున్నది.

**- ఎ. సమ్మయ్య**

కరీంనగర్

**వీక్షణం సెప్టెంబర్ సంచికలో 'కశ్మీర్ పై భారత పాలకవర్గాల దురాక్రమణ' వ్యాసం పేజీ నెం 14లో 1951కు బదులు 1981 అని అచ్చయింది. పొరపాటుకు చింతిస్తున్నాం. -సం**

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# ఫాసిజాన్ని నిలువరించడానికిదే సమయం

**భా**రత ప్రభుత్వం భారత్ ఆక్రమిత కశ్మీర్‌లో ఆగస్ట్ 5న ప్రారంభించిన దుర్మార్గమైన దండయాత్ర ఇప్పటికి యాభై రోజులు గడిచిపోయినా అడ్డూ ఆపూ లేకుండా కొనసాగుతున్నది. ప్రాథమిక హక్కుల మీద, వాక్సభాస్వాతంత్ర్యాల మీద ఆంక్షలు మాత్రమే కాదు, మనుషులు ఒకరితో ఒకరు మాట్లాడుకోవడానికి, అనారోగ్యానికో మరొక అవసరానికో బైటికి కదలడానికి, వీథుల్లో నడవడానికి, రాత్రి పూట ఇళ్లలో లైట్లు వేసుకోవడానికి, బహుశా శ్వాస పీల్చుకోవడానికి, ఒక్క మాటలో చెప్పాలంటే బతకడానికి వీలులేని దిగ్బంధనం ఆరువారాలకు పైగా సాగుతున్నది. కశ్మీర్ ప్రజల ఆకాంక్షలు మాత్రమే కాదు, కనీసం ఆవేదన, ఆక్రోశం వినడానికి, అర్థం చేసుకోవడానికి, ప్రచార సాధనాల్లో వ్యక్తీకరించడానికి వీలులేని దమనకాండ కొనసాగుతున్నది. ప్రజా సమస్యలను వ్యక్తీకరించే అన్ని రాజకీయ, పౌర, మాధ్యమాల వ్యవస్థలను ఉక్కుపాదం కింద అణచిపెట్టి నెలకొల్పిన శ్మశాన శాంతి గురించి పాలకులు ప్రగల్భాలు పలుకుతున్నారు. దేశంలోనూ, అంతర్జాతీయంగానూ వ్యతిరేకతను వినబడకుండా చేయడానికి నిరసనలు అణగిపోయేంత రభస సాగిస్తున్నారు. ప్రపంచ పోలీసుతో కితాబులు ఇప్పించుకునే మహాజన ఆర్భాటాలు నడుపుతున్నారు. ఇదంతా చాలనట్టు యుద్ధం కూడ తెస్తామని, పాకిస్తాన్ ఆక్రమిత కశ్మీర్ ను ఆక్రమించుకుంటామని బెదిరింపులు సాగిస్తున్నారు. మరొకవైపు అస్సాంలో ఒక్క కలంపోటుతో ఇరవై లక్షల మంది ప్రజలను పౌరులు కాదని ప్రకటించి, వారికోసం నిర్బంధ శిబిరాల నిర్మాణం ప్రారంభించారు. ఆ జాబితాలో లేని హిందువులు భయపడనక్కరలేదని హామీలు కూడ ఇస్తున్నారంటే తప్పనిసరిగా ఎన్ఆర్‌సి కేవలం ముస్లింలను ఉద్దేశించిందేనని స్పష్టమవుతున్నది. అటు ఉత్తరాదిన డెబ్బై లక్షల మంది కశ్మీరీ ముస్లింలను, ఇటు తూర్పున ఇరవై లక్షల మంది బంగ్లా ముస్లింలను భయపెట్టడం ద్వారా దేశమంతా ఉన్న ఇరవై కోట్ల ముస్లిం జనాభాను భయభీతావహంలో ముంచడం సంఘ్ పరివార్ లక్ష్యం. అటు కశ్మీర్‌లో, ఇటు అస్సాంలో సాగుతున్న మూకుమ్మడి హింసాకాండ కాక, దేశంలో ఎక్కడో ఒకచోట ముస్లింల మీద, దళితుల మీద, ఆదివాసుల మీద, స్త్రీల మీద, బహుజన కులాల మీద సంఘ్ పరివార్ ప్రత్యక్ష భౌతిక దాడులు గాని, భావజాల దాడులు గాని ప్రతిరోజూ ప్రతి క్షణమూ జరుగుతూనే ఉన్నాయి. ప్రభుత్వ వర్గాలు, ముఖ్యంగా పోలీసు, అర్ధసైనిక, సైనిక బలగాలు కూడ సంఘ్ పరివార్ మూకలకు తోడు నిలుస్తున్నాయి.

ఇదంతా 1933 నుంచి 1945 దాకా నాజీ జర్మనీలో జరిగిన దుర్మార్గం భాజపా భారత్ లో పునరుక్తమవుతున్నట్టుగా ఉన్నది. నాజీ దురాగతాల గురించి అధ్యయనం చేసిన పరిశీలకులందరూ కూడ ఆ దుర్మార్గాన్ని అడ్డుకోవడానికి, అసలు జరగకుండా చూడడానికి అవకాశాలు ఉండేవని, కాని ప్రతిఘటనా శక్తుల అనైక్యతే హిట్లర్ దండయాత్ర నిరాఘాటంగా సాగడానికి చోటిచ్చిందని వ్యాఖ్యానించారు. అటు రీచ్‌స్టాగ్‌లో బలమైన ప్రతిపక్షంగా ఉండిన రెండు ప్రధాన వామపక్ష పార్టీల అనైక్యత, ఇటు దేశంలో యూదు, సోషలిస్టు, కార్మిక, ప్రజాస్వామిక పౌర సమాజ సంస్థల అనైక్యత హిట్లర్ దాడులకు మార్గం సుగమం చేశాయి. దాడులు పెచ్చరిల్లిన తర్వాత, అరెస్టులూ అత్యాచారాలూ హత్యలూ నిర్బంధ శిబిరాలూ మొదలైన తర్వాత రూపొందిన చిన్న చిన్న ఫాసిస్టు వ్యతిరేక ప్రతిఘటనా బృందాలకు నాజీ మహమ్మారిని అడ్డుకునే శక్తి సరిపోలేదు. చివరికి రెండు కోట్ల మంది ప్రజల, ఎర్ర సైనికుల ప్రాణత్యాగంతో సోవియట్ యూనియన్ హిట్లర్ ను మట్టి కరిపించి, ప్రపంచాన్ని రక్షించవలసి వచ్చింది.

ఇవాళ అటు ట్రంప్, నెతన్యాహు, ఇటు మోడీ, దాదాపుగా అన్ని దేశాలలోనూ ఫాసిస్టు భావజాలం పుణికి పుచ్చుకున్న నేతలు రాజ్యాలు నడుపుతుంటే, వారిని నిలువరించగలమనీ, మట్టి కరిపించగలమనీ ప్రజలకు ఆశ్వాసం ఇవ్వడానికి, ప్రజలను నడిపించడానికి సోషలిస్టు శిబిరమూ లేదు, ఎర్రసైన్యమూ లేదు. ఏ దేశానికి ఆ దేశంలో ప్రగతిశీల, ప్రజాస్వామ్య, వామపక్ష శక్తుల సమీకరణ, ఐక్యత, క్రియాశీలత, ప్రతిఘటన మాత్రమే ఇవాళ ప్రపంచాన్ని చుట్టుముడుతున్న ఫాసిస్టు ప్రమాదం నుంచి రక్షించగలుగుతాయి. మిగిలిన దేశాల్లో ఫాసిస్టు వ్యతిరేక, ప్రతిఘటనా చర్చలు, చర్యలు, క్రమాలు ఎట్లా సాగుతున్నాయో తెలియదు గాని, భారత దేశంలో మాత్రం ఆ పని జరగవలసినంత దృఢంగా జరగడం లేదు. దేశంలో ఫాసిజమంటే కేవలం సంఘ్ పరివార్ దేనన్నట్టుగా, కాంగ్రెస్‌ను కూడ కలుపుకుని ఫాసిస్టు వ్యతిరేక ఐక్యసంఘటన నిర్మించాలనే అమాయక ప్రయత్నాలు సాగుతున్నాయి. కాని, ఈ దేశంలో సకల అరిష్టాలకూ కాంగ్రెసే కన్నతల్లి అయినట్టుగానే, ఫాసిజం వ్యాప్తి కూడ దాని ఖాతాలో వేయవలసిందే. కాకపోతే దానిది ప్రచ్ఛన్న ఫాసిజం, సంఘ్ పరివార్‌ది బహిరంగ, నిర్ద్వంద్వ ఫాసిజం. మిగిలిన పాలకవర్గ పార్టీలన్నీ కూడ సంఘ్ పరివార్‌కు నయానో భయానో లొంగిపోతాయని, సంఘ్ పరివార్‌ను వ్యతిరేకిస్తున్నట్టు కనబడుతున్న పాలకవర్గ ముఠాలు కూడ ఎప్పుడైనా గోడ దూకవచ్చునని గత ఐదు సంవత్సరాల అనుభవాలు చూపుతున్నాయి. ఇక స్వభావరీత్యా ఫాసిజం ప్రమాదాన్ని ఎదుర్కొని, పోరాటానికి నాయకత్వం ఇవ్వవలసిన కమ్యూనిస్టు పార్టీలలో పార్లమెంటరీ కమ్యూనిస్టు పార్టీలు ఇవాళ ఉన్నది ఫాసిజమేనా, దీన్ని ఫాసిజం అనవచ్చునా అని చర్చల్లో మునిగి ఉన్నాయి. ఆ చర్చలు ముగిసినాకనైనా క్రియాశీల చర్యలు చేపడతాయనే నమ్మకం లేదు. కనుక ఇవాళ దేశంలో ఫాసిజం ప్రమాదాన్ని నిజంగా ఎదుర్కోవలసినదీ, ఎదుర్కోగలిగినదీ ముస్లిం, ఆదివాసి, దళిత, స్త్రీ, బహుజన సమూహాలు మాత్రమే. ఆ సమూహాలను సమీకరించి, వారితో కలిసి నడిచి ఈ ఫాసిస్టు వ్యతిరేక పోరాటానికి సిద్ధాంత, నిర్మాణ, ఆచరణాత్మక మార్గదర్శకత్వం ఇవ్వగలిగేవి పార్లమెంటరీయేతర కమ్యూనిస్టు పక్షాలు, పౌర సమాజ సంస్థలు మాత్రమే. కాని ఇతరులను ఏకం చేయడం అలా ఉంచి, పార్లమెంటరీయేతర కమ్యూనిస్టు పక్షాల అనైక్యత ఎంత తీవ్రంగా ఉన్నదంటే గత రెండు మూడు సంవత్సరాలలోనే మార్క్సిస్టు లెనినిస్టు శిబిరంలోనే కనీసం మూడు ఫాసిస్టు వ్యతిరేక ఐక్య సంఘటనలు ఏర్పడి, ఒకదానితో మరొకటి మాట్లాడుకోలేని స్థితిలో ఉన్నాయి. పౌరసమాజ సంస్థలకు తమ మధ్య తమకు అనుసంధానం ఏర్పరచుకోవడానికి, దేశవ్యాప్త ఐక్యసంఘటనకు మార్గం సుగమం చేయడానికి తగిన శక్తి లేదు. ఈ స్థితిలో నాజీ జర్మనీలో సాగిన దుర్మార్గ పరిణామాలు భాజపా భారత్ లో మన కళ్ల ముందర సాగిపోతుంటే చూస్తూ ఉండడం, కత్తి మన మెడమీద ఎప్పుడు పడుతుందా అని వేచి చూడడం తప్ప గత్యంతరం లేదా అనే నిరాశ కలుగుతున్నది. ఇప్పటికైనా భారత ప్రజాస్వామిక, ప్రగతిశీల సమాజం మేలుకొని తన బాధ్యతను గుర్తెరిగి ఫాసిస్టు ప్రమాదాన్ని ఎదుర్కోవడానికి సిద్ధపడుతుందా? వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# నిజమా అబద్ధమా తెల్వకుండ మాట్లాడుడే తెలివి

పట్నంల శాన శాన మతలబులు జరుగుతానయట గద. మా పల్లెటూరోల్లకు ఏం దెలుస్తయి గాని, ఆడోడు ఈడోడు మోపై ఏదో ఒకటి ఒర్లుతాంటె మా చెవుల బడబట్టె. అబ్బ ఎట్ల తారుమారై పోతాందిర జమాన అని నాకు అఫ్సోసు గావట్టె. ఏందంటవా? నల్లమల ముచ్చటింటాంటె నాకు గట్లనిపిచ్చె. నల్లమల తొవ్వేదే లేదు, అర్గీజ్ ఒప్పుకోను అన్నడట గద పెద్దొర. ఆపొద్దే చిన్న దొరేమో తొవ్వకాలు జరుపుడు అదేందో ఉరేనియమో బొరేనియమో తొవ్వి తీసుడు దేశానికి ఎంత అక్కెరున్నదో గుడ జెప్పిండట గద. మల్ల రెండ్రోజుల ముందరనేమో ఆయినె ఏషం ఈనె, ఈనె ఏషం ఆయినె గట్టిండ్రట గద. చిన్నదొర, ఆయినె దోస్తులేమో అర్గీజు వద్దు వద్దంటాంటె దొర నోరు దెరిచి మాట్లాడలేదట గద. దానికన్న ముందు అడ్విల ఆ ఉరేనియం తొవ్వకపోనీకి పొక్కలు దొవ్విండ్రట గద. మారె మా అడ్విల మీరు పొక్కలు దొవ్వొద్దు, మా అడ్విని మాకొదిలి పెట్టుండ్రి అని చెంచోల్లు లొల్లి పెట్టిండ్రట గద. చెంచోల్లకు సదువుకున్నోల్లు సోర సోర పోరలు గుడ సాతిచ్చిండ్రట గద. అట్ల సాతిచ్చినోల్లను దొర అడ్విలకు పోనియ్యలేదట, కేసులు గుడ పెట్టిపిచ్చిండట. అంటేంది బాంచెన్? అడ్విల పొక్కలు తవ్వుడు, చెంచోల్లను ఎల్లగొట్టుడు, అడ్విని సత్తెనాశ్ జేసుడు మంచిదే అని దొర అన్నట్టే గాదా? మల్ల ఆయినే అచానక్ అడ్డం తిరిగి తవ్వనియ్యనే తవ్వనియ్య అని బల్లగుద్ది జెపుతండంటె అది నమ్మాల్నా ఇది నమ్మాల్నా? రాత్రి మాట నమ్మాల్నా పొద్దటి మాట నమ్మాల్నా? సమజైత లేదు బాంచెన్. మారె, తెలంగాణొస్తె జమీన్ ఆస్మాన్ ఫరక్ బోతదని ఏమనుకోలేదు గని కమస్కం మన బతుకు మనం బతుకుతమనుకున్న. ఎటుబొయ్యి ఎటొచ్చినా నిజమే మాట్లాడుతమనుకున్న. మనం ఇంకోల్లను అన్నాలం జేయొద్దు, మనను ఇంకోడు అన్నాలం జేయొద్దు. బస్ గది చాలనుకున్న. కాని కాలం అట్లలేదు. తెలంగాణొచ్చినంక కొత్త కతలు పుట్టుకొచ్చినయి. అవును అంటె కాదు అని అర్థం వచ్చింది. కాదు అంటె బరాబర్ జేస్తం అన్నమాట. తెలంగాణొచ్చినంక ఇప్పటితీర్గ ఉండదు, అంత మార్చి పారేస్తం అని దొర పాపం శాన సార్లె జెప్పిండు. నాకే పిస్సలేశి ఇనుమంత బంగారం అయిపోతదని అనుకున్న. ఎహె, ఇనుమేంది, మట్టే బంగారం అయిపోతదనుకున్న. కాని ఐదేండ్లు గడిచిపాయె. జరిగింది ఏందిరా అంటె తిప్పడు కొండపర్తికి పోనే పోయిండు, రానే వచ్చిండు. ఏం పనిమీద బోయిండో తెల్వది. ఏం పని జేశిండో తెల్వది. ఎట్ల తిరిగొచ్చిండో గుడ తెల్వది. అంత తారుమారు అయిపోయింది. తల్కాయ కిందికి కాల్లు మీదికి అయిపోయినయి. మా దండి దొర మా బొగ్గు బాయిల్ల కొచ్చి, ఓపెన్ కాస్టు అస్సలు తవ్వనియ్య, ఈడ కుర్సి ఏస్కోని కూసుంట, ఎవడొచ్చి తవ్వతడో చూస్త అంటాంటె ఇని నా చెవుల్ల పువ్వులు పుట్టె నాయనా. అటెంక ఏమయింది? పాపం దొరనెందుకనాలె గని, దొరకు కుర్సి దొర్కలే. కుర్సి జేస్తనని చెప్పిన మల్లిగాడు అటే పాయె, కుర్సి దెస్తనని పొయిన ఎల్లిగాడు అటే పాయె, పాపం దొరేం జేస్తడు? కుర్సి లేదు గదా, కూసోని ఆపనీకి. గందుకే ఇగ పోండ్రి, ఓపెన్ కాస్టులు తవ్వుకోపోండ్రి, మీ పాపంల మీరే బోతరు అన్నడు. గంతే. ఇగ గిప్పుడు నల్లమల అడ్విల గుడ గంతే అయితది. తవ్వుడు వద్దు అని దొరన్నడంటె నాకు అనుమానమే, తప్పకుంట దవ్వుతరని. తవ్వొద్దు అని తీరుమానం జేసినం, ఢిల్లి సర్కారు తోటి కొట్లాడ్తం అన్నడంటె ఇంక పెద్ద అనుమానం. ఎన్ని పార్లు జూడ్లె ఇసొంటివి? దొర మాటంటె మాటే. తల్కాయయిన కోసిస్త గాని మాటదియ్య అంటడు దొర. ఎన్ని తల్కాయలు పడిపాయె, ఎన్ని మాటలు తలకిందులైపాయె. వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# అవే విధానాలు, మారిందేమున్నది?

వైఎస్ జగన్‌మోహన్ రెడ్డి పాలనలో ఆంధ్రప్రదేశ్ పాలనా విధానాలు అంతకు ముందరి చంద్రబాబు నాయుడు విధానాల కన్న భిన్నంగా ఉంటాయని, పాత విధానాలన్నిటినీ ఒకరకమైన ప్రతీకారేచ్ఛతో మార్చి వేస్తారని తొలి రెండు మూడు నెలలు కొందరైనా నమ్మారు. బహుశా అటువంటి నమ్మకం కలిగించడానికే విద్యుత్ కొనుగోలు ఒప్పందాల సమీక్ష, పోలవరం కాంట్రాక్టు రద్దు, రివర్స్ టెండరింగ్, బాక్సైట్ తవ్వకాల నిర్ణయం ఉపసంహరణ, కియా కార్ల కంపెనీకి ఇచ్చిన ప్రోత్సాహకాల వంటి వాటిపై సమీక్ష, రాజధానిగా అమరావతి నిర్ణయంపై సమీక్ష వంటి ఆర్భాట పూరితమైన ప్రకటనలు చేశారు. పాత ప్రభుత్వానికి భిన్నంగా తెలంగాణ ప్రభుత్వంతో అన్యోన్య మైత్రి ప్రారంభించి, ఒకే రకమైన ప్రజా వ్యతిరేక విధానాలను అమలుచేస్తున్నారు. పాత ప్రకటనల ఆర్భాటాలన్నీ చల్లబడి, ఇప్పుడు మూడు నెలలు గడిచిపోయాక చూస్తే ఒక్కటంటే ఒక్కటైనా కొత్త విధానం, పాత విధానాలలో గణనీయమైన మార్పు కనబడడం లేదు. మార్పులా కనిపించిన నిర్ణయాలు జరుగుతున్నప్పుడు కూడ పాత ప్రభుత్వపు ఆశ్రితుల స్థానంలో కొత్త ప్రభుత్వపు ఆశ్రితులకు ప్రయోజనాలు కలిగించడానికో, పాత ఆశ్రితులను బెదిరింపులకు గురిచేసి అదనపు ముడుపులు రాబట్టడానికో ఈ చర్యలు జరుగుతున్నాయని అనుమానించిన వారున్నారు. ఆ అనుమానాలు వాస్తవమేనని ఒక్కొక్క నిర్ణయమూ క్షేత్ర స్థాయిలో అమలవుతున్న తీరు చూస్తే అర్థమవుతుంది. బాక్సైట్ తవ్వకాల కాంట్రాక్టులను పాత ప్రభుత్వం తెలుగుదేశం నాయకులకు, వారి సన్నిహితులకు ఇచ్చింది గనుక వాటిని రద్దు చేశారు, రేపో మర్నాడో వాటిని పునరుద్ధరించి తమ పార్టీవారికి ఇస్తారు. ప్రజాధనాన్ని కంట్రాక్టర్లకు దోచిపెట్టడానికి కుదిరిన ఒప్పందాల సమీక్ష ఆ దోపిడీ నుంచి తమ వాటా పొందడంతో ఆగిపోతుంది. రాజధానిగా అమరావతిని పునరాలోచిస్తామనే మాట, రాష్ట్ర వ్యాప్తంగా ఎన్నో ప్రాంతాలలో రియల్ ఎస్టేట్ కృత్రిమ పెరుగుదలకు, తద్వారా స్థానిక అధికార పార్టీ నాయకులు, దళారులు రియల్ ఎస్టేట్ వ్యాపారులుగా మారి కోట్లకు పడగెత్తడానికి దారి తీస్తుంది. ఇలా పాత పాలకవర్గ సన్నిహితుల స్థానంలో కొత్త పాలకవర్గ సన్నిహితుల ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలు సాధించే అదే రకమైన అవినీతి, ఆశ్రిత పక్షపాతం, ప్రజా ధనం వృథా, ప్రజాధనం కైంకర్యం వంటి విధానాలే యథాతథంగా కొనసాగుతున్నాయి. అధికార పీఠం మీద ఏ పాలకవర్గ ముఠా కూచున్నా ప్రజలకు, ప్రజా ప్రయోజనాలకు ఒరిగేది ఏమీ ఉండబోదనే వాస్తవం మరొకసారి నిగ్గు తేలుతున్నది. ప్రజా రాజకీయాల మీద, ప్రత్యామ్నాయ ఉద్యమాల మీద తీసుకుంటున్న వైఖరిలో, ప్రత్యేకంగా విప్లవోద్యమాన్ని అణచివేయడానికి బూటకపు ఎన్‌కౌంటర్లలో విప్లవకారులను కాల్చి చంపడంలో, తూర్పు కనుమల్లో నెత్తురుటేర్లు పారించడంలో చంద్రబాబు నాయుడు ప్రభుత్వానికీ తన ప్రభుత్వానికీ ఇసుమంత తేడా లేదని జగన్‌మోహన్ రెడ్డి ప్రభుత్వం చూపుకుంటున్నది. బాక్సైట్ గనుల తవ్వకాన్ని ఉపసంహరిస్తున్నా నన్న చేతితోనే ఆ బాక్సైట్ గనులకు వ్యతిరేకంగా పోరాడుతున్న ఆదివాసులను, వారికి నాయకత్వం వహిస్తున్న విప్లవకారులను చంపివేయడం ప్రభుత్వ విధానాలలో ఏ మార్పూ లేదనడానికి కొట్టవచ్చినట్టు కనిపిస్తున్న సూచన. వీ

# గందరగోళంలో బ్రెగ్జిట్-బోరిస్ జాన్సన్‌కు ఎగ్జిట్ తప్పదా!

**- ఎ. నర్సింహారెడ్డి**

బ్రెగ్జిట్ పీటముడి మరింత జటిలమైపోయింది. బ్రెగ్జిట్ అమలు విధానం ఈయులో నుంచి బ్రిటన్ ఎంతకీ బయట పడలేకపోతోంది. దరి, దాపు అందక గిలగిల కొట్టుకుంటోంది. ముందుగా కుదిరిన ఒప్పందం ప్రకారం బ్రిటన్ అక్టోబర్ 31 కల్లా యూరోపియన్ యూనియన్ నుంచి వైదొలగాల్సి ఉండగా ప్రధాని బోరిస్ జాన్సన్ కాస్తా పార్లమెంట్‌ను సెప్టెంబర్ 9 నుంచి అక్టోబర్ 14 వరకు సస్పెండ్ చేయడంతో పరిస్థితి మళ్లీ మొదటికొచ్చింది. ఒప్పందంలో మార్పులు జరిగితే బ్రిటన్ వైదొలగేందుకు తనకు అభ్యంతరం లేదని బోరిస్ అంటూండగా విపక్షాలు తమకు అనుకూలమైన మార్పులు జరిగితేనే వీడాలని పట్టుపడుతున్నాయి. లేదంటే బ్రిటన్‌కు ఆర్థికంగా నష్టమని హెచ్చరిస్తున్నాయి. ఇంతకీ అక్టోబర్ 31లోగా బ్రెగ్జిట్ సాధ్యమేనా అంటే సందేహమే. ఇయుతో ఏ ఒప్పందమూ లేకుండానే బ్రెగ్జిట్‌ను సాకారం చేయడానికి, తక్షణమే ఎన్నికలు జరిపించడానికి బోరిస్ కదిపిన పావులు పాములై కాటేస్తున్నాయి. తన నిర్ణయాలపై, ధోరణిపై ప్రతికూలత పెరుగుతున్న సందర్భంలో పార్లమెంట్‌ను సస్పెండ్ చేసి తీవ్ర విమర్శకు గురయ్యారు. పార్లమెంట్ సస్పెన్షన్‌పై బ్రిటన్ న్యాయస్థానాల్లో మూడు కేసులు నమోదయ్యాయి. దీంతో బ్రెగ్జిట్ బంతి బ్రిటన్ కోర్టులో ఉంది! పార్లమెంట్‌ను సస్పెండ్ చేయడం పట్ల స్కాట్లండ్ కోర్టు తాజాగా తీసుకున్న నిర్ణయం జాన్సన్‌కు తగిలిన గట్టి ఎదురు దెబ్బగా భావించాలి. బ్రిటన్ సుప్రీంకోర్టు ప్రత్యేక బెంచ్ ఏకగ్రీవంగా జాన్సన్ నిర్ణయాన్ని రద్దు చేసింది. జాన్సన్ తన నిర్ణయాలపై ప్రజాస్వామిక పరిశీలనను, చర్చను అడ్డుకోడానికే పార్లమెంట్‌ను సస్పెన్షన్‌లో ఉంచారని అది ప్రజాస్వామిక పునాది సూత్రాలకు విరుద్ధమైనదని ప్రత్యేకించి చెప్పుకోనక్కరలేదు.

బ్రెగ్జిట్ గడువుకు స్వల్ప వ్యవధి ఉందనగా పార్లమెంట్ సమావేశం జరిపి ఈ వ్యవహారంపై మరింత చర్చకు వీల్లేకుండా చూసుకోవడమే జాన్సన్ వ్యూహమని బోధపడుతున్నది. బ్రెగ్జిట్ డీల్‌ను అడ్డుకునేందుకు ఆర్టికల్ 50ని పొడిగించాలని కోరుతూ, టోరీ అసమ్మతి ఎంపిలతో సహా పార్లమెంట్‌లో ప్రతిపక్షాలన్నీ కలసి చట్టాన్ని తెస్తే దానిని ఖాతరు చేయలేదు. సెప్టెంబర్ మొదటి వారంలో ఆరుసార్లు బోరిస్ ప్రభుత్వం ఓటమి చవిచూసినా దేనికీ బాధ్యత వహించలేదు. జాన్సన్ బ్రిటన్ పాలిట మరో ట్రంప్‌గా పరిణమించాడు. అక్టోబర్ 31లోగా ఎన్నికలు జరపకుండా చూడాలని లేబర్ పార్టీ, స్కాటిష్ నేషనలిస్టులు ఉమ్మడి వ్యూహంతో అడుగులు వేస్తున్నారు. మరోవైపు నిగెల్ ఫరాగే నేతృత్వంలో కొత్తగా ఏర్పడిన 'బ్రెగ్జిట్ పార్టీ' బలం పెరుగుతోంది. అక్టోబర్ 31 తర్వాత ఎన్నికలు నిర్వహిస్తే బ్రెగ్జిట్‌పై విఫలమయ్యాడనే కారణంతో ఓటర్ల ఆగ్రహానికి గురయ్యే ప్రమాదం ఉంటుందని జాన్సన్ భయం, బెంగ. ఇప్పటికే ప్రభుత్వం గుత్తవ్యాపార సంస్థలకు లాభాలు చేకూర్చింది. సంపన్నులకు పన్నుల్లో రాయితీలు, సంక్షేమ నిధుల్లో కోతలు, ప్రభుత్వ సంస్థల ప్రైవేటీకరణ అమలు చేయడంతో ప్రజల్లో అసంతృప్తి పెరిగింది. ప్రస్తుత పరిస్థితుల్లో జాన్సన్ ముందు మూడు దారులున్నాయి. ఒకటి, అక్టోబర్ 31లోగా ఇయుతో మరో ఒప్పందం కుదుర్చుకోవడం. రెండవది, ఇయుతో ఎలాంటి ఒప్పందం లేకుండా బ్రిటన్ పార్లమెంట్ నిర్ణయాన్ని కాదని బయటకు రావడం. మూడవది, గడువు మరింతగా పెంచాలని ఇయును కోరడం. ఈ మూడు కుదరకపోతే రాజీనామా చేయడం తప్ప మరో మార్గం లేదు. రాజీనామా చేస్తే ఆయన రాజకీయ భవితవ్యం మంట కలుస్తుంది. దీంతో బోరిస్ జాన్సన్ ఎగ్జిట్ పూర్తవుతుంది. వీ





❖ **ప్రొఫెసర్ కర్వాలో** – కన్నడ మూలం పూర్ణచంద్ర తేజస్వి – తెలుగు అనువాదం శాఖమూరు రామగోపాల్ – 301 పేజీలు, 1/8 డెమీ, రు. 350



❖ **జుగారిక్రాస్ (సాలెగూడు)** – కన్నడ మూలం పూర్ణచంద్ర తేజస్వి – తెలుగు అనువాదం శాఖమూరు రామగోపాల్ – 300 పేజీలు, 1/8 డెమీ, రు. 300



❖ **ప్రొఫెసర్ గారి విశిష్ట యాత్రా కథనాలు** – కన్నడ మూలం ప్రొ. రహమత్ తరీకెరె – తెలుగు అనువాదం శాఖమూరు రామగోపాల్ – 282 పేజీలు, 1/8 డెమీ, రు. 290



❖ **డా: నా.డి'సోజగారి కథలు** – కన్నడ మూలం – శాఖమూరు రామగోపాల్ – 294 పేజీలు, 1/8 డెమీ, రు. 300

పై నాలుగు ప్రతులకు: శాఖమూరు రామగోపాల్, ఇ.నెం. 31-7-4, ఫ్లాట్ నెం. 202, జయప్రధ ఫోర్చున్ అపార్ట్‌మెంట్, జె.ఎం.జె. కాలేజ్ ఎదురుగా, సరళనగర్, సుల్తానాబాద్, తెనాలి, గుంటూరు – 522202



❖ **మోహన స్మృతి** – కామ్రేడ్ విశ్వవరం మోహన్‌రెడ్డి – మిత్రుల జ్ఞాపకాల సంకలనం – మోహన్‌రెడ్డి మిత్రులు ప్రచురణ – 100 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: సిద్ధార్థ, ఫ్లాట్ నెం. 301, మిత్రా టవర్స్, డొంకరోడ్డు, పోరంకి, విజయవాడ – 521137, ఫోన్: 9247575436



❖ **సినారె సాహితీ వైభవం** – (జాతీయ సదస్సు సాహిత్య వ్యాసాలు) – ప్రధాన సంపాదకులు ఆచార్య సూర్యా ధనంజయ్ – సంపాదకులు డా. ఎస్. రఘు – తెలుగు శాఖ ఉస్మానియా విశ్వవిద్యాలయం ప్రచురణ – 311 పేజీలు, 1/8 డెమీ, రు. 350, ప్రతులకు: తెలుగు డిపార్ట్‌మెంట్, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్ – 500007



❖ **వేలిత పాట** – (తీగ పాట) ఆదిలాబాద్ రాజ్ గోండుల గురించి మైకల్ యార్క్ రెండు వ్యాసాలు – తెలుగు: ల.లి.త. – తెలంగాణ గిరిజన సాంస్కృతిక పరిశోధన, శిక్షణా సంస్థ – 152 పేజీలు, 1/8 డెమీ, రు. 90, ప్రతులకు: తెలంగాణ గిరిజన సాంస్కృతిక పరిశోధన, శిక్షణా సంస్థ, గిరిజన అభివృద్ధి శాఖ, తెలంగాణ ప్రభుత్వం, మాస్ టాంక్, హైదరాబాద్ – 500017



❖ **స్వామి – సాని** – సంస్కృతము: బోధాయనుడు, తెలుగుసేత: కీ.శే. ప్రఖ్య శ్రీరామమూర్తి – 52 పేజీలు, 1/8 డెమీ, రు. అమూల్యం, ప్రతులకు: ప్రఖ్య ఆర్ట్ ప్రింటర్స్ ప్రై.లి., 1-8-724/ఎ/31, విజిటెబుల్ మార్కెట్ స్ట్రీట్, నల్లకుంట, హైదరాబాద్ – 500044. ఫోన్: 9885298329, 9246118429, 9440068429



❖ **కాశ్మీర్ ఎవరిది?** – సి.ఎస్. సాగర్ – పి.డి.ఎస్.యు. జాతీయ ఆర్గనైజింగ్ కమిటీ ప్రచురణ – 20 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు: ఎం. రామకృష్ణ, 2-1-594 (బి-34, ఎఫ్-1), కామ్రేడ్ సి.పి. భవన్, రైల్వేస్టేషన్ రోడ్, విద్యానగర్, హైదరాబాద్ – 500044, ఫోన్ : 040-27668471



❖ **పాలపిట్ట** – వినూత్న కవిత – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 192 పేజీలు, 1/8 డెమీ, రు. 100



❖ **ఏనుగు నరసింహారెడ్డి సాహిత్యాంతరంగం** – కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 144 పేజీలు, 1/8 డెమీ, రు. 100,పై రెండు ప్రతులకు: పాలపిట్ట బుక్స్, ఫ్లాట్ నెం. 2, బ్లాక్-6, ఎంఐజి-2, ఎపిఎచ్‌బి, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ – 500044, ఫోన్ : 040-27678430



❖ **నిఖిలేశ్వర్ కథలు** – నిఖిలేశ్వర్ – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 148 పేజీలు, 1/8 డెమీ, రు. 110



❖ **బాలల కోసం భారతదేశ కథ** – ముల్క్‌రాజ్ ఆనంద్ – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 80 పేజీలు, 1/8 డెమీ, రు. 70



❖ **కొడవంటి కాశీపతిరావు కథలు** – కొడవంటి కాశీపతిరావు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 202 పేజీలు, 1/8 డెమీ, రు. 150

పై మూడు పుస్తకాల ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, బండ్లగూడ (నాగోల్) జి.ఎస్.ఓ పోస్ట్, హైదరాబాద్-500068, తెలంగాణ ఫోన్:29884453, ఇమెయిల్: navachethanaph@gmail.com



❖ **బౌద్ధం – తెలంగాణ అస్థిత్వం** – ఆచార్య అడపా సత్యనారాయణ – అడుగుజాడలు పబ్లికేషన్స్ – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 35, ప్రతులకు: అడుగుజాడలు పబ్లికేషన్స్, ఎంఎస్‌కె టవర్స్, ఫ్లాట్ నెం. 410, స్ట్రీట్ నెం. 11, హిమాయత్‌నగర్, హైదరాబాద్-500029



❖ **యూదుల చరిత్ర – చరిత్రలో యూదులు** – డా. ఆర్. శర్మ – లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ – 72 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు: 'లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్', డి. రాధాకృష్ణమూర్తి, ఇ.నెం.5-85-4/బి, పండరీపురం, 1వ లైను, గుంటూరు – 522 002

ఫోన్ : 9848877596

# దేశానికి రానున్నవి చీకటిరోజులు

***నాజీ జర్మనీకీ భాజపా భారత్‌కూ పోలికలు చూపుతూ సరిగ్గా జర్మనీలో జరిగినట్టుగానే, అసలు సమస్యల నుంచి దృష్టి మళ్లించడానికి మతోన్మాదాన్ని రెచ్చగొడుతున్నారని అంటున్నారు* జస్టిస్ మార్కండేయ కట్జూ**

భారతదేశంలో జరుగుతున్న సంగతులు నాకు నాజీల కాలంలో జర్మనీలో జరిగిన సంగతులను గుర్తుకు తెస్తున్నాయి.

జనవరి 1933లో హిట్లర్ అధికారానికి వచ్చిన తర్వాత యావత్తు జర్మనీ ఉన్మాదంలో పడిపోయింది. ఎక్కడ చూస్తే అక్కడ జనం 'హెయిల్ హిట్లర్' అనీ 'సీగ్ హెయిల్' అనీ 'యుడెన్ వెరెక్కె' అనీ అరవడం, మత్తెక్కిన మరబొమ్మల్లాగ ఆ పిచ్చివాణ్ణి ప్రశంసించడం చేశారు.

మీకు కావాలంటే ఆ దృశ్యాలన్నీ యూట్యూబ్ మీద చూడవచ్చు.

జర్మన్లు ఎంత ఉన్నతమైన సంస్కృతీపరులంటే వారు మాక్స్ ప్లాంక్, ఐన్‌స్టీన్ వంటి గొప్ప శాస్త్రవేత్తలను, గూథె, షిల్లర్ వంటి మహా రచయితలను, హీనె వంటి మహా కవులను, మోజార్ట్, బాక్, బీథోవెన్ వంటి మహా సంగీత విద్వాంసులను,మార్టిన్ లూథర్ వంటి గొప్ప సంస్కర్తలను, కాంట్, నీషే, హెగెల్, మార్క్స్ వంటి గొప్ప తత్వవేత్తలను, లీబ్నిట్జ్, గాస్, రీమన్ వంటి గొప్ప గణితశాస్త్రజ్ఞులను, ఫ్రెడరిక్ ది గ్రేట్, బిస్మార్క్ వంటి గొప్ప రాజనీతిజ్ఞులను కన్న నేల అది. నేను కలిసిన ప్రతి ఒక్క జర్మన్ కూడ ఎంతో ఉత్తములు.

అయినప్పటికీ, రంగస్థలం మీదికి హిట్లర్ వచ్చాక, జర్మన్లే ఉత్తమ పాలకజాతి అని, వారి సమస్యలన్నిటికీ బాధ్యులు యూదులే అని ప్రకటించాక, జర్మన్లు ఆ పిచ్చిప్రేలాపనలను నమ్మడం మొదలుపెట్టారు. యూదుల మీద జరిగిన అత్యాచారాలకు, చివరికి జరిగిన మహామారణ కాండకు వారు ఎదురుచెప్పలేదు. బహుశా దాన్ని సమర్థించి ఉంటారు కూడ.

అలా ఎలా జరిగింది? కచ్చితంగా జర్మన్ ప్రజలందరూ మూర్ఖులేమీ కాదు. అంతరాంతరాల్లో దుర్మార్గులేమీ కాదు. అన్ని దేశాల, అన్ని మతాల, అన్ని నరజాతుల, వగైరా అన్ని సమూహాల ప్రజల్లో 99 శాతం మంచివాళ్లేనని నా ప్రగాఢ నమ్మకం. మరి అరవై లక్షల మంది యూదులను గ్యాస్ చాంబర్లలోకి పంపి మూకుమ్మడిగా హత్య చేయడానికి జర్మన్లకు చేతులెలా వచ్చాయి?

నా ఉద్దేశంలో దానికి కారణమేమంటే, మహా శక్తిమంతమైన ఆధునిక ప్రచారసరళి అత్యంత సంస్కృతీపరుల, ఆలోచనాపరుల మెదళ్లలో కూడ విషం నింపగలదు. ఎక్కువమంది జర్మన్ల విషయంలో జరిగిందదే. మొదటి ప్రపంచ యుద్ధంలో ఓటమి తర్వాత జర్మన్లలో నిండిన నిరాశా నిస్పృహలు, 1929 మహా సంక్షోభం తర్వాత పెద్ద ఎత్తున వ్యాపించిన నిరుద్యోగం, ధరల పెరుగుదల, ఆర్థిక సంక్షోభం హిట్లర్ వంటి దుర్మార్గుడి విషప్రచారానికి సులభంగా దొరికిన ఆయుధాలు. ఆ విషప్రచారాన్ని జర్మన్లు మొత్తానికి మొత్తంగా అక్షరం వదలకుండా మింగి తమ మెదళ్లలో నింపుకున్నారు.

ఇవాళ అత్యధిక భారతీయుల విషయంలో అదే జరుగుతున్నది. అభివృద్ధి నిరోధక, హిందూ నయా ఫాసిస్టు పార్టీ అయిన భారతీయ జనతా పార్టీ 2014లో అధికారానికి వచ్చినప్పటి నుంచి భారతీయ మైనారిటీలకు (ప్రత్యేకంగా ముస్లింలకు) వ్యతిరేకంగా భారీ మతోన్మాద ప్రచారానికి తెరలేపింది. ఆవులను చంపుతున్నారనీ, హిందూ బాలికలకు వల వేస్తున్నారనీ, వగైరా విద్వేషం నిండిన ఉపన్యాసాలతో చాలమంది హిందువుల మనసులను విషపూరితం చేశారు. రామాలయం నిర్మించాలనే ప్రకటనలూ, ముస్లింలను కొట్టి చంపడమూ గత కొద్ది సంవత్సరాలలో సర్వసాధారణమైపోయాయి. పాకిస్తాన్ లోని బాలాకోట్ మీద వైమానిక దాడి, సానుకూలమైన భారత ప్రచార సాధనాల ద్వారా యుద్ధోన్మాదాన్ని రెచ్చగొట్టడం కూడ ఈ దండయాత్రలో భాగమే. ఈ ప్రయత్నమంతా ఇటీవలి పార్లమెంటరీ ఎన్నికలలో భారతీయ జనతా పార్టీకి కనీవినీ ఎరగని ఘన విజయం చేకూర్చడం ద్వారా అనుకున్న ఫలితాలను సాధించింది. భారతదేశంలోని ఏ ఒక్క నిజమైన సమస్యనూ పరిష్కరించలేని గారడీచర్యగా అధికరణం 370 రద్దు, దుష్ట పాకిస్తాన్ మీద సాధించిన మహా విజయంగా, ఉత్సవ సందర్భంగా చాల మంది హిందువులను మరింత ఉన్మాదులుగా మార్చింది. అమెరికాలోని హ్యూస్టన్‌లో హౌడీ మోడీ ప్రదర్శన దీనికి ఒక సాక్ష్యం.

కనీ వినీ ఎరగని స్థాయి నిరుద్యోగం (స్వయంగా భారత ప్రభుత్వ సంస్థ అయిన నేషనల్ సాంపిల్ సర్వే వెల్లడించింది), దారుణమైన శిశు పోషకాహార లోపం (దేశంలోని ప్రతి ఇద్దరు పిల్లల్లో ఒకరు పోషకాహార లోపం బారిన పడి ఉన్నారు), అతి పెద్ద సంఖ్యలో రైతుల ఆత్మహత్యలు (మూడు లక్షలకు పైగా), అశేష ప్రజానీకానికి దాదాపుగా అందని సరైన ఆరోగ్య సౌకర్యాలు, నాణ్యమైన విద్యా సౌకర్యాలు, ధనికులకూ పేదలకూ మధ్య విపరీతంగా పెరిగిపోతున్న అంతరం (దేశంలోని 135 కోట్ల జనాభాలో సగం మంది దగ్గర ఉన్న సంపద కన్న ఎక్కువ సంపద ఏడుగురు భారతీయుల దగ్గరే ఉంది) వంటి భారతదేశంలోని నిజమైన సమస్యలలో ఏ ఒక్కటీ ఇటీవలి లోకసభ ఎన్నికలలో చర్చకే రాలేదు.

లౌకిక వాదమనేది ఉత్తర అమెరికా, యూరప్ ల వంటి పారిశ్రామిక సమాజాల లక్షణం. అది ఆసియా దేశాలలో అత్యధికంగా ఉన్న భూస్వామ్య, అర్ధభూస్వామ్య సమాజాల లక్షణం కాదు. రాజ్యాంగంలో ఆ మాట ప్రస్తావించినంత మాత్రాన దేశం లౌకిక దేశం అయిపోదు. భారతదేశం ఇంకా అర్ధభూస్వామ్యమేననేది ఈ సమాజంలో విస్తృతంగా ఉన్న కులతత్వం, మతతత్వం రుజువు చేస్తున్నాయి. భారతీయులలో అత్యధికులు లోలోతులనుంచి మత విశ్వాసాలు కలవాళ్లు. భారతీయులలో దాదాపు 80 శాతం హిందువులు గనుక వారు చాల సులభంగా మతోన్మాద ప్రచారానికి గురికాగలరు.

భారతదేశంలో హిందువులలోనూ ముస్లింలలోనూ అత్యధికులు

# ఆర్థిక వ్యవస్థను కమ్ముకుంటున్న మాంద్యం

*గత కొన్ని దశాబ్దాలుగా అమలవుతున్న ప్రపంచీకరణ విధానాలు, దేశంలో బిజెపి అమలుచేస్తున్న కార్పొరేట్ సంస్థల అనుకూల విధానాల వల్ల పేదల కొనుగోలు శక్తి మరింత తగ్గి ఆర్థిక మాంద్యానికి దారితీసిందని అంటున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

అమెరికాతో పాటు ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక మాంద్యం సూచనలు బలంగా కనిపిస్తున్నాయి. మన దేశ ఆర్థిక వ్యవస్థ గతంలో ఎన్నడూ లేని విధంగా తీవ్ర గడ్డు పరిస్థితిని ఎదుర్కొంటోంది. వ్యవస్థలో వినియోగం గణనీయంగా పడిపోతోంది. ఫలితంగా డిమాండ్ తగ్గి ఉత్పత్తి కార్యక లాపాలు దెబ్బతింటున్నాయి. దీంతో ఆర్థిక వ్యవస్థలో తీవ్ర మందగమన ఛాయలు ముసురుకుంటున్నాయి. ఆర్థిక వ్యవస్థ రోజురోజుకి సంక్షోభంలో కూరుకుపోతోంది. ఉత్పత్తి, ఉపాధి రంగాలు నీరుగారి పోతున్నాయి. ద్రవ్యోల్బణం పెరిగిపోతోంది. గత 45 సంవత్సరాల కాలంలో నిరుద్యోగం 6.1 శాతానికి పెరగడం ఇదే మొదటిసారి. తాజాగా వృద్ధి రేటు దారుణంగా కుంగి ఆరేండ్ల కనిష్ఠానికి 5 శాతానికి పడిపోయింది. 2012-13 తొలి త్రైమాసికంలో నమోదైన 4.3 శాతం వృదిరేటు తర్వాత ఇదే అత్యంత తక్కువ వృద్ధిరేటు. వరుస త్రైమాసికాల్లో దేశ జిడిపి వృద్ధిరేటు మందగించడాన్ని ఆర్థిక మాంద్యం (గ్రోత్ రెసిషన్)గా అభివర్ణిస్తుంటారు.

ఆగస్టు 3న కేంద్ర ప్రభుత్వం వెల్లడించిన గణాంకాలూ ఇదే విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. కీలక రంగాల వృద్ధి 11 నెలల కనిష్ఠానికి చేరిందని స్వయంగా ప్రభుత్వమే ప్రకటించింది. ఆర్థిక మాంద్యం వాస్తవమేనని రిజర్వ్‌బ్యాంక్ తన తాజా వార్షిక నివేదికలో తెలిపింది. డాలర్‌తో పోటీపడలేక రూపాయి అంతకంతకు నీరసించిపోతోంది. ఎగుమతులు తగ్గి దిగుమతులు పెరుగడంతో విదేశీ మారక నిల్వలు కరిగిపోతున్నాయి. మరోవైపు దేశీయ స్టాక్ మార్కెట్లు దారుణంగా పడిపోతున్నాయి. గత రెండు మాసాలుగా స్టాక్ మార్కెట్ కుప్పకూలడంతో మదుపరులు 17.5 లక్షల కోట్లు నష్టపోయారు. బిఎస్ఇ లిస్టెడ్ కంపెనీల నికర విలువ

---

మతతత్వానికి గురైనవాళ్లేనని నా అభిప్రాయం. నా చిన్నతనంలో నా హిందూ బంధువులూ మిత్రులూ చాల మంది ముస్లింల మీద విషం కక్కుతుండడం నేను చూశాను. కాకపోతే వాళ్లు అలా మాట్లాడుతున్నప్పుడు పక్కన ముస్లిం లేకుండా చూసే జాగ్రత్త తీసుకునేవారు. ఇవాళ ఒక ముస్లింను కొట్టి చంపేశారంటే చాలమంది హిందువులకు అది పట్టడమే లేదు. బహుశా కొందరు సంతోషిస్తున్నారేమో కూడ. ఒక తీవ్రవాది తగ్గాడని అనుకుంటున్నారేమో!

మైనారిటీల పట్ల, ప్రత్యేకించి ముస్లింలపట్ల విద్వేషం రూపంలో మతోన్మాదం చాలమంది హిందువులలో పైకి కనబడకుండా ఎప్పుడూ ఉంటూనే ఉంది. ఎక్కడో ఒకచోట నిప్పురవ్వ పడితే పేలిపోయే మందుపాతర లాగ అది వేచి చూస్తూ ఉండింది. 2014 నుంచి 2019 వరకూ ఆ మతోన్మాద మంటలను భారతీయ జనతా పార్టీ ఎగసన దోస్తూ వచ్చింది. ఈ పార్టీ మీద ఆధిపత్యం వహిస్తున్నది భయంకరమైన ముస్లిం వ్యతిరేక, క్రైస్తవ వ్యతిరేక మతోన్మాద సంస్థ రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్.

ఇప్పుడిక భారతీయ జనతా పార్టీ, దాని నాయకుడు మోడీ అసాధారణ విజయం సాధించారు గనుక, ప్రజల వైపు నుంచి తమ సమస్యలు పరిష్కరించే పాలన ఇమ్మని ఒత్తిడి పెరుగుతుంది. అంటే ఉద్యోగాలు కల్పించమనీ, రైతుల నిస్సహాయ స్థితిని మెరుగుపరచమనీ, శిశు పౌష్టికాహార లోపాన్ని తగ్గించమనీ, మంచి ఆరోగ్యసేవలు అందించమనీ, నాణ్యమైన విద్య అందించమనీ, వగైరా ఆకాంక్షలు పెరుగుతాయి. కాని ఈ పాలకులకు ఆ పరిష్కారాలు ఎలా సాధించాలో తెలియదు. అంతే కాదు, పరిష్కరించకపోవడం మాత్రమే కాదు, దేశంలో ప్రస్తుతం ఆర్థిక స్థితి మరింతగా దిగజారింది. జాతీయాదాయ పెరుగుదల రేటు ఒక్కసారిగా 5 శాతానికి పడిపోయింది. వాహనాల తయారీ రంగంతో సహా పారిశ్రామిక ఉత్పత్తులలో, రియల్ ఎస్టేట్ లో, విద్యుచ్ఛక్తి రంగంలో, అటువంటి మరెన్నో రంగాలలో పతనం కనబడుతున్నది. మున్నెన్నడూ లేనంత నిరుద్యోగం తలెత్తడం మాత్రమేకాదు, అది ఇంకా పెరుగుతున్నది.

ప్రస్తుత పాలనా పద్ధతుల లోపల పరిష్కరించడం అసాధ్యమైన ఈ నిజమైన సమస్యల నుంచి, అవి ఇంకా దిగజారుతుండడం నుంచి ప్రజల దృష్టిని మళ్లించాలంటే ఏదో ఒక బలిపశువును కనిపెట్టాలి. సరిగ్గా హిట్లర్ అట్లాగే యూదులు అనే బలిపశువును కనిపెట్టినట్టుగా. భారతదేశంలో అటువంటి బలిపశువు ముస్లింలు. అందువల్ల ముస్లింల మీద అత్యాచారాలు ఇంకా పెరుగుతాయనీ, కొద్దిగా తక్కువగా క్రైస్తవుల మీద కూడ పెరుగుతాయనీ నాకు భయం కలుగుతున్నది.

సరిగ్గా నాజీ పాలనాకాలంలో జర్మనీలో విజ్ఞానశాస్త్రాన్ని ఎట్లా జాత్యహంకార పూరితమైన అర్థరహిత ప్రేలాపనగా మార్చారో, భారతదేశంలో కూడ 2014 తర్వాత విజ్ఞానశాస్త్రాన్ని అట్లాగే మార్చారు. నాజీ జర్మనీలో చరిత్రను ఎట్లా వక్రీకరించారో, 2014 తర్వాత భారతదేశంలో అట్లాగే వక్రీకరిస్తున్నారు. సరిగ్గా జర్మన్ ప్రచార సాధనాల మీద గోబెల్స్ ఆధిపత్యం చలాయించినట్టుగానే, భారత ప్రచార సాధనాలు కూడ వంగిపోయి, లొంగిపోయి, 'సర్వంసహా చక్రవర్తి'కి ప్రణామాలు పలుకుతున్నాయి.

దేశానికిక రానున్నవి చీకటిరోజులే.

*(రచయిత సుప్రీం కోర్టు మాజీ న్యాయమూర్తి,*
*ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా మాజీ అధ్యక్షులు)*
*https://indicanews.com/2019/09/24/*
*dark-days-are-ahead-for-india/*

వీ

మేలో రు. 1,58,62,936.40 కోట్లు కాగా, సెప్టెంబర్ 15 నాటికి లిస్టెడ్ సంస్థల నికర విలువ రు. 1,41,15,315.30 కోట్లకు పడిపోయింది. ఈ నేపథ్యంలో క్షేత్రస్థాయి పరిస్థితుల్ని అంచనా వేయలేకపోతున్న సర్కారు తోచిన విధంగా నిర్ణయాలు తీసుకుంటూ ఆర్థిక వ్యవస్థను మరింత ప్రమాదంలోకి నెడుతోంది. 2018 ఆక్స్‌ఫామ్ నివేదిక ప్రకారం దేశంలోని ఒక శాతం వద్ద 51 శాతం సంపద, 10 శాతం వద్ద 77.4 శాతం సంపద పోగుపడగా కింది నుంచి 60 శాతం ప్రజల వద్ద కేవలం 4.8 శాతం సంపద మాత్రమే ఉంది.

భారత ఆర్థిక వ్యవస్థకు దేశీయ డిమాండ్ ప్రధానమైంది. 2008లో మొదలై ప్రపంచాన్ని కుదిపేసిన ఆర్థిక సంక్షోభం నుంచి మన దేశాన్ని నిలబెట్టింది దేశీయ డిమాండ్, ప్రభుత్వ రంగ సంస్థలు, బ్యాంకులేనన్నది యథార్థం. అయితే మోడీ ప్రభుత్వం గత ఐదేళ్లలో ప్రభుత్వరంగ సంస్థల్ని, బ్యాంకుల్ని నిర్వీర్యం చేసింది. దేశంలో ధరలు వేగంగా పెరుగుతున్నాయి. నిత్యావసర సరుకుల ధరలు 10 నెలల గరిష్ఠ స్థాయికి చేరాయి. ముఖ్యంగా చేపలు, మాంసం, కూరగాయలు, పప్పులు తదితర ఆహారోత్పత్తుల ధరలు భారీగా పెరిగాయి. దీంతో వినియోగదారుల రిటైల్ ద్రవ్యోల్బణం సూచీ 3.21 శాతానికి చేరింది. గ్రామీణ ప్రాంతాల్లో 2.18 శాతంగా, పట్టణ ప్రాంతాల్లో 4.49 శాతంగా నమోదయ్యింది. 2018 అక్టోబర్‌లో ఈ సూచీ గరిష్ఠంగా 3.38 శాతంగా ఉంది. ఆ తర్వాత ఈ స్థాయిలో పెరగడం ఇదే తొలిసారి.

**ఆర్థిక మాంద్యం అంటే ఏమిటి ?**

పెట్టుబడిదారీ వ్యవస్థ స్వభావాన్ని మార్క్స్ 170 సంవత్సరాల క్రితమే వివరించాడు. ఆయన చేసిన సూత్రీకరణలో ఆర్థిక మాంద్యం ఒకటి. పెట్టుబడిదారీ విధానంలో అధికోత్పత్తికి చెందిన పెట్టుబడిదారీ సంక్షోభాలు నిర్ణీత సమయాల్లో సంభవిస్తుంటాయి. పెట్టుబడిదారీ విధానంలో కార్మికుల శ్రమ దోపిడీ రేటును పెంచే సాంకేతికతను పరిశ్రమల్లో ప్రవేశపెట్టడం వల్ల ఉత్పాదకత పెరుగుతుంది కాని అత్యధిక సంఖ్యలో కార్మికులు తొలగింపుకు గురై నిరుద్యోగులుగా మారుతారు. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో అరాచకం ఉంటుంది. మార్కెట్ ఆటుపోట్లు ఉంటాయి. రుణ వ్యవస్థ అలజడులకు గురవుతుంది. పెట్టుబడిదారీ దోపిడీ ఆర్థిక వ్యవస్థ ఉత్పత్తిలో సంక్షోభం, మాంద్యాలు అనివార్యంగా చోటు చేసుకుంటాయి. ఎందుకంటే పెట్టుబడిదారుడు కేవలం లాభాల కొరకే సరుకులను ఉత్పత్తి చేస్తాడు. పెట్టుబడిదారీ విధానం అంటేనే లాభాల వేట. ఉత్పత్తి ఒక పద్ధతి ప్రణాళిక ప్రకారం జరుగదు. ప్రజల అవసరాలను, ప్రయోజనాలను, కొనుగోలు శక్తిని పెట్టుబడిదారుడు దృష్టిలో పెట్టుకోడు. ఉత్పత్తి పెరిగి మార్కెట్‌లో డిమాండ్ తగ్గితే వెంటనే ఉత్పత్తి తగ్గిస్తారు. కార్మికులను తొలగిస్తారు. నిరుద్యోగం పెరుగుతుంది. ప్రజల కొనుగోలు శక్తి కన్నా ఉత్పత్తి ఎక్కువగా ఉంటుంది. అంటే అవసరానికంటే వస్తువుల సరఫరా ఎక్కువగా ఉంటుంది. అందువల్లనే ఉత్పత్తి అయిన సరుకులు మొత్తం అమ్మకం కావు. ఫలితంగా ఉత్పత్తి సామార్థ్యాన్ని కుదించాల్సి రావడాన్ని ఆర్థిక మాంద్యం అంటారు. ఆర్థిక మాంద్యం కారణంగా పరిశ్రమలు మూతపడడం జరుగుతుంది. మాంద్యం పెరిగితే వచ్చేది ఆర్థిక సంక్షోభం. గ్రోత్ రెసిషన్ ఒక రకంగా విష వలయం లాంటిది. ఇందులో చిక్కుకుంటే నానాటికి పరిస్థితులు క్షీణించే ప్రమాదం ఉంటుంది. ఈ వలయంలోంచి బయటపడేందుకు భారీ నష్టంతోపాటు చాలా సమయం పడుతుంది.

**ఆందోళన వ్యక్తం చేస్తున్న ఆర్థికవేత్తలు**

ఉత్పత్తి, వాణిజ్యం, హోటళ్లు, రవాణా, నిర్మాణం, వ్యవసాయ రంగాల్లో ఆర్థిక మాంద్యం నెలకొందని తన విధాన సమీక్షలో ఆర్‌బిఐ తెలిపింది. ఆర్థిక మాంద్యం ముంచుకొస్తున్నా ప్రభుత్వం దేశంలో డిమాండ్ పెంచే చర్యలపై దృష్టి సారించడం లేదు. కేవలం ఉత్పత్తి కార్యకలాపాలకు తోడ్పాటును అందించే దిశగానే పలు సంస్కరణలను ప్రకటిస్తూ వస్తోంది. ఇది ఆర్థిక వ్యవస్థకు ఏ మాత్రం మేలు చేయదు. ప్రజల ఆదాయాలు పెంచే చర్యలు తీసుకోకపోతే మాంద్యం గాఢమవుతుంది.

మాంద్యానికి భూమిక పెద్ద నోట్ల రద్దు వల్ల దాపురించిందన్న ఆర్థిక నిపుణుల అంచనాను మోడీ ప్రభుత్వం ఎంతమాత్రం అంగీకరించడం లేదు. ఉత్పత్తి రంగం దెబ్బతినడానికి నోట్ల రద్దు, జిఎస్‌టి ప్రధాన కారణమని ఆర్‌బిఐ మాజీ గవర్నర్లు సుబ్బారావు, రఘురామ్ రాజన్, అంతర్జాతీయ ఆర్థికవేత్తలు అమర్త్యసేన్, పాల్‌క్రుగ్‌మన్ స్పష్టం చేశారు. ఆర్థిక మంత్రి నిర్మలా సీతారామన్ ఆగస్టు 23న ప్రకటించిన ఉద్దీపనలు మాంద్యాన్ని అడ్డుకోలేవు. నోట్ల రద్దుతో లక్షలాది ఉద్యోగాలు ఊడిపోయాయి. ద్రవ్యకొరత వల్ల కేంద్ర కార్పొరేట్ వ్యవహారాల మంత్రిత్వ శాఖలో నమోదైన 6.8 లక్షల కంపెనీలు మూతపడ్డాయి. మొత్తం కంపెనీల్లో ఇవి 36 శాతమని అధికారిక గణాంకాలు తెలిపాయి. జిఎస్‌టి, నోట్ల రద్దుతో చిన్న పరిశ్రమలు లక్షల్లో మూతపడి నిరుద్యోగం మరింత పెరిగింది. బ్యాంకుల్లో మొండి బకాయిలు 9.5 లక్షల కోట్లకు చేరాయి. బ్యాంకులకిచ్చే (70వేల కోట్లు), ఎగుమతులకు ప్రోత్సాహకంగా 55 వేల కోట్లు ఉద్దీపనలు పెద్ద మనుషులకు ఫలహారాలవుతాయి. రైతులకు గానీ, సూక్ష్మ, చిన్న తరహా పరిశ్రమలకు గానీ పెద్దగా ఉపయోగపడవని ఇప్పటికే నిర్ధారణ అయింది.

**క్షీణిస్తున్న ఆర్థిక వ్యవస్థ**

దేశంలో వస్తు వినియోగం తగ్గిందంటే ప్రజల జేబులు బక్కచిక్కి పోయాయని భావించక తప్పదు. ఆదాయాలు పడిపోయి రోజువారీ అవసరాలకే పరిమితమయ్యే ఆర్థిక దుస్థితిలో వారు చిక్కుకున్నారని అర్థం. జనం కొనుగోలు శక్తి పడిపోయినప్పుడే మార్కెట్‌లో గిరాకీ నేల చూపు చూస్తుంది. అది దేశ ఆర్థిక వృద్ధిరేటుపై వ్యతిరేక ప్రభావాన్ని చూపుతుంది. జూన్ 2018లో పారిశ్రామిక వృద్ధిరేటు 7 శాతం ఉండగా జూన్ 2019లో 2 శాతానికి పడిపోయింది. గనుల రంగం వృద్ధిరేటు 2018 జూన్‌లో 6.5 శాతం కాగా జూన్ 2019 నాటికి 1.6 శాతంగా ఉన్నది. వ్యవసాయరంగం 2017-18 సంవత్సరం 5 శాతం వృద్ధి కనబర్చగా 2018-19లో 2.7 శాతానికి తగ్గింది. నిర్మాణ రంగం, స్టీల్, సిమెంట్, సర్వీస్ రంగాలలో కూడ వృద్ధి మందగించింది. ఆర్థిక వ్యవస్థ మందగమనం ఉపాధిపై ప్రతికూల ప్రభావాన్ని చూపిస్తుంది. లేబర్ ఫోర్స్ సర్వే ప్రకారం 2017-2018లో 47.4 కోట్లుగా ఉన్న కార్మికుల సంఖ్య 2018-19లో 46.5 కోట్లకు తగ్గిపోయింది. అంటే

91 లక్షలకు పైగా కార్మికులు తమ ఉపాధి కోల్పోయారు. నిరుద్యోగం రేటు 6.1 శాతం ఉన్నదని పిరియాడిక్ లేబర్ ఫోర్స్ సర్వే తెలియజేస్తోంది. ప్రపంచంలోనే అతి శీఘ్ర అభివృద్ధి సాధిస్తున్న ఆర్థిక వ్యవస్థగా చెప్పుకుంటున్న ఇండియా పరిస్థితి ఇప్పుడు నత్తను తలపిస్తున్నదని బ్రిటిష్ బ్రాడ్ కాస్టింగ్ కార్పొరేషన్ (బిబిసి) ప్రతినిధి చేసిన వ్యాఖ్య ఈ సందర్భంగా గమనించదగినది.

కేంద్ర ప్రభుత్వ ఆర్థిక వ్యవహారాల విభాగం ఆగస్టు 6న విడుదల చేసిన నివేదిక కూడా వృద్ధి రేటు పతనం వాస్తవమేనని అంగీకరించింది. ప్రైవేట్ పారిశ్రామిక ఉత్పత్తుల దేశీయ వినియోగం, ఎగుమతులూ బాగా తగ్గినట్లు ఒప్పుకున్నది. దేశ ఆర్థిక వృద్ధి రేటు 2015-16లో 8 శాతం కాగా 2018-19లో 6.98 శాతంగా నమోదయింది. 2019 జూలై నాటికి 5 శాతానికి దిగజారింది. ఆగస్టులో కూడ కోలుకున్న జాడలేదు. గత ఏడాదిలో తయారీ రంగం వృద్ధి అనేక మాసాల పాటు పతన దిశ పట్టింది. తయారీరంగం వృద్ధిరేటు జూన్ 2018లో 6.9 శాతం కాగా జూన్ 2019 నాటికి 1.2 శాతానికి దిగజారింది. అంతర్జాతీయం గానూ, దేశంలోనూ గిరాకి పడిపోవడం వల్లనే ఇది సంభవించిందని కేంద్ర ఆర్థిక వ్యవహారాల విభాగం నివేదిక స్పష్టం చేసింది. భారీ యంత్ర పరికరాల విక్రయం చాలా కాలంగా మందకొడిగానే ఉన్నది. అంటే దేశంలో కొత్త పరిశ్రమల స్థాపన పుంజుకోలేదని అర్థం.

2016లో ప్రధాని మోడీ ప్రభుత్వం అమలు చేసిన పెద్ద నోట్ల రద్దు వల్ల రైతాంగం దారుణంగా దెబ్బతిన్నదని, వ్యవసాయ రంగం మీద ఆ చర్య ప్రభావం కూడా ఉన్నదని నిపుణులు నిగ్గు తేల్చారు. దేశంలోని అతిపెద్ద మౌలిక సదుపాయాల సంస్థ ఐఎల్ అండ్ ఎఫ్ఎస్ కంపెనీ పతనం వంటి కారణాల వల్ల వ్యాపార పారిశ్రామిక కార్యకలాపాలకు రుణ లభ్యత క్షీణించింది. రిజర్వు బ్యాంకు వడ్డీ రేట్లు వరుసగా తగ్గించినా పరిస్థితి మెరుగుపడలేదు. రుణ గ్రహీతల పట్ల బ్యాంకుల్లో విశ్వాసం సన్నగిల్లిపోయింది. గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లోనూ ప్రజల ఆదాయాలు ఊహించని స్థాయిలో పడిపోయాయని నిపుణులు చెబుతున్నారు. అలాగే వస్తు, సేవల పన్ను (జిఎస్‌టి) అవకతవక అమలు, అత్యధిక పన్ను శ్లాబుల్లో అనేక వస్తువులను చేర్చడంవంటి దాని వికృత విన్యాసాల వల్ల అనేక వాణిజ్య పారిశ్రామిక సంస్థలు మూతపడి నిరుద్యోగాన్ని పెంచాయి.

### స్తంభించిన పారిశ్రామిక వృద్ధి

పారిశ్రామిక ఉత్పత్తి సూచిక 2015-16లో నమోదు చేసిన వృద్ధిరేటు 2.4 శాతం కాగా 2018-19లో మరింతగా దిగజారింది. 1980-81 నుంచి 1990-91 వరకు పారిశ్రామిక ఉత్పత్తి సూచిక సగటు వార్షిక వృద్ధిరేటు 7.83 శాతంగా ఉన్నది. అందుకు భిన్నంగా ఆ తరువాత దశాబ్దం, 1990-91 నుంచి 2011-12 మధ్య కాలంలో వార్షిక సగటు వృద్ధిరేటు 6.28 శాతంగా ఉన్నది. వేరే మాటల్లో చెప్పాలంటే ప్రపంచీకరణ విధానాలు అమలు మొదలైన తర్వాత కాలంలో అంతకు ముందున్న దశాబ్దంలో కంటే పారిశ్రామిక వృద్ధి మందగించింది.

దేశ ప్రజల కొనుగోలు శక్తి పెరిగితే ఇక్కడి పరిశ్రమలు తమ ఉత్పత్తుల విక్రయం కోసం విదేశాలవైపు చూడవలసిన అవసరం ఉండదు. ప్రపంచ మార్కెట్ పుంజుకోకపోయినా దేశీయ వినియోగదార్లే ఇక్కడి పరిశ్రమలను, తయారీ రంగాన్ని పోషించగలరు. గత 45 ఏళ్లలో ఎన్నడూ లేనంత నిరుద్యోగం ప్రబలినందువల్ల ప్రజలు చేతి నిండా పనుల్లేక ఆదాయాలు పడిపోయి కొనుగోలు శక్తి తీవ్రంగా తగ్గింది. ఈ పరిస్థితిని వెంటనే సరిదిద్దకపోతే దేశ ఆర్థిక వ్యవస్థ మరిన్ని చిక్కులను ఎదుర్కోవలసి వస్తుంది. చిన్న, మధ్యతరగతి వర్తకులు, కుటీర పరిశ్రమలను పూర్తిగా నిర్లక్ష్యం చేసే విధానాలను ప్రభుత్వం రూపొందిస్తోంది. చిరు వర్తకులకు ఎలాంటి రక్షణ కల్పించకుండా నేరుగా వస్తు సేవల (జిఎస్‌టి) పన్నును అమలు చేయడంతో లక్షలాది మంది తమ ఉపాధిని కోల్పోయారు. లఘు కుటీర పరిశ్రమలు నడుపుకునే వ్యాపారులు కూడా బడా పరిశ్రమల్లో కార్మికులుగా మారారు. ప్రభుత్వం ఇష్టానుసారం పన్నుల అమలు, విధానాల రూపకల్పన, నిబంధనల్లో తరుచూ మార్పులు చేస్తుండడంతో తక్కువ టర్నోవర్ గల చిరు పరిశ్రమల మనుగడే కష్టసాధ్యంగా మారిపోయింది.

దేశంలో వినియోగం తగ్గి డిమాండ్ పడిపోతున్న నేపథ్యంలో ఆటోమొబైల్, స్థిరాస్థి రంగాలలో పరిస్థితి మరింత దారుణంగా తయారైంది. దీంతో ఆయా రంగాలలోకి కొత్త పెట్టుబడులు రావడంలేదు. దీనికి తోడు ఉన్న పరిశ్రమలు కూడా ఒక్కొక్కటిగా మూత పడుతూ వస్తున్నాయి. ఫలితంగా ఉద్యోగులు, వారి కుటుంబాలు రోడ్డున పడుతున్నాయి. దేశంలో దాదాపు 50 లక్షల మందికి ప్రత్యక్షంగా, పరోక్షంగా ఉపాధిని కల్పించే ఆటోమొబైల్ రంగంలో సంక్షోభం ముంచు కొస్తున్నది. ఆటోమొబైల్ రంగంలో గత 19 ఏళ్లల్లో ఎన్నడూ లేనంతగా అమ్మకాలు పడిపోయాయి. గత సంవత్సరంతో పోలిస్తే 2019 మే నాటికి వాహనాల అమ్మకాలు 26 శాతం తగ్గాయి. మారుతి లాంటి కార్ల కంపెనీలు ఉన్న వాటిని అమ్ముకోవడానికే ప్రయత్నం చేస్తున్నారు. చాలా పరిశ్రమల్లో తమ ఉత్పాదక శక్తిలో 70 శాతం మాత్రమే వినియోగించుకుంటున్నాయి.

పార్లే బిస్కెట్ కంపెనీ, సిమెంట్, ఉక్కు పరిశ్రమలను మాంద్యం ఆవహిస్తోంది. వినియోగ వస్తువుల అతిపెద్ద తయారీదారు హిందూస్థాన్ యూనిలీవర్ లిమిటెడ్ సంస్థ ఆదాయ వృద్ధి 18 మాసాల్లో ఎన్నడూ లేనంత అతి తక్కువగా 7 శాతం నమోదు కావడం గమనించవలసిన విషయం. గృహవినియోగ వస్తువుల కొనుగోలు కూడా దారుణంగా పతనమైంది. ఈ ప్రతికూల అంశాలన్నీ ఉపాధి అవకాశాలను దెబ్బ తీస్తున్నాయి. ముఖ్యంగా కాంట్రాక్టు ఉద్యోగాలు, రోజు కూలీలుగా పని చేసే కూలీల ఉపాధి అవకాశాలు తగ్గుతున్నాయి. వాహనాలు తయారు చేసే వారు, విడి భాగాలు తయారు చేసే వారు, డీలర్లు కలిసి గత మూడు నెలల కాలంలో 3,50,000 మందిని ఉద్యోగాల్లోంచి తొలగించారు. ఇది ఇలాగే కొనసాగితే రాబోయే కొద్ది రోజుల్లోనే ఆటోమొబైల్ రంగంలోని ఈ సంక్షోభంతో దాదాపు 10 లక్షల మంది ఉద్యోగాలు కోల్పోయే ప్రమాదం ఉంది.

### ప్రపంచీకరణ-వాణిజ్య యుద్ధాలు

2008లో మొదలైన ఆర్థిక సంక్షోభం నేపథ్యంలో ప్రపంచ వాణిజ్యం బాగా దెబ్బతిన్న దశలోనే ప్రపంచీకరణకు రాజకీయంగా వ్యతిరేకత బాగా పెరుగుతూ వచ్చింది. దేశీయంగా తమ కంపెనీలనూ, పరిశ్రమలనూ కాపాడుకునే ప్రయత్నంలో భాగంగా, ఇతర దేశాల నుంచి దిగుమతయ్యే సరకులపై సుంకాలూ, ఆంక్షలూ విధించే చర్యల వైపు

వివిధ ప్రభుత్వాలు మళ్లాయి. అంటే సంరక్షణ విధానాలను వదిలెయ్యాలని ఇంతకాలం పరులకు చెప్పిన సంపన్న దేశాలే ఇప్పుడు వాటినే ఆశ్రయిస్తున్నాయి. గత రెండేండ్లలో ప్రపంచ వ్యాప్తంగా ప్రభుత్వాలు వాణిజ్య ఆంక్షలను రెట్టింపు చేశాయని సెయింట్ గ్యాలెన్ యూనివర్సిటీలో వాణిజ్య నిపుణుడు ప్రొఫెసర్ సైమన్ ఎవెనెట్ అన్నారు. అయితే ఈ ఆంక్షల విధానం రెండంచుల కత్తి వంటిదని ఆర్థికవేత్తలంటున్నారు. ఆయా దేశాల్లో కార్మికవర్గంలో నెలకొన్న ఆగ్రహాన్ని చల్లార్చేందుకు సంరక్షణవాద చర్యలు ఉపయోగపడొచ్చునేమో కానీ దీని ఫలితంగా వినియోగ వస్తువుల ధరలు పెరిగిపోయి అది ప్రజలపై భారంగా పరిణమించక తప్పదని హెచ్చరించారు.

లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌కు చెందిన యాండ్రూ లాంగ్ దీనిపై మాట్లాడుతూ, 'గ్లోబలైజేషన్ ఫలితాల్లో అత్యధికం ప్రతి దేశంలోనూ ఉన్న అతి చిన్న సమూహానికే దక్కాయి' అని తెలిపారు. 'గ్లోబలైజేషన్ ఫలితాలిచ్చిందా లేదా అన్నది ప్రశ్న కాదు, ఆ ఫలితాలెవరికి దక్కాయన్నదే అసలు విషయం' అని లాంగ్ అంటున్నారు. మొత్తానికి స్వేచ్ఛా వాణిజ్యం పట్ల పెట్టుబడిదారీ శక్తుల్లో మునుపున్న ఏకాభిప్రాయం ఇప్పుడు లేదన్నది ఆర్థికవేత్తల అభిప్రాయం. వామపక్షాలు ప్రపంచీకరణ విధానాలను తొలి నుంచీ వ్యతిరేకిస్తుండగా, ఇప్పుడు కరడుగట్టిన మితవాదులు సైతం వ్యతిరేకిస్తున్నారు. 'ప్రపంచీకరణ' అనేది నిజానికి సామ్రాజ్యవాద ప్రపంచీకరణే అనీ, దీని సారాంశం సామ్రాజ్యవాదుల దోపిడీకి దేశాల సరిహద్దులు అడ్డుకాకుండా చూడడమేననీ వామపక్షాలు తొలి నుంచీ చెబుతున్నాయి. 'స్వేచ్ఛా వాణిజ్యం' పేరిట పేద దేశాలనూ, సంపన్న దేశాలనూ సమాన షరతులపై పోటీకి దించడంతో నష్టపోయేది బడుగు దేశాలేనన్నది స్పష్టం.

### మోడీ ప్రభుత్వ పెట్టుబడి అనుకూల విధానాలు

మోడీ ప్రభుత్వం 2014 నుంచి ఆర్థిక వ్యవస్థ నిర్వహణలో పూర్తిగా విఫలమైంది. ప్రైవేటీకరణ, క్రోనీ కేపిటలిజం (ప్రభుత్వ అండతో నిర్మించే పెట్టుబడిదారీ వ్యవస్థ) వైపు అవిశ్రాంతంగా సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలతో దూసుకుపోవడమే ఈ పాలనకున్న కీలకాంశం. ప్రజానుకూల సంస్థాగత సంస్కరణల నుండి దూరంగా పోతున్న మోడీ ప్రభుత్వం కార్పొరేట్ రంగ అవసరాలకు సానుకూలంగా స్పందిస్తూ వారిపట్ల నిబద్ధతతో వ్యవహరిస్తోంది. కార్పొరేట్ పన్నులో ఇటీవల జరిపిన కోత, సిఎస్ఆర్, (కార్పొరేట్ సామాజిక బాధ్యత) ప్రమాణాలలో సడలింపు దీనిని మరోసారి ప్రతిబింబిస్తోంది. విదేశీ బ్యాంకుల్లో దాచుకున్న సంపన్నుల అక్రమార్జన ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడానికి సుముఖంగా లేదు. నీతి ఆయోగ్ వైస్ చైర్మన్ రాజీవ్‌కుమార్ స్వయంగా అంగీకరించినట్లు 'ప్రభుత్వానికిది మున్నెన్నడూ ఎరుగని పరిస్థితి. యావత్ ద్రవ్యరంగం పతనానికిలోనైన ఇటువంటి ద్రవ్యసరఫరా పరిస్థితిని గత 70 ఏళ్లలో మనం ఎదుర్కోలేదు'. ఈ మౌలిక సూచీలను పరిగణనలోనికి తీసుకుంటే, 2024 నాటికి భారతదేశ ఆర్థిక వ్యవస్థ 5 లక్షల కోట్ల డాలర్ల వ్యవస్థగా మారుతుందని ప్రధాన మంత్రి ప్రకటించడం సుదూర స్వప్నంలా, వాక్పటిమతో చెప్పే డొల్ల నినాదాల్లో ఒకటిగా మిగిలిపోతుంది.

ఆర్థిక మాంద్యం నుంచి ప్రజలను రక్షించడం కాకుండా కార్పొరేట్లను ఆదుకోవడానికి ప్రభుత్వం పూనుకున్నది. సంపన్న వర్గాలపై రు. 14000 కోట్లు సర్‌చార్జీ ఉపసంహరణ, అంకురాలకు ఏంజెల్స్ పన్ను మినహాయింపు, జిఎస్‌టి రిఫండ్, వాహనాలపై జిఎస్‌టి తగ్గించి ప్రోత్సహించడం, ప్రభుత్వమే కొత్త కార్లు కొనడం అనేకం ఉన్నాయి. కార్పొరేట్ల పెట్టుబడి విస్తృతి పెంచుకోవడానికి 40 ప్రభుత్వరంగ సంస్థలను ప్రైవేటు రంగానికి అమ్మివేయడానికి సిద్ధమవుతున్నది. సింగిల్ బ్రాండ్, రిటైల్, డిజిటల్ మీడియా రంగాల్లో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల శాతాన్ని పెంచడానికి, బొగ్గు, కాంట్రాక్టు మాన్యుఫాక్చరింగ్ (ఒక సంస్థ ఉత్పత్తి చేసి మరో సంస్థ తన లేబుల్‌తో విక్రయించుకొనే) రంగాలలో 100 శాతం ఎఫ్‌డిఐలను అనుమతించడానికి రంగం సిద్ధమైంది. పెద్దపెద్ద కార్పొరేట్లు బ్యాంకులకు ఎగ వేస్తున్న వేల కోట్ల రూపాయలను రద్దుచేస్తూ మరోవైపు బ్యాంకులకు పెట్టుబడి సమకూర్చడానికి 70 వేల కోట్ల రూపాయలను ప్రభుత్వం ఇస్తుంది. ఇవన్నీ కార్పొరేట్, పెట్టుబడిదార్ల పెట్టుబడి దాహం తీర్చడానికే తప్ప వేరుగాదు. చివరకు బ్యాంకుల ఏకీకరణ వలన కార్పొరేట్లకు భారీ రుణాలిచ్చేందుకు ఉపయోగపడ్తాయి తప్ప, పేదలను, రైతులను ఉద్ధరించవు. 'ప్రజల కోసం అన్ని బ్యాంకుల జాతీయకరణ' అన్న లక్ష్యం వదిలేసి, పెద్దల కోసం ఏకీకరణ అమలు చేస్తున్నారు.

మోడీ ప్రభుత్వ విధానాలను గమనిస్తే, ఆర్థిక వ్యవస్థను ప్రభుత్వం అర్థం చేసుకొన్న విధానం, అది అమలుపరుస్తున్న ఉపశమన చర్యలు అన్నీ లాభాలార్జిస్తున్న కార్పొరేట్, బడా వ్యాపార సంస్థలను లక్ష్యంగా పెట్టుకొని చేస్తున్నవేనని స్పష్టమౌతుంది. నోట్లరద్దుకు దారుణంగా గురైంది అసంఘటిత రంగం, సూక్ష్మ, చిన్న మధ్య తరహా పరిశ్రమలన్నది సుస్పష్టం. అయితే ఈ వాస్తవాన్ని ప్రభుత్వం స్థిరంగా తిరస్కరిస్తూ, వాటికి ఉపశమనం అందజేసేందుకు ఎలాంటి చర్యా తీసుకోవడం లేదు. భారతదేశానికి చెందిన అన్ని సహజ, మానవ వనరులను కార్పొరేట్ రంగం యథేచ్ఛగా కొల్లగొట్టేందుకు, పూర్తిగా వినియోగించుకునేందుకు వీలుగా తలుపులు తెరిచి భారతదేశాన్ని ఒక పెట్టుబడిదారుల అనుకూల ఆర్థిక వ్యవస్థగా మార్చేందుకు ప్రయత్నిస్తూ మన ఆర్థిక వ్యవస్థనొక రైతువ్యతిరేక, కార్మిక వ్యతిరేక ఆర్థికవ్యవస్థగా ప్రభుత్వం రూపొందించింది.

2008లో ఆర్థిక మాంద్యం ఎదురైనప్పుడు ప్రపంచ వ్యాప్తంగా ఉద్దీపన చర్యలు చేపట్టారు. అయినా పెద్ద ఫలితం కనిపించలేదు. ద్రవ్య విధానంలో మార్పుల వల్ల అంతగా ఫలితం ఉండదన్న గుణపాఠాన్ని భారత విధాన నిర్ణేతలు నేర్చుకున్నట్టు లేదు. వడ్డీ రేట్లను మారిస్తే ఆర్థిక వ్యవస్థ పుంజుకుంటుందన్న భ్రమలోనే మన విధాన నిర్ణేతలు ఉన్నారు. వడ్డీ రేట్లు తగ్గడంవల్ల ప్రైవేటు రంగం రుణాలు తీసుకుని పెట్టుబడులు పెడుతుందని, వినియోగం పెరుగుతుందని, తద్వారా ఆర్థిక వ్యవస్థ పుంజుకుంటుందని భావిస్తున్నారు. మందగిస్తున్న భారత ఆర్థిక వ్యవస్థకు జవజీవాలు అందించాలంటే మాంద్యాన్ని నివారించాలి. వడ్డీ రేట్లలో మార్పు ఈ పని చేయలేదు. వినియోగం ఎప్పుడూ ప్రస్తుత ఆదాయం మీద ఆధారపడి ఉంటుంది. ప్రస్తుతం ఆదాయాలు తక్కువగా ఉన్నాయి. భవిష్యత్తులో ఆదాయాలు పెరుగుతాయన్న ఆశలేదు. ప్రభుత్వం ప్రజల ఆదాయాలు పెంచే దిశలో చర్యలు తీసుకోవడం లేదు.

### మాంద్యానికి ఉద్దీపనలు పరిష్కారం కావు

1929లో మహామాంద్యం ఏర్పడినప్పుడు కీన్స్ పెట్టుబడిదారీ

విధానాన్ని ఎలా బతికించాలో చెప్పాడు. ముఖ్యంగా మాంద్యం పరిస్థితులలో ప్రభుత్వ వ్యయం ప్రధాన పాత్ర వహించాలన్నాడు. అవసరమయితే 'విత్తలోటు'ను అనుసరించాలన్నాడు. కానీ సామ్రాజ్య ప్రపంచీకరణ విధానాల అమలుతో 1991 నుంచి రాజ్యం సంక్షేమం బాట వీడి మార్కెట్ స్వేచ్ఛను ప్రోత్సహిస్తోంది. ద్రవ్య పెట్టుబడికి దాసోహం చేస్తోంది. ఫలితంగా ఆర్థిక అంతరాలు పెరిగాయి.

ఆర్థిక కార్యకలాపాలకు ప్రేరణనిచ్చేందుకు ఆర్థిక మంత్రి చేపట్టిన చర్యలు ప్రభుత్వ రంగాన్ని పణంగా పెడుతూ ప్రైవేటు రంగానికి మాత్రమే తోడ్పాటునందించే విధంగా ఉన్నాయి. మోడీ ప్రభుత్వం తన కార్పొరేట్ యజమానులను ప్రసన్నం చేసుకునేందుకు, ప్రభుత్వ రంగ సంస్థలను కారు చౌకగా అమ్మేసేందుకు గట్టి కృషి చేస్తోంది. స్థిరమైన ఉపాధులు కల్పించేందుకు ఎలాంటి సంస్థాగత సంస్కరణలు ప్రకటించలేదు. ఏదైనా అనిశ్చితి పరిస్థితి ఏర్పడిన సందర్భంగా వినియోగించాల్సిన ఆర్‌బిఐ మిగులు నిధులను మాంద్యం సందర్భంగా ఉద్దీపనల కొరకు రు. 1.76 లక్షల కోట్లు ప్రభుత్వం తీసుకోవడం సెంట్రల్ బ్యాంక్ స్వయం ప్రతిపత్తికి తీవ్రమైన విఘాతం. ప్రభుత్వం ఆర్‌బిఐని ఒక స్వంత కోశాగారంలా చూస్తోంది. దాని స్వతంత్రతను క్రమంగా హరిస్తోంది. దానివల్ల దేశంలో అనేకానేక ద్రవ్య సేవలు దారుణంగా అపాయంలో పడతాయి.

మార్కెట్ ఆధారిత ఆర్థిక వ్యవస్థ లాభాలు సంపాదించుకోగలమన్న విశ్వాసంపై ఆధారపడి ఉంటుంది. ప్రభుత్వం ప్రభుత్వరంగ బ్యాంకులు, ఎల్‌ఐసి లాంటి సంస్థల ద్వారా పెట్టుబడులు సమకూర్చడం ద్వారా పెట్టుబడిదారులకు విశ్వాసాన్ని కలిగించే ప్రయత్నం చేస్తుంది. మూడు దశాబ్దాలుగా పాలకులు అనుసరిస్తున్న కార్పొరేట్ అనుకూల విధానాలే మాంద్యానికి కారణం. మందగమన పరిస్థితుల నుంచి బయటపడాలంటే ఆర్థిక వ్యవస్థలో డిమాండ్ పెంచాలి. ఇది జరగాలంటే మౌలిక రంగంలో, సామాజిక రంగాలలో ప్రభుత్వ పెట్టుబడులు పెరగాలి. ఉపాధి అవకాశాలను పెంచే ప్రయత్నం చేయాలి. ఆర్థిక వ్యవస్థలో మార్కెట్లకు మితిమీరిన స్వేచ్ఛ నిచ్చే సంస్కరణలను ఆపివేయాలి. మార్కెట్ ఆధారిత ఆర్థిక వ్యవస్థకు తనను తాను చక్క దిద్దుకునే సామర్థ్యం ఉంటుందని, మార్కెట్‌కు అన్నీ తెలుసునన్న విశ్వాసంతో నడిపే ఆర్థిక వ్యవస్థను పక్కన పెట్టి, ప్రత్యామ్నాయ ఆర్థిక విధానాలు అవలంబించాలి. పబ్లిక్‌రంగంలో పెట్టుబడుల్ని పెంచి పబ్లిక్ రంగ సామర్థ్యాన్ని పెంచడం ద్వారా ఆర్థిక వ్యవస్థకు చేయూతనివ్వాలి.

ఈ మాంద్యం నుంచి బయట పడడానికి ప్రభుత్వ వ్యయం పెంచడం, ఉపాధికల్పన పెంచి ప్రజల ఆదాయాలు పెంచడం, ఉత్పత్తిలో కార్మికుల వేతనాల వాటాలను అన్ని రంగాలలో పెంచడం, ప్రజల కొనుగోలు శక్తి పెంచే మార్గాలు వెదకాలి. అందుకు భిన్నంగా మాంద్యం పరిష్కరించ డానికి ప్రభుత్వం కార్పొరేటు మార్గం ఎంచుకున్నది. కార్పొరేట్లకు ఉద్దీపనలు ప్రకటిస్తే ఉన్న సంస్థలు లాభపడవచ్చు కాని కొత్త పరిశ్రమలు రావు. ఉపాధి పెరగదు. మోడీ ప్రభుత్వం వడ్డీరేటును కనిష్ఠస్థాయికి తగ్గించి ప్రపంచమంతా తిరిగి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల కోసం అర్జించినా ప్రోత్సాహకరంగా లేదు. కొన్ని ఎఫ్‌పిఐలు లేదా విలీనాలు, స్వాధీనాలు తప్ప ప్రత్యక్ష ఉత్పత్తి పెట్టుబడులు ఆశాజనకంగా లేవు.

సేవారంగంలో, పారిశ్రామికరంగంలో పనిచేస్తున్న కోట్లాది కార్మికుల, ఉద్యోగుల కొనుగోలు శక్తి పెంచడానికి వారి అతి తక్కువ ఆదాయాలకు కారణమైన కాంట్రాక్టు, ఔట్‌సోర్సింగ్ విధానాలను రద్దు చేయాలి. అలా చేయకపోగా కార్మిక చట్టాలను సవరించి మేనేజిమెంట్‌తో సంప్రదింపులు జరిపే అవకాశాన్ని కూడా తొలగించి కనీస వేతనాన్ని రు. 178లుగా నిర్ణయించిన ఘనత ఈ ప్రభుత్వానిది. బహుళజాతి సంస్థలను కట్టడి చేయాల్సిందిపోయి వీటికి రెడ్‌కార్పెట్ పరుస్తోంది. ఈ విధానం మారాలి. మోడీ పాలనలో మొదటిసారిగా ప్రత్యక్ష పన్నుల కంటే పరోక్ష పన్నుల వాటా పెరిగింది. అంటే ప్రభుత్వానికి సంపన్నులకంటే ప్రజలే ఎక్కువ పన్నులు చెల్లిస్తున్నారు. సంపన్నుల ఆదాయం, కార్పొరేట్లపై వచ్చే పన్నుల కంటే ఎక్కువగా పరోక్ష పన్నుల ద్వారా ప్రభుత్వ ఖజానాకు డబ్బు చేరుతుంది. పరోక్ష పన్నులను తక్షణం తగ్గించాలి. అప్పుడే ధరలు దిగి వస్తాయి. ప్రజల్లో కొనుగోలు సామర్థ్యం పెరుగుతుంది.

ప్రజలు ఆర్థికంగా పరిపుష్టిగా ఉంటేనే దేశ ఆర్థిక వ్యవస్థ పటిష్టంగా ఉంటుంది. ప్రజల వద్ద ఖర్చు పెట్టేందుకు డబ్బు లేనందునే ఆర్థిక వ్యవస్థ బలహీనంగా ఉంది. వ్యవసాయ రంగంపై అధికంగా ఆధారపడిన మనదేశంలో వ్యవసాయ ఉత్పత్తి పరికరాలపై రాయితీ, వడ్డీలేని రుణాలు, అలాగే వ్యవసాయ అనుబంధ పరిశ్రమలకు పెట్టుబడిని పెంచి ఉపాధి కల్పించాలి. అలాగే వ్యవసాయ అనుబంధ పరిశ్రమలను ప్రోత్సహించాలి. పెట్టుబడి సాంద్రత గల పరిశ్రమల స్థానంలో శ్రమ సాంద్రత గల పారిశ్రామిక రంగాన్ని ప్రోత్సహించడం ద్వారా ఆదాయ పంపిణీ అనేక మంది మధ్య జరిగి ప్రజల వినియోగ సామర్థ్యాన్ని పెంచవచ్చు. శ్రమజీవుల నిజవేతనాలు పెంచాలి. కార్మిక సంస్కరణ పేరుతో వారి వేతనాలకు కోత విధించే విధానాలను విడనాడాలి. మౌలిక సదుపాయాల కల్పనలో పెట్టుబడి పెడ్తే ఉపాధి అవకాశాలూ పెరుగుతాయి. నిజమైన ఆర్థికవృద్ధి జరుగాలంటే విధానపరమైన మార్పులు తీసుకోవడం అత్యవసరం. సంస్కరణలు వేగవంతం చేస్తే మరింత సంక్షోభం పెరుగుతుందని గమనించాలి. అందువల్ల మాంద్యం నుండి తక్కువ నష్టంతో బయటపడాలంటే సామ్రాజ్యవాద అనుకూల ప్రపంచీకరణ విధానాలను పక్కన పెట్టాలి.

భారత ఆర్థిక వ్యవస్థ పుంజుకోవడానికి సమగ్రమైన భవిష్యత్ ప్రణాళికలను అనుసరించకుండా కాయకల్ప చికిత్స వల్ల ప్రయోజనం ఏమీ ఉండదు. కానీ ప్రస్తుతం అధికారంలో ఉన్న ప్రభుత్వానికి ప్రణాళికల మీద నమ్మకం లేదుగా! ఇలాంటి చర్యలేమీ తీసుకోకుండా క్రోనీ పెట్టుబడుల ద్వారా ఆర్థిక వ్యవస్థను మరింతగా బలహీనపర్చేలా ప్రభుత్వం వ్యవహరిస్తోంది. సామాన్యుల మనుగడ ప్రశ్నార్థకం అవుతుంది. ఆర్థిక వ్యవస్థను తిరిగి గాడిలో పెట్టడంతో పాటు సామాన్యుల చేతిలో డబ్బు ఉండేందుకుగాను కచ్చితమైన చర్యలు తీసుకోవాలి. రక్షణ, బ్యాంకింగ్, పిఎస్‌యుల బలోపేతంతో దీనిని నేరుగా సాధించవచ్చు. సంపద సృష్టికర్తలు వాస్తవంగా ప్రజలే అని అర్థమైనప్పుడు మాత్రమే ప్రభుత్వం ఈ దిశగా పయనించేందుకు పూనుకుంటుంది. విదేశీ పెట్టుబడులా లేక ప్రజల సంక్షేమమా తేల్చుకోవాల్సిన సమయం ఆసన్నమైంది. స్వదేశీ జపం చేస్తూ విదేశీ పెట్టుబడికి సలాం చేస్తున్న కేంద్ర ప్రభుత్వ వైఖరి మారకుండా భారతదేశం ముందుకు పోదు.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# ఆర్థిక మాంద్యం అసలు రహస్యం

***ప్రస్తుతం తీవ్రమైన చర్చనీయాంశంగా, స్పష్టాస్పష్టంగా ఉన్న భారత ఆర్థిక వ్యవస్థ మాంద్యం అనే పరిణామాన్ని ఎలా అర్థం చేసుకోవాలో వివరిస్తున్నారు ఎన్. వేణుగోపాల్***

ఇటీవలి కాలంలో పత్రికలూ ప్రచారసాధనాలూ అన్నీ ఆర్థిక మాంద్యం గురించీ, అనేక పరిశ్రమల మూత గురించీ, వేలాది, లక్షలాది మంది ఉద్యోగాలు కోల్పోవడం గురించీ వార్తలూ వ్యాఖ్యలూ ప్రకటిస్తున్నాయి. దీన్ని మాంద్యం అనవచ్చునా లేదా అని ప్రభుత్వ అర్థశాస్త్రవేత్తలూ విమర్శకులూ చర్చలు జరుపుతున్నారు. దీన్ని అర్థశాస్త్ర పరిభాషలోని మాంద్యం (రిసెషన్) అనలేమనీ, ఇది కేవలం మందకొడి తనం (స్లో డౌన్) మాత్రమేననీ వ్యవస్థ సమర్థకులు వాదిస్తున్నారు. అమెరికా, చైనా ఆర్థిక వ్యవస్థల మధ్య ఘర్షణ వల్ల వచ్చే సంవత్సరం అంతర్జాతీయ ఆర్థిక మాంద్యం వచ్చే అవకాశం ఉందనీ, అది 2008 ఆర్థిక సంక్షోభం కన్న తీవ్రంగా ఉండవచ్చుననీ, ఇప్పుడింకా అది అంతర్జాతీయంగానూ, భారతదేశంలోనూ రాలేదనీ వారు అంటున్నారు. కాని మరొకపక్క స్వయంగా రిజర్వ్ బ్యాంక్, నితి ఆయోగ్ తో సహా కొన్ని ప్రభుత్వ సంస్థల అధిపతులు, కొందరు ఆర్థిక శాస్త్రవేత్తలు భారత ఆర్థిక వ్యవస్థలో సంక్షోభం ప్రారంభమైందని అంటున్నారు. దానికి ఏ పేరు పెట్టినా గిరాకీ తరుగుదల, పరిశ్రమల మూత, నిరుద్యోగం, జాతీయాదాయ పెరుగుదల రేటు పతనదిశను చూపడం మాత్రం వాస్తవంగా జరుగుతున్నాయి. మామూలుగానే ఆర్థిక శాస్త్ర విషయాలు, ఆ శాస్త్ర పరిభాష సగటు పాఠకులకు అర్థం కావు. ఇక ఈ మాంద్యం గురించిన వార్తలూ వ్యాఖ్యలూ కూడ మహమ్మారి అంటూ భయం గొలిపేలా, సంచలనాత్మకంగా వస్తున్నాయి గాని అసలు సమస్య ఏమిటి, ఏ కారణాల వల్ల వచ్చింది, ఈ సమాజంలో పరిష్కారం ఉందా, ఆ పరిష్కారం దిశగా ప్రభుత్వాలు గాని, ప్రజలు గాని చేయగలిగిందీ, చేయవలసిందీ ఏమైనా ఉందా వంటి విషయాల చర్చ జరగడం లేదు. ఈ నేపథ్యంలో అసలు పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో సంక్షోభం అనేది ఎలా వస్తుంది, ద్రవ్యపెట్టుబడి దశలో భూస్వామ్యంతో, పెట్టుబడిదారీ పూర్వ సంబంధాలతో మిలాఖత్తయి తన స్వభావాన్ని మార్చుకున్న దళారీ పెట్టుబడి రాజ్యం చేసే భారతదేశం వంటి దేశాలలో ఆ సంక్షోభం మరెంత దుర్మార్గంగా, విషాదకరంగా ఉంటుంది చాల చర్చించవలసి ఉంది.

అమెరికా వంటి ఆర్థిక వ్యవస్థలలో జాతీయాదాయం పెరుగుదల రేటును కాలెండర్ సంవత్సరంలో ప్రతి త్రైమాసికానికి లెక్క కడతారు. వరుసగా రెండు త్రైమాసికాలలో పెరుగుదల రేటు తగ్గుతూ పోతే దాన్ని మాంద్యం అంటారు. భారత ఆర్థిక వ్యవస్థలో అలా ఒక త్రైమాసికాన్ని మరుసటి త్రైమాసికంతో పోల్చి చూసే పద్ధతి లేదు. ఇక్కడ ఈ ఆర్థిక సంవత్సరపు త్రైమాసికాన్ని గత ఆర్థిక సంవత్సరపు అదే త్రైమాసికంతో పోల్చి జాతీయాదాయం పెరుగుదల రేటును లెక్క కడతారు. ఈ ఆర్థిక సంవత్సరంలో మొదటి త్రైమాసికం (అంటే ఏప్రిల్ – జూన్ 2019) లెక్కలు జూలై మొదటి వారంలో విడుదల కాగా, జాతీయాదాయ పెరుగుదల రేటు ఏప్రిల్ – జూన్ 2019 త్రైమాసికం కన్న తక్కువగా 5 శాతానికి పడిపోయిందని తేలింది. ఈ పెరుగుదల రేటు గత ఆరు సంవత్సరాలలో అతి కనిష్టమైనది. జూలై నుంచి సెప్టెంబర్ వరకు జరిగిన రెండో త్రైమాసికం లెక్కలు అక్టోబర్ మొదటి వారంలో వెలువడుతాయి. అప్పటికి ఈ పెరుగుదల రేటు తిరోగమనం ఇంకా కిందికే జారిపోతున్నదా, నిలకడగా ఉన్నదా, ఏ మాత్రమైనా పైకి పోతున్నదా తేలుతుంది.

అసలు జాతీయాదాయం పెరుగుదల రేటు అనే సాంకేతిక అంశాన్ని లెక్కించడంలో ఉన్న అవకతవకలను కూడ పక్కనపెట్టి చూసినా, ఇటీవల జరిగిన, జరుగుతున్న పరిణామాలు దేశ ఆర్థిక వ్యవస్థకు తీవ్రమైన ప్రమాదం వాటిల్లిందనో, వాటిల్లబోతున్నదనో స్పష్టం చేస్తున్నాయి. ఈ పరిణామాలు చాల పారిశ్రామిక సరుకులకు తగినంత గిరాకీ లేకపోవడం దగ్గర ప్రారంభమయ్యాయి. అందువల్ల వ్యాపార, పారిశ్రామిక సంస్థలు, వాటి ఉత్పత్తులు, వాటికి రుణాలు అందించే ద్రవ్యసంస్థలు అతలాకుతలం అవుతున్నాయి. ఆ సంస్థలన్నీ కూడ తమ సమస్యలను తమ కార్మికుల మీదికి, సిబ్బంది మీదికి నెడతాయి గనుక విపరీతంగా ఉద్యోగుల తొలగింపు, నిరుద్యోగం పెరుగుదల జరుగుతున్నాయి. అలా నిరుద్యోగం పెరిగినందువల్ల వినియోగదారుల కొనుగోలుశక్తి తరిగిపోయి మార్కెట్‌లో గిరాకీ మరింత తగ్గిపోతున్నది. అందువల్ల పారిశ్రామిక, వ్యాపార సంస్థలు తమ ఉత్పత్తులను మరింతగా తగ్గించవలసి వస్తున్నది, మరింతగా ఉద్యోగులను తొలగించవలసి వస్తున్నది. దీనికి తోడు ద్రవ్యోల్బణం రేటు విపరీతంగా పెరిగిపోతున్నది. మూడు నెలలుగా సాగుతున్న ఈ విషవలయం ఫలితంగా కార్లు, ద్విచక్ర వాహనాలు, ఇతర వాహనాల అమ్మకాలు విపరీతంగా తగ్గిపోయాయి. కేవలం వాహన తయారీ రంగంలో మూడు లక్షల ఉద్యోగాలు రద్దయిపోయాయి. అనుబంధ పరిశ్రమల్లో కనీసం పది లక్షల ఉద్యోగాలు రద్దయిపోయాయని అంచనా. ఒక చివరన కార్ల వంటి ఖరీదైన సరుకులు మాత్రమే కాక మరొక చివరన బిస్కట్ల వంటి సాధారణ చౌక సరుకులకు కూడ గిరాకీ తగ్గి పార్లె వంటి సంస్థ ఉత్పత్తి తగ్గించి పదివేల మంది కార్మికులను తొలగించవలసి వచ్చింది. ఐఎల్అండ్ఎఫ్ఎస్ మూత నాటి నుంచి బ్యాంకింగేతర ద్రవ్య సంస్థలు అనేకం సంక్షోభంలో పడి పారిశ్రామిక, వ్యాపార, రియల్ ఎస్టేట్, వాహన ఫైనాన్స్ రంగాలలో రుణ, పరపతి సౌకర్యాలు తరిగిపోయాయి. ఈ అన్ని రంగాలలోను ఉద్యోగుల తొలగింపు, కోత ప్రారంభమయింది. తత్ఫలితంగా కొనుగోలుశక్తి తగ్గి, గిరాకీ మరింత తగ్గి, ఉత్పత్తి మరింత తగ్గవలసి వస్తుంది.

ఇలా ఉత్పత్తి – వినియోగం – ఉద్యోగం వంటి వాస్తవ జీవితాంశాల మీద మాత్రమే కాక వాటికి ప్రతీకాత్మక (చాలవరకు కుహనా) రూపాలైన స్టాక్ మార్కెట్ల మీద కూడ ఈ మాంద్యం ప్రభావం గణనీయంగానే ఉంది. దేశంలోని ప్రధాన స్టాక్ మార్కెట్ సూచికలైన సెన్సెక్స్, నిఫ్టీ

రెండూ కూడ ఎద్ద ఎత్తున పతనాన్ని చూపుతున్నాయి. రెండోసారి మోడీ ప్రభుత్వం అధికారానికి వచ్చిన తర్వాత తొలి వంద రోజుల్లో బొంబాయి స్టాక్ ఎక్స్‌చేంజిలో నమోదైన మొత్తం స్టాకుల విలువ దాదాపు పన్నెండున్నర లక్షల కోట్ల రూపాయల మేర తరిగిపోయింది. అలాగే విదేశీ పోర్ట్ ఫోలియో ఇన్వెస్టర్లు (స్టాక్ మార్కెట్ లో మదుపు పెట్టే విదేశీ సంస్థలు) కూడ ఆ వంద రోజుల్లో దాదాపు ముప్పై వేల కోట్ల రూపాయల పెట్టుబడులు ఉపసంహరించుకున్నారు. ఆ వంద రోజుల్లో వేరువేరు రంగాల స్టాక్ విలువల్లో విడివిడిగా జరిగిన పతనాన్ని చూస్తే బ్యాంకింగ్ రంగంలో 26 శాతం, లోహాల రంగంలో 19 శాతం, మీడియా కంపెనీల్లో 14 శాతం, ఆటోమొబైల్ రంగంలో 13 శాతం, రియల్ ఎస్టేట్ రంగంలో 10 శాతం, ద్రవ్య సేవల రంగంలో 7 శాతం, ఔషధాల రంగంలో 5 శాతం, ఎఫ్ఎంసిజి రంగంలో 4 శాతం పడిపోయాయి. కేవలం ఐటి రంగ షేర్లు మాత్రమే స్వల్ప లాభాలతో మిగిలాయి.

దీనికి పాలకవర్గాల వైపు నుంచి ఒకస్థాయిలో “అసలు ఆర్థిక మాంద్యమే లేదు” అనే స్పందన వస్తుండగా, మరొక స్థాయిలో దానికి తక్షణ కారణాలు వెతికి, ఏవో అతుకులూ మాట్లు వేసి ఉపశమనం సాధించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ ఆర్థిక మాంద్యానికి 1991 నుంచి సాగుతున్న ఆర్థిక సంస్కరణలే కారణమని కొందరు, మోడీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక తీసుకున్న నిర్ణయాలు, ప్రధానంగా పెద్దనోట్ల రద్దు, జిఎస్‌టి వంటి చర్యలు కారణమని కొందరు, ప్రత్యేకంగా కార్ల విషయంలో కాలుష్య ప్రమాణాల నిబంధనలు, ఎక్కువ మంది ఉబెర్, ఓలాలు వాడడం కారణమని కొందరు వ్యాఖ్యానిస్తున్నారు. ఈ తక్షణ కారణాలు గిరాకీని తగ్గించి ప్రస్తుత ఆర్థిక సంక్షోభాన్ని త్వరితమూ తీవ్రమూ చేసిన మాట నిజమే ఆవచ్చు గాని, ఆర్థిక సంక్షోభం అనేది భారత పాలకులు ఎంచుకున్న ఆర్థిక వ్యవస్థకు సహజమైన, స్వాభావికమైన అంశం. ఆ మౌలికాంశాన్ని విస్మరించగూడదు.

ఉత్పత్తిదారుల లాభాపేక్షవల్ల, గిరాకీతో, కొనుగోలుశక్తితో సంబంధం లేని అధికోత్పత్తి వల్ల పెట్టుబడిదారీ విధానంలో సంక్షోభం సహజంగా తలెత్తుతుంది. ఆ అధికోత్పత్తిని వదుల్చుకోవడానికి కొన్నాళ్లపాటు ఉత్పత్తిని ఆపివేయడం, ఉన్న నిలువలు తరిగిపోయేవరకూ ఉత్పత్తి తిరిగి ప్రారంభించకపోవడం, ఎటువంటి పరిస్థితిలోనైనా ఉత్పత్తి కొనసాగించ డానికి పరిశ్రమలకు ఉద్దీపనలు ఇవ్వడం, ప్రభుత్వ, ప్రైవేటు ద్రవ్య సంస్థల ద్వారా రుణాలు ఇవ్వడం, వడ్డీ రేట్లు తగ్గించడం, ప్రభుత్వమే గిరాకీ సృష్టించడం వంటి చర్యల ద్వారా సంక్షోభం నుంచి బైట పడి, మరొకసారి ఉత్పత్తి – వినియోగ వికాస దశను చేరడం పెట్టుబడిదారీ వ్యవస్థలలో సర్వసాధారణమైన అంశం. దాన్ని పెట్టుబడిదారీ అర్థశాస్త్రం అనివార్యమైన వ్యాపార వలయంగా అభివర్ణిస్తుంది. అయితే అలా వచ్చే వికాసం స్వల్పకాలికమైనదో, మధ్యంతరమైనదో తప్ప దీర్ఘ కాలికంగా చూసినప్పుడు సంక్షోభమే శాశ్వతమని కనీసం గత రెండు శతాబ్దాల పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థల చరిత్ర చెపుతున్నది.

ఇక భారతదేశం విషయానికి వస్తే ఇక్కడ పెట్టుబడే ద్రవ్య పెట్టుబడి దశలో, సామ్రాజ్యవాద దశలో ప్రవేశించింది. అందువల్ల భూస్వామ్యంతో పోరాడి, ఓడించి, గ్రామీణ ప్రాంతాలలో సమూలమైన విప్లవం తెచ్చి, ఒక కొత్త సమాజాన్ని, ఒక దేశీయ మార్కెట్‌ను సృష్టించకుండా, భూస్వామ్యంతో మిలాఖత్తయింది. అటువంటప్పుడు ఈ సమాజంలో పెట్టుబడిదారీ సంక్షోభం మరింత వికృత రూపం ధరిస్తుంది. ఇక్కడ ఏర్పడిన మార్కెట్ వ్యవసాయ విప్లవం జరిగి, వ్యవసాయోత్పత్తి, వ్యవసాయ ఉత్పాదకత పెరిగి, గ్రామాల వ్యవసాయాదాయ మిగులు వల్ల గిరాకీ ఏర్పడిన విస్తారమైన దేశీయ మార్కెట్ కాదు. ఉనికిలో ఉన్న వ్యవసాయ రంగం కూడ విపరీతమైన సంక్షోభాన్ని ఎదుర్కొంటూ, గిట్టుబాటు ధరల డిమాండ్లలో, రైతుల ఆత్మహత్యలలో, వలసల్లో వ్యక్తీకరణ పొందుతున్నది గనుక గ్రామీణ మార్కెట్‌లో గిరాకీ పెరుగుదలకు ఎక్కువ అవకాశాలు లేవు. గ్రామీణ వలసల వల్ల పట్టణ ప్రాంతాల్లో ఉద్యోగాల మీద ఒత్తిడి, ఉద్యోగాల కోత, విపరీతమైన నిరుద్యోగం వంటి కారణాల వల్ల పట్టణ మార్కెట్ కూడ ఉండవలసినంత విస్తృతమైన గిరాకీతో లేదు. అలా అటు గ్రామీణ మార్కెట్ చూసినా, ఇటు పట్టణ మార్కెట్ చూసినా దేశం జనాభా రీత్యా విశాలమైన మార్కెటే గాని కొనుగోలు శక్తి రీత్యా అతి చిన్న మార్కెట్‌గా మిగిలిపోయింది.

ఇక పారిశ్రామిక, వ్యాపారవేత్తలవైపు నుంచి చూసినా వారు వ్యవసాదాయ మిగులును పెట్టుబడిగా సమకూర్చుకున్న సహజమైన పెట్టుబడిదారులు కారు. అటు బహుళ జాతి సంస్థలకు, విదేశీ పెట్టుబడికి, ఇటు వడ్డీ వ్యాపార పెట్టుబడికి లేదా ప్రభుత్వం తేరగా ఇచ్చిన ప్రజాధనానికి పుట్టిన పెట్టుబడి. అందువల్ల అది ఎక్కువగా దళారీ మార్కెట్ నే, విదేశీ సాంకేతిక పరిజ్ఞానం మీద, పెట్టుబడి మీద, సరుకుల మీద ఆధారపడిన మార్కెట్ నే సృష్టించగలిగింది. ఇక్కడ దేశీయ పెట్టుబడిదారులు ఉండవచ్చు గాని వారు బహుళ జాతి సంస్థలకు కిందిస్థాయి భాగస్వాములుగా ఉండడానికే సిద్ధంగా ఉంటారు. అందువల్ల భారత మార్కెట్ లో అధికోత్పత్తి – అల్పవినియోగ సంక్షోభానికి అవకాశం ఎల్లప్పుడూ ఉంటూ వచ్చింది. రెండున్నర దశాబ్దాలుగా నూతన ఆర్థిక విధానాలు ఆ అవకాశపు అగ్నికి ఆజ్యం పోస్తున్నవి.

అయితే నూతన ఆర్థిక విధానాల్లో భాగంగా ఐటి రంగం, మధ్యతరగతి లో గణనీయమైన భాగం ఎగువ మధ్యతరగతిగా ఎదగడం, సంపన్న వర్గానికి హెచ్చుగా అంతర్జాతీయ సంబంధాలు ఏర్పడి ఆర్థిక వనరులు పెరగడం వంటి పరిణామాలతో గిరాకీని పెంచడానికి కొన్ని కృత్రిమ ప్రయత్నాలు జరిగాయి. గిరాకీ పెరిగింది, ఉత్పత్తి పెరిగింది. మార్కెట్ విస్తరించింది. కాని అది భారత ఆర్థిక వ్యవస్థ నిజమైన పెరుగుదల కాదు, వాపు మాత్రమే. ఆ వాపును బలుపుగా చూపి మాయ చేయడానికి కూడ ప్రయత్నాలు జరిగాయి.

ఆ వాపుకు తొలిదెబ్బ 2008లో అమెరికాలో సబ్ ప్రైమ్ గృహరుణాల సంక్షోభంతో మొదలై ప్రపంచమంతా వ్యాపించిన సంక్షోభం రూపంలో తగిలింది. కాని అప్పటికింకా భారత ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వ రంగ బ్యాంకింగ్ వ్యవస్థ, పరిశ్రమల్లో అనేక ప్రభుత్వ రంగ సంస్థలు ఉండడం వల్ల, ప్రభుత్వం వైపు నుంచి కూడ పారిశ్రామిక సరుకులకు పెద్ద ఎత్తున గిరాకీ ఉండడం వల్ల అప్పటి సంక్షోభపు వేడి భారత ఆర్థిక వ్యవస్థకు పూర్తిగా తగలలేదు. పది సంవత్సరాలు గడిచేసరికి, యుపిఎ కాలంలోనూ, ఆ తర్వాత ఎన్‌డిఎ కాలంలోనూ బ్యాంకింగ్ రంగ సరళీకరణ, బ్యాంకు రుణాల ఎగవేతలు భారత ఆర్థిక వ్యవస్థ నిరోధక శక్తిని కొంత తగ్గించాయి. పెద్దనోట్ల రద్దు, జిఎస్‌టి మరింతగా ఆ నిరోధక శక్తిని తగ్గించాయి. అందువల్ల ఈసారి అంతర్జాతీయ సంక్షోభానికి కొన్ని నెలలు ముందుగానే భారత ఆర్థిక వ్యవస్థ వణికి పోవడం మొదలయింది.

ఇది పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి సహజమైన, స్వాభావికమైన సంక్షోభం గనుక దీని అంతిమ పరిష్కారం పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానాన్ని, అంటే ఇవాళ సామ్రాజ్యవాదాన్ని, దాని వ్యక్తీకరణలైన బహుళ జాతి సంస్థలను కూలదోయడంలో మాత్రమే ఉంటుంది. ఆ అంతిమ పరిష్కారం దిశగా ప్రజా చైతన్యాన్ని మేల్కొల్పడం, ప్రజా సమీకరణ జరపడం, ఒక సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని ప్రారంభించడం మాత్రమే ఆర్థిక సంక్షోభానికి నిజమైన ప్రజా స్పందన అవుతుంది.

అయితే, భారతదేశం వంటి దేశంలో భూస్వామ్య వ్యతిరేకతతో జోడించని సామ్రాజ్యవాద వ్యతిరేకతకు అర్థం లేదు. భూస్వామ్యపు వ్యక్తీకరణలూ కొనసాగింపులూ అయిన కుల, మత తత్వాల మీద, దేశంలో ప్రధాన ఉత్పత్తి సాధనమైన భూమిని, మొత్తంగా సమాజాన్ని, సంస్కృతిని భూస్వామ్య బంధనాల నుంచి విడిపించడం మీద పోరాటాన్ని ఎక్కుపెట్టాలి. అది దీర్ఘకాలిక లక్ష్యం కాగా, తక్షణ నిరుద్యోగ సమస్య దగ్గర ప్రారంభించి, నిరుద్యోగులనూ ప్రజలనూ సమీకరించి ఈ నిరుద్యోగానికీ, అల్ప వినియోగానికీ, కొనుగోలుశక్తి లేమికీ, అధికోత్పత్తికీ, కొనసాగుతున్న ఉత్పత్తి విధానానికీ మూల కారణాల మీద అవగాహన కల్పించాలి. ఉద్యోగకల్పన బాధ్యత, ప్రైవేట్ పరిశ్రమలను నియంత్రించే బాధ్యత ప్రభుత్వానిదేనని నిలదీయాలి. వీ

*(రచయిత వీక్షణం సంపాదకుడు)*

---

*(2008 ఆర్థిక సంక్షోభం సమయంలో ఆ ఆర్థిక సంక్షోభానికీ, మార్క్సిస్టు రాజకీయార్థిక సూత్రాలకూ ఉన్న సంబంధాన్ని వివరిస్తూ 'కమ్యూనిజం' మాసపత్రిక నవంబర్ 2008 సంచికలో ఎన్. వేణుగోపాల్ రాసిన వ్యాసం)*

# ఆర్థిక సంక్షోభం : మార్క్సిస్టు రాజకీయార్థిక సూత్రాల నిరూపణ

పెట్టుబడిదారీ వ్యవస్థలో ఆ ఉత్పత్తి విధానంవల్ల అనివార్యంగా సంక్షోభాలు వస్తాయని రాజకీయార్థిక శాస్త్రం చదువుకున్నవారందరికీ తెలుసు. ఆ సంక్షోభాల గురించి వివరించకతప్పని పెట్టుబడిదారీ అర్థశాస్త్రం కూడ వాటి లోతునూ విస్తృతినీ తీవ్రతనూ తగ్గించి వాటిని ఏవో స్వల్పకాలికమైన, స్థానికమైన వ్యాపార వలయాలుగా, పారిశ్రామిక వలయాలుగా ప్రచారం చేస్తూ ఉండడం కూడ తెలిసిన విషయమే. సంక్షోభం, మాంద్యం, పునరుజ్జీవనం, వికాసం అనే నాలుగు దశలు పెట్టుబడిదారీ ఉత్పత్తివిధానంలో నిరంతరాయంగా వస్తుంటాయనీ, వాటితో భయపడవలసినదేమీలేదనీ, ఒక రకంగా అవి అధికోత్పత్తినీ, నిరుద్యోగాన్నీ సవరించి, వనరుల వినియోగాన్ని పునర్ నిర్ధారించే వ్యవస్థాగత చర్యలనీ పెట్టుబడిదారీ అర్థశాస్త్రం బోధిస్తుంది. గత రెండు శతాబ్దాలలో ఇటువంటి వలయాలు పది సంవత్సరాలకొకసారి, ఒక్కొక్కసారి ఇంకా తక్కువ వ్యవధిలోనూ వచ్చాయని, ప్రతిసారీ పెట్టుబడిదారీ విధానపు పునరుజ్జీవనం, వికాసం సాధ్యమయ్యాయనీ కూడ పెట్టుబడిదారీ అర్థశాస్త్రం చెపుతుంది. అంటే ఈ వలయంలో సంక్షోభం, మాంద్యాల పాత్రకన్న పునరుజ్జీవనం, వికాసాల పాత్రే ఎక్కువన్నట్టుగా, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం సంక్షోభాలను అధిగమిస్తుందన్నట్టుగా పెట్టుబడిదారీ అర్థశాస్త్రవేత్తలు ప్రవచిస్తుంటారు. సంక్షోభాల వల్ల పెట్టుబడిదారీ విధానం కూలిపోతుందని మార్క్సిస్టులు చెప్పే మాట నిజం కాదని అంటుంటారు.

అటువంటి అర్థశాస్త్రవేత్తలు, పెట్టుబడిదారీ సమర్థకులు కూడ సమర్థించడానికి తబ్బిబ్బు పడుతున్నటువంటి, సమర్థించలేక పోతున్నటువంటి సంక్షోభం 2008 లో మొదలయింది. ఈ సంక్షోభం భౌగోళిక విస్తృతిలోనూ, వివిధ ఆర్థిక వ్యాపార పారిశ్రామిక రంగాల విస్తృతిలోనూ, లోతులోనూ ఎంత తీవ్రమైనదో గత రెండు నెలలుగా రోజురోజుకూ అంతకంతకూ ఎక్కువగా బయటపడుతోంది. ప్రపంచవ్యాప్తంగా ప్రచార సాధనాల, ప్రభుత్వాల, ద్రవ్యసంస్థల, వ్యాపార పారిశ్రామిక వర్గాల ప్రతిస్పందన తోనే ఈ సంక్షోభం ఎంత తీవ్రమైనదో తేటతెల్లమవుతోంది. చాలామంది అర్థశాస్త్రవేత్తలకు, పరిశీలకులకు ఈ సంక్షోభాన్ని 1929 నాటి మహాసంక్షోభంతో పోల్చకతప్పని స్థితి వచ్చింది. అలా పోల్చే క్రమంలో ఆనాటి మహాసంక్షోభం ధాటికి తట్టుకుని నిలిచిన సోవియట్ ఆర్థికవ్యవస్థ గురించి కూడ చర్చ వస్తోంది. ఈ సమయంలోనే చాలమంది పరిశీలకులు మళ్లీ ఒకసారి మార్క్సునూ, తమ కాలపు సంక్షోభాలను మార్క్స్ – ఎంగెల్స్‌లు విశ్లేషించిన తీరునూ, మొత్తంగా మార్క్సిస్టు రాజకీయార్థిక శాస్త్రంలో పెట్టుబడిదారీ ఆర్థిక సంక్షోభం గురించిన విశ్లేషణనూ గుర్తు చేసుకుంటున్నారు. ఆర్థిక సంక్షోభాన్ని అర్థం చేసుకోవడానికీ, వివరించడానికీ, విశ్లేషించడానికీ మార్క్సిస్టు సంవిధానం తప్పనిసరి అని గుర్తిస్తున్నారు.

ప్రస్తుత సంక్షోభం అమెరికాలో గృహరుణాల వల్లనో, సబ్ ప్రైమ్ సంక్షోభం వల్లనో, అమెరికా తనఖా వ్యాపారంలో ఒడిదుడుకులవల్లనో, అమెరికాలో వడ్డీరేట్లకూ ఇతరదేశాల వడ్డీరేట్లకూ ఉన్న తేడాలవల్లనో, అమెరికన్ డాలర్ ప్రాముఖ్యతవల్ల ఇతరదేశాల ద్రవ్యసంస్థలు అమెరికన్ ద్రవ్య ఉత్పత్తులకు ఎగబడడం వల్లనో వచ్చిందని ఇప్పటికే ఎంతోమంది వివరించారు. ఈ కారణాలన్నీ బయటికి కనబడుతున్న కారణాలు కావచ్చు. సంక్షోభం ముదిరిపోవడంలో వాటిపాత్ర కొంతమేరకు ఉండవచ్చు. కాని అంతకన్న ముఖ్యమైన, ప్రధానమైన కారణాలున్నాయి. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో ఉన్న అంతర్వైరుధ్యాలవల్ల, అది ఆధారపడిన మూల సూత్రాల వల్ల, పెట్టుబడిదారీ లాభాపేక్ష నియమాలవల్ల అనివార్యంగానే, సహజంగానే పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం సంక్షోభాల మయంగా ఉంటుంది. ప్రస్తుత ఆర్థిక సంక్షోభం కూడ పెట్టుబడిదారీ జ్వరసూచిక కాదు, ఒకానొక రోగ లక్షణం కాదు. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానపు స్వాభావిక, సహజాత అవలక్షణాలు బయటపడుతున్న సందర్భం మాత్రమే. అసలు పెట్టుబడిదారీ విధానమే సంక్షోభం. తాత్విక స్థాయిలో గాని, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం పునాదిలోగాని, ఆ ఉత్పత్తి విధానం పనితీరులో గాని చాల సహజంగా, అనివార్యంగా ఉండే అంశాలే దాని సంక్షోభానికి దారితీస్తాయి. ప్రస్తుతం కూడ అవే ఈ సంక్షోభానికి దారితీశాయి.

ఆర్థికవ్యవస్థ సంక్షోభం గురించి అటు పెట్టుబడిదారీ అర్థశాస్త్రం లోనూ, ఇటు మార్క్సిస్టు రాజకీయార్థిక శాస్త్రంలోనూ అనేక విశ్లేషణలు, అవగాహనలు ఉన్నాయి. మార్క్సిస్టు విశ్లేషణను మాటమాత్రంగా కూడ ప్రస్తావించకుండా, డజన్లకొద్దీ వ్యాపారవలయాల సిద్ధాంతాలను ప్రస్తావించిన పాల్ శామ్యూల్‌సన్ ఏడు రకాల సిద్ధాంతాల జాబితా

ఇచ్చాడు గాని అవేవీ సంక్షోభాన్ని మూలాలనుంచి, సమగ్రంగా విశ్లేషించేవి కావు. ఇటు మార్క్సిస్టు శిబిరంలో కూడ సంక్షోభం గురించి స్వయంగా మార్క్స్ – ఎంగెల్స్‌లు చెప్పినసాటినుంచి, ఆ తర్వాత కాలంలో లెనిన్, రోజా లగ్జెంబర్గ్ వంటి మార్క్సిస్టులు, విశ్వవిద్యాలయాల మార్క్సిస్టు అర్థశాస్త్రవేత్తలు చెప్పినవాటివరకూ ఎన్నో సూత్రీకరణలు, సిద్ధాంతాలు ఉన్నాయి. స్వల్పమైన భేదాలు కూడ ఉన్నాయి. మొత్తం మీద మార్క్సిస్టు శిబిరంలోనే పెట్టుబడిదారీ సంక్షోభం గురించి వెలువడిన సిద్ధాంతాలన్నిటినీ రెండు రకాలుగా వింగడించవచ్చునని పరిశీలకులు అంటున్నారు: అవి, 1. అధికోత్పత్తి – అల్ప వినియోగం; రెండు ఉత్పత్తి శాఖల మధ్య సమన్వయం లేకపోవడం వంటి అసమతౌల్య సంక్షోభాలు. 2. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో లాభాల రేటు పడిపోయే ధోరణి వల్ల వచ్చే సంక్షోభాలు.

పెట్టుబడిదారీ విధానంలో సరుకుల ఉత్పత్తి ప్రజల అవసరాలకు అనుగుణంగా కాక, పెట్టుబడిదారుల లాభాపేక్ష ప్రాతిపదికగా జరుగుతుంది. ఉత్పత్తి ప్రక్రియ ఎంతగా సామాజికంగా మారుతుందో, ఉత్పత్తి సాధనాలు, ఫలితాలు అంతగా వ్యక్తిగత ఆస్తిగా మారుతాయి. సంపద పెరుగుదల ఎంత పెద్ద ఎత్తున సాగుతుందో, పేదరికం కూడ అంతే ఎక్కువగా విస్తరిస్తుంది. యంత్రాల వాడకం ఎంతగా పెరుగుతుందో అంతగా నిరుద్యోగం విస్తరిస్తుంది. ఇటువంటి అనేక మౌలిక వైరుధ్యాలవలనే, పెట్టుబడిదారీ విధానంలో ఒక పక్క అధికోత్పత్తి, మరొక పక్క అల్పవినియోగం కొనసాగుతాయి.

ఈ అంశాన్ని 'కమ్యూనిస్టు ప్రణాళిక'లో కూడ మార్క్స్ – ఎంగెల్స్‌లు ప్రస్తావించారు: "కొంతకాలానికి ఒకసారి విడవకుండా వస్తూ, వచ్చిన ప్రతిసారీ మొత్తం పెట్టుబడిదారీ వర్గం అస్తిత్వానికే మరింత భీతావహంగా ప్రమాదం కలిగిస్తున్న వాణిజ్య సంక్షోభాలను చూద్దాం. ఈ సంక్షోభాలలో అప్పటికే తయారయి ఉన్న వస్తువులలోని అధికభాగమే కాకుండా, అంతకు పూర్వం రూపొంది ఉన్న ఉత్పత్తి శక్తులలోని అధికభాగం కూడ నాశనం చేయబడుతుంది. ఈ సంక్షోభాలలో, అంతకు పూర్వపు యుగాలలో అర్థరహితంగా కనబడే మహమ్మారి ఒకటి – అధికోత్పత్తి అనే మహమ్మారి పుట్టుకొస్తుంది. ఈ సంక్షోభాలు కలిగినప్పుడల్లా ఒక క్షణకాలం అనాగరిక దశలోకి, వెనక్కి నెట్టబడినట్టుగా సమాజానికి అనిపిస్తుంది. మహా దుర్భిక్షంగానీ, సర్వవినాశకరమైన ప్రపంచవ్యాప్త యుద్ధంగానీ వచ్చి, నిత్యజీవితావసర సరుకుల సరఫరా నంతటినీ ధ్వంసం చేసినట్టనిపిస్తుంది. పరిశ్రమా, వాణిజ్యమూ నాశనమైనట్టనిపిస్తుంది."

ఇదే అంశాన్ని ఎంగెల్స్ 'సోషలిజం ఊహాజనితమూ శాస్త్రీయమూ' లో కూడ వివరించాడు: "మొట్టమొదటి సార్వత్రిక సంక్షోభం తలెత్తిన 1825 నుంచీ కూడ అన్ని నాగరిక సమూహాలలోనూ, వారి బర్బర సహచరులలోనూ సకల పారిశ్రామిక, వాణిజ్య ప్రపంచమూ, ఉత్పత్తీ వినిమయమూ ప్రతి పది సంవత్సరాలకొకసారి అతలాకుతలమై పోతున్నాయి. వ్యాపారం స్తంభించిపోతోంది. మార్కెట్లలో సరుకుల గుట్టలు పేరుకుపోతున్నాయి. అమ్ముడుపోని ఉత్పత్తులు అనంతంగా మిగిలిపోతున్నాయి. ప్రతి ఒక్కరి దగ్గరా చేతిలో డబ్బులు ఆడని పరిస్థితి వస్తోంది. పరపతి సౌకర్యం అదృశ్యమవుతోంది. కార్ఖానాలు మూతబడి పోతున్నాయి. కార్మిక జనావళి ఉపాధికోల్పోయి వీధుల్లోపడుతున్నారు. ఇదంతా ఎందుకంటే వాళ్లు మనుగడకు అవసరమయిన దానికన్న ఎక్కువ ఉత్పత్తి చేశారు గనుక."

అధికోత్పత్తి అంటే ప్రజలకు, సమాజానికి అవసరమైనదానికన్న ఎక్కువ ఉత్పత్తి కావడం కాదు. ఉత్పత్తి చేసిన సరుకులన్నిటినీ పెట్టుబడిదారులు అమ్ముకోలేకపోవడం. అంటే అధికోత్పత్తి సంక్షోభానికి మరొక ముఖం ప్రజల అల్ప వినియోగం. ఈ అధికోత్పత్తి – అల్ప వినియోగం ప్రధానంగా ఒక సాపేక్షిక స్థితిని తెలుపుతాయి. అవి పెట్టుబడిదారీ సమాజంలో ప్రజలకు కొనుగోలు శక్తి లేకపోవడానికి సూచికలు.

అసలు అధికోత్పత్తి – అల్ప వినియోగం ఎందుకు వస్తాయి? పెట్టుబడిదారీ ఉత్పత్తి క్రియ మొత్తాన్నీ రెండురకాలుగా విభజించి చూడవచ్చు. అవి మొదటిది, ప్రజలకు అవసరమైన వినియోగ సరుకులను ఉత్పత్తి చేసే శాఖ. రెండవది, ఆ సరుకులను తయారుచేసే భారీ యంత్ర సామగ్రిని ఉత్పత్తి చేసే శాఖ. ఈ రెండు శాఖలూ ఒకదానిమీద ఒకటి ఆధారపడి, సమన్వయంతో పనిచేయవలసినవే. కాని పెట్టుబడిదారీ వ్యవస్థలోని వైరుధ్యాలవల్ల ఆ సమన్వయం కొరవడుతుంది. పెట్టుబడిదారులు విడివిడిగా తమ కార్ఖానాలలో ఎంత క్రమబద్ధంగా, క్రమశిక్షణతో, సమన్వయంతో పనిచేస్తారో, మొత్తం మార్కెట్ లోకి వచ్చినప్పుడు తమ లాభాలే ప్రధానంగా చూసుకుంటూ అంత అరాచకంగా, గందరగోళంగా, పరస్పర పోటీతో వ్యవహరిస్తారు. అందరికన్న తామే ఎక్కువ లాభాలు సంపాదించాలనే దృష్టితో ఎక్కువ వేగవంతమైన, తక్కువ మానవశ్రమను వాడే యంత్రాలతో ఉత్పత్తి చేయాలనుకుంటారు. అలా ఆ యంత్రాలకు గిరాకీ పెరుగుతుంది. ఆ యంత్రాల ఉత్పత్తి పెరుగుతుంది. వాటివల్ల వినియోగ సరుకుల ఉత్పత్తి పెరుగుతుంది. మార్కెట్‌లో ఆ సరుకులు నిండిపోతాయి. కాని కొత్త యంత్రాలు తక్కువ శ్రామికులను ఉపయోగిస్తాయి గనుక ఒక శాఖలో యంత్రాల ఉత్పత్తి పెరిగినకొద్దీ రెండో శాఖలో కార్మికుల సంఖ్య తగ్గిపోతుంది. కార్మికుల సంఖ్య తగ్గిపోవడమంటే కార్మికుల కొనుగోలు శక్తి తగ్గిపోవడమే. అంటే సరుకుల మార్కెట్ తగ్గిపోవడమే. ఆ విధంగా మొత్తంమీద మార్కెట్‌లో సరుకులు ఎక్కువగానూ, కొనగల వినియోగదారులు తక్కువగానూ ఉండే స్థితి వస్తుంది.

ఈ అధికోత్పత్తి సంక్షోభంవల్ల తయారయిన సరుకులు అమ్మకం కాకుండా మిగిలిపోవడం మాత్రమే కాక, ఇక సరుకులను తయారు చేయనక్కరలేదని కొన్ని పరిశ్రమలు మూతబడిపోతాయి. దానితో మరికొందరు కార్మికులు ఉపాధి పోగొట్టుకుని, కొనుగోలు శక్తి పోగొట్టుకుంటారు. అంటే మార్కెట్లో వినియోగ సరుకుల గిరాకీ మరింత తగ్గిపోతుంది. మరొకవైపు వినియోగ సరుకుల పరిశ్రమలు మూతబడడంతో యంత్రసామగ్రి పరిశ్రమలు కూడ అధికోత్పత్తి దశకు చేరుకుని అక్కడ కూడ కార్మికులను తొలగించవలసి వస్తుంది. ఈ చక్రం మరింత తిరిగి అనుబంధ పరిశ్రమలు కూడ మూతబడతాయి.

సాధారణంగా పెట్టుబడిదారీ పరిశ్రమల్లో పెట్టుబడిదారులు బ్యాంకులనుంచి, ద్రవ్య సంస్థల నుంచి రుణాలు తీసుకుని పరిశ్రమలు ఏర్పాటు చేస్తారు గనుక, పరిశ్రమలు మూత బడగానే ఆ ద్రవ్యసంస్థలు కూడ దివాళా ఎత్తక తప్పదు. ద్రవ్యసంస్థలు, బ్యాంకులు మూత బడ్డాయంటే, దానిలో డబ్బులు దాచుకున్న మధ్యతరగతి, సాధారణ ప్రజానీకం, పదవీ విరమణ ఫలితాలు దాచుకున్న వృద్ధులు, వగైరా ఖాతాదార్లందరూ కుప్పకూలిపోతారు. ఇలా ఒకచోట అధికోత్పత్తిగా

ప్రారంభమైనది సార్వత్రిక సంక్షోభంగా మారుతుంది. ఆర్థిక వ్యవస్థలో విభిన్న శాఖలమధ్య, వివిధ సరుకుల పరిశ్రమల మధ్య, వివిధ బ్యాంకుల మధ్య, వివిధ ద్రవ్య సంస్థల మధ్య, వివిధ దేశాల ఆర్థిక వ్యవస్థలమధ్య సంబంధాలు ఎంతగా పెరుగుతుంటే ఈ సంక్షోభం అంతగా సార్వత్రికం అవుతుంది.

లాభాలరేటు పడిపోయే ధోరణి వల్ల వచ్చే సంక్షోభాన్ని కూడ ఈ అధికోత్పత్తి సంక్షోభంలో భాగంగానే చూడవచ్చు. లాభాల రేటు పడిపోవడానికి రెండు ముఖాలున్నాయి. ప్రతి ఒక్క పెట్టుబడిదారూ కూడ తన కార్మికులకు వీలయినంత తక్కువ ఇచ్చి తన లాభాలు ఎక్కువగా పెంచుకోవాలని చూస్తాడు. కాని తాను తయారు చేసే సరుకుల మార్కెట్ మాత్రం పెరగాలని కోరుకుంటాడు. అంటే సమాజంలోని ఇతరప్రజల (అంటే ఇతర పరిశ్రమల కార్మికుల) వేతనాలు మాత్రం పెరగాలని కోరుకుంటాడు. వేతనాలు తగ్గినందువల్ల మార్కెట్ గిరాకీ తగ్గుతుంది. వేతనాలు పెంచాలంటే లాభాలు తగ్గుతాయి. ఇది ఒక అనివార్యమైన పెట్టుబడిదారీ ఉత్పత్తి నియమపు వైరుధ్యం.

లాభాలరేటు పడిపోవడానికి రెండో ముఖం – ఘనాంగ నిర్మాణానికి సంబంధించినది. పెట్టుబడిదారులకు లాభాలు మానవశ్రమనుంచి అదనపు విలువను పిండడం వల్లనే వస్తాయి గనుక, మానవశ్రమను తగ్గించే యంత్రాల వాడకం పెరిగినకొద్దీ, అంటే పెట్టుబడి ఘనాంగ నిర్మాణం పెరిగినకొద్దీ, లాభాల రేటు తగ్గిపోతుంటుంది. కాని పెట్టుబడిదారీ విధానమంటేనే లాభం గనుక ఇంకా ఎక్కువ లాభం సంపాదించడానికి పెట్టుబడిదారులు ఇంకా యాంత్రీకరణకు ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నంలో భాగంగా సంక్షోభం తలెత్తుతుంది.

ఈ నేపథ్యం నుంచి 2008 సంక్షోభాన్ని పరిశీలిస్తే, ఈ సంక్షోభం ఇప్పటికి ప్రధానంగా మౌలిక పరిశ్రమలలో బయటపడలేదు. అమెరికాలో ఆటోమొబైల్ పరిశ్రమ మీద కొంత ప్రభావం కనబడుతున్నప్పటికీ, ఇది ప్రధానంగా ద్రవ్య రంగానికే పరిమితమై ఉంది. ద్రవ్యరంగంలో కూడ గృహాల అధికోత్పత్తి, గృహ రుణాలను ఇబ్బడిముబ్బడిగా, అసలు ధరావత్తులేకుండా, ఉద్యోగం, ఆదాయం లేనివారికి కూడ రుణం ఇచ్చి ఇల్లు తనఖా పెట్టుకోవడంగా మొదలయింది. ఆ తనఖాలను – అంటే ఉత్తి కాగితాలను – ఆకర్షణీయమైన పేర్లతో, సరుకులుగా మర్చి వాటిని ప్రపంచానికంతా అమ్మడంలో అమెరికన్ ద్రవ్య, తనఖా, బీమా సంస్థలు విజయం సాధించాయి. రుణం – తిరిగి వాయిదాలు చెల్లించలేనివారికి రుణం – రియల్ ఎస్టేట్ ధరలను కృత్రిమంగా విపరీతంగా పెంచి ఆ ఇళ్లనే ధరావత్తుగా, తనఖాగా పెట్టుకోవడం – ఆ తనఖా కాగితానికి డిరైవేటివ్స్ అనీ, కొల్లాటరలైజ్డ్ సెక్యూరిటీస్ అనీ ముద్దుపేర్లు పెట్టి, ఆ కాగితాలను దేశదేశాల మదుపుదార్లకు అమ్మడం – ఈ విషచక్రం సాగినంతకాలం బాగానే సాగింది. పెట్టుబడిదారులు వీలయినచోట్ల ప్రతి మజిలీ దగ్గరా లాభాలు చేసుకున్నారు. కాని ఈ చక్రం ఏ ఒక్క చోట అయినా ఆగిపోతే ఇదంతా పేకమేడలా కూలిపోతుంది. ప్రస్తుతం జరిగినది అదే.

ఈ ప్రక్రియకూ ఆర్థిక సంక్షోభం గురించి మార్క్సిస్టు రాజకీయార్థిక విశ్లేషణకూ పోలికలూ తేడాలూ చూస్తే, ఇది పరిశ్రమ కాకపోవచ్చు గాని నిత్యజీవితావసరమైన ఇల్లు అనే సరుకును ప్రజలకు అమ్మడం అనే ప్రక్రియ ఇక్కడ సాగింది. తీసుకోగలిగినవాళ్లకంటే ఎక్కువమందికి రుణాలను ఇవ్వడం, కొనగలిగినవాళ్ల సంఖ్యకంటె ఎక్కువ ఇళ్ల నిర్మాణం జరిగాయి. అంటే ఇళ్ల సంఖ్యలో అధికోత్పత్తి తప్పనిసరిగా ఉంది. రుణం తీసుకోవడానికి ఆస్తీ ఆదాయమూ ఉద్యోగమూ ధరావత్తూ ఏమీ అక్కరలేకపోవచ్చుగాని వాయిదాలు చెల్లించడానికి క్రమబద్ధమైన ఆదాయం కావాలి. అది లేనివారు వాయిదాలు కట్టడం మానేశారు. దానితో తనఖా పత్రాలు కొనుక్కున్న వారికి ఆదాయం ఆగిపోయింది. వారు కూలిపోయారు. వారినుంచి గిరాకీ లేకపోవడంతో గృహ రుణ సంస్థలకు రుణాలు ఇవ్వడానికి నిధులు లేకుండాపోయాయి. దానితో గృహ రుణాలు తగ్గిపోయాయి. వాయిదాలు కట్టలేనివారు పెరిగిపోవడంతో వారిని ఇళ్ల నుంచి ఖాళీ చేయించడం, కొత్త రుణాలు ఇవ్వలేకపోవడం, అందువల్ల కొత్త ఇళ్లు అమ్మకం కాకపోవడం – చక్రం ఎంత వేగంగా ముందుకు తిరిగిందో అంతే వేగంగా వెనక్కి తిరిగింది. పారిశ్రామిక సరుకుల గురించి చెప్పుకున్నట్టుగా ఇళ్ల గురించి కూడ ఒకవైపు అధికోత్పత్తి, మరొకవైపు అల్ప వినియోగం అని చెప్పుకోవలసి వచ్చింది. మొత్తంగా పెట్టుబడిదారీ అరాచకత్వం గురించి మార్క్సిస్టు రాజకీయార్థిక శాస్త్రం చెప్పిన సూత్రీకరణ అక్షరాలా మనకళ్లముందే రుజువయింది.

ఈ సంక్షోభాన్ని పరిష్కరించి అమెరికన్ ద్రవ్య, బీమా, తనఖా రంగాన్ని గట్టెక్కించాలంటే ముప్పై లక్షల కోట్ల డాలర్లు అవసరమవుతాయని, అవి సమకూర్చి తనఖారంగాన్ని, ద్రవ్య, బీమా సంస్థలను కాపాడతానని అమెరికన్ పాలకవర్గాలు అంటున్నాయి. కాని మౌలికంగా పెట్టుబడిదారీ సామాజిక ఆర్థిక ధర్మంలోనే, దాని పునాదిలోనే ఈ వైరుధ్యం ఉన్నప్పుడు ఈ ఉపశమనాలు ఆ సంక్షోభాన్ని పరిష్కరించజాలవు. కాకపోతే ఈ సారి ఏర్పడిన సంక్షోభాన్ని ఎంతో కొంత తగ్గించవచ్చు. మళ్లీ మరింత పెద్ద సంక్షోభం వస్తుంది. అప్పుడు ఈ మందు కూడ పనిచేయదు. పెట్టుబడిదారీ స్వభావమే సంక్షోభానికి కారణమైనప్పుడు, ఆ స్వభావాన్ని యథాతథంగా ఉంచి, పైపై పూతలు, మెరుగులు, సంస్కరణలు, చిట్కామంత్రాలు ఎన్నిటితోనైనా ఆ సమస్యను పరిష్కరించడం సాధ్యం కాదు.

అయితే ప్రస్తుత సంక్షోభం ఎంత తీవ్రమయినదయినప్పటికీ పెట్టుబడిదారీ విధానానికి అదే చరమగీతం కూడ పాడజాలదు. సామ్రాజ్యవాదం వల్ల, ఇప్పటికీ పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి అనేక దేశాలలో ముడిసరుకులు, చౌక శ్రమ, విశాలమైన మార్కెట్లు దొరికే అవకాశం ఉన్నందువల్ల ఇటువంటి సంక్షోభాల నుంచి అది గట్టెక్కగలుగుతుంది. నిజానికి ఇటువంటి సంక్షోభాలవల్ల పరిశ్రమల నుంచి బయటికి తోయబడే సువిశాల నిరుద్యోగ సైన్యం సంఘటితమైన నిర్మాణరూపం ధరించి, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధాన అమానుషత్వాన్ని గుర్తించి, దానిమీద తమ పోరాటాన్ని ఎక్కుపెట్టగలిగినప్పుడే ఈ సంక్షోభం పరిష్కారమవుతుంది. అలా పెట్టుబడిదారీ విధానం కూలిపోయి, శ్రామిక సైన్యం రూపొందించుకునే కొత్త సామాజిక రాజకీయార్థిక ధర్మం నెలకొంటుందని మార్క్సిస్టు మహోపాధ్యాయులు ఊహించారు. ఇటువంటి సంక్షోభాలను వినియోగించుకోగలిగిన, వినియోగించుకోవలసిన ప్రజాతంత్ర, వామపక్ష శక్తులు ఇప్పటికైతే బలహీనంగా ఉన్నాయి. బయటికి తోయబడుతున్న లక్షలాది, కోట్లాది నిరుద్యోగ సైన్యానికి రాజకీయార్థిక, సామాజిక చైతన్యం కలిగించి వారిని సుశిక్షితులైన, సంఘటిత, క్రమశిక్షణాయుత, నిర్మాణపర సైనికులుగా తీర్చిదిద్దవలసిన శక్తులు ఆ పని చేయడంలో వెనుకబడే ఉన్నాయి. వీ

# పాలకుల దుశ్చర్యలతో కుదేలైన ఆటో రంగం

*ఆటోరంగం పతనానికి ప్రధాన కారణం ప్రభుత్వం అమలు చేస్తున్న ప్రపంచీకరణ విధానాలనీ, కార్మిక, ఉద్యోగ రంగాలపై దీని ప్రభావం తీవ్రంగా ఉంటుందనీ అంటున్నారు* **కె. సూర్యం**

**భా**రత దేశంలో మూడున్నర కోట్ల మంది ప్రత్యక్షంగా, పరోక్షంగా ఉపాధి నందిస్తున్న రంగం ఆటోమొబైల్స్. 2019 ఏప్రిల్ – జూలై మధ్య కాలంలో తమ ఉత్పత్తుల్లో కోత విధించారు. ట్రాక్టర్లు, కార్లు, మోటార్ సైకిల్స్ అమ్మకాలు క్షీణించడంతో ఉత్పత్తులను ఆయా సంస్థలు నిలిపివేశాయి. దీనిలో ఆయా సంస్థలు మూడున్నర లక్షల మంది కార్మికులను తొలగించారు.

మారుతి సుజుకీ 18 శాతం, మహేంద్ర 11 శాతం, టాటా మోటార్స్ 20 శాతం, హోండా కార్స్ 19 శాతం, టోయోటా 21 శాతం, హీరో మోటార్స్ 12 శాతం, హీరో మోటార్ కార్స్ 12 శాతం, హోండా మోటార్ సైకిల్ 18 శాతం, టివిఎస్ మోటార్ 8 శాతం, రాయల్ ఎన్‌ఫీల్డ్ 22 శాతం ఈ విధంగా ఉత్పత్తులు తగ్గించుకోవడంతో భవిష్యత్ మరో 10 లక్షలకు పైగా కొలువులకు గండం ఏర్పడబోతుందని ఆటో మోటార్ పరికరాల తయారీ సంస్థల సమాఖ్య (ఎసిఎంఎ) జూలైలో హెచ్చరించింది. దేశీ ప్యాసింజర్ వాహనాల ఉత్పత్తి ఏప్రిల్ – జూలై మధ్య 13.18 శాతం తగ్గిపోయింది. భారీ దిగ్గజాలు భారీగా ఉత్పత్తులు తగ్గించుకున్నారు.

ఆటోమొబైల్ తయారీ సంస్థల సమాఖ్య సియోమ్ గణాంకాల ప్రకారం గత సంవత్సరం 87,13,476 యూనిట్లు ఉండగా, ఈ ఏడాది 78,95,675గా నమోదైంది. అంటే 10 శాతం పడిపోయింది. ప్యాసింజర్ వాహనాల ఉత్పత్తులు 13,97,404 యూనిట్ల నుండి 13 శాతం క్షీణతలో 12,13,281 యూనిట్లకు పడిపోయింది.

వందల కొద్ది డీలర్‌షిప్స్‌ల మూతపడినాయి. లక్షలాది మంది ఉపాధి కోల్పోవడం వంటి తీవ్ర పరిస్థితి నెలకొంది. సిఐఇఎల్‌ఎచ్‌పి. సర్వీసెస్ సిఇఒ ఆదిత్య నారాయణ మిశ్రా అధిక వేతనాలు పొందుతున్న వారిని, తాత్కాలిక ఉద్యోగులను సత్వరమే తొలగించి సంస్థలను నిలబెట్టుకునే పరిస్థితి వచ్చిందని వాపోయారు.

ఆర్థిక మంత్రి నిర్మలా సీతారామన్‌ను పారిశ్రామిక వేత్తలు కలిసి కనివిని ఎరుగని రీతిలో అమ్మకాలు తగ్గిపోయినందున ఆటో రంగంలో వచ్చిన అస్తవ్యస్త స్థితి నుండి, ఇక్కట్ల నుండి కాపాడుకోవడానికి పరిశ్రమకు ఉద్దీపనలిచ్చి ఆదుకోవాలని కోరారు.

మారుతీ సుజుకీ చైర్మన్ ఆర్.సి. భార్గవ్ మహేంద్ర ఆటోమొబైల్ విభాగం ప్రెసిడెంట్ సియామ్ అధ్యక్షుడు రాజవ్ వధేరా, ఆటో విడిభాగాల పరిశ్రమల సంఘం (ఆక్మా), ఫాడా ప్రతినిధులు ఆర్థిక మంత్రికి కలిసి వివరించిన బృందంలో ఉన్నారు. అలాగే జీఎస్‌టి 28 శాతం నుండి 18 శాతం తగ్గించాలని కోరారు.

**ఈ సంక్షోభాలకు కారణాలు ఏమిటి?**

ఒకే దేశం, ఒక పన్నుల విధానం అంటూ గత రెండు సంవత్సరాల కింద వస్తు సేవల పన్ను (గూడ్స్ సర్వీస్ టాక్స్) విధింపు అడ్డగోలుగా చేయడం. మోడీ అధికారానికి వచ్చాక మేడ్ ఇన్ ఇండియా, మేక్ ఇన్ ఇండియా అంటూ ప్రపంచ దేశాలల్లో పర్యటించి ఆహ్వానాలు పలికారు. వారికి అనుకూలంగా కార్మిక చట్టాలను సవరించారు. దేశంలో పెద్ద పెద్ద కార్పొరేట్ కంపెనీలు బ్యాంకుల ద్వారా కోట్లాది రూపాయల రుణాలు తీసుకొని బోర్డులు తిప్పి వేయడం, వేలాది మోసాలతో బ్యాంకులను కొల్లగొట్టారు. దీనితో బ్యాంకింగ్ వ్యవస్థ అస్తవ్యస్తం కావడం జరిగింది. దేశ ఆర్థికాభివృద్ధి 8 శాతం వరకు దూసుకు పోతుందని మోడీ అన్నారు. కాని నేడు ఆర్థికాభివృద్ధి 5 శాతం కూడా దాటని స్థితి రావడంతో ఆర్థిక వ్యవస్థ అస్తవ్యస్తంగా మారింది.

దేశీయ నల్లధనాన్ని వెలికి తీస్తానంటూ, విదేశాల్లో దాచిన సొమ్మును కక్కిస్తానంటూ పలికిన మాటలు ఉత్తర ప్రగల్భాలని తెలిసిపోయింది. ప్రజల వినియోగం పెరగని చోట ఆర్థికాభివృద్ధి మందగిస్తుందని, ప్రజలకు అవసరాలు ఉన్న, వాటిని వినియోగించే ఆర్థిక స్థితి లేక పోవడం ప్రధాన కారణం. అందుతే ప్రజల ఆదాయం పెరిగితేనే ఆర్థిక వ్యవస్థ ముందుకు పోతుంది. లేనిచో మందగమనం తప్పదని అర్థ శాస్త్రవేత్తలు హెచ్చరిస్తూనే ఉన్నారు.

వస్తు సేవల పన్నులు (జిఎస్‌టి)తో వాహనాల ధరలకు రెక్కలు రావడం వలన వినియోగదారుడు ఆచితూచి అడుగులు వేస్తున్నాడు. దీనితో అమ్మకాలు తగ్గాయి. రెండవది బీమా కంపెనీలు తమ ప్రీమియమ్స్‌లను పెంచడం, దీనికి తోడు మూలిగే నక్కపై తాటిపండు పడ్డ చందంలా ఇంధన ధర అడ్డు అదుపు లేకుండా పెరిగిపోవడం వలన వాహనాలపై పెట్టుబడులు పెట్టడానికి ముందుకు రావడం లేదు.

బ్యాంకింగ్ రంగాల నుండి రుణాలు పొందడం కూడా కష్టతరంగా మారింది. ఎందుచేతనంటే వరసగా లక్షల కోట్లు రాని బాకీల కింద మిగిలి పోవడం, దేశాలు వదిలిపోయిన పారిశ్రామిక వేత్తలు (నీరవ్ మోడీ, విజయమాల్యా), ఉండబట్టి రుణాలు ఇవ్వడానికి బ్యాంకులు వెనుకా ముందు చూస్తున్నాయి. వడ్డీ రేట్లు అధికంగా ఉండబట్టి కూడా మందగమనానికి కారణాలు.

ఆటోమొబైల్ రంగానికి ఊతం ఇవ్వాలంటే తాత్కాలిక ఉద్దీపనలు ప్రకటించి, కొన్ని కోట్ల రూపాయలను పారిశ్రామిక వేత్తలకు కట్టబెట్టడం వలన ఆశించినంతగా ఫలితాలు రావు. జిఎస్‌టిని తగ్గించడం, వడ్డీ రేట్లు తగ్గించడం వలన కొంత ఉపశమనం లభిస్తుంది. కాని అదే శాశ్వతం

# దేశాన్ని ఆర్థిక సంక్షోభంలోకి నెట్టిన హిందూవాదం

*ప్రస్తుత దేశ ఆర్థికసంక్షోభానికి బిజెపి ప్రభుత్వం అనుసరిస్తున్న కార్పొరేట్ అనుకూల విధానాలే కారణమనీ, మౌలిక సమస్యలు తీర్చకుండా, వనరులను కొల్లగొడుతూ ప్రజలను మరింత పతనావస్థకు చేరుస్తున్నారనీ అంటున్నారు* **డా. కత్తి పద్మారావు**

**భా**రతదేశం ఈనాడు ఆర్థిక సంక్షోభంలో కొట్టుమిట్టాడుతోంది. భారత ప్రధాని నరేంద్రమోడీ ఏమో ప్రపంచమంతా తిరిగి తనేదో భారతదేశానికి కొత్త రూపం తీసుకొస్తున్నట్లు ప్రచారం చేసుకుంటున్నాడు. మన్‌కీ బాత్‌లో మొదటి సంవత్సరం ఏమి చెప్పాడో ఆరవ సంవత్సరం కూడా అదే చెబుతున్నాడు. ప్రధానికి వాచకం ఉన్నంత బలంగా కార్యాచరణ లేదు. హావభావాలు ఉన్నంత నైపుణ్యంగా జీవన వర్తన లేదు. హక్కులు కాలరాయడంలోనే భారతదేశ గౌరవం ఇనుమడిస్తుందను కుంటున్నాడు. నిజానికి ప్రపంచ దేశాల ముందు మనం తల వంచుకుని నిలబడే అనేక అంశాలు ఈనాడు మన ముందు దృశ్యీకృతమై ఉన్నాయి. దేశంలో మత, కుల వైరుధ్యాలు, అణచివేతలు విపరీతంగా కొనసాగు తున్నాయి. దేశంలో అనారోగ్యం పల్లెపల్లెలో, ఊరూరా తాండవిస్తున్నది. బిజెపిలోనే అతి ప్రధానమైన పాత్రధారులు మాజీ ప్రధానమంత్రి వాజ్‌పేయి, మాజీ కేంద్ర విదేశాంగ శాఖ మంత్రి సుష్మాస్వరాజ్, మాజీ కేంద్ర ఆర్థికమంత్రి అరుణ్‌జైట్లీ, గోవా మాజీ ముఖ్యమంత్రి మనోహర్ పారికర్ ఒక సంవత్సరంలోనే మరణించడం. ఈ మరణాల వెనుక క్యాన్సర్ ఇతర వ్యాధుల వంటి కారణాలున్నాయి. అయితే వీరందరికీ సముచితమైన వైద్యమే జరిగింది. కానీ అనారోగ్య భారతంలో భాగంగా వీరు మరణానికి గురయ్యారు. వాయు కాలుష్యం, జల కాలుష్యం పెరిగాయి.

ఇక సామాన్యుల విషయం చూస్తే పౌష్టికాహారం లేక శిశువులకు రక్షణ లేక ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు బలహీనంగా ఉండడం వలన మరణిస్తున్నారనేది మనకర్థమవుతుంది. మొత్తం భారతదేశంలో మరణాల వెనుక ఆర్థిక సంక్షోభం, దోపిడీ ఉంది. మరోపక్క జాతి జనుల సంపదను దోపిడీదారులు బ్యాంకులకు ధనం ఎగ్గొట్టడంతో దోచుకుంటున్నారు.

మొదట 11వేల కోట్ల రూపాయలు నీరవ్‌మోడీ బ్యాంకులకు ఎగవేసినట్లు మనకు లెక్కలు చెబుతున్నాయి. నీరవ్‌మోడీ దోచుకున్న డబ్బు రుణాలు, వడ్డీలు కలిపి 20వేల కోట్ల రూపాయలుగా లెక్క తేలింది. ఏడు బ్యాంకులతో కూడిన కన్సార్టియం నుంచి కొఠారీ కుటుంబం రాబట్టి ఎగ్గొట్టిన అసలు, వడ్డీ కలిపి ఇప్పటికి 3695 కోట్ల రూపాయలు, నకిలీ పత్రాలతో బ్యాంకుల నుంచి రుణాన్ని పొంది విదేశీ సంస్థల ఖాతాలకు ఆ డబ్బును మళ్లించి తిరిగి వాటిని రాబట్టడంలో కొఠారీ బృందం నిబంధనలన్నింటినీ నెట్టివేసింది.

మరోపక్క ఆక్స్‌ఫాం ఇంటర్నేషనల్ సర్వే ప్రకారం భారతదేశంలోని పది శాతం ఉన్నత జనాభా చేతిలో 77.4 శాతం సంపద ఉంది. ఒక శాతం జనాభా చేతిలో 51.53 శాతం సంపద ఉంది. దిగువ 60 శాతం చేతిలో 4.8 శాతం సంపద మాత్రమే ఉంది.

**పేదరిక మూలం**

పేదరికం ఇంత భయంకరంగా ఉంటే మరోవైపు శతకోటీశ్వరులు పెరిగిపోతున్నారు. భారతదేశంలో శత కోటీశ్వరుల ఆదాయం రోజుకి 2200 కోట్ల రూపాయలు గత సంవత్సరం పెరిగింది. 18 మంది శత కోటీశ్వరులు గత సంవత్సరం పెరిగారు. మొత్తం శతకోటీశ్వరులు 119 మంది. వీరి ఆస్తి 28 లక్షల కోట్ల రూపాయలకు చేరింది. ప్రపంచంలోని 50 శాతం మంది ప్రజల దగ్గర ఎంత సంపద ఉందో, కేవలం 26 మంది దగ్గర అంతే సంపద ఉంది. ప్రపంచంలో ఉన్న 2200 మంది శతకోటీశ్వరులు రోజుకు రు. 17,750 కోట్లు సంపాదిస్తున్నారు.

కేంద్ర ప్రభుత్వ గణాంకాల ప్రకారం ఇంతవరకు మనం తీసుకున్న

కాదు. ప్రజల వినియోగం పెరగాలి. దానికి వారికి లభించే ఆర్థిక వనరు, జీతభత్యాలు పెరగాలి. పెరగడానికి చర్యలు తీసుకోకుండా పైపై పూత మెత్తులతో ఒరిగేది ఏమి ఉండదు.

ప్రజల ఆదాయం పెరగాలంటే దేశంలో గల 35 కోట్ల మంది కార్మిక వర్గానికి కనీస వేతనాలు నెలకు 18 వేల వరకు ఉండాలనే డిమాండ్‌ను కేంద్రం కనీస పరిశీలన చేయక పోవడం శోచనీయం. నేడు మూడున్నర లక్షల మందిని ఆటో రంగం నుండి తొలగించడం వలన ఆర్థికవ్యవస్థపై తీవ్ర ప్రభావం ఉంటుంది. కొనుగోలు లేక అమ్మకాలు క్షీణించడంతో ఆయా సంస్థలు ఉత్పత్తులు నిలిపివేయడం జరిగింది. తిరిగి మూడున్నర లక్షల మంది ఉద్యోగాలు లేక, ఆదాయం లేక వారు ఏలాంటి కొనుగోలు చేయక పోవడం వలన ఇతర రంగాలపై ప్రభావం ఉంటుంది.

ఉదాహరణకు ఉద్యోగాలు కోల్పోయిన వారు బట్టలు, బిస్కెట్లు కొనరు అనుకోండి. దీనితో వాటిలో కూడా ఉత్పత్తుల అమ్మకాలు లేక పోవడంతో వాటి నుండి కూడా కార్మికులను తొలగిస్తున్నారు. ఈ మధ్య పార్లే బిస్కెట్ అమ్మకాలు క్షీణించడంతో 15 వేల మంది కార్మికులకు ఉద్వాసన పలికారు. టెక్స్‌టైల్స్ రంగం నుండి దేశవ్యాపితంగా 13 లక్షల మంది కార్మికులను తొలగింపులకు గురయ్యారు.

పాలకులు, పెట్టుబడిదారులు లాభాపేక్ష దృష్టితో వ్యవస్థను నడపడం వలన ఇలాంటి సంక్షోభాలు వస్తాయి. నిరుద్యోగులుగా మారిన కార్మిక వర్గం, చైతన్యవంతంగా పరిస్థితిని అర్థం చేసుకొని నూతన సమాజ స్థాపనకై పోరు సాగించవలసి వస్తుందని గుర్తించాలి.

*(రచయిత ఐఎఫ్‌టియు రాష్ట్ర ప్రధాన కార్యదర్శి)* వీ

స్వదేశీ, విదేశీ రుణాలు రు. 84 లక్షల కోట్లను మించిపోయాయి. అందులో విదేశీ రుణాలు 5 లక్షల కోట్ల రూపాయలకు కాస్త ఎక్కువ స్వదేశీ రుణాలు రు. 70 లక్షల కోట్ల పైచిలుకు. ఇకపై తన వార్షిక రుణ సేకరణలో 10 శాతాన్ని విదేశీ బాండ్ల మార్కెట్ నుంచి సేకరించాలని ప్రభుత్వం యోచిస్తోంది. తడవకు 300-400 కోట్ల డాలర్ల చొప్పున ఈ ఏడాది మొత్తంగా 1000 కోట్ల డాలర్లను (రు. 70,000 కోట్లను) సేకరించ దలచిందని ఆర్థిక శాస్త్రవేత్తలు చెబుతున్నారు. మరో ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే మన దేశంలో ఉండే కుటుంబాల వాళ్ళ స్త్రీలు, వృద్ధులు దాచిపెట్టుకుంటున్న డబ్బుల్లో 80 శాతం ప్రభుత్వం ఇప్పటికే అప్పు తీసుకుంది.

ప్రభుత్వం ఇంకా దివాళా తీస్తే వీరికి పోస్టాఫీసులు, బ్యాంకుల నుండి తిరిగిస్తారా! ఎందుకంటే ప్రభుత్వం దివాళా తీసిందని ప్రజలకు తెలియదు. మనం ఇంట్లో దాచుకోలేము కాబట్టి ప్రభుత్వ సంస్థల్లో భద్రంగా ఉంటాయని వీరు దాచుకుంటున్నారు. ప్రభుత్వం ఆర్థిక సంక్షోభంలోనే కాక ఊబిలోకి కూడా దిగిపోయిందని ప్రజలకు తెలియదు. ఇకపోతే తాజా లెక్కల ప్రకారం మన దేశంలో దాదాపు 6.5 కోట్ల సూక్ష్మ, చిన్న, మధ్య తరహా పరిశ్రమలు ఉన్నాయి. ఈ సంస్థల ద్వారా 12 కోట్ల మందికి ఉద్యోగ, ఉపాధి అవకాశాలు లభిస్తున్నాయి. ఎంఎస్ఎంఇ రంగం వాటా స్థూల దేశీయోత్పత్తి (జిడిపి)లో 29 శాతం. కొన్నేళ్లుగా ఇది స్థిరంగా అక్కడే ఉండిపోయింది.

రాష్ట్రాలవారీగా చూస్తే ఎంఎస్ఎంఇ సంస్థల సంఖ్య బీహార్, ఉత్తర్‌ప్రదేశ్ రాష్ట్రాల్లో అధికంగా ఉంది. తమిళనాడు, మహారాష్ట్ర, గుజరాత్, మధ్యప్రదేశ్, రాజస్థాన్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు తరువాతి స్థానాల్లో ఉన్నాయి. ఒకవైపు కొత్తగా ఎంఎస్ఎంఇ పరిశ్రమలు ఏర్పాటవుతున్నప్పటికీ, ఖాయిలా పడుతున్న సంస్థల సంఖ్యా అదే క్రమంలో అధికమవుతోంది. రిజర్వు బ్యాంకు గణాంకాల ప్రకారమే దేశ వ్యాప్తంగా 4,86,291 సూక్ష్మ, చిన్న, మధ్యతరహా యూనిట్లు మూతపడ్డాయి.

ఇటీవల వాహన సంస్థలన్నీ మా అమ్మకాలు తగ్గిపోయాయని గోలపెడుతున్నాయి. ఈ సందర్భంగా వాళ్ల తగ్గింపు రేట్లు కూడా పెద్ద ఎత్తున ప్రకటించాయి. భారీ డిస్కౌంట్లు ప్రకటించి అమ్ముకోవాలని చూస్తున్నా కానీ ద్విచక్ర వాహనాలు కూడా కొనలేని యువకులు ఎందుకున్నారని లోతుగా ఆలోచిస్తే యువతకు ఉపాధి లేదు. దగ్గర దగ్గర 30 కోట్ల మంది యువకులు ఉపాధి లేక సోమరులుగా జీవిస్తున్నారు.

ఆటోమొబైల్ రంగం రానురాను సంక్షోభంలో కూరుకుపోతుంది. భారతదేశంలో ప్రతి వెయ్యిమందికి 17 కార్లున్నాయి. కానీ ఒక కుటుంబానికి 17 కార్లున్న ధనవంతులు కూడా ఉన్నారు. ప్రతి వెయ్యి మందికి 85 ద్విచక్ర వాహనాలున్నాయి. కానీ కొన్ని పల్లెల్లో ఒక ద్విచక్ర వాహనం కూడా లేదు. దేశంలో 30 శాతం మందికి ఏ వాహనం లేదు. ఉన్నవాళ్లకే ఉన్నాయి, లేనివాళ్లకి అసలు లేవు. ఇదీ భారతదేశ ముఖచిత్రం. భారతదేశంలో అందరూ అప్పులకు అలవాటు పడుతున్నారు.

దేశమే అప్పులు తెచ్చుకుంటుంది, నేను చేస్తే తప్పేంటి అనే భావం ప్రజల్లో ముఖ్యంగా మత ప్రభావం వలన పెరిగిపోతున్నది. మతం కర్మ భావాన్ని పెంచుతుంది. పుట్టించినవాడే చూసుకుంటాడు. మన కర్మ ఎలా ఉంటే అలా జరుగుతుంది. అన్నింటికీ దేవుడే బాధ్యుడు. ఇలాంటి భావాలు మనుషుల్లో పెరుగుతున్నాయి. ఎదుటివాడిని దోచుకోవడానికి ఏ మాత్రం వెనుకాడడం లేదు. దోచుకున్న వాడికే నీరాజనాలు పలుకుతున్నారు. దోపిడీదారులు రాజకీయ వేత్తలుగా కూడా చలామణి అవుతున్నారు. ముఖ్యంగా కోట్లకు పడగలెత్తిన వారంతా లోక్‌సభలోనే ఉన్నారు. నానాటికీ వ్యవసాయం నిరాదరణకు గురవుతోంది. వ్యవసాయ కూలీకి పనిలేదు. ఉపాధిలో కొత్త అవకాశాలు కల్పించడంలో ప్రభుత్వం పూర్తిగా విఫలమైంది. సామాజిక స్తబ్దత వలన కొత్త ఉపాధి రంగంలోకి దూకడానికి గ్రామీణ ప్రజలు వెనుకాడుతున్నారు. కులం పునాదులు చెదరక పోవడం వలన అస్పృశ్యత ఇంకా తాండవిస్తూనే ఉంది.

**తాగునీరు లేని భారతం**

ఇంకా భారతదేశం ప్రజలకు కనీసం త్రాగునీటిని అందించే స్థితిలో కూడా లేదు. సురక్షిత జల సంక్షోభాన్ని గురించి శాస్త్రవేత్తలు ముందే ఆందోళన చెందుతున్నారు. ఇంచుమించు గ్రామాలన్నీ శుభ్రమైన నీటికి దిక్కులేని స్థితిలోనే మగ్గుతున్నాయి. వివిధ కారణాల వల్ల వలస వెళ్లిన 6.85 కోట్ల ప్రజలకు రక్షిత తాగునీరు దుర్భర సమస్యగా పరిణమించింది. ప్రపంచంలో సుమారు 15.90 కోట్ల ప్రజలు చిన్నపాటి కుంటలు, వాగులు, ఇతర ఉపరితల వనరుల నుంచి లభ్యమయ్యే మురికి నీటిని ఉపయోగించి రోగాల పాలవుతున్నారు.

2030 నాటికి దాదాపు 70 కోట్ల మంది ప్రజలు నీటి కొరత వల్ల జీవన సంక్షోభంలోకి నెట్టబడతారని అంచానా. ఎవరైనా, ఎక్కడున్నా నీటిని పొందడం ప్రజలందరి ప్రాథమిక హక్కు. సురక్షిత జలం అందుబాటులో ఉన్నప్పుడే ప్రజారోగ్యం సాధ్యమవుతుంది. సమాజాభివృద్ధి సాకారమవుతుంది. పారిశుధ్యం, మంచినీటిని ప్రపంచ ప్రజల ప్రాథమిక హక్కుగా 2010లో ఐక్యరాజ్యసమితి గుర్తించింది. ఈ హక్కు క్షేత్రస్థాయిలో అమలైనపుడే సంపూర్ణ మానవ వికాసం సాధ్యపడుతుంది. నీటిపై ప్రాథమిక హక్కు లభించినప్పుడే ప్రజలందరూ తమ వ్యక్తిగత పారిశుధ్య, పంట పొలాలకు సుజలాన్ని పొందగలుగుతారు.

వాతావరణ మార్పులు, జనాభావృద్ధి వలసల వల్ల నీటి అవసరం ఎక్కువగా ఉంటుంది. నీరు అందుబాటులో లేక ఇక్కట్లు పడుతున్న ప్రజలపై ప్రభుత్వాలు దృష్టి కేంద్రీకరించాలి. నీటికి సంబంధించి విధాన నిర్ణయాలు తీసుకొనేటప్పుడు ఆయా వర్గాలకు ప్రాధాన్యమివ్వాలి.

ఇకపోతే దేశంలో ప్రస్తుతం విద్యావంతులైన నిరుద్యోగుల సంఖ్య 10.2 కోట్లుగా ఉన్నట్లు అంచనా. నిరక్షరాస్యులైన నిరుద్యోగుల సంఖ్య మరో 5 కోట్ల వరకు ఉంటుంది. ప్రతి సంవత్సరం వీరి సంఖ్య పెరుగుతూనే ఉంది. 2021 నాటికి 15-34 సంవత్సరాల వయస్సు గలవారి సంఖ్య 48 కోట్లకు చేరుకుంటుంది. అందులో 50 శాతం మేరకు నిరుద్యోగులుగా మిగిలే ప్రమాదముందని ఆర్థికవేత్తలు విశ్లేషిస్తున్నారు.

అజీమ్ ప్రేమ్‌జీ విశ్వవిద్యాలయ విశ్లేషణ ప్రకారం 2011-2016 మధ్య కాలంలో దేశవ్యాప్తంగా దాదాపు అన్ని రాష్ట్రాల్లో నిరుద్యోగం పెరిగింది. కళాశాలల నుంచి బయటకు వచ్చాక నిరుద్యోగులుగా మిగులుతున్న పట్టభద్రుల రేటు 4.1 నుంచి 8.4 శాతానికి పెరిగింది. అందుకే భారతదేశం ఈనాడు ఆర్థిక సంక్షోభంలో కూరుకుపోయి ఉంది.

మోడీ, అమిత్‌షాల నాయకత్వం ప్రజల్లో మూఢ విశ్వాసాలను పెంచుతున్నది. మత భావోద్వేగాలను రెచ్చగొడుతున్నది. నిజానికి

భారతదేశం రత్నగర్భ. ఎన్నో మానవ వనరులు, ఎంతో ప్రకృతి సంపద, ఎంతో మానవ శ్రమజీవన సంపద ఉన్నాయి. వీటిని సమన్వయించి సంపదను వృద్ధి చేయడమే నాయకత్వం పని. అయితే భారతదేశం మోడీకి, అమిత్‌షాకి అర్థం కావడంలేదు. వారిలో ఉన్న సంకుచిత భావాలతో భారతదేశాన్ని మరింత తిరోగమనంలోకి తీసుకెళ్తున్నారు.

దక్షిణ భారతదేశం మీద వారికి మరింత నిర్లక్ష్యం. రాజకీయ విన్యాసాల వల్ల సంపద పెరగదు. దేశంలో సంపద పెరగడానికి జ్ఞానోత్పత్తి, వివేచన, శ్రమజీవనం, హేతు దృక్పథం ముఖ్యం. అయితే ప్రజలు పాలకుల మత, కుల, ప్రాంతీయ భావజాలాన్ని తిప్పిగొట్టి భారత రాజ్యాంగ స్ఫూర్తితో సంపదను పెంచుకునే దిశగా ముందుకు నడవాలి. పాలకవర్గం ఎప్పుడూ దోపిడీదారులకు, పెట్టుబడిదారులకు, సామ్రాజ్యవాదులకు తొత్తుగా ఉంటుంది. ప్రజలే చైతన్యవంతులై శక్తివంతులుగా తమ దేశాన్ని, తమ దేశ గౌరవాన్ని, తమ దేశ సంపదను పెంచుకునే వివేచనాపరులుగా ముందుకు నడవాలి. అదే రాజ్యాంగం మనకిచ్చిన స్ఫూర్తి. ఆ చైతన్యంతో ముందుకు నడుద్దాం.

ఈనాడు భారత దేశం బహుముఖంగా పతనమవుతూ వెళ్తున్నది. ఈ పతనానికి కారణం పాలకులకు రాజ్యాంగ స్ఫూర్తి లేకపోవడమే. పాలకులకు భారతదేశ అభివృద్ధికి సంబంధించిన స్పష్టమైన ప్రణాళిక లేదు. భారతదేశంలో యువశక్తి అంతా బలహీనమైపోతున్నది. యువకులకు నైపుణ్యంతో కూడిన పనిని ప్రభుత్వం కల్పించలేక పోతున్నది. వ్యవసాయ రంగం ఒక పక్క కుంటుపడుతుండగా, వ్యవసాయేతర రంగాల్లోకి యువకులు భౌతిక, బౌద్ధిక, సాంకేతిక శక్తితో ముందుకు వెళ్లలేకపోతున్నారు. ప్రపంచవ్యాప్తంగా ఉపాధి రంగాల్లో ఉపాధిని యువకులకు కల్పించడంలో అనేక కొత్త పోకడలు వస్తున్నాయి.

**పరిశ్రమల రంగం**

భారతదేశం వాటితో పోటీ పడలేకపోతుంది. దక్షిణ కొరియాలో 96 శాతం, జపాన్‌లో 80 శాతం, జర్మనీలో 75 శాతం, యుకెలో 68 శాతం కార్మికులు వృత్తి నైపుణ్యాల ఆలంబనతో రాణిస్తుంటే, ఇండియాలో ఆ సంఖ్య పట్టుమని అయిదు శాతమైనా లేకపోవడమే బాధాకరం. సూక్ష్మ, చిన్న, మధ్య తరహా పరిశ్రమల రంగం తైవాన్ స్థూల దేశీయోత్పత్తిలో 85 శాతం వాటా కలిగి ఉంటే చైనాలో అది 60 శాతం, సింగపూర్‌లో 50 శాతంగా నమోదవుతుంది.

భారత్ జిడిపిలో ఎంఎస్ఎంఇల వాటా 30 శాతానికి లోపే ఉండడం ఎవరి కాళ్లమీద వాళ్లు బతికే నైపుణ్యాలు లేని శ్రామిక శక్తి బలహీనపడడమే దీనికి కారణం. దేశీయ పరిశ్రమలు మానవ వనరుల గిరాకీని తీర్చడానికే కాదు. అంతర్జాతీయ ప్రమాణాలతో శిక్షణా కార్యక్రమాలను రూపుదిద్దడం ద్వారా అమెరికా, రష్యా, చైనా, జపాన్, పశ్చిమాసియాతో పాటు స్పెయిన్‌కూ నిపుణుల శ్రామిక శక్తిని అందించే ప్రణాళికను 2014 సెప్టెంబర్‌లో కేంద్ర సర్కారు ప్రస్తావించింది.

భారతదేశంలో నిజానికి యువశక్తి బలహీనమవడానికి కారణాలలో ప్రధానమైనవి నిర్వ్యాపకం, నిరాసక్తత, నిద్రాణం. జాతికి చైతన్యం రావాలంటే పని పుష్కలంగా ఉండాలి. పనిలేని జాతి సోమరితనానికి అలవాటు పడుతుంది. ముఖ్యంగా యువశక్తి మద్యానికి, మత్తు మందులకు, వాట్సాప్‌లలో చాటింగ్‌లకు అలవాటు పడుతున్నారు. వారి చేతిలో ఉత్పత్తి పరికరాలు ఉండడం లేదు. చదువుకునే విద్యార్థులు కూడా వారి చేతుల్లో పెన్ను ఉంటుంది గాని రాయడంలేదు.

భారతదేశంలో వాఙ్మయోత్పత్తి తగ్గింది. పుస్తకం ఉన్నవాడు చదవడం లేదు. జ్ఞానం తగ్గి జీవన వర్తనలో ఒడిదుడుకులు పెరుగుతున్నాయి. గమ్య నిర్దేశం లేదు. తల్లిదండ్రులకు ఎక్కువ మంది యువకులు భారం అవుతున్నారు. తల్లిదండ్రులను ఎక్కువ మంది వృద్ధాప్యంలో చూడడం లేదు. కరుణ భావం తగ్గింది. కన్నీళ్లు ఇంకాయి. వినోదం పెరిగింది. పెళ్లిళ్లు, బర్త్‌డేలు, పండుగలు చేసుకున్నంతగా ఉత్పత్తి చేయడం లేదు. ఎంత ఖర్చుపెట్టారనే దానిమీద ఉన్న ఆసక్తి ఎంత సంపాదిస్తున్నామనే దాని మీద లేదు. ఒకరికి ఒకరి మీద విశ్వాసాలు తగ్గిపోయాయి. మనుషుల్లో మోసం పెరిగింది. సమాజంలో విశ్వాసం తగ్గాక వీధి తీర్పరులు పెరిగారు. ఆస్తులు లావాదేవీల్లో ఇరుక్కుపోతున్నాయి. మనుష్యులపై ఒత్తిడి పెరుగుతోంది. ఈ దశలో సామాజిక స్పృహ తగ్గింది. సమాజంలో వృద్ధులు, శిశువులు, ఒంటరి జీవులను ఆదుకునే స్పృహ తగ్గిపోయింది.

సమాజంలో ఉన్న పేదరికం గురించి ప్రభుత్వం ఎన్నో కమిటీలు వేసింది. పేదరిక మూలం కమిటీల వల్ల తెలియడం లేదు. దేశంలో పేదరికం స్థాయి ఎంత అనే అంశంపై ఇంత వరకు స్పష్టత లేదు. అది తేలనిదే పేదరిక నిర్మూలన సాధ్యమవుతుందా అన్నది ప్రశ్న. పేదరిక స్థాయిని ఖరారు చేసే బాధ్యతను గతంలో యుపిఎ ప్రభుత్వం సురేష్ టెండూల్కర్ కమిటీకి అప్పగించింది. గ్రామాలు, పట్టణాల్లో పేదరిక స్థాయిల నిర్ధారణకు ఆ కమిటీ తలసరి ఆదాయాలను ప్రాతిపదికగా తీసుకుంది.

గ్రామాల్లో ఒక వ్యక్తి దినసరి ఆదాయం రు. 27.2గా, పట్టణాల్లో రు. 33.3గా ఉంటే దాన్ని పేదరికంగా పరిగణించాలంది. కమిటీ నివేదిక ప్రకారం 2011-12లో దేశ జనాభాలో 22 శాతమే పేదరికంలో ఉన్నట్లు లెక్క. టెండూల్కర్ కమిటీ లెక్కలపై దుమారం రేగడంతో పేదరికానికి కొత్త నిర్వచనమివ్వడానికి డాక్టర్ సి. రంగరాజన్ నేతృత్వంలో మరో కమిటీని వేశారు. ఇది గ్రామీణ, పట్టణ పేదరిక స్థాయిలను రు. 32.4, రు. 46.9లుగా నిర్ణయించింది. ఆ లెక్కన 2011-12లో దేశ జనాభాలో 29.5 శాతం (36.3 కోట్ల మంది) పేదలని నిర్ధారించింది.

ప్రపంచంలోని నిరుపేద బాలల్లో 30.3 శాతం మంది భారత్‌లోనే ఉన్నారు. ఎన్‌డిఎ ప్రభుత్వం పగ్గాలు చేపట్టిన వెంటనే 2014 జులైలో రంగరాజన్ కమిటీ నివేదిక సమర్పించింది. దాన్ని కేంద్ర ప్రభుత్వం ఆమోదించిందా లేదా అనేది ఇంతవరకు తెలియదు. అది తేలే వరకు టెండూల్కర్ కమిటీ సిఫారసులే చెలామణిలో ఉంటాయి. పేదరిక నిర్మూలన విధానాల రూపకల్పన అమలుకు ఆ కమిటీ నివేదిక మీదనే ఆధారపడే స్థితి ఉంది. ఒకవేళ కేంద్రం రంగరాజన్ కమిటీ నివేదికను ఆమోదించినా, అది కూడా టెండూల్కర్ కమిటీలానే 2011-12 నాటి పేదరికం స్థాయిలనే ప్రాతిపదికగా తీసుకుంటుందని గమనించాలి. కమిటీలు వేయడమే కాని అందించే సూత్రాలను అమలుజరపడం లేదు.

వ్యవసాయం పూర్తిగా దిగజారడానికి ప్రధాన కారణం వ్యవసాయానికి గ్రామాలకు ఉన్న అనుబంధం తెలియకపోవడమే. మన గ్రామాలు వ్యవసాయ ఉత్పత్తులతో కూడుకున్నవి. నదులకు ఆనకట్టలు కట్టడంలో మనం విఫలం అవుతూ ఉన్నాం. నదులు సముద్రాల వైపు పరుగెడుతున్నాయి. వరదలు వచ్చినప్పుడు గ్రామాలకు గ్రామాలు మునిగిపో

తున్నాయి. నీరు స్వచ్ఛంగా లేకపోవడంతో గ్రామీణ భారతం అనారోగ్యంలో సంక్షుభితం అవుతున్నది. రైతులు అప్పుల ఊబిలో కూరుకుపోయి నిరాశతో జీవిస్తున్నారు. కొందరు ఆత్మహత్యలకు గురవుతున్నారు. రైతు మరణంతో కుటుంబాలు కూలుతున్నాయి. ఊళ్లకు ఊళ్లు వలసబాటలు పడుతున్నాయి. ఖర్చులు పెంచుకుంటున్నారు.

దీనంతటికి కారణం హిందూ మతోన్మాదం పెరగడమే. ఇతర మతాల్లో కూడా ముఖ్యంగా క్రైస్తవ, ముస్లిం మతాలలో కూడా పోటీగా మూఢత్వం పెరిగింది. ఆచారాలు పెంచుకున్నారు. జ్ఞానం తగ్గుతుంది. భారతదేశం మొత్తంగా అస్పృశ్యత, నిరక్షరాస్యత, బాల్య వివాహాలు, విగ్రహాల కొలుపులు బిజెపి వచ్చిన తరువాత విపరీతంగా పెరిగాయి. అందువల్లే పనిచేయాలనే భావన తగ్గిపోతుంది. పని అనేది ఒక గొప్ప జీవన సంస్కృతి. శ్రామిక సంస్కృతి ఉన్న దేశాలు నానాటికీ శక్తివంతమవు తున్నాయి. మన దేశంలో విగ్రహాలను పూజించి ప్రజలకు మూఢాచారా లను నేర్పి, పురాణాలు వల్లించి బ్రతికే వారి సంఖ్య కూడా పెరుగుతున్నది. దానివల్ల ప్రజలు సాంకేతిక జ్ఞానులు కాలేకపోతున్నారు. తనకు వచ్చిన కష్టాలు ఖర్మ వల్ల అనుకుంటున్నారు. పేదరికానికి ఖర్మకు సంబంధం లేదు. తనకు వచ్చిన కష్టాలు పూర్వజన్మలో చేసిన పాపాల వల్ల అనుకుంటున్నారు.

దేవుళ్లకు కోట్ల రూపాయలు దానాలు ఇస్తున్నారు. బంగారు ఆభరణాలు తొడుగుతున్నారు. దేవుళ్ల భార్యలకు పట్టు వస్త్రాలు కట్టబెడుతున్నారు. తన తల్లి సరియైన వస్త్రాలు లేకుండా ఉన్నా తన మొక్కు కోసం వేల రూపాయలు అప్పు చేసి తిరుపతి, అన్నవరం, కాశి, ప్రయాగ వంటి అనేక మత స్థలాలకెళ్తున్నారు. హిందూ, క్రైస్తవ, ముస్లిం పుణ్యక్షేత్రాలకు వెళ్లేవారికి ప్రభుత్వం డబ్బులిస్తుంది. అంటే మతాలను పెంచాలనే దుర్వ్యూహంలో ప్రభుత్వం ఉంది. మతం వ్యక్తిగతం.

ప్రభుత్వం లౌకికవాదంతో నడవాలి. సైన్స్ ప్రదర్శనలు, సాంకేతిక జ్ఞానాభివృద్ధి శిక్షణా తరగతులు, బోధనా వ్యక్తిత్వ శిక్షణా తరగతులు మొక్కుబడిగా జరుగుతున్నాయి. అందుకే దేశంలో వ్యక్తిత్వ శూన్యులు పెరుగుతున్నారు. చాలామందికి రాజ్యాంగ సూత్రాలు తెలియవు. ఏదో ఒక మత గ్రంథాన్ని పట్టుకుని జీవితాంతం జీవించి దాంతో మరణిస్తారు. అందువల్ల పేదరికానికి మూలం అర్థం కావడం లేదు. చాలా మంది తాము పుట్టిన కులాన్ని నమ్ముతున్నారు. నిజానికి కులం లేదు. కులం సృష్టించబడింది. ఈ కుల భావన, మత భావన తగ్గాలంటే కుల నిర్మూలనా భావం పెరగాలి. మనిషిలో ఉన్న ప్రతిభను బట్టి, జ్ఞానాన్ని బట్టి గౌరవించే పద్ధతి పెరగాలి. భౌతిక శ్రమజీవులకు కూడా అసంఘటిత కార్మికులకు కూడా, వృత్తికారులకు కూడా బౌద్ధిక జీవులతో కూడిన సమగౌరవాన్ని ఇవ్వగలిగిన స్థాయికి రావాలి. ముఖ్యంగా భారతదేశంలో మానవ శక్తి నిర్వీర్యమవుతున్నది. అంతే కాదు భారతదేశంలో ఉన్న ఇంధన, లోహ, ఖనిజ సంపద కూడా సరైన వినియోగంలోకి రావడం లేదు.

1970 నాటికి 118 కోట్ల టన్నుల మేర నమోదైన సంప్రదాయ ఇంధన వనరుల వినియోగం 2015 నాటికే 740 కోట్ల టన్నులకు ఎగబాకింది. 2030 సంత్సరానికల్లా అంతకు రెండింతలు కానుందని అంచనా. ప్రపంచ వ్యాప్తంగా సగటున ఎకరం నేల నుంచి 450 టన్నులదాకా వనరులు వెలికి తీస్తుండగా, దేశీయంగా అలా తోడేస్తున్న రాశి ఉన్నపాటున 1580 టన్నులు కోబాల్ట్, రాగి, లిథియం వంటివి నూరు శాతం దిగుమతి చేసుకుంటున్న భారత్, ముడిచమురు అవసరాల్లో 80 శాతం దాకా విదేశాలపైనే ఆధారపడుతోంది. ఈ పరాధీనత కొనసాగినన్నాళ్లు దిగుమతుల బిల్లు ఏటేటా తడిసి మోపెడు కాక తప్పదు. చమురు, బొగ్గు అనేముంది.

వివిధ శిలాజ ఇంధనాలు, లోహఖనిజాల విచ్చలవిడి వినియోగంతో పర్యావరణ విధ్వంస తీవ్రతను గుర్తెరిగిన ఎన్నో దేశాలు ప్రత్యామ్నాయాలపై దృష్టి సారిస్తున్నాయి. ప్రణాళికాబద్ధంగా పునరుత్పాదక ఇంధన సామర్థ్యం పెంచుకుంటున్నాయి. సొంత అవసరాల్లో 85 శాతం మేర సౌర, పవన విద్యుత్తుపైనే జర్మనీ ఆధారపడుతుండగా చమురు నిల్వలకు పేరుపడ్డ యుఎఇ, బహ్రెయిన్ వంటి గల్ఫ్ దేశాలు సైతం పునరుత్పాదక ఇంధన వనరుల వైపు మొగ్గుతున్నాయి.

భారతదేశంలో అపారమైన ఖనిజ సంపద ఉంది. అపరిమితమైన మానవ శ్రమశక్తి ఉంది. పాలకవర్గం చూపు రాజ్యాంగ నిరాకరణ మీద ఉన్నంత వనరుల అభివృద్ధి మీద లేదు.

ముఖ్యంగా ప్రధానమంత్రి నరేంద్రమోడీ, హోంమంత్రి అమిత్‌షా ఇద్దరు నోట్ల రద్దు, జిఎస్‌టిని రాష్ట్రాలపై రుద్దడం, స్త్రీ అణచివేత, 370 ఆర్టికల్, 35ఏ రద్దు, మానవ హక్కుల ఉల్లంఘన వంటి చర్యలపైన ఉన్న శ్రద్ధ మానవ జీవన సాంస్కృతిక, సాంకేతిక వికాసం మీద చూపలేదు. నిజానికి రాజ్యాంగ అధ్యయన శూన్యతే వారిద్దరి అదోగతికి, భారతదేశ జిడిపి ఈనాడు 5 శాతానికి పడిపోవడానికి కారణం. పాలక ద్వయంలో మానవతా స్ఫూర్తి లేదు. కశ్మీర్‌లో ప్రజలపైన అంతర్గత ఎమర్జెన్సీని రుద్దారు.

భారతదేశ వ్యాప్తంగా దళితులు జీవించే హక్కు మీద ఉక్కుపాదం మోపుతున్నారు. మరీ ముఖ్యంగా కేంద్రీయ విశ్వవిద్యాలయాల్లో దళితుల ఉపకార వేతనాలను రద్దుచేయడం ద్వేష మాత్సర్యాలతో కూడుకున్న విషయం. భారతదేశ వ్యాప్తంగా 30 లక్షల దళితుల బ్యాక్‌లాగ్ పోస్టులున్నాయి. ఒక్క ఉద్యోగాన్నివ్వడానికి కూడా మోడీ, షాలు సిద్ధంగా లేరు. కారణం వారికి దళితులంటే అనిర్వచనీయమైన ద్వేషం ఉంది. కారణం దళితులు శ్రమజీవులు, బుద్ధిజీవులు, కళాజీవులు, సాంకేతిక నిపుణులు, కొన్ని వేల సంవత్సరాలు ఊరికి దూరంగా ఉంచినా ప్రకృతి సంపదతో బతికిన శాస్త్ర జ్ఞానులు. వారికి ఉన్నత విద్యలో అవకాశమిస్తే బ్రాహ్మణులను, అగ్రవర్ణాలను మించిపోతారనేదే వీరిద్దరి కాపట్యానికి కారణం. పాలకుడే ద్వేషి అయితే దేశం బహుముఖంగా అదోగతిలోకి వెళ్లక తప్పదు.

రాజ్యాంగం భారతదేశానికి గుండె వంటిది. గుండె మీదే దెబ్బ వేసినవాడు ఎక్కువ కాలం పాలించలేదు. పాలకుడి పని గుండెను రక్షించుకోవడం. రాజ్యాంగం మాట్లాడే స్వేచ్ఛను, ఉద్యోగం చేసుకునే హక్కు, ముఖ్యంగా జీవించే హక్కును అందరి ప్రజలకు సమానంగా ఇచ్చింది. కానీ ఈనాటి పాలకులు అసమ సమాజాన్ని సృష్టించడానికి ఉవ్విళ్లూరుతున్నారు. ఈ సందర్భంగా లౌకిక ప్రజాస్వామిక సామ్యవాదులు ఏకమై భారతదేశాన్ని పునర్జీవింప చేసుకోవాల్సిన అవసరముంది. రాజ్యాంగాన్ని రక్షించుకోవడమే భారతదేశాన్ని రక్షించుకోవడం. పాలకుల మీదే కాదు పాలితుల మీద కూడా దేశాన్ని రక్షించుకోవాల్సిన బాధ్యతను గమనించినపుడే నియంతల ఓటమి, ప్రజాస్వామ్య వాదుల విజయం తథ్యం. చరిత్ర నిర్మాతలు ప్రజలే.

*(రచయిత సామాజిక తత్వవేత్త, నవ్యాంధ్రపార్టీ, వ్యవస్థాపక అధ్యక్షులు)* వీ

# తిరోగమన దిశలో తెలంగాణ బడ్జెట్

***తెలంగాణ ఏర్పడినప్పుడు మిగులు బడ్జెట్‌తో ఉన్న రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను పాలకులు నేడు అనాలోచిత విధానాలతో కనీస చెల్లింపులు కూడా చేయలేని స్థితికి నెట్టారని అంటున్నారు* డా. ఎ. పున్నయ్య**

దేశంలో ఎక్కడా లేని అభివృద్ధి తెలంగాణ రాష్ట్రంలో ఈ ఐదు సంవత్సరాలల్లో జరిగింది. మేము అందించిన అత్యుత్తమ పాలనతో రాష్ట్రం అన్ని రంగాలలో అద్భుతమైన ప్రగతితో ముందదుకు దూసుకు పోతుంది. రాబోయే ఐదు సంవత్సరాల్లో ఐదు లక్షల కోట్ల బడ్జెట్‌ను తెలంగాణ రాష్ట్రంలో ప్రవేశపెట్టి తీరుతామని ముఖ్యమంత్రి నిండు శాసన సభలో గతంలో బీరాలు పలికారు. తెలంగాణ ముమ్మాటికి సంపన్న రాష్ట్రమే, నిధుల కొరత లేనే లేదన్నారు. రాష్ట్రం ఏర్పడనపుడు నెలకు రు. 6,247 కోట్లు ఖర్చు పెట్టగలిగే స్థితి నుండి ఐదేళ్ల అనంతరం నెలకు రు. 11,305 కోట్లు ఖర్చుపెట్టే స్థితికి చేర్చినామన్నారు. మిగులు రాష్ట్రంగా తులతూగిన తెలంగాణ ఆర్థిక ముఖచిత్రం నేడు నిధుల కొరతతో వెలవెల పోతుంది. సెప్టెంబర్ 9న శాసన సభలో బడ్జెట్ ప్రవేశపెట్టిన సందర్భంలో ముఖ్యమంత్రి కాస్తా స్వరం తగ్గించుకొని గొంతుమార్చి సంపన్న రాష్ట్రంలో సంపద తగ్గడానికి కేంద్రమే కారణమని, దేశంలో ఆర్థిక మాంద్యం ప్రభావం తీవ్రంగా ఉందన్నారు. నిజా నిజాలను గుర్తించాలని ఈ రాష్ట్ర ఆర్థిక పరిస్థితి రక్షించుటకు కేంద్రాన్ని దోషిగా నిలబెట్టినారు. చాలా సహజంగా శాసన సభలో రాష్ట్ర బడ్జెట్‌ను సమర్పించి తెలివిగా దేశ ఆర్థిక పరిస్థితిని విశ్లేషించారు. రాష్ట్రంలో పన్నుల ఆదాయం గణనీయంగా తగ్గిపోయింది. పన్నేతర ఆదాయం పడిపోయింది. కేంద్రం నుంచి వచ్చే నిధులు భారీగా తగ్గినాయని, ఈ దుస్థితికి ముమ్మాటికి కేంద్ర ప్రభుత్వ అనాలోచిచ నిర్ణయమన్నారు. అందుకే కఠిన వాస్తవాల ప్రాతిపదికగా బడ్జెట్ సిద్ధం చేశామన్నారు. ఆదాయ వనరుల ఆధారంగా ప్రభుత్వం ఎప్పటికప్పుడు తన ప్రాధాన్యతలను నిర్ణయించుకుంటూ, సవరించుకుంటూ క్రియాశీలకంగా పనిచేస్తుంద న్నారు. వివిధ శాఖలకు, పథకాలకు పెద్ద ఆశలు పెట్టుకోవద్దంటూ కొత్త కథలతో ప్రజలను నమ్మబలికించి ఈ బడ్జెట్‌కు భారీ కోతలు కోశారు.

కేంద్ర బడ్జెట్ అయినా అది రాష్ట్ర బడ్జెట్ అయినా కేవలం ప్రతిపాదనలు మాత్రమే ఉంటాయి. దీనిని బడ్జెట్ అంచనా అంటారు. ఒక ఏడాది గడిచాక ప్రతిపాదనల మేరకు ఆదాయాలు సమకూరాయా, ప్రతిపాదించిన మేరకు వ్యయాలు జరిగాయా అనేది సవరించిన అంచనాలుగా ఉంటాయి. మరొక సంవత్సరరం గడిచాక ఆ గణాంకాలు నిర్ధారణ పూర్తయిన లెక్కలు వాస్తవ గణంకాలు తయారు అవుతాయి. అంటే ఒక బడ్జెట్ ప్రవేశ పెడుతున్నప్పుడు రాబోయే సంవత్సరం బడ్జెట్ అంచనాలు (బిఇ) గడిచిన సంవత్సరం బడ్జెట్ అంచనాలు గడిచిన సంవత్సరం సవరించిన అంచనాలతో పాటు అంతకు ముందు సంవత్సరం వాస్తవ గణాంకాలుగా నాలుగు పద్దులుంటాయి. ఈ సమగ్ర స్వరూపాన్ని పోల్చి చూస్తే వర్తమాన బడ్జెట్‌ను అంచనా వేయగలం.

తెలంగాణలో నేటికి ఆరు బడ్జెట్‌లు పూర్తికాగా నేడు సభలో ప్రవేశ పెట్టింది 7వ బడ్జెట్. ఈ వార్షిక బడ్జెట్ 2018-19తో పోలిస్తే 16 శాతం తగ్గింది. 2019-20 ఓట్ ఆన్ అకౌంట్ కంటే దారుణంగా 19.52 తగ్గింది. గత సంవత్సర బడ్జెట్ రు. 1,74,453.84 కోట్లు కాగా నేటి బడ్జెట్ రు. 1,46,492.30 కోట్లు. ఇది గత సంవత్సర వార్షిక బడ్జెట్ కంటే రు. 27,961.54 కోట్లు తక్కువ. ఈ ఏడాది

**తెలంగాణ బడ్జెట్ సమగ్ర స్వరూపం** (అంకెలు రు. కోట్లలో)

| | 2017-18 (వాస్తవాలు) | 2018-19 ఆర్ఇ సవరించిన అంచనాలు | 2018-19 బిఇ బడ్జెట్ అంచనాలు | 2019-20 బిఇ బడ్జెట్ అంచనాలు |
|---|---|---|---|---|
| రెవెన్యూ వసూళ్లు | 88,824 | 1,19,099 | 1,30,975 | 1,13,099 |
| మూలధన వసూళ్లు | 54,554 | 42,507 | 43,507 | 33,445 |
| మొత్తం వసూళ్లు | 1,43,378 | 1,61,607 | 1,74,482 | 1,46,544 |
| రెవెన్యూ వ్యయం | 85,364 | 1,19,027 | 1,25,455 | 1,11,055 |
| మూలధన వ్యయం | 23,902 | 26,888 | 33,369 | 17,275 |
| రుణాల అడ్వాన్సులు | 6,209 | 8,713 | 9,035 | 8,896 |
| రుణాల చెల్లింపులు | 27,657 | 6,594 | 6,594 | 9,266 |
| మొత్తం వ్యయం | 1,43,133 | 1,61,223 | 1,74,453 | 1,46,492 |
| రెవెన్యూ మిగులు | 3,459 | 7,219 | 5,520 | 2044 |
| ద్రవ్యలోటు | 26,700 | 28,723 | 29,077 | 24,081 |

ఫిబ్రవరిలో ఓట్ ఆన్ అకౌంట్‌లో రు. 1,82,017 కోట్లు పెట్టినారు. అత్యంత తక్కువగా దానికన్న కూడా నేడు ప్రవేశపెట్టిన పూర్తిస్థాయి బడ్జెట్‌లో రు. 35,527.70 కోట్లు తగ్గడంతో రాష్ట్రం పురోగమనానికి బదులు తిరోగమన దిశగా సాగుతుంది.

బడ్జెట్ సమగ్ర స్వరూపం గమనిస్తే చేదు నిజాలు బయటకొస్తున్నాయి. గణాంకాల ప్రకారమే ఈ రాష్ట్రాన్ని రెండేళ్లు వెనక్కి తీసుకెళ్లారు. దాదాపు అన్ని శాఖల కేటాయింపులు రెండేళ్ల కిందటి వాస్తవ వ్యయంతో సమానమయ్యాయి. కొన్ని శాఖలకైతే ఇంకా తగ్గాయి. 2017-18 వాస్తవ వ్యయాలకు చేరువుగా 2019-20 పూర్తిస్థాయి బడ్జెట్ ఉండడం రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను కోలుకోని విధంగా దెబ్బతీసినట్లవుతుంది. 2017-18లో వాస్తవ గణాంకాలు రు. 1,43,378 కోట్లు కాగా, ఈ బడ్జెట్‌లో రు. 1,46,544 కోట్లు ప్రతిపాదించడం గమనార్హం.

రెవెన్యూ వసూళ్లలో ఆదాయం పెరిగినట్లు కనిపిస్తున్నా మూలధన వసూళ్లలో దాదాపు సగం వరకు భారీ తగ్గుదదల కనిపిస్తుంది. తెలంగాణ ఆవిర్భావం నుంచి రాష్ట్ర బడ్జెట్ క్రమంగా పెరిగింది. గడిచిన ఐదేళ్లలో మొదటిసారిగా రాష్ట్రం వెనక్కి వెళ్లి రెండేళ్ల కిందటి పరిస్థితుల్లో చేరడం ప్రజలందరిని, పాలకులను, ఆర్థిక నిపుణులను అయోమయానికి గురి చేసింది. ఈ విషయం గ్రాంట్-ఇన్-ఎయిడ్‌లో మరింత స్పష్టంగా కనిపిస్తుంది. రెండేళ్ల కిందట గ్రాంట్-ఇన్-ఎయిడ్ రు. 8058 కోట్లు కాగా, గత ఏడాది రు. 28,041 కోట్లు. మరి ఈ బడ్జెట్‌లో రు. 8177 కోట్లుగా అంచనా వేశారు. మూలధన వ్యయంలో మరింత తగ్గించినారు. రెండేళ్ల క్రితం రు. 23,902 కోట్లు కాగా, గతేడాది రు. 33,369 కోట్లు. ఈ బడ్జెట్‌లో కేవలం రు. 17,274 కోట్లు అంటే మొత్తం బడ్జెట్‌లో ఇది 12 శాతం ఉంటుంది. మూలధన వ్యయం తగ్గడం అంటే భవిష్యత్ పట్ల దార్శనికత కోల్పోయినట్లు. రాబోయే కాలానికి ఆశలను, అవకాశాలను కల్పించలేని స్థితిలో ఉన్నట్లు. దీనితో పాటుగా నూతన ఉత్పత్తి శక్తికి రాష్ట్రం దూరం అయినట్లు. ఈ ప్రభావం దీర్ఘకాలంలో రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను కుంగదీస్తుంది.

**బడ్జెట్ ప్రతిపాదన తగ్గింపుకు ప్రభుత్వం చూపించే కారణాలు**

రాష్ట్ర స్థూల జాతీయోత్పత్తిపై మాంద్యం ప్రభావం తీవ్రంగా కనిపిస్తోంది. గత ఆర్థిక సంవత్సరం వరకూ 10.5 శాతంగా ఉన్న జిఎస్‌టిడిపి 9.5 శాతం తగ్గే అవకాశముందని భావిస్తుంది. ఖజానాకు వచ్చే మొత్తంలో అమ్మకం పన్ను వాటా 52 శాతం ఉంది. ఈ మొత్తం పెట్రోలియం ఉత్పత్తులు, మద్యం అమ్మకాల ద్వారా వస్తుంది. గత కొద్ది రోజులుగా ఈ రెండింటి రాబడి కూడా తగ్గింది. స్టాంపులు రిజిస్ట్రేషన్ల శాఖ రాబడులు ప్రస్తుతానికైతే ఆశించిన మేరకు వృద్ధిరేటు కొనసాగుతున్నా ముున్ముందు మాంద్యం ప్రభావం ఉంటుందని ప్రభుత్వం అంచనా వేసింది. ఈ క్రమంలోనే ప్రతిపాదనలను తగ్గిస్తున్నట్లు పేర్కొన్నారు. కాని 20 శాతం తగ్గించడం సరికాదు.

**వాస్తవాలకు - అంచనాలకు మధ్య పెరిగిన అప్పులు**

26 మంది ముఖ్యమంత్రులు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌ను దాదాపు 70 సంవత్సరాలు పరిపాలించినారు. రాష్ట్ర విభజన సమయంలో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ అప్పులు 1 లక్షా 30 వేల 54 కోట్ల రూపాయలు. ఇందులో తెలంగాణ వాటా కేవలం రు. 69 వేల 515 కోట్లు. అంటే 70 సంవత్సరాలలో తెలంగాణ రాష్ట్రానికి అభివృద్ధి సంక్షేమ పథకాలు అందించినందుకు అప్పుగా రు. 70 వేల కోట్లుగా విభజన సందర్భంగా తెలంగాణ రాష్ట్రానికి కేటాయించినారు. ఈ ప్రభుత్వ పరిపాలనలలో ఆర్థిక నిర్వహన సరిగ్గాలేని కారణంగా అప్పులు భయంకరంగా మారాయి. నేడు రాష్ట్రం అప్పుల ఊబిలో కూరుకుపోయింది. ఇది భవిష్యత్ తరాలకు తీరని నష్టమే.

బడ్జెట్ ద్వారా తెచ్చిన అప్పులు 2016-17 నాటికి రు. 1,29,531 కోట్లు కాగా, 2017-18లో రు. 1,52,190 కోట్లు, 2018-19లో రు. 1,79,795 కోట్లకు ఎగబాకి తాజా బడ్జెట్‌లో చూపించిన రు. 24 వేల కోట్లను కలిపితే 2020 మార్చి నాటికే మన రాష్ట్ర అప్పులు రు. 2,03,730 కోట్లు. ఈ మొత్తం మన రాష్ట్ర జిఎస్‌డిపిలో 21.39 శాతం. ఇంత పెద్ద మొత్తం ఎదుగుతున్న రాష్ట్రాన్ని కృంగదీస్తుంది. రాష్ట్ర అవిర్భంలో రు. 70 వేల కోట్లుంటే నేడది మూడు రెట్లు పెరగడమంటే కేవలం ఆర్థిక క్రమశిక్షన లేకపోవడం మాత్రమే.

**బడ్జెట్ బయటి అప్పులు**

రాష్ట్ర ప్రభుత్వాల అప్పులు (ఎఫ్ఆర్‌బిఎం) చట్టం ఆంక్షల కారణంగా జిఎస్‌డిపిలో 20 శాతం మేరకు ఉండాలి. తెలంగాణ రాష్ట్రం చాలా తెలివిగా బడ్జెట్‌లో చూపిన ప్రకారం 21.39 శాతం అప్పు తెచ్చింది. ఆ అప్పులతో పాటు బడ్జెట్‌తో సంబంధం లేకుండా మరిన్ని అప్పు తెచ్చింది. ప్రభుత్వం అత్యంత తెలివితేటలతో ఆయా పనులకు సంబంధించిన కార్పొరేషన్లను ఏర్పాటు చేసి వాటి ద్వారా సేకరించే అప్పులకు ప్రభుత్వం హామీగా నిలుస్తుంది. ఆయా సంస్థలు వాటిని చెల్లించకపోతే ప్రభుత్వమే వాటిని చెల్లించాలి. ఇలా బడ్జెట్ బయట 2019 మార్చి నాటికి రు. 77,314 కోట్లకు హామీలను ఇచ్చినట్లు బడ్జెట్ గణాంకాల్లో వెల్లడించింది. వీటితో పాటు 2020 మార్చి నాటికి మరో రు. 34 వేల కోట్లకు హామీలను ఇవ్వనున్నట్లు వెల్లడించింది. దీంతో బడ్జెట్ బయటి అప్పులు రు. ఒక లక్ష కోట్లు దాటనుంది. బడ్జెట్ ద్వారా తీసుకొచ్చిన రెండు లక్షల కోట్లతో పాటు బడ్జెట్ బయట అప్పులు లక్ష కోట్లు కలిపితే ఈ రాష్ట్ర స్థూల అప్పులు మూడు లక్షల కోట్లకు పైగానే.

**అప్పుల కంటే వడ్డీలు అధికం**

అప్పులు పెరిగే కొద్ది వడ్డీల భారం తీవ్రమవుతుంది. బాండ్ల ద్వారా సేకరించే రుణాలను ఐదేళ్ల తర్వాత తిరిగి చెల్లించునప్పటికీ వాటిపై వడ్డీలు ఎప్పటికప్పుడు జమచేయక తప్పదు. గత బడ్జెట్‌లో 12 వేల కోట్లు వడ్డీలు ఉండగా 2019-20లో వడ్డీలు రు. 14,574 కోట్లు చెల్లించాలని తాజా బడ్జెట్‌లో ఆర్థిక శాఖ అంచనా వేసింది. మరల గత ఏడాది కంటే ఈ ఏడాదికి పెద్ద ఎత్తున రుణాలు అవసరమున్నాయి. ఏ రూపంలోనైనా రు. 33 వేల కోట్లు అప్పుల ద్వారా సమీకరించే ప్రయత్నం చేస్తుంది. ఇదే ఆర్థిక మాంద్య పరిస్థితులు కొనసాగితే వచ్చే ఏడాది అప్పుల కింద రు. 40 వేల కోట్ల వరకు సమీకరించే పరిస్థితులు ఏర్పడుతాయని ఆర్థిక నిపుణులు అంచనా వేస్తున్నారు.

**ఆర్థిక నిర్వహణను తప్పుపట్టిన 'కాగ్'**

వార్షిక బడ్జెట్ అంచనాలకు, వాస్తవాలకు భారీ వ్యత్యాసముందని, బడ్జెట్ రూపకల్పనలో హేతుబద్ధత అవసరమని రాష్ట్ర ప్రభుత్వానికి సూచించింది. ఆర్థిక క్రమశిక్షణ విషయంలో దృఢ వైఖరి అవలంబించాలని 'కాగ్' సూచించింది. ప్రభుత్వరంగ సంస్థలకు బేషరతుగా రుణాలివ్వడం, పాత రుణాలను తిరిరగి చెల్లించేందుకు మళ్లీ అప్పులివ్వడం జవాబుదారీ తనానికి విఘాతం కలిగిస్తుందన్నారు. అప్పుల చెల్లింపు భారాన్ని తట్టుకోవాలంటే రాష్ట్ర ప్రభుత్వం తన సొంత వనరులను పెంచుకోవాలని సూచించింది. రు. 26,231 కోట్లు అప్పులు తెస్తే అందులో రు. 10,836 కోట్లు వడ్డీ చెల్లింపులకు, మరో రు. 4,549 కోట్లు అసలు అప్పు చెల్లించడానికి వెచ్చించాల్సి వచ్చిందని వివరించింది. పన్నుల రాబడిలో 8 శాతం అప్పులు చెల్లించడానికే పోతుంది.

రాష్ట్ర అవిర్భావ సమయంలో జీఎస్‌డిపితో పోల్చినప్పుడు అప్పులు 15.20 శాతం ఉండగా 2017-18లో 19 శాతానికి పెరిగినాయి. 2018 మార్చి నాటికి మొత్తం అప్పు రు. 1,42,918 కోట్లు అని తెలిపింది. ఈ అప్పులు, వడ్డీల చెల్లింపులకు రానున్న ఏడేళ్లలో ప్రభుత్వం రు. 1.63 లక్షల కోట్లు సమకూర్చుకోవాల్సి ఉంటుందని, మరోవైపు పూచీకత్తులపై అప్పు రు. 41,892 కోట్లని ప్రభుత్వం ప్రత్యక్ష పరోక్ష అప్పుల భారం రు. 2.05 లక్ష కోట్లని 'కాగ్' వెల్లడించింది.

ఈ ప్రభుత్వంలో రాబడి, ఖర్చులు రెండు పెరిగినాయి. కాని ప్రభుత్వం అత్యంత తెలివిగా ప్రజలను నమ్మబలికేటట్లుగా రెవెన్యూ మిగులును రు. 3,748.74 కోట్లు ఎక్కువగా చూపగా, ద్రవ్య లోటును రు. 954.60 కోట్ల మేర తగ్గించి చూపిందని వెల్లడించింది. అంచనాలకు, వాస్తవాలకు మధ్య అంతరం తగ్గేలా బడ్జెట్ తయారీ ప్రక్రియను హేతుబద్ధం చేయాలని కాగ్ తెలంగాణ ప్రభుత్వాన్ని హెచ్చరించింది.

కాగ్ మరొక్క అడుగు ముందుకేసి సాగునీటి పారుదల రంగం మీద పెడుతున్న భారీ పెట్టుబడుల వల్ల కలిగే ప్రయోజనాలను మదింపు చేయాలని సూచించింది. 2018 మార్చ్ నాటికి రాష్ట్రంలో 36 సాగునీటి ప్రాజెక్టులు నిర్మాణంలో ఉన్నాయని, వీటిలో 19 ప్రాజెక్టుల విషయంలో 3-11 సంవత్సరాల వరకు జాప్యం జరిగింది. ఈ కారణంగా తొలి అంచనా వ్యయం రు. 42,201 కోట్ల నుంచి రు. 1,32,928 కోట్లు పెరిగిందని వివరించింది. ఈ ప్రాజెక్టులకు ఇప్పటికే రు. 70,758 కోట్లు ఖర్చు చేసినా అవి ఇంకా పూర్తి కాలేదని, సాగునీటి ప్రాజెక్టుల ఆర్థిక ఫలితాలను రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించడం లేదని తప్పుబట్టింది. బడ్జెట్‌లో లేని ఆదాయాన్ని ఉన్నట్లు చూపి మభ్యపెట్టడం మానుకోవాలని తేల్చి చెప్పింది. అప్పులకు ప్రత్యామ్నాయాలను ఏర్పాటు చేసుకుంటే భవిష్యత్‌లో అప్పు తేస్తేగాని ఉద్యోగులకు జీతాలు ఇవ్వలేని, పథకాలు సాగించలేని పరిస్థితి వస్తుంది.

**అన్ని శాఖలకు తగ్గిన బడ్జెట్ కేటాయింపులు**

తెలంగాణ అవిర్భావం నుండి రాష్ట్ర బడ్జెట్‌ను క్రమంగా పెంచుకుంటూ పోయిన ప్రభుత్వం అకస్మాత్‌గా ఈ బడ్జెట్ 20 శాతం మేరకు కేటాయింపుల కుదింపుతో దాదాపుగా అన్ని శాఖలు నిర్వహణే కష్టం కానుంది. వ్యవసాయ రంగానికి గతం కంటే రు. 3,340 కోట్ల నిధులను పెంచింది. దీంతో వ్యవసాయ రంగ కేటాయింపులు రు. 20.566.36 కోట్లకు చేరింది. కాని ఇందులో సింహభాగం రైతుబంధు, రైతుబీమా, రుణమాఫీకే కేటాయించినారు. మిగతా అన్ని పథకాలకు గణనీయంగా తగ్గించినారు. రైతుబంధుకు రు. 12 వేల కోట్లు, రుణమాఫీకి రు. 6 వేల కోట్లు, రైతుబీమాకు రు. 1137 కోట్లు కేటాయించినారు. ఇతర ముఖ్యమైన చిన్న చిన్న పథకాలకు కేటాయింపుల్లో మొండిచేయి చూపినారు. విత్తన రాయితీకి గతేడాది రు. 127 కోట్లు కేటాయించింది. రు. 104 కోట్లు ఖర్చు చేస్తే నేడది కేవలం రు. 55 కోట్లకు కుదించారు. దీంట్లో ఎంత శాతం ఖర్చు పెడతారో వేచి చూడాల్సిందే.

గతంలో ఉద్యాన శాఖ పరిధిలో అమలవుతున్న పథకాలకు గతేడాది రు. 340 కోట్లు కేటాయించి రు. 280 కోట్లు విడుదల చేయగా ఈ సారి రు. 19.36 కోట్లు కేటాయించినారు. గతంలో ప్రొ. జయశంకర్ వ్యవసాయ విశ్వవిద్యాలయానికి రు. 105 కోట్లు కేటాయించి రు. 86 కోట్లు ఖర్చు చేయగా, ఈసారి రు. 20 కోట్లు కేటాయించినారు. ఈ కేటాయింపులతో వ్యవసాయానికి దండిగా కేటాయించినాం, రైతులందరు పండుగ చేసుకోండి అని చమత్కారాలు పలుకుతున్నారు.

**విద్యాశాఖ**

రాష్ట్ర బడ్జెట్‌లో విద్యారంగానికి ఏటేటా కేటాయింపులు తగ్గిపోతున్నాయి. ఆరేండ్లలో విద్యకు 4.13 శాతం నిధులను తగ్గించినారు. అన్ని రంగాలకంటే విద్యా రంగాన్ని మరింత నిర్లక్ష్యం చేసినారు. అభివృద్ధి పనులకు ప్రగతిపద్దు కింద పాఠశాల, ఉన్నత, సాంకేతిక విద్యా శాకలకు రు. 767 కోట్లు కేటాయించింది. 2018-19 కేటాయింపులతోఓ పోల్చుకుంటే రు. 3,378 కోట్లు తగ్గింది. ఈ కేటాయింపు కేవలం బోధన, బోధనేతర సిబ్బంది వేతనాలకే సరిపోతుంది. మొత్తం బడ్జెట్‌లో విద్యా రంగానికి 30 శాతం నిధులు కేటాయించాలని ప్రభుత్వ కమిషన్లు చెప్పినప్పటికీ నేడు 6.7 శాతం నిధులు విద్యా రంగానికి కేటాయించి విద్యారంగం నిర్వీర్యం అయ్యే పరిస్థితికి తీసుకుపోతుంది.

తెలంగాణలో ఉన్న 11 విశ్వవిద్యాలయాలు నిధుల కొరతతో నియామకాలు లేక దయనీయంగా మారినాయి. తెలంగాణ ఉద్యమానికి కళాశాలలు, విశ్వవిద్యాలయాలు కదనరంగంగా మారి ఉద్యమాన్ని ఉవ్వెత్తుకు తీసుకుపోయినాయి. ఈ సంవత్సరం ఉపాధ్యాయ దినోత్సవంలో మాట్లాడిన మాటలన్నా ఈ ప్రభుత్వానికి వినిపించడం లేదా. తెలంగాణ వచ్చినంకా బడుల్లో ఏమీ మారలేదు. అవే గదులు, అవే బెంచీలు, అవి పోస్టులు మారిందల్లా బోర్డులో ఆంధ్రప్రదేశ్ పోయి తెలంగాణగా మారింది అని అధికార పార్టీ నాయకుడే విస్తుపోయాడు. ప్రభుత్వం భవిష్యత్‌లో నైనా సమీక్ష చేసుకోవాలి.

**వైద్య - ఆరోగ్య శాఖ:** ఐదేళ్ల బడ్జెట్ కేటాయింపులతో పోలిస్తే ఈ ఏడాది ప్రగతి పద్దులో వైద్య ఆరోగ్య శాఖకు కేటాయింపులు గణీయంగా తగ్గాయి. వైద్య పరికరాల కొనుగోళ్లకు, నిర్ధారణ పరీక్షల్లో వినియోగించే రసాయనాలకు, శస్త్ర చికిత్స పరికరాలకు నిధులను భారీగా తగ్గించింది. అన్ని స్థాయిల్లో ఆసుపత్రుల భవన నిర్మాణాలు అభివృద్ధి పనులను

తగ్గించింది. ఔషదాలు, నిర్ధారణ పరీక్షలకు నిధుల కోతవల్ల రోగులకు ఉచితంగా అందాల్సిన సేవలకు తప్పక ఆటంకాలు ఎదురవుతాయి. 2018 – 19 బడ్జెట్‌లో కేటాయింపుకంటే రు. 1681 కోట్లు వైద్య ఆరోగ్య శాఖలకు తగ్గించింది. ఈ రాష్ట్రంలో విద్యా, ఆరోగ్య రంగాలకు నిధులను భారీగా పెంచి ఉచిత విద్యను, ఆరోగ్యాన్ని అందించాలని ప్రజలందరూ డిమాండ్ చేస్తుంటే ఈ రెండింటి పైనా కేటాయింపులు తగ్గడం విచారకరం.

**ఆర్‌టిసి కేటాయింపులు లేవు :** ఆర్థిక సంక్షోభంలో కొట్టుమిట్టాడుతున్న ఆర్‌టిసిని ఆదుకోవాల్సిన రాష్ట్ర ప్రభుత్వం చేతులెత్తేసింది. గత బడ్జెట్‌లో 2018–19 ఆర్‌టిసికి రు. 975.55 కోట్లు కేటాయిస్తే, ఈ సారి నయా పైసా ఇవ్వకపోవడం బాధాకరం. నిజానికి బస్ పాసు రియింబర్స్‌మెంట్ తో సహా పలు పద్దుల కింద ఆర్‌టిసికి ఎటా రు. 650 కోట్లు చెల్లించాలి. కాని నేడు ఎలాంటి కేటాయింపులు లేకపోవడంతో ఈ కార్పొరేషన్ డీలా పడనుంది. ఇట్లానే నిర్లక్ష్యం చేస్తే ప్రగతి రథచక్రాలు ప్రైవేట్ కానున్నాయి. ఈ శాఖలో ఏముంది. ఆయిల్ కూడా లేదని చైర్‌మెన్ పోస్టుకు కూడా దిక్కు లేకుండా పోయే ప్రమాదం ఉంది. ఇదే దారిలో మండల పరిషత్‌లకు, జిల్లా పరిషత్‌లకు మొండిచేయి చూపింది. దళిత సంక్షేమానికి భారీ కోతే పెట్టింది. బిసి, ఎస్‌టి, మైనారిటీ సంక్షేమాల్లో ఏకంగా గతకంటే రు. 19,404 కోట్లకు కోత పెట్టింది.

మారుతున్న కాలానికి కీలకంగా ఉన్న ఇన్ఫర్‌మేషన్ టెక్నాలజీ, ఎలక్ట్రానిక్ కమ్యూనికేషన్‌ల శాఖలకు భారీగా కోతలు విధించినారు. ఈ శాఖలు రాష్ట్ర ఆర్థిక పురోగతికి మూలంగా ప్రకటించినారు. నేడు మరచినారు. ఈ రకంగా అన్ని శాఖలకు కేటాయింపులు తగ్గిపోయాయి. అయినా అభివృద్ధిని పరుగులు పెట్టిస్తామని ప్రగల్భాలు పలుకుతుండడం విచారకరం. అంతా పచ్చగా ఉంటే ఆ ఘనత తమదేనని జబ్బలు చరుచుకున్నారు. సమస్యలు తలెత్తడంతో తమ బాధ్యత లేదంటున్నారు. ఇంతకన్నా అవకాశవాదం ఏముంటుంది.

**ఆర్థిక వ్యవస్థ చిన్నాభిన్నానికి కారణాలనేకం**

ఈ ఆర్థిక వ్యవస్థ చిన్నాభిన్నం కావడానికి అవినీతిలో మన రాష్ట్రం ముందు వరుసలో ఉంది. ప్రణాళిక రహితమైన పాలన అందిస్తున్నారు. ఆహేతుక నిర్ణయంతో అప్రధాన ఖర్చులు చేస్తున్నారు. తెలంగాణ రాష్ట్రం సాకారమైతే ప్రజల జీవితాలు గణనీయంగా పురోభివృద్ధి సాధిస్తామని వాగ్దానం చేసి నమ్మబలికిన నాయకత్వమే గత ఐదేండ్లుగా అధికారంలో ఉండి ఊదరగొట్టే హామీలతో ప్రజలందరినీ వశపరుచుకొని మరో ఐదేండ్లకు అధికారానికి వచ్చింది. అహేతుకమైన నిర్ణయాల కారణంగా మిగులు బడ్జెట్‌తో అలరారిన తెలంగాణ ఆర్థిక వ్యవస్థను కనీస చెల్లింపులు చేయలేని స్థితికి తీసుకుపోయారు. ఓట్ల కోసం ఆర్థిక వ్యవస్థను చిన్నాభిన్నం చేసినారు. అనుత్పాధక వ్యయాల కోసం బడ్జెట్ మొత్తాన్ని ఖాళీ చేయించినారు. సమాజాన్ని కులాలుగా, మతాలుగా చీల్చి కుల మతాలకు గుళ్లు గోపురాలకు, యజ్ఞ యాగాలకు అనాలోచిత ఖర్చులు పెంచినారు. శాస్త్రీయమైన ఆలోచనలకు ముగింపునిచ్చారు. రీడిజైనింగ్ పేరుతో అంచనా వ్యయాలు భారీగా పెంచి కాంట్రాక్టర్ల బొజ్జ నింపారు. పేరు కీర్తుల కోసం పెద్ద ప్రాజెక్టులు మొదలు పెట్టినారు. ఆ మొత్తం చిన్న నీటి పారుదల ప్రాజెక్టుల మీద ఖర్చు చేసి ఉంటే లక్షలాది మంది రైతులకు ఇప్పటికే సాగునీరు అందేది. ఉపాధ్యాయ, ఉద్యోగ కార్మికుల వేతనాలు పెంచితే కుటుంబ ఆదాయాలు పెరిగి కొనుగోలు శక్తి పెరిగేది. ప్రభుత్వం చెప్పిన ఐదు లక్షల డబుల్ బెడ్‌రూం ఇండ్లు నిర్మిస్తే లక్షలాది మందికి ఉపాధితో పాటు సొంత ఇండ్లు దక్కేవి. ఈ ప్రతికూల పరిస్థితులలో అవసరం లేకున్నా సెక్రెటేరియట్, అసెంబ్లీ భవనాలను కూల్చి వేల కోట్ల ఖర్చుతో కొత్త భవనాలను ఎందుకు నిర్మిస్తున్నారు? ఏ ఒక్కరికి అర్థం కాదు. అర్థం కాని కారణాలతో ఆర్థిక వ్యస్థను చిన్నాభిన్నం చేసినారు.

**ముగింపు**

స్థిరమైన ఆర్థిక ప్రగతి పటుతరమైన ఆర్థిక క్రమశిక్షణ పాటించని కారణంగా ఈ పరిస్థితి వచ్చింది. అత్యుత్తమ అభివృద్ధికి పటిష్టమైన ఆర్థిక క్రమశిక్షణే ప్రధానం. ఈ ప్రతికూల పరిస్థితుల్లో తీవ్ర మేధోమథనం చేసి, అనేక మంది ఆర్థిక గణాంక నిపుణులతో చర్చించి, వాస్తవిక దృక్పథంతో బడ్జెట్‌ను అమలు పరచాలి. ఆర్థిక వ్యవస్థ సంక్లిష్టతకు గురవున్న ఈ సమయంలో అత్యంత జాగురుకతతో వ్యవహరించాలి. ఉన్న పరిమితులు దాటిపోకుండా జాగ్రత్త పడాలి.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ యూనివర్సిటీ)* వీ

**వచ్చే సంచికలలో...**

- శక్తి - శీతోష్ణస్థితి సంక్షోభం - వెన్నెలకంటి రామారావు
- జారిజంపై డిసెంబరిస్టు సైనిక తిరుగుబాటు - ఎన్.వి.ఎస్. నాగభూషణ్
- శ్రీకాకుళ రైతాంగ సాయుధ పోరాటం - పౌర హక్కుల ఉద్యమం - గడ్డం లక్షణ్
- బలహీనమవుతున్న సమాచార హక్కు చట్టం - చిమ్మె జాన్ బర్నబాస్
- పదునెక్కిన సినీ తెలంగాణం - డా. సుంకరి సత్యం

# అరకొర కేటాయింపులు - అధోగతిలో విద్య

***సమాజాన్ని ముందుకు నడిపించే విద్యారంగాన్ని తెలంగాణ ప్రభుత్వం నిర్లక్ష్యం చేస్తుందనడానికి విద్యకు కేటాయించిన నిధులే తెలియజేస్తున్నాయని అంటున్నారు* పబ్బతి వెంకటేశ్వర్లు**

ఉపాధ్యాయుడు జాతి నిర్మాత. దేశ భవిత తరగతి గదుల్లోనే నిర్మితమవుతుంది. గురుబ్రహ్మ గురువిష్ణు గురుదేవో మహేశ్వర పొగడ్తల శాలువాలు కప్పి ఉక్కిరి బిక్కిరి చేసి ఉపాధ్యాయ దినోత్సవం నాడు మాట్లాడే రాజకీయ నాయకుల మాటలవి. దీంతోపాటు తమ తమ గొప్పతనానికి ప్రభుత్వ పాఠశాలలో చదువుకోవడమే తమ భాగ్యమని ప్రభుత్వ పాఠశాలలే ప్రతిభకు నిలయాలని కొనియాడుతూ ఉపన్యాసాలతో ఉపాధ్యాయులు ఉబ్బి తబ్బిబ్బయ్యేలా ఊదరగొడతారు. ఇంకో అడుగు ముందుకేసి ప్రభుత్వ పాఠశాలలు ఇప్పుడు కునారిల్లుతున్నాయని ఎక్కడలేని బాధను ఒలకబోస్తూ ప్రైవేట్, కార్పొరేట్ పాఠశాలలకు దీటుగా తీర్చిదిద్దుతామని కూడా వాగ్దానం చేస్తారు. ప్రభుత్వ పాఠశాలలను, ప్రభుత్వ ఉపాధ్యాయులను ఆకాశానికెత్తి ప్రశంసలతో ముంచెత్తిన రెండు నాల్కల రాజకీయ విష సర్పాలే ప్రైవేట్ విద్యా వ్యాపారానికి పడగలెత్తి, తెరచాటున ప్రభుత్వ పాఠశాలల విధ్వంసానికి ప్రణాళికలు రచిస్తుంటే, ప్రభుత్వంలో భాగస్వాములై విధాన నిర్ణయాలకు రూపకర్తలై ప్రభుత్వ విద్యా రంగంపై విరుచుకు పడుతూ, తమకు అక్కరలేని పాలసీలన్నీ ప్రభుత్వ పాఠశాలలపై గుప్పిస్తూ, కొరగాని కార్యక్రమాలతో అటు విద్యార్థులను, ఇటు ఉపాధ్యాయులను చదువుకు దూరం చేస్తూ కుటిల యాగానికి తెరతీస్తుంటే ప్రభుత్వ విద్యా రంగగం ఎట్లా ప్రగతిబాట పడుతుంది. ప్రభుత్వ ప్రయోజనాలన్నీ కొల్లగొడుతూ ప్రభుత్వ విద్యా రంగం నామ మాత్రపు కేటాయింపులతో ఎట్లా ప్రగతి పథం వైపు పయనిస్తుందో అర్థం కాని అంశంగా ఆందోళణ కలిగిస్తున్నది. ఈ నేపథ్యంలో ఇటీవల ప్రభుత్వం ప్రవేశపెట్టిన బడ్జెట్‌లో తెలంగాణ విద్యా రంగాన్ని ఎంత చిన్నచూపు చూసిందో అర్థం చేసుకోవాల్సి ఉన్నది. నాటి నుండి నేటివరకు జాతీయంగా, ప్రాంతీయంగా విద్యపట్ల ప్రభుత్వాల వైఖరి, విద్యారంగం పట్ల అనుసరిస్తున్న అసంబద్ధ విధానాలు, విద్యాభివృద్ధికి కేటాయిస్తున్న నిధులు ఏ మేరకు విద్యా రంగ అభివృద్ధికి తోడ్పడుతున్నాయో, దాంతో పాటు స్వతంత్ర రాష్ట్రంగా అవతరించిన తెలంగాణలో స్వయంగా ముఖ్యమంత్రి ప్రవేశపెట్టిన బడ్జెట్‌లో విద్యా రంగానికి ఏపాటి పెద్దపీట వేశాడో తర్కించుకోవాల్సిన సందర్భమిది.

**భారతదేశంలో విద్యారంగ నిర్లక్ష్యం - పూర్వాపరాలు**

19వ శతాబ్దం పూర్వార్థంలో బ్రిటిష్ మేధావి వర్గం భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వ పాలనావసరాల కోసం ఇంగ్లీష్ విద్య ప్రవేశపెట్టాలని భావించింది. బ్రిటిష్ ఇండియాలో సంస్థానాల ఆధ్వర్యంలో పూర్వాశ్రమంలో స్థానిక ప్రాంతీయ భాషల్లో విద్యా బోధన జరిగేది. స్థానిక అవసరాల మేరకు ఈ దేశ సంస్కృతి, సంప్రదాయాలు, చరిత్ర ప్రధానంగా సాగిన విద్యాభ్యాసం దేశ ఔన్నత్యానికి తోడ్పడేదిగా ఉండేది. క్రమంగా భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్య విస్తరణ తర్వాత దేశ ప్రజల విద్యాభ్యాసంలోని ఏకత్వాన్ని గ్రహించి, సంస్కృతీ, సంప్రదాయాలు, చరిత్రను దెబ్బకొట్టడానికి తన అధికార, వ్యాపార విస్తరణ కోసం విద్యా విధానంలో మార్పుకు శ్రీకారం చుట్టింది. దాంతో 1813లో ఇవాంజలిస్టులు భారతదేశంలో క్రిస్టియన్ మిషనరీలను ప్రవేశపెట్టడంతో ఆంగ్ల విద్యకు డిమాండ్ మరింత పెరిగింది. ముఖ్యంగా భారతదేశంలో ఈ విద్యా ద్వారా గుమస్తాగిరి ఉద్యోగుల్ని ఇంకా చెప్పాలంటే రక్తంలో రంగులో భారతీయులుగా, అభిరుచులు, అభిప్రాయాల్లో బ్రిటిష్ వారికి సన్నిహితులుగా ఉండేవారిలాగా తయారు చేసుకోవాలని మెకాలే సిఫార్స్ చేశాడు. ఇది క్రమంగా బలపడి ఇంగ్లిష్ విద్యా భారతదేశంలో విస్తృతంగా వ్యాప్తి చెందింది. ఇంగ్లిష్ చదువుతో కలిగిన ప్రాపంచిక జ్ఞానం, చైతన్యం మధ్యతరగతిలో ఎలా ఉన్నా భారతీయ మేధావి వర్గంలో బ్రిటిష్ ప్రభుత్వం ఎడల విముఖతను పెంచింది. ఉన్నత చదువులు చదువుకున్నవారు జాతీయోద్యమాన్ని బలోపేతం చేయడానికి, స్వాతంత్రోద్యమ కాంక్ష పెంచడంలో ఈ విద్య తోడ్పడింది. ఈ విద్యా విధానం బ్రిటిష్ వారనుకున్న దానికన్నా వ్యతిరేక ఫలితాలనిచ్చింది. దీంతో హంటర్ కమిషన్, విద్యా సంస్థలకు ప్రభుత్వం చేయూతనివ్వడం, అలాగే యాజమాన్యం వహించడం లాంటి బాధ్యతల నుండి క్రమంగా తప్పుకోవాలని సిఫార్సు చేసింది. కాలేజీ ఫీజులకు మార్గదర్శక సూత్రాలను రూపొందించి, సెకండరీ పాఠశాలలను గ్రాంట్ ఇన్-ఎయిడ్ ప్రాతిపదికపైన నడపాలని, సెకండరీ పాఠశాలల బాధ్యతల నుండి సాధ్యమైనంత తొందరలో తప్పుకొని ప్రభుత్వ బాధ్యతను తగ్గించాలని సూచించింది. సామ్రాజ్యవాద ధోరణి, విస్తృత వ్యాపార కాంక్ష కలిగిన బ్రిటిష్ పాలకులు, ఆ విద్య తమ వ్యాపారాభివృద్ధికి తోడ్పాటునటుంచి, తమ ఉనికికే ప్రమాదకరంగా మారుతుందని, తమకు ఉత్పాదక శక్తి కాదని, కేవలం భావజాల చోదకశక్తి మాత్రమేనని భావించి, విద్యా వ్యాప్తికి బాటలు పరిచినట్లే పరిచి తమకు అనుకూలంగా లేకపోయేసరికి విద్యావ్యాప్తి పట్ల విముఖతను ప్రదర్శించింది.

స్వాతంత్ర్యంత్రో బాటు బ్రిటిష్ విద్యావిధానాన్ని పునికి పుచ్చుకున్న స్వతంత్ర భారతావనిలో కూడా బ్రిటిష్ ప్రభుత్వానికి తీసిపోని రీతిలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మొదట్లో ఎక్కువ నిధులిచ్చి, ప్రోత్సహించి వివిధ రకాల కార్యక్రమాలు చేపట్టినా రాను రాను ప్రభుత్వ విద్యకు నిధుల కేటాయింపు భారీగా తగ్గడం మొదలైంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ కూడా విద్యను అనుత్పాదక రంగంగా పరిగణిస్తూ, పెట్టుబడులు నిరర్థకంగా భావిస్తూ ప్రతి ఏడాది బడ్జెట్ కేటాయింపులు తగ్గిస్తూ ప్రైవేట్

శక్తుల్ని, ప్రైవేట్ విద్యను, ప్రైవేట్ యూనివర్సిటీలను ప్రోత్సహించడానికి గత కొన్ని శతాబ్దాలుగా శతథ ప్రయత్నిస్తున్నాయి. అభివృద్ధి పేరుతో పెట్టుబడుల కోసం ప్రపంచ బ్యాంకు నిధుల కోసం దేబిరిస్తున్న ప్రభుత్వాలు అది విధించే నిబంధనలకు తలొగ్గి ఉత్పాదక రంగంలో మాత్రమే పెట్టుబడులు లాబదాయకమని, విద్యా రంగం అనుత్పాదక రంగం కనుక రాజకీయ నాయకులు ఏనాడూ విద్యకు ఇవ్వాల్సినంత ప్రాధాన్యం ఇవ్వలేదు. ముఖ్యంగా ప్రాథమిక విద్యా రంగంపై మన ప్రభుత్వాలు చాలా తక్కువ ఖర్చు పెడుతున్నది. కేంద్ర ప్రభుత్వం స్థూల జాతీయోత్పత్తి (జిఎన్‌పి) లో 6 శాతం విద్య కోసం కేటాయించాలని జాతీయ విద్యా విధాన పత్రం నిర్దేశిస్తున్నది. అయితే మన ప్రభుత్వాలు 3.7 శాతం కన్నా ఏనాడూ ఎక్కువ వ్యయం చేసినట్లు కనబడదు. అమూల్యమైన ఆరోగ్యకరమైన మానవ వనరుల ఉత్పత్తికిఇ మూలాలైన విద్య, వైద్యం పట్ల ప్రభుత్వ నిర్లక్ష్యాన్ని చూసి డా. అమర్త్యసేన్ 'సమాజంలో లభించే అవకాశాలను సద్వినియోగం చేసుకోవాలంటే విద్య తప్పనిసరి కనుక సమాజ సంక్షేమాన్ని కోరే ప్రభుత్వాలు ఆరోగ్యం, విద్య సమస్యల పరిష్కారానికి శ్రద్ధవహించాలని, విద్య, వైద్య సౌకర్యాలు కలుగజేయడంలో అశ్రద్ధ కనబరుస్తున్నాయని ప్రభుత్వాలను దుయ్యబట్టారు.

ఇక రాష్ట్ర ప్రభుత్వాల విషయానికి వస్తే విద్య ఉమ్మడి జాబితాలో ఉండడం మూలంగా కేంద్ర ప్రభుత్వం నుండి రావల్సిన నిధులు సరిగా విడుదల కాకపోవడమో, విడుదలైన నిధులు ఇతర పథకాలకు మళ్లించడమో లేదా రాజకీయ కారణాలతో నిధులు ఇవ్వకపోవడమో జరుగుతున్నది. అలాగే రాష్ట్ర ప్రభుత్వాలు కూడా విద్యను ప్రధానమైనదిగా భావించకపోవడం, మొక్కుబడి తంతుగా వ్యవహరించడంతో విద్యకు ఏనాడూ ఆశించిన స్థాయిలో కేటాయింపులు జరుగలేదు. ఈ నేపథ్యంలో ఇటీవల తెలంగాణ ప్రభుత్వం ప్రవేశపెట్టిన బడ్జెట్‌లో విద్యా రంగానికి కేటాయించిన నిధులు, నామమాత్రపు విదిలింపుల పట్ల వాస్తవాలను చర్చించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

**తెలంగాణ బడ్జెట్ – విద్యా రంగం**

ముఖ్యమంత్రి కెసిఆర్ శాసన సభలో బడ్జెట్‌ను సెప్టెంబర్ 9న ప్రవేశ పెటారు. దీనిలో విద్యా రంగానికి రు. 9,899.80 కోట్లు కేటాయించారు. ఇందులో పాఠశాల విద్యకు రు. 8,299 కోట్లు, ఉన్నత విద్యకు రు. 1367.88 కోట్లు, సాంకేతిక విద్యకు రు. 362.91 కోట్లు కేటాయించారు. నిజానికి విద్యావేత్తలు విద్య నాణ్యతను మెరుగుపరచ డానికి, వసతుల కల్పనకు బడ్జెట్‌లో 20 శాతం డిమాండ్ చేస్తున్నారు. కెజి నుండి పిజి వరకు ఉచిత విద్య, కామన్ స్కూల్, రెసిడెన్సియల్ పాఠశాలలు నా కల అంటూ ఎన్నో వాగ్దానాలు చేసినప్పటికీ ఓట్ ఆన్ ఎకౌంట్‌లో కన్నా పూర్తిస్థాయి బడ్జెట్‌లో విద్య కోసం కేటాయించిన నిధులు భారీగా తగ్గినవి. 2014–15 ప్రభుత్వం రాష్ట్ర బడ్జెట్‌లో 10.88 శాతం కేటాయించింది. ఈ కేటాయింపులు క్రమంగా తగ్గిపోతూ రావడం చాలా బాధాకరం. 2015–16లో 9.69 శాతం, 2016–17లో 8.23 శాతం, 2017–18లో 8.49 శాతం, 2018–19లో ఓట్ ఆన్ అకౌంట్ బడ్జెట్‌లో 7.6 శాతం కాగా 2019–20 ఆర్థిక సంవత్సరానికి 6.71 శాతంతో రు. 12220.75 కోట్లు కేటాయించారు. దక్షిణాది రాష్ట్రాల బడ్జెట్‌లలోకెల్ల ఇది చాలా స్వల్పం. ముఖ్యమంత్రి ఇది చెప్పకుండా చాలా రాష్ట్రాలు పంజాబ్, హర్యానా లాంటివి ప్రతికూల వృద్ధిరేటును నమోదు చేస్తున్నాయని చెప్పుకొచ్చారు. బడ్జెట్‌లో తనను గెలిపించి సింహాసనం తిరికి అప్పగించిన సంక్షేమ పథకాలకు మాత్రం కేటాయింపులు యథావిథిగా కొనసాగేలా చూశారు. సహజంగానే ఉపాధ్యాయ, విద్యార్థి వ్యతిరేకియైన ముఖ్యమంత్రి ఉద్యమ కాలంలో ధనమాన ప్రాణాలను ఫణంగా పెట్టి తెలంగాణ సాధించి, పీఠమెక్కించిన దాంట్లో విద్యార్థి, ఉపాధ్యాయ, మేధావి వర్గం పాత్ర మరువలేనిది. అటువంటి ప్రభుత్వ విద్యా రంగం మరింత బలపడడం, చైతన్యవంతం కావడం బహుశా ఇష్టం లేని ముఖ్యమంత్రి విద్యా రంగం తనకు పెద్దగా అక్కరకు రాదని భావించి సుమతీకారుడు చెప్పినట్లు అక్కరకురాని దానిని గ్రక్కున విడవాలి గనుక దాదాపు గత సంవత్సరం కన్నా 25 శాతం తక్కువగా ప్రస్తుత బడ్జెట్‌లో రు. 9,899.80 కోట్లు కేటాయించారు. గత సంవత్సర బడ్జెట్ 13,278 కోట్లకన్నా రు. 3,378.2 కోట్లు తక్కువ. అంటే గతం కన్నా దాదాపు 25.44 శాతం తక్కువ. 2014–15లో విద్య వాటా మొత్తం బడ్జెట్‌లో 10.88 శాతంగా ఉంటే, అది ఇప్పుడు నానాటికీ దిగజారి 6.71 శాతం దగ్గర ఆగి కొట్టుమిట్టాడుతోంది. మున్ముందు ఏ పాతాళానికి చేరుతుందో కూడా తెలియని స్థితి నెలకొన్నది.

2019–20 బడ్జెట్ కేటాయింపులు ఇప్పటికే ముక్కుతూ మూలుగుతున్న విద్యా రంగంపై తాటికాయ పడ్డట్లు అయింది. ఇది విద్యా నాణ్యతను పెంచడానికి ఏమాత్రం సరిపోదు. తన ముద్ర కోసం పరితపిస్తున్న ముఖ్యమంత్రి వెనుకబడిన తరగతుల కోసం 119 రెసిడెన్సియల్ పాఠశాలల ఏర్పాటును ప్రకటించాడు. సాధారణ పాఠశాలల్లో లక్షల సంఖ్యలో విద్యార్థులు చదువుతున్నప్పటికీ వాటిల్లోని మౌలిక వసతుల గురించి కాని, ఖాళీల గురించి కాని ఈ బడ్జెట్‌లో కనీస ప్రస్తావనలేదు. పాఠశాలల్లో పనిచేసే ఉద్యోగుల, ఉపాధ్యాయులల జీతాలకు, పాఠశాలల సాధారణ నిర్వహన కోసం చేసిన కేటాయింపులే తప్ప ప్రత్యేకంగా కేటాయించిన నిధులేమీ లేవు. తనకు ప్రధాన ఆదాయ వనరుగా భావించే రెవెన్యూ, నీటి పారుదల ప్రాజెక్టులు, ఎక్సైజ్, యజ్ఞ యాగాదులు, దేవాలయాలపై తరచుగా సమీక్షించే ముఖ్యమంత్రికి, విద్యా శాఖను సమీక్షించే తీరిక దొరక్కపోవడం నిజంగా విచారకరమే.

నాటి నుండి నేటి దాకా రాష్ట్రాన్ని పాలించిన ఏ రాజకీయ పార్టీ విద్యాభివృద్ధే సమగ్రాభివృద్ధికి మూలమని భావించలేదు. విద్యకు పెట్టే పెట్టుబడి భవిష్యత్ తరాల అభివృద్ధికి పునాది రాయి అన్న స్పృహ పాలకుల్లో లేకపోవడం ప్రధాన కారణం. అప్పుడప్పుడు ఉపాధ్యాయ సమావేశాల్లోనో, సన్మానోత్సవాల్లోనో మొసలి కన్నీరు కార్చడం పరిపాటిగా మారింది. దక్షిణాది రాష్ట్రాల్లో తెలంగాణ ప్రభుత్వం పెట్టే ఖర్చు అన్ని రాష్ట్రాల్లో కన్నా తక్కువ అని గణంకాలే చెబుతున్నాయి. 2018–19 బడ్జెట్‌లో తమిళనాడు 27,205 కోట్లు, ఆంధ్రప్రదేశ్ 24,185 కోట్లు, కర్నాటక 22,350 కోట్లు, కేరళ 20,889 కోట్లు, అదే తెలంగాణ రాష్ట్రం విద్యకు కేటాయించిన బడ్జెట్ 9,899.80 కోట్లు మాత్రమే. మిగతా రాష్ట్రాలతో పోల్చుకుంటే ధనిక రాష్ట్రం అని గొప్పలు పోతూ విద్యపై పెట్టుబడి దగ్గరికి వచ్చేసరికి నిరుపేద రాష్ట్రంగా వ్యవహరించడం ఆందోళన కలిగించే విషయం.

ఫిబ్రవరి 2019లో ఓట్ ఆన్ ఎకౌంట్ బడ్జెట్‌ను సాక్షాత్తు రాష్ట్ర రథసారధి ముఖ్యమంత్రి కెసిఆర్ ప్రవేశపెడుతూ ఎప్పటిలాగే గత ప్రభుత్వాల నిర్వాకాన్ని, కేంద్ర ప్రభుత్వ తీరును ఎత్తిచూపుతూ బంగారు తెలంగాణకు బాటలు పరుస్తున్నామని, మిగతా రాష్ట్రాల కన్నా మిన్నగా

బడ్జెట్ ప్రవేశపెడుతున్నామంటూ రు. 1,82,017 కోట్లతో ప్రవేశపెట్టారు. దీంట్లో విద్యకు కేటాయింపులు 2018-19లో రు. 13,278 కోట్ల నుంచి 12,220.75 కోట్లకు తగ్గింది. గత 5 సంవత్సరాల బడ్జెట్‌ను పరిశీలిస్తే ఇదే తక్కువ. 2017-18 బడ్జెట్‌తో పోలిస్తే ఇది 1.6 శాతం తగ్గింది. దీనిలో కూడా విద్యారంగానికి కేటాయించిన నిధులు 7.6 శాతం మాత్రమే.

2019 సెప్టెంబర్ 9న ముఖ్యమంత్రి కెసిఆర్ ప్రవేశపెట్టిన బడ్జెట్ ఉపన్యాసంలో 'కేంద్రం, రాష్ట్రం రెండూ తీవ్రమైన సంక్షోభంలో పడుతున్న ప్పుడు నేను 2019-20 సంవత్సరానికి సంబంధించిన బడ్జెట్‌ను సభలో ప్రవేశపెడుతున్నందుకు చింతిస్తున్నాను. ఇటువంటి పరీక్షా సమయంలో మనం జాగ్రత్తగా నడవాలి. మేము కొన్ని పరిమితులు దాటలేము' అంటూ ఓట్ ఆన్ ఎకౌంట్ బడ్జెట్‌ను 1.82 లక్షల కోట్లుగా ప్రవేశపెట్టిన ముఖ్యమంత్రి పూర్తిస్థాయి బడ్జెట్‌కు వచ్చేసరికి దానిని 1.46 లక్షల కోట్లకు తగ్గించి ప్రవేశపెట్టారు. ఈ తగ్గుదలకు కారణంగా ద్రవ్యోల్బణం క్రమంగా విస్తరిస్తోందని, ఆదాయాలు దారుణంగా పడిపోయాయని అసంబద్ధ కారణాలు చూపడం జరిగింది. ద్రవ్యోల్బణం పేరుచెప్పి ఓట్ ఆన్ ఎకౌంట్ బడ్జెట్‌ను 20 శాతం తగ్గించి పూర్తిస్థాయి బడ్జెట్‌ను తీసుకొచ్చారు. 2019-20లో తెలంగాణ పన్ను ఆదాయంలో 15 శాతం వృద్ధిని అంచనా వేస్తుండగా, 2019-20 మొదటి త్రైమాసికంలో 5.46 శాతం మాత్రమే సాకారం అయిందని, దీంతో తప్పనిసరి పరిస్థితుల్లోనే 20 శాతం బడ్జెట్ కోత విధించడం జరిగిందని వాపోయారు. చాలా రంగాల్లో వృద్ధిరేటు పడిపోయినప్పటికీ తెలంగాణ ఇతర రాష్ట్రాలకన్నా మెరుగ్గా పనిచేస్తుందని, పంజాబ్, హర్యానా, కర్నాటక రాష్ట్రాలు ప్రతికూల వృద్ధిరేటును నమోదు చేశాయని ముఖ్యమంత్రి గారి ప్రసంగ సారాంశం. వడ్డించేవాడు మనోడైతే ఏ మూల కూర్చున్నా పర్వలేదన్నట్లు ముఖ్యమంత్రి మాంద్యం పేరుచెప్పి బడ్జెట్ తగ్గించినా, తనకిష్టమైన రంగాలకు సంక్షేమాల పేరుతో వాటికి కేటాయింపులు సానుకూలంగానే ఉంచుకున్నారు. విద్యా రంగాన్ని తీవ్ర నిర్లక్ష్యానికి గురిచేస్తున్నట్లు ఈ బడ్జెట్ కేటాయింపులే నిదర్శనంగా నిలుస్తున్నాయి. గురువుల పట్ల, విద్య పట్ల తన విధేయతను గొప్పగా చెప్పుకునే ముఖ్యమంత్రి అంతరంగంలోని డొల్లతనమంతా ఈ కేటాయింపుల ద్వారా అర్థమౌతుంది.

### పాఠశాలల దుస్థితి

విద్యా రంగానికి బడ్జెట్‌లో 2017-18లో 8.49 శాతం ఉండగా, 2018-19లో ఓట్ ఆన్ ఎకౌంట్ బడ్జెట్‌లో 7.6 శాతం కాగా ఇది కాస్తా ఇప్పుడు 6.71 శాతానికి తగ్గింది. ఇవాళ పాఠశాలలు చాలా దయనీయ స్థితిలో ఉన్నాయి. చాలా పాఠశాలలకు ప్రహరీ గోడలు గాని, తరగతి గదులు గాని, బాల బాలికలకు సరిపడా మరుగుదొడ్లు గాని, తాగడానికి శుభ్రమైన నీరు గాని అందుబాటులో లేవు. చాలా పాఠశాలలు సౌకర్యాల లేమితో అల్లాడుతున్నాయి. పిల్లలు కూర్చోవడానికి బెంచీల సంగతి చెప్పకపోవడమే మంచిది. పాఠశాలల్లో ఉపాధ్యాయ, విద్యార్థి నిష్పత్తి కూడా ఆశించిన స్థాయిలో లేదు. తరగతికొక టీచర్ ఉండాలన్న నియమం ఏనాడో కొండెక్కింది. పాఠశాలల్లో ఫ్యాన్లు, విద్యుత్ సౌకర్యం లాంటి కనీస సౌకర్యాలు లేక పాఠశాలలు దిక్కుతోచని స్థితిలో ఉన్నాయి. పిల్లలకు ఆట స్థలాలు, ఆట వస్తువులు మచ్చుకైనా కానరావు. ఇన్ని రకాల అసౌకర్యాలకు, వసతుల లేమికి ఆలవాలమైన ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య తగ్గిపోతున్నది. ఇప్పటికే నాలుగు వేల పాఠశాలలు మూసివేసినారు. పాఠశాలలన్నీ మూసివేతకు గురికావడానికి సమయం ఎంతో దూరంలో లేదు. తెలంగాణ పునర్నిర్మాణం అన్న ముఖ్యమంత్రి నోట గురుకులాల మాట తప్ప, అన్ని పాఠశాలల సంతులాభివృద్ధికి విద్యా రంగాన్ని పునర్నిర్మించాలని ఎందుకు భావించడం లేదో అర్థం కాదు. ఆర్థిక మాంద్యం బూచిగా చూపెడుతూ కేటాయింపులు తగ్గించేశారు. వివిధ రకాల రెసిడెన్సియల్ పాఠశాలలు నెలకొల్పిన తర్వాత కారణాలేవైనా ఎక్కువ మంది విద్యార్థులు వీటిలో చేరడానికి ఆసక్తిని ప్రదర్శిస్తున్నారు. వీటిలో కూడా సౌకర్యాల లేమి స్పష్టంగా కన్పిస్తోంది. అన్ని కూడా కిరాయి దుకాణాల్లోనే నిర్వహిస్తున్నారు. ఇవి సమస్యలకు నిలయాలయినాయి. గొప్ప ఆశయంతో గురుకుల పద్ధతి అంటూ పెట్టిన పాఠశాలల్లో కూడా వసతుల లేమికి తోడు నిధులు సరిగా కేటాయించకపోతే అవి ఎలా మనగలుగుతాయో ఏలినవారికే ఎరుక.

### బుట్టదాఖలవుతున్న కమిటీల సిఫార్సులు

రాష్ట్రంలో జిల్లా, మండల పరిషత్, ప్రభుత్వ పాఠశాలలు 22,000, రెసిడెన్సియల్ పాఠశాలలు దాదాపు 500 దాకా ఉన్నాయి. అలాగే విశ్వవిద్యాలయాలు, కాలేజీలు సహా అనేకం ఉన్నాయి. 1954లో ఏర్పాటు చేసిన ఖేర్ కమిటీ పాఠశాలల్లో ఫ్రీ క్లాసెస్, కంప్యూటర్ విద్యకు, అన్ని విద్యా సంస్థల్లో బోధనా సిబ్బంది నియామకానికి కేంద్రం తన బడ్జెట్‌లో 10 శాతం విద్యకు నిధులు కేటాయించాలని, రాష్ట్రాలు 20 శాతం విద్యకు నిధులు కేటాయించాలని సిఫార్సు చేసింది. సిఫార్సులు కాగితాలకే పరిమితమైనవి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఏవీ కూడా నిధులను పెంచాలన్న కనీస బాధ్యతను మరిచిపోయాయి. ఆఖరికి కేటాయించిన నిధుల్లో కూడా లేశమైనా ఖర్చు చేయని స్థితి కూడా మనం చూడవచ్చు.

### అరకొర గ్రాంట్లు

బడ్జెట్‌కు రానురాను విద్యకు కేటాయించే నిధులు బక్కచిక్కి పోతుండడంతో పాఠశాలలకు ఇచ్చే గ్రాంట్ భారీగా తగ్గించారు. గతంలో ఉన్నత పాఠశాలలకు రు. 50,000 ఇచ్చిన గ్రాంటు ప్రస్తుతం రు. 16,000 లకు పడిపోయింది. ఈ కొద్దిపాటి మొత్తం పాఠశాల నిర్వహణకు ఏమాత్రం పరిపోవడం లేదు. కనీసావసరాలైన రిజిస్టర్లు, చాక్‌పీసులు, దస్తర్లు, జాతీయ పండుగల నిర్వహణ, ఆటల పోటీల నిర్వహణ, హరితహారం, బడిబాట, సైన్స్‌ఫేర్‌లు మొదలైన వాటితో పాటు వరానికోసారి ఫలానా కార్యక్రమం నిర్వహించాలని ఖర్చు పాఠశాల గ్రాంట్ నుండి వాడుకొమ్మని ఉచిత సలహాలు ఇస్తారు. వచ్చే పాఠశాల గ్రాంట్ మొదటి మూడు నెలలకి పరిపోవడం లేదు. ఈ నేపథ్యంలో ప్రధానోపాధ్యాయులే తమ స్వంత డబ్బులు సమకూర్చడం పరిపాటి అయింది. విద్యుత్ బిల్లులు, కంప్యూటర్లు, ప్రింటర్ల నిర్వహణ తలకు మించిన భారంగా ఉన్నది. నిధుల లేమివల్ల పాఠశాల నిర్వహణ సరిగా ఉండడం లేదు. వసతుల కొరత కొట్టొచ్చినట్లు కనపడుతున్నది. దీంతో ఏ రకమైన సౌకర్యాలు, సిబ్బందిలేమి పాఠశాలల్లో తమ పిల్లల్ని చదివించ డానికి తల్లిదండ్రులు ముందుకు రావడం లేదు. పిల్లల సంఖ్య తగ్గిపోతు న్నది. నియామకాలు, పర్యవేక్షణాధికారులు లేకపోవడం మరింతగా విద్యా రంగాన్ని కుంగదీస్తుంది. ప్రభుత్వం ఉపాధ్యాయుల పనితీరు సరిగా

# అమరావతి నిర్మాణం జరిగేనా?

***రాష్ట్ర విభజన జరిగి అయిదేళ్లయినా రాజధాని నిర్మాణం విషయంలో ఎలాంటి స్పష్టత కనిపించడం లేదనీ, రాజధానిని పూర్తి చేయడంలో స్తబ్ధత ఏర్పడడంతో ప్రజలు తీవ్ర గందరగోళానికి గురవుతున్నారనీ అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

**2014-19** మధ్య కాలంలో చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా ఉన్న సమయంలో 'అమరావతి'ని ఆంధ్రప్రదేశ్ నూతన రాజధానిగా ప్రకటించి ప్రధానమంత్రి నరేంద్రమోడీతో శంకుస్థాపన కావించి కొన్ని నిర్మాణాలను చేపట్టారు. దాదాపు 33 వేల ఎకరాలు అధికారికంగా, అక్కడి చుట్టుపక్కల గ్రామాల రైతులు 'భూ సమీకరణ' (ల్యాండ్ పూలింగ్) కింద తమ విలువైన భూములను ప్రభుత్వానికి ఉచితంగా ధారపోశారు. అయితే అందులో కొంతభాగం వారికి కొన్ని ప్లాట్ల రూపంలోనూ, వారికి నివాసయోగ్య స్థలాలు గానూ ఇస్తూ సిఆర్‌డిఎ (క్యాపిటల్ రెజిస్ట్రర్ డెవలాప్‌మెంట్ అథారిటీ) అధికారి సంతకంతో కొన్ని పత్రాలు భూమి ఇచ్చిన వారికి అందజేశారు.

2019 మే 30న ఆంధ్రప్రదేశ్‌లో జగన్‌మోహన్‌రెడ్డి నాయకత్వంలోని వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత ఈ 'అమరావతి' రాజధాని నిర్మాణం కొంత కుంటుపడిన మాట వాస్తవం. అంతేకాక ఈ నూతన ప్రభుత్వం రాజధానిని తరలించాలనే యోచన ఉన్నట్టు కూడా మంత్రుల ప్రకటనల ద్వారా తెలుస్తున్నది. అంతేకాకుండా పోలవరం రివర్స్ టెండరింగ్ విధానం ప్రకటించడంతో దానిపై అప్పటి 'నవయుగ కంపెనీ' రాష్ట్ర ఉన్నత న్యాయస్థానం (హైకోర్టు) ను ఆశ్రయించడంతో రివర్స్ టెండరింగ్ ప్రక్రియ ఆగిపోయింది. ఇదే విధంగా రాజధాని రైతుల పరిస్థితి కూడా అగమ్యగోచరంగా తయారైంది. తమ భూములు ఇప్పుడు అటు వ్యవసాయ యోగ్యానికి పనికిరాక, ఇటు నిర్మాణాలు జరుగక రైతులు చాలా ఆందోళనలో ఉన్న మాట వాస్తవం.

ముఖ్యంగా అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు నిర్మించిన సచివాలయం, తాత్కాలిక హైకోర్టు, తాత్కాలిక శాసనసభ శాసన మండలి చుట్టూ ఉన్న గ్రామాలైన ఉండవల్లి మందడం, ఉద్దండ నాయునిపాలెం, నిడమర్రు గ్రామాలకు మంగళగిరి నుంచి పోయే దారులన్నీ వెడల్పు పేరుతో, కొత్త రోడ్ల నిర్మాణం పేరుతో పూర్తిగా పొలాలన్నీ చెడగొట్ట బడ్డాయి. దాదాపు కొన్ని వందల ఎకరాలు తొలిచి వేయబడ్డాయి. పెద్ద పెద్ద రోడ్లు వేసే యంత్రాలతో పొలాలన్నీ దున్నించ బడ్డాయి.

హైకోర్టుకు సమీపంలో 'మందడం' గ్రామం వద్ద నిర్మించబడే ఐఎఎస్/ ఐపిఎస్ అధికారుల క్వార్టర్లు దాదాపు 15 – 20 అంతస్థులుండే భవనాల నిర్మాణం పూర్తయి ప్రారంభించకుండా ఉన్నాయి. అంతేకాకుండా హైకోర్టు జడ్జీల క్వార్టర్లు కూడా నిర్మాణం పూర్తయినాయి కానీ, ప్రభుత్వం మారడంతో అవి ప్రారంభించలేదు. అన్నింటికన్నా ముఖ్యంగా 'సిఆర్‌డిఏ' అనే కార్యాలయం పనిచేస్తున్నదా? అనే విషయం కూడా అర్థం కాని పరిస్థితి. అన్ని వేల కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి నిర్మించాలనుకున్న నూతన రాజధాని అమరావతి నిర్మాణం ఎందుకు ఆగిపోయిందో 4

---

లేని కారణంగానే పిలల్లు తగ్గుతున్నారని నెపం వేస్తున్నది. నిధుల విడుదలపై మాట దాటేస్తున్నది. క్రమంగా పాఠశాలలు వాటికవే కుంగి కృశించిపోయేలా పాలకులు చేస్తున్నారన్న వాస్తవాలు బలపడుతున్నాయి. ఈ స్థితి విద్యారంగానికి రావడం వాంచనీయం కాదు.

**ముగింపు**

దేశాభివృద్ధికి, మానవాభివృద్ధికి మార్గం చూపేది, వెలుతురు వైపు పయనం సాగింపజేసేది విద్య మాత్రమే. ఏ రంగం అభివృద్ధి చెందాలన్నా విద్యారంగం పాత్ర కీలకమైనది. అన్ని రంగాలకు ఇంధనంగా పనిచేసే రంగానికి ఇంధనం లేకపోతే జవజీవాలుడిగి నశిస్తుంది. ఇది భావితరాలకు మంచిది కాదు. వెనువెంటనే ప్రభావం చూపకపోవచ్చు గాని, దీర్ఘ కాలంలో దాని ప్రభావం చాలా తీవ్రంగా ఉంటుంది. కాబట్టి విద్యా రంగానికి నిధులు కనీసం 20 శాతం కేటాయించాలి. ఇప్పటికీ పాఠశాల విద్యలో అనేక విద్యాధికారుల ఖాళీలు, ఉపాధ్యాయుల ఖాళీలు ఉన్నాయి. ఉపాధ్యాయ విద్యలో కూడా ఖాళీలున్నాయి. పాఠశాల విద్య పర్యవేక్షకుల లేమితో ఇంకా కుంటుపడుతున్నది. కొత్త జిల్లాల అవతరణ తర్వాత పూర్తిస్థాయి డిఇఒలు కూడా లేకపోవడంతో ఇంచార్జీల పాలనలో నెట్టుకొస్తున్నారు. పాఠశాల విద్యపై ముఖ్యమంత్రి ఇకనైనా దాని అభివృద్ధికి కృషి చేయాల్సిన అవసరం ఉన్నది. ఇప్పటికే తెలంగాణ అక్షరాస్యత శాతంలో వెనుకబడి ఉంది. కేంద్ర పాలిత ప్రాంతాలు, రాష్ట్రాలు కలిపి మొత్తం 36లో 35వ స్థానంలో ఉన్నది. దీన్ని అధిగమించడానికి తీవ్రమైన కృషి చేయాల్సి ఉంది. మరోవైపు మంత్రులకు సైతం అవగాహనలేని కారణంగా, అధికారులు సంవత్సరానికో తీరున విద్యారంగం నడుపుతుండడంతో అనేక సమస్యలు ఎదురవుతున్నాయి. విద్యా రంగానికి ఎక్కువ నిధుల కేటాయింపు, ఖాళీల భర్తీ, వసతుల కల్పన చేయకపోతే ఉన్న పిల్లలంతా ప్రైవేట్ బాట పట్టడం ఖాయం. ఇదే జరిగితే అతి తొందరలో పాఠశాల విద్యకు చరమగీతం పాడక తప్పదు. కొట్లాడి తెచ్చుకున్న తెలంగాణలో పాఠశాలలు, ప్రభుత్వ విద్య కనుమరుగయ్యే ప్రమాదం ఉన్నందున మళ్లీ ప్రజలు ఏకతాటిపై నిలబడి బడికోసం ప్రభుత్వంతో కలబడాల్సి ఉంది. ప్రజాగ్రహాన్ని ప్రభుత్వ ఉద్యోగ, ఉపాధ్యాయ పోరాటాన్ని మరొకసారి చవిచూడకముందే ప్రభుత్వం తగు చర్యలు చేపట్టి సవరింపులతోనైనా విద్యారంగం నిధులను పెంచి ప్రభుత్వ విద్యను పటిష్ట పరచాల్సి ఉంది.

*(రచయిత డిటిఎఫ్ రాష్ట్ర కౌన్సిలర్)* ఈ

నెలలు గడిచినప్పటికీ ఈ నూతన ప్రభుత్వం దానిపైన తన వైఖరిని గాని, విధానాన్ని గాని ప్రకటించలేదు. ఇది చాలా శోచనీయం. కొన్ని వేలమంది రైతులు అప్పటి ప్రభుత్వాన్ని నమ్మి తమ భూములను అప్పనంగా ఇచ్చివేశారు. అవి అన్నీ కూడా గుంటూరు జిల్లాలోని సారవంతమైన భూములు, కొన్ని కృష్ణా నదితీర గ్రామాలు (మందడం – ఉద్దండ రాయునిపాలెం). సంవత్సరానికి మూడు పంటలు పండే సారవంతమైన భూములు. ఒక్కమాటలో చెప్పాలంటే అవి బంగారు భూములే.

తాడేపల్లి హైవే నుంచి హైకోర్టుకు వెళ్లే మార్గంలో ఇప్పటికీ అరటి తోటలు, తమలపాకుల తోటలు, ద్రాక్షా తోటలు, కూరగాయల తోటలతో నిండి ఉంటాయి. ఇలాంటి భూములు గత ప్రభుత్వానికి ధారాదత్తం చేసినప్పుడు ఇప్పుడు వచ్చిన ప్రభుత్వం భూములిచ్చిన రైతులకు సమాధానం చెప్పాల్సిన బాధ్యత ఖచ్చితంగా ఉంది. కానీ రాజధాని నిర్మాణం వారి ఎన్నికల హామీలలో లేదనే నెపంతో దానిని ఏమాత్రం పట్టించుకోవడం లేదు. కాకపోగా దానిపై రైతుల హృదయాలను నొప్పించే విధంగా మంత్రులు మాట్లాడుతున్నారు. ఇది పూర్తిగా ప్రజల హక్కులను కాలరాయడమే.

ఢిల్లీకి మించిన రాజధానిని నిర్మిస్తామని ప్రధాని మోడీ శంకుస్థాపనకు వచ్చినప్పుడు బహిరంగంగా ప్రకటించాడు. దానిపై ఇప్పుడు బిజెపి వారు ఏమీ మాట్లాడడం లేదు. కేంద్ర ప్రభుత్వం కూడా తన హామీని నిలబెట్టుకోవాలి. వివిధ నిర్మాణాల కోసం వచ్చిన కూలీలు, వివిధ రాష్ట్రాల నుంచి వచ్చిన వృత్తి నైపుణ్యం కలవారు చాలా మంది జీవనోపాధిలేక వెళ్లిపోయారు. అంతే కాకుండా అనేక పెద్ద పెద్ద భవన నిర్మాణ యంత్రాలన్నీ కనబడడం లేదు. కొన్ని వేల మంది జీవనోపాధి పోయింది. దీనికంతటికీ ఇప్పుడున్న ప్రభుత్వ వైఖరే కారణం.

గత ప్రభుత్వం ఏమైనా అవినీతి అక్రమాలకు పాల్పడి ఉంటే దానిపై కేసు నమోదు చేసి చర్యలు తీసుకోవచ్చు. కానీ, సమస్యను ఎటూ కాకుండా నాన్చుతున్నారు. ఇది రాజకీయంగా ఈ ప్రభుత్వానికి అప్రతిష్ఠే అంతే కాకుండా ప్రజలను అయోమయానికి గురిచేస్తున్నారు. రాజధాని నిర్మాణానికి భూములిచ్చిన రైతులలో ఎక్కువ భాగం మంది గత ప్రభుత్వంలో ఉన్న పార్టీకి ఓటు వేశారనే ఓటు బ్యాంక్ దృష్టితో కూడా దీనిని చూస్తున్నారు. ఇది విచారకరం.

చంద్రబాబు నాయుడుకు చెందిన సామాజిక వర్గం (ఎక్కువ మంది) రైతులున్నారనే కారణం కూడా ఒకటై ఉండవచ్చు. దీనిని కూడా రైతులు బహిరంగంగానే చర్చించుకుంటున్నారు. అందుకే వీరు అన్ని రాజకీయ పార్టీలను, ప్రజా సంఘాలను కలుస్తూ ఉన్నారు. అంతా కలిసి ఒక ఐక్య కార్యాచరణ కమిటీ (జెఎసి) గా ఏర్పడుతున్నారు. ఇప్పుడున్న ప్రభుత్వ వైఖరిపై తాడోపేడో తేల్చుకోవాలని రైతులు ఆందోళనా బాట పట్టబోతున్నారు.

గత ప్రభుత్వం చేసిన నిర్మాణాలన్నీ కూడా ప్రజల సొమ్ముతో చేసినవే. ఇప్పుడవంతా 'బూడిదలో పోసిన పన్నీరు' కావలసిందేనా? రాష్ట్ర ప్రభుత్వం రైతుల పట్ల, రాజధాని నిర్మాణం పట్ల, ఇంతవరకూ జరిగిన నిర్మాణాల పట్ల అధికారుల వద్ద ఉన్న లెక్కలను తెప్పించుకొని ఒక శ్వేతపత్రం విడుదల చేయాలి. అది బహిరంగంగా ప్రజలందరికీ తెలియజేయాలి. ప్రజల అవసరాల కోసం నిర్మించిన 'ప్రజా వేదిక' దాదాపు 9 కోట్ల రూపాయల విలువైన దానిని ఈ నూతన ప్రభుత్వం కూల్చివేయడంతో ప్రజలు చాలా ఆందోళన చెందారు. అంతే కాకుండా ప్రజా వేదికను కూల్చివేయకుండా దానికి ఉపయోగించిన ఫైబర్ మెటీరియల్ నంతా తీసుకొని వెళ్లి మరోచోట నిర్మించుకోవచ్చు. ఆ పని చేయకుండా వృథాగా దానిని కూల్చివేశారు. పెద్ద పెద్ద యంత్రాలతో నేలమట్టం చేశారు. దాని పక్కన ఉన్న మంతెన సత్యనారాయణ రాజు ప్రకృతి చికిత్సాలయం, తులసీ – రామచంద్ర ప్రభు గెస్ట్ హౌస్ (విశ్రాంతి నిలయం – ఎకరాలలో ఉంది) ను మాత్రం వదిలివేశారు. కారణాలు వెల్లడించలేదు.

రాష్ట్ర ప్రభుత్వం ఈ విధంగా వ్యవహరించడం వలన కేవలం కొంతమంది పైననే వారు గురిపెట్టినట్లు, మిగతా వారిని వదిలి వేసినట్లు అర్థమవుతున్నది. లేదా వారితో ఏదో ఒక విధమైన లాలూచీ జరిగి ఉండవచ్చును. ఈ విషయంలో కూడా ప్రభుత్వం ప్రజలలో ఆరోపణలకు గురయింది. కనీసం మరో ప్రజా వేదికనైనా ఇంతవరకూ ఏర్పాటు చేయలేదు. 'మాకు ప్రజలు అధికారమిచ్చారు, మా ఇష్టం వచ్చినట్లు చేస్తాం' అనే ఒక నిరంకుశమైన ధోరణి తప్ప స్పష్టమైన వైఖరంటూ ఏ విషయంలోనూ లేదు. అంతే కాకుండా ప్రభుత్వ ప్రాధాన్యతలు కేవలం 'నవరత్నాలు' అంటూ ఎన్నికల హామీల గురించి మాత్రమే మాట్లాడుతూ ఉన్నారు. కనీసం మంత్రులు కూడా ఒకరికొకరు సమన్వయం లేకుండా మాట్లాడుతున్నారు. 'అమ్మ బడి' పథకం కేవలం ప్రభుత్వ పాఠశాలలకు మాత్రమే వర్తిస్తుందని ఒకరు, ప్రైవేట్ పాఠశాలలకు కూడా వర్తిస్తుందని, ఏ పాఠశాలలో చదివినప్పటికీ వర్తిస్తుందని ముఖ్యమంత్రి వివరణ ఇచ్చారు. ఈ విధంగా ప్రతి విషయంలో ప్రజలను అయోమయానికి గురిచేస్తున్నారు.

అమరావతి ప్రాజెక్ట్ ప్రభుత్వ ప్రాధాన్యతలలో లేదని తెలుసుకొని ఇప్పటికే ప్రపంచ బ్యాంక్, ఏషియన్ ఇన్‌ఫ్రా స్ట్రక్చర్ అండ్ ఇన్వెస్ట్‌మెంట్ బ్యాంక్ (ఏఐఐబి) ఇచ్చే రుణసదుపాయాన్ని మానుకోవడంతో రాష్ట్ర ఖజానాపై మరింత భారం మోపబడుతుంది. ఇది మరొక సమస్యగా మారుతుంది. తమిళనాడుకు చెన్నై, కర్ణాటకకు బెంగుళూరు, తెలంగాణకు హైదరాబాద్ ఎలాగో ఆంధ్రప్రదేశ్‌కు 'అమరావతి' అలాగా నిర్మించబడు తుందని ప్రజలు తమ మనస్సులలో భావించారు కానీ, ఈ కొత్త ప్రభుత్వం ప్రజల ఆకాంక్షలను నీరుగార్చింది. లేనిచో రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో ఒక పెద్ద నిర్మాణం చేపడితే మరీ బాగుంటుంది. అనగా రాయలసీమలో హైకోర్టు, ఉత్తరాంధ్రలో హైకోర్టు బెంచ్, దక్షిణ కోస్తాలో అనగా ప్రకాశం – నెల్లూరు జిల్లాలో డైరెక్టరేట్ – కమిషనరేట్ కార్యాలయాలు లేదా శాసనసభలలోనే శీతాకాల సమావేశాలకొకటి, వర్షాకాల సమావేశాల కొకటి నిర్మాణాలు లేదా పెద్ద పరిశ్రమలు స్థాపిస్తే అన్ని ప్రాంతాలకు సమన్యాయం చేసినట్లు ఉంటుంది. ఎలాగూ డిజిపి కార్యాలయం మంగళగిరిలో ఉంది. అది రాజధాని ప్రాంతానికి కేంద్రంగా పనిచేస్తున్నది. అది గుంటూరు – విజయవాడ మధ్యలో ఉంది.

నూతన రాష్ట్రానికి రాజధాని అమరావతి నిర్మాణం ఒక ప్రశ్నార్థకంగా మారింది. దీనిపై ప్రజాందోళన పెంపొందించబడకముందే రాష్ట్ర ప్రభుత్వం మేల్కొనడం మంచిది. భారత రాజ్యాంగం మౌలిక అంశాలైన పౌరులందరికీ 'సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయం', భావ ప్రకటనా స్వేచ్ఛకు ఏమాత్రం ఇబ్బందులు కలుగకుండా చూడాల్సిన బాధ్యత ఈ కొత్త ప్రభుత్వం తీసుకోవాలి. లేదా ప్రజలు పోరాటాల ద్వారానే దానిని సాధించుకుంటారు.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

# తుమ్మలపల్లె యురేనియం విషాదగాథ

*బహుళజాతి కంపెనీల ప్రయోజనాల కోసమే ప్రభుత్వం యురేనియం వెలికితీతను పోత్సహిస్తోందనీ, దీని వల్ల పెద్ద ఎత్తున ప్రకృతి, మానవ విధ్వంసం జరుగుతోందనీ, ప్రజలంతా ఏకమై ఈ విధ్వంసానికి వ్యతిరేకంగా పోరాడాలనీ అంటున్నారు* **ఎం.కె. కుమార్**

యురేనియం తవ్వకాలను ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రజలు వ్యతిరేకిస్తున్నారు. తెలంగాణ రాష్ట్రంలో సేవ్ నల్లమల్ల ఉద్యమానికి చిత్ర పరిశ్రమ ప్రముఖులు, ప్రతిపక్ష పార్టీలు మద్దతును ఇస్తున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లోని యురేనియం గని ప్రాంతమంతా విషపూరితమైంది. కాలుష్యం, పర్యావరణ నిబంధనలను కేంద్ర సంస్థ పట్టించుకోలేదు. రాష్ట్ర కాలుష్య నియంత్రణ మండలి యురేనియం తవ్వకాలపై ఆందోళన వ్యక్తం చేసింది. షోకాజు నోటీసులు సైతం జారీ చేసింది. ఆంధ్రప్రదేశ్ తరహాలోనే, తెలంగాణలోను యురేనియం తవ్వకాలకు కేంద్రం పచ్చజెండా ఊపింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వాళ్ల మధ్య ఉన్న రాజకీయ వైరుధ్యాల్లో భాగంగానే యురేనియం తవ్వకాలపై రాజకీయం చేస్తున్నాయి. ఇద్దరికీ చిత్తశుద్ధి లేదు. కేంద్ర ప్రభుత్వం తవ్వకాలకు అనుమతి ఇవ్వబోతుంటే రాష్ట్ర ప్రభుత్వం ఆ చర్యను కనీసం ఖండించలేదు. ప్రజాస్వామ్య సంస్థల, ప్రజాస్వామిక వాదుల ఆందోళన నేపథ్యంలో తెరాస ప్రభుత్వం అసెంబ్లీలో యురేనియం తవ్వకాలను తమ రాష్ట్రంలో నిషేధిస్తున్నట్టు తీర్మానం చేసింది.

కడప జిల్లా, వేముల మండలం, ఎం. తుమ్మలపల్లె వద్ద యురేనియం ప్రాసెసింగ్ కర్మాగారం ఉంది. దీన్ని భారత యురేనియం సంస్థ (యుసిఐఎల్) నిర్వహిస్తోంది. ఈ సంస్థకు అనుమతి కేంద్రం 2007లో ఇచ్చింది. రు. 1103 కోట్ల నిధులు యురేనియం వెలికితీతకు ఇచ్చారు. 1700 ఎకరాల విస్తీర్ణంలో కర్మాగారాన్ని ఏర్పర్చారు. రోజుకు 2500 టన్నుల వరకు ముడి ఖనిజాన్ని తీసి శుద్ధి చేస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వం 1050 ఎకరాలు ఇచ్చింది. రైతుల నుండి 650 ఎకరాలు తీసుకున్నారు. మొదట్లో నష్టపరిహారం, ఇంటికో ఉద్యోగం, పక్కా ఇళ్లు, వేరే చోట పొలాలు ఇస్తామని ప్రభుత్వాలు మాటిచ్చి తప్పాయి. కేంద్ర ప్రభుత్వ కాలుష్య నియంత్రణ మండలి నిబంధనలను ఈ సంస్థ పాటించడం లేదు. విడుదలవుతున్న వ్యర్థాలు బురదనీళ్ల రూపంలో ఉంటాయి. వీటిని ప్రత్యేకంగా తవ్విన చెరువులో నిల్వ ఉంచాలి. ఆ జలాలు భూమిలోకి ఇంకకుండా లైనింగ్ చేయాలి. చెరువుకు వ్యర్థాలను పంపించేటపుడే శుద్ధి చేయాలి. శుద్ధి చేసిన నీటిని కర్మాగార నిర్వహణకు ఉపయోగించాలి. రాష్ట్ర ప్రభుత్వం ఈ కర్మాగారాన్ని రాష్ట్రంలో స్థాపించేందుకు అంగీకరిస్తూ కొన్ని నిబంధనలను విధించింది.

చెరువు చుట్టూరా 500 మిల్లీమీటర్ల మందంతో బెన్‌టోనైట్ మట్టితో పొరను ఏర్పాటు చేయాలి. ఆ పొరకు 250 మైక్రాన్ పాలియాథిలిన్ పొరను ఏర్పాటు చేయాలి. మళ్లీ 250 మిల్లీమీటర్ల ఇసుకతో రక్షణపొరను ఏర్పాటు చేయాలి. ఇవేమి సదరు సంస్థ పాటించడం లేదు. తర్వాత ఈ సంస్థ ప్రమాదకరమైన వ్యర్థాలను శుద్ధి చేయకుండా విడుదల చేస్తోంది. స్థానిక ప్రజలు సంపూర్ణంగా వ్యతిరేకిస్తున్నారు. ఎందుకంటే ఈ కర్మాగారం నుంచి కలుషిత జలాలను ఒక చెరువులోకి మళ్లిస్తున్నారు. ఈ జలాలు భూగర్భంలోకి ఇంకిపోతున్నాయి. దీనివల్ల చుట్టుప్రక్కల ఉన్న ఊర్లలోని తాగునీరు కలుషితమౌతోంది. అభివృద్ధి అంటే స్థానిక ప్రజల మనోగతాలకు, ఆకాంక్షలకు వ్యతిరేకంగా పరిశ్రమలను స్థాపించడమే అని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు భావిస్తున్నాయి. ప్రభుత్వ చర్యలు పర్యావరణ, వాతావరణ కాలుష్యాన్ని పెంచేవిగా ఉంటున్నాయి.

ప్రజల జీవితాలను మరింతగా దిగజారుస్తూ, వారి జీవించే హక్కును కాలరాసే విధంగా అభివృద్ధి సాగుతోంది. ఈ అభివృద్ధి ఫలాలు కార్పొరేట్ శక్తులే అనుభవిస్తున్నాయి. పంట పొలాలను ధ్వంసం చేస్తూ, జల కాలుష్యాన్ని పెంచుతూ, ఊర్ల నుండి ప్రజలను వెళ్లగొట్టడం అభివృద్ధి కాదని సామాన్య ప్రజలు పేర్కొంటున్నారు. అణువిద్యుత్తు కర్మాగారాన్ని నడపాలంటే యురేనియం అవసరం చాలా ఉంది. ఈ యురేనియం నిక్షేపాలు కడప జిల్లా ప్రాంతంలో ఉన్నట్టు ప్రభుత్వాలు గుర్తించాయి. అణువిద్యుత్తు కర్మాగారాల వల్ల వచ్చే విద్యుత్తు కన్నా, వాటి వల్ల వచ్చే నష్టాలు ఎక్కువుగా ఉన్నాయని ప్రపంచంలోని ధనిక దేశాలు వాటిని మూసివేస్తున్నాయి. ప్రత్యామ్నాయ విద్యుత్తు ఉత్పత్తి మార్గాలను వెతుక్కుంటున్నాయి. మన దేశంలో మాత్రం దానికి భిన్నంగా పాలకులు ప్రవర్తిస్తున్నారు.

యురేనియం వెలికితీతను కార్పొరేట్ యాజమాన్యానికి ఇస్తే ప్రజల్లో వ్యతిరేకత వస్తుందని ప్రభుత్వాలు గ్రహించాయి. అంతే గాకుండా ప్రభుత్వమే దళారీగా వ్యవహరించి కార్పొరేట్ కంపెనీలకు తక్కువ ధరకు యురేనియాన్ని ఇవ్వడానికి పూనుకుంటోంది. అందుకే ప్రభుత్వ సంస్థల ద్వారానే యురేనియం వెలికితీసి, దాన్ని బహుళజాతి సంస్థలకు అమ్మాలని ప్రభుత్వ పెద్దలు భావిస్తున్నారు. ప్రభుత్వం చెపుతున్నదేమంటే అణు విద్యుత్తు కర్మాగారాలు భారత్‌లో విరివిగా నెలకొల్పాలి. దీనివల్ల నిరంతరాయంగా ప్రజలకు కరెంట్‌ను ఇవ్వచ్చు. అలాగే దీన్ని అధికంగా ఉత్పత్తి చేస్తే మనం విదేశాలకు అమ్ముకోవచ్చని ప్రభుత్వం వాదిస్తోంది. అందులో భాగంగా తమ భూభాగాలను, పంట పొలాలను నష్టపోయే ప్రజలకు నష్టపరిహారం ఇస్తామని చెపుతోంది. అభివృద్ధిని ఆటంకపరిచే విధంగా యురేనియం తవ్వకాలను వ్యతిరేకించడం భావ్యం కాదని ప్రభుత్వ పెద్దలు చెపుతున్నారు.

కడప జిల్లాలో, ఎం. తుమ్మలపల్లెలో భారత యురేనియం సంస్థ గనిని నిర్వహిస్తోంది. అలాగే వెలికి తీసిన యురేనియాన్ని శుద్ధి

చేయడానికి ప్రాసెసింగ్ కర్మాగారాన్ని నెలకొల్పింది. కనీసమైన జాగ్రత్తలను, ప్రమాణాలను సైతం ప్రభుత్వ సంస్థ పాటించడం లేదు. కొంతమంది ప్రజలు తమ ప్రాంతంలో కర్మాగారాన్ని నిర్మించి, నిర్వహిస్తే ప్రాంతం అభివృద్ధి చెందుతుందని భావించారు. ఇప్పుడు చుట్టుపక్కల ప్రాంతాలు కలుషితమవడంతో తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. చుట్టుపక్కల ప్రాంతాల్లోని భూగర్భ జలాలు కలుషితమైపోయాయి. ఎం.తుమ్మలపల్లెకి సమీపంలో కణంపల్లె గ్రామంలో తిరుమల నాయక్ అనే రైతుకు 5 ఎకరాల అరటి తోట ఉంది. భూగర్భజలాలు కలుషితమవడం వల్ల అతని బోరు నీళ్ల వల్ల అరటి కాయలు రాలేదు. విపరీతమైన ఆవేదనతో అతను చివరకు పంటనే తగులబెట్టుకున్నాడని స్థానిక పత్రికలు పేర్కొన్నాయి. అంతేగాకుండా తుమ్మలపల్లె పరిసర ప్రాంతాలైన కనంపల్లె, కొట్టాల, మబ్బుచింతలపల్లె, బూమయ్యగారి పల్లె, గిడ్డంగివారిపల్లె, తదితర గ్రామాల్లో పొలాలు పంటలకు పనికిరాకుండా పోయాయి.

హక్కుల సంఘాలు ఈ ప్రాంతాల్లో పర్యటించినపుడు స్థానికులు వాళ్ల బాధలను చెప్పి వాపోయారు. పశువులు చనిపోవడం, మనుషులకు వింత చర్మవ్యాధులు రావడం, ముసలివాళ్లు పిచ్చిగా ప్రవర్తిస్తున్నారని స్థానికులు పేర్కొన్నారు. స్థానిక ప్రజలు యురేనియం ప్లాంటును వ్యతిరేకించడంతో వారిపై ప్రభుత్వం అక్రమ కేసులు పెట్టింది. జైళ్లలో వేసింది. ఒకప్పుడు అరటితోటలు పండే ఆ ఊర్లల్లో ఇప్పుడు 1000 అడుగులు బోరు వేసినా నీళ్లు పడడం లేదు. ఆ ప్రాంతాల్లో భూగర్భాల్లో లభించే నీరంతా ఎర్రరంగుకు మారిపోయింది. ప్లాంట్ స్థాపనలో, పర్యవేక్షణలో సుమారు 1000 కోట్ల రూపాయల అవినీతి జరిగిందని ప్రతిపక్ష పార్టీలు వైఎస్ఆర్ హయాంలో దుమ్మెత్తి పోశాయి.

స్థానిక ప్రజల ఆందోళనలు ఎక్కువవడంతో రాష్ట్ర కాలుష్య నియంత్రణ మండలి ఆగస్టు 7, 2019న సదరు కేంద్ర యురేనియం కార్పొరేషన్‌కు మరో షోకాజ్ నోటీసు జారీ చేయాల్సి వచ్చింది. గతంలో ఇచ్చిన నోటీసులకే ఇప్పటికీ సరైన రీతిలో జవాబు రాలేదు. చుట్టుపక్కల ఊర్లలోని బోరు నీళ్లు కలుషితమయ్యాయి. ఒక కేంద్ర ప్రభుత్వ సంస్థకే రాష్ట్ర ప్రభుత్వ సంస్థ నోటీసులు జారీచేసిందంటే కేంద్ర ప్రభుత్వం ఆ కర్మాగారాన్ని ఎంత నిర్లక్ష్యంతో నిర్వహిస్తోందో అర్థమౌతుంది. పర్యావరణాన్ని దృష్టిలో పెట్టుకుని ఆ పరిశ్రమను మూసివేయాలని ప్రజాసంఘాలు ఆందోళన చేస్తున్నాయి. రాష్ట్ర ప్రభుత్వం యురేనియం వ్యర్థాలను సరైన పద్ధతిలో శుద్ధిచేస్తే సరిపోతుందని పేర్కొంటుంది. ప్రజలకు, ప్రభుత్వాలకు మధ్య ఉన్న అభిప్రాయాల్లో తేడాలు ఆందోళనలను మరింత తీవ్రతరం చేస్తున్నాయి. యురేనియం వ్యర్థాలను నింపే చెరువుకు నిర్దిష్ట ప్రమాణాలను పాటించక పోవడం వల్ల వ్యర్థాలు భూగర్భంలోకి ఇంకుతున్నాయి. మరోవైపు ముడిఖనిజమైన యురేనియాన్ని పెద్దఎత్తున గుట్టలుగా కర్మాగారం పక్కన పోశారు. దూరం నుండి ఆ నిల్వలను చూస్తే చిన్న కొండలుగా కనిపిస్తాయి. బోరు నీళ్లను సంవత్సరాలుగా తాగుతున్న ప్రజలు ప్రస్తుతం అవి ఉప్పుగా, ఎర్రగా మారడంతో ఏం చేయాలో దిక్కు తోచని పరిస్థితుల్లో ఉన్నారు. దీనివల్ల ఆ ప్రాంతాల్లోని పొలాల ధరలు అమాంతం పడిపోయాయి. ఇప్పటికీ యురేనియం వ్యర్థాల వల్ల 300 ఎకరాల పంట పొలాలు ఎందుకు పనికిరాని బీడు భూములుగా మారిపోయాయని స్థానికులు చెపుతున్నారు. పంటలు బీడు అవుతున్నా ప్రజలు సంయమనం పాటిస్తూ వచ్చారు. ఇప్పుడు త్రాగునీరు కలుషితమవడంతో అనారోగ్య సమస్యలు ఎక్కువవుతున్నాయి. కిడ్నీవ్యాధి ప్రబలుతోంది.

నిబంధనలు ఏ మాత్రం పాటించకుండా కర్మాగారం నిర్వాహకులు చట్టాన్ని ఉల్లంఘిస్తున్నారు. వ్యర్థాలను ఉంచే చెరువుకు 250 మైక్రాన్ పాలియాథిలిన్ పొరను ఏర్పాటు చేయనే లేదు. రాష్ట్ర ప్రభుత్వం 2018లోను నోటీసులు జారీ చేసింది. దానికి యురేనియం కార్పొరేషన్ నిర్లక్ష్యమైన సమాధానం ఇచ్చింది. అణుశక్తి మండలి మార్గదర్శకాలను పాటిస్తున్నామని చెప్పింది. చెరువుకు అవసరం మేరకు లైనింగ్ వేశామని చెప్పి, పాలియాథిలిన్ పొర అవసరం లేదని చెప్పింది. ఈ నేపథ్యంలో నవంబర్ 19, 2018న రాష్ట్ర కాలుష్య నియంత్రణ మండలి కార్పొరేషన్‌కు అదనపు మార్గదర్శకాలను జారీ చేసింది. వ్యర్థాలు భూగర్భంలోకి ఇంకకుండా వెంటనే జాగ్రత్తలు తీసుకుని నివేదిక ఇవ్వాలని ఆదేశించింది. ప్రస్తుతం ఉన్న చెరువులోని వ్యర్థాలను తిరిగి శుద్ధిచేయాలని పేర్కొంది. ఇవేమి సదరు సంస్థ ఇప్పటివరకు చెయ్యలేదు.

భారతదేశంలో ఉన్న మొత్తం యురేనియం నిల్వల్లో సగానికిపైగా నిల్వలు కడప జిల్లా, ఎం.తుమ్మలపల్లెలోనే ఉన్నాయి. 1,20,228 టన్నులు ఎం. తుమ్మలపల్లెలో ఉన్నాయి. గుంటూరు జిల్లా కొప్పునూరు వద్ద 2,342 టన్నుల మేర యురేనియం నిల్వలు ఉన్నట్లు కేంద్ర ప్రభుత్వ గణాంకాలు పేర్కొంటున్నాయి. రాష్ట్రాల వారీగా యురేనియం నిల్వలు కింది విధంగా ఉన్నాయి. 1 హిమాచల్ ప్రదేశ్ 665 టన్నులు; 2 రాజస్థాన్ 7,989 టన్నులు; 3 ఉత్తరాఖండ్ 85 టన్నులు; 4 మేఘాలయ 19,538 టన్నులు; 5 ఉత్తరప్రదేశ్ 666 టన్నులు; 6 మహారాష్ట్ర 301 టన్నులు; 7 జార్ఖండ్ 57,420 టన్నులు; 8 ఛత్తీస్‌గఢ్ 3,380 టన్నులు; 9 తెలంగాణ 15,731 టన్నులు; 10 కర్ణాటక 3,970 టన్నులు; 11 ఆంధ్రప్రదేశ్ 1,22,570 టన్నులు.

ఎం.తుమ్మలపల్లె ప్రాంతాల్లో బోరులోని నీళ్లల్లో కాలుష్యం గత కొన్ని సంవత్సరాలుగా విపరీతంగా పెరిగింది. బోరు నీళ్లల్లో 4000 పిపిబి (పార్ట్స్ పర్ బిలియన్) యురేనియం గాఢత ఉంది. ప్రమాణాల ప్రకారం యురేనియం గాఢత 60 పిపిబి ఉండాలి. అలాగే తాగునీటిలో అధిక క్షారత్వం ఉంది. మెగ్నీషియమ్, సల్ఫేటు, సోడియం పరిణామాలు ఎక్కువుగా ఉన్నాయి. ఈ ఘన పదార్థాలు (టిడిఎస్) నీటిలో సహజంగానే కరిగి ఉంటాయి. కాపర్, క్రోమియమ్, నికెల్ వంటి హెవీ మెటల్స్ సాధారణ పరిమాణం కన్నా ఎక్కువుగా ఉన్నాయి.

**పరిమాణం లీటరు నీళ్లకు గ్రాముల్లో**

| | పరిమితి | ఉన్నది |
|---|---|---|
| క్రోమియం | 0.05 | 0.10 |
| నికెల్ | 0.02 | 0.11 |
| టిడిఎస్ | 500 | 2,045 |
| సల్ఫేట్లు | 200 | 909 |
| అధిక క్షారత్వం | 200 | 604 |
| కాఠిన్యం | 200 | 292 |

(ఈనాడు పత్రిక సౌజన్యంతో)

తాగునీరు ఎక్కువగా కలుషితం అవ్వడం వల్ల ప్రజల ఆరోగ్యం దెబ్బతింది. జంతువులు సైతం ఈ కలుషిత నీటిని తాగకూడదు. ప్రజల్లో మూత్రపిండ వ్యాధుల సమస్యలతో పాటు నపుంసకత్వం వస్తుంది. అంతుతెలియని చర్మవ్యాధులు వ్యాపిస్తాయి. జలాల్లో అధిక క్షారత్వం వల్ల నేల గట్టిపడుతుంది. మొక్కలు మొలవవు. అధిక క్రోమియం వల్ల మొక్కల వేర్లు పోషకాలను సరిగా గ్రహించలేవు. మొత్తంగా పంట పొలాలు వ్యవసాయానికి పనికిరాకుండా పోతాయి. ఈ ప్రాంత కలుషితం పై ప్రముఖ పర్యావరణ వేత్త కె.బాబూరావు, స్థానిక ప్రజలు పలుమార్లు రాష్ట్ర కాలుష్య నియంత్రణ మండలికి లేఖలు రాశారు. దీంతో దిగివచ్చిన రాష్ట్ర ప్రభుత్వం స్వయంగా పరీక్షలు నిర్వహించి వాస్తవ విషయాలను తెలుసుకుంది. యురేనియం కార్పొరేషన్ క్షారయాన నిక్షాళన ప్రక్రియ (ఆల్కలైన్ లీచింగ్ మెథడ్) సరిగా చేయడం లేదని తేల్చింది.

స్థానికుల నుండి వ్యతిరేకత వస్తున్నా యుసిఐఎల్ లెక్కచేయలేదు. పైపెచ్చు యురేనియం వెలికితీతకు అదనంగా 2400 ఎకరాల భూమిని సేకరించే ప్రయత్నం చేసింది. తన రెండో ప్లాంటు కట్టడం కోసం ముమ్మర ప్రయత్నాలు చేసింది. ప్రజాభిప్రాయ సేకరణ వ్యతిరేకంగా రావడంతో తాత్కాలికంగా నిలిపివేయాల్సి వచ్చింది. 2013 నుండి యుసిఎల్ నిర్లక్ష్య ధోరణుల వల్ల రైతులు నష్టపోవడం ఎక్కువగా ప్రారంభమైంది. వ్యర్థాలు ఏకంగా పంటపొలాల్లోకి రావడంతో పంట నష్టపోయింది. యురేనియాన్ని తరలించే పైపుల లీకేజీ వల్ల వ్యర్థాలు పొలాల్లోకి రావడం ప్రారంభమయ్యాయి. ఆ వ్యర్థాలు నీటిలో కలవడం వల్ల, వాటిని తాగడంతో గొర్రెలు, మేకలు వింత జబ్బులకు గురయ్యాయి. కొన్ని చనిపోయాయి. 2017 నాటికి యురేనియం వ్యర్థాల వల్ల పంట పొలాలు వ్యవసాయానికి పనికిరాకుండా పోయాయి. దాంతో ప్రజలకు యురేనియం తవ్వకాల వల్ల వచ్చే అనర్థం స్పష్టంగా అర్థమైంది.

సమాజం అభివృద్ధి పేరుతో కేంద్ర ప్రభుత్వం ప్రకృతిని విధ్వంసం చేస్తోంది. దీనివల్ల అన్నిరకాల కాలుష్యాలు పెరుగుతున్నాయి. ముడి సరుకును తరలించడానికి మార్కెట్ శక్తులు ప్రయత్నిస్తున్నాయి. ఈ ముడిసరుకు చౌకగా శ్రమ దొరికేచోటుకి తరలించబడుతుంది. తద్వారా ఇది ప్రపంచ వ్యాప్తంగా మార్కెట్ చేయబడుతుంది. యురేనియం ప్రపంచంలోని అతి తక్కువ దేశాలలో నిల్వ ఉంది. అందులో భారతదేశం ఒకటి. ప్రకృతిలో 92 మూలకాలు ఉన్నాయి. ఇవి భూమి గర్భంలోకి వెళ్లడానికి లక్షల సంవత్సరాలు పడుతుంది. అందులో యురేనియం కూడా ఒకటి. యురేనియం గట్టి నేల, రాతి నేలల్లో, కొండ, అటవీ ప్రాంతాలుగా ఉంటాయి. ఇక్కడే ఆదివాసులు వేల సంవత్సరాలుగా అడవిని నమ్ముకుని జీవిస్తున్నారు. వీరే అనాదిగా అడవిని కాపాడుతూ వస్తున్నారు. యురేనియం భూమి నుండి బయటకు రాగానే గాలిలోని ఆక్సిజన్ కలవడంతో ఆక్సైడ్‌గా మారుతుంది. దీని సాంద్రత ఎక్కువగా ఉంటుంది. సీసం కంటే 75 శాతం అధిక సాంద్రతను కలిగి ఉంటుంది. దీన్ని అణు రియాక్టర్లలో ఇంధనంగా వాడతారు. 7 కిలోల యురేనియంతో ఒక అణు బాంబును తయారు చేయవచ్చు. వానల వల్ల బయట ఉన్న యురేనియం భూమిలోకి ఇంకుతుంది. యురేనియాన్ని భూమి నుండి తవ్వుతున్నారు. యురేనియం ప్రాసెసింగ్‌లో దుమ్ము, ధూళి ఏర్పడుతుంది. ఇందులో కంటికి కనిపించని బి కిరణాలు ఉంటాయి. ఇవి గాలి, నీరు, ఆహారాన్ని కలుషితం చేస్తాయి. యురేనియాన్ని ఎక్కువగా అణుబాంబు తయారీకి వాడతారు. తర్వాత విద్యుత్ ఉత్పత్తి కోసం వాడతారు. అతి తక్కువ పరిమాణంలో ఉపగ్రహాలను రోదసిలోకి పంపడానికి వాడతారు. యురేనియం వ్యర్థ పదార్థాలు సుమారు 90 వేల సంవత్సరాల వరకు అలాగే ఉండిపోతాయి. ఇవి ఉన్న చోట ప్రకృతి, మనిషి తమ ఉనికిని క్రమంగా కోల్పోవాల్సి వస్తుంది. 1984లో రష్యాలోని చెర్నోబిల్‌లో అణుధార్మికత వల్ల లక్షల మంది చనిపోయారు. ఇప్పటికీ ఆ ప్రాంతంలో పచ్చగడ్డి కూడా మొలవడం లేదు. 2011లో జపాన్‌లోని ఫుకుషిమా అణుకేంద్రం వెలువరించిన అణుధార్మికత వల్ల లక్షల మంది చనిపోయారు. అందుకే వాళ్లు అణు విద్యుత్ ఉత్పత్తిని ఆపేశారు. అమెరికా, జర్మనీ, ఫ్రాన్స్, కెనడా, ఇంగ్లాండ్, జపాన్ లాంటి దేశాల్లో యురేనియం పరిశ్రమకు వ్యతిరేకంగా ప్రజా ఆందోళనలు వెల్లువెత్తాయి.

యురేనియం తవ్వకాల వల్ల వాతావరణ ఉష్ణోగ్రత విపరీతంగా పెరుగుతుంది. 1970లోనే అణు విద్యుత్ కేంద్రాలకు యంత్ర సామాగ్రిని సరఫరా చేసే కార్పొరేట్ సంస్థ ప్రపంచవ్యాప్తంగా 1000 విద్యుత్ కేంద్రాలను 2020లోగా ఏర్పాటు చేయాలని ప్రయత్నించాయి. ఇప్పటికీ ప్రపంచవ్యాప్తంగా ఉన్న అణు విద్యుత్ కేంద్రాలు కేవలం 450 మాత్రమే. దీన్నిబట్టే యురేనియం తవ్వకాలకు చాలా దేశాలు విముఖత చూపిస్తున్నాయని అర్థమవుతోంది.

దేశంలో యురేనియం తవ్వకాలను కేంద్ర ప్రభుత్వమే పర్యవేక్షిస్తుంది. అణువిద్యుత్ శాఖ యురేనియం తవ్వకాలకు అనుమతిని ఇస్తుంది. యురేనియం కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ ఆధ్వర్యంలో యురేనియం తవ్వకాల నియంత్రణ ఉంటుంది. రాష్ట్రాలలో జరిగే తవ్వకాలకు రాష్ట్ర ప్రభుత్వం కూడా అనుమతులు ఇవ్వాల్సి ఉంటుంది. మే 22న తెలంగాణలో యురేనియం తవ్వకాలకు కేంద్ర అటవీ పర్యావరణ మంత్రిత్వ శాఖ సలహా మండలి అనుమతులు ఇచ్చినట్టు వార్తలు వచ్చాయి. నాగర్‌కర్నూలు జిల్లా, అమ్రాబాద్ పులుల అభయారణ్యంలో, అమ్రాబాద్, ఉడిమల్ల, నారాయణపూర్ ప్రాంతాల్లో ఉన్న యురేనియం నిక్షేపాలు వెలికితీసే ఆలోచనలో కేంద్ర ప్రభుత్వం ఉంది. దేశవ్యాప్తంగా 13 యురేనియం ప్రాజెక్టులను కేంద్రం మంజూరు చేసింది. వీటి కోసం 10,300 కోట్ల పెట్టుబడిని కేంద్రం పెట్టబోతోంది. అండర్‌గ్రౌండ్ మైనింగ్ ఎల్లోప్లేట్ల రూపంలో యురేనియం వెలికి తీయాలని కేంద్రం భావిస్తోంది. కేంద్ర ప్రభుత్వం పర్యావరణ అనుమతిని జారీ చేసింది. తెలంగాణలో 20 వేల ఎకరాల్లో తవ్వకాలను జరపాలని కేంద్రం భావిస్తోంది. ఇది లక్ష ఎకరాలకు విస్తరిస్తుందని మేధావులు అభిప్రాయ పడుతున్నారు. దీనివల్ల 48 గ్రామాలు తమ నైసర్గిక రూపాన్ని కోల్పోతాయి. 80 వేల మంది ప్రజలు నిరాశ్రయులవుతారు.

నల్లమలలో 22 పులులు, 100 చిరుతపులులు, 70 రకాల స్తన్య జంతువులు, 60 రకాల సరీసృపాలు, 700 రకాల వృక్షజాతులు, 350 రకాల పక్షులు ఉన్నట్లు పర్యావరణ వేత్తలు అంచనా వేశారు. 2003లో ప్రజా వ్యతిరేకతను దృష్టిలో పెట్టుకుని అప్పటి ప్రభుత్వం యురేనియం తవ్వకాలను తాత్కాలికంగా నిలిపివేసింది. యురేనియం శుద్ధికి కృష్ణానది నీటిని వాడతారని ప్రచారం జరుగుతోంది. అందువల్ల వ్యర్థాలు కృష్ణానదిలో కలిసే ప్రమాదముంది.

యురేనియం తవ్వకాల్లో భాగంగా 4 వేల చోట్ల బోర్లు వెయ్యాలని కార్పొరేషన్ భావిస్తోంది. ఒక్కో బోరు 1000 అడుగుల పైన ఉంటుంది. దీనివల్ల 1000 అడుగుల లోతుకు నీటి మట్టం పడిపోతుంది.

# దేశ ఆరోగ్య స్థితి - మోడీ ఫిట్ నినాదం

***ఒకవైపు దేశంలో పిల్లలు పోషకాహార లోపంతో, మహిళలు రక్తహీనతతో బాధపడుతుంటే వాటి నుండి ప్రజల దృష్టి మళ్లించడానికే మోడీ ఫిట్ ఇండియా నినాదం ఎత్తుకున్నాడని అంటున్నారు* సతీష్ బైరెడ్డి**

గత ఆగస్టు 29న హాకీ క్రీడాకారుడు అయిన ధ్యాన్ చంద్ జన్మదినం సందర్భంగా ప్రతి సంవత్సరం జరిగే విధంగా కాకుండా కొత్త నినాదం, ప్రచారంతో దేశమంతా చర్చనీయాంశంగా 'ఫిట్ ఇండియా' అనే ఆకర్షణీయ పదబంధాన్ని ప్రధాని మోడీ పరిచయం చేశాడు. ప్రతి పౌరుడు శారీరక, మానసిక దారుఢ్యంతో ఆరోగ్యంగా ఉంటూ దేశ ప్రగతికి పాటుపడాలని పిలుపునిచ్చాడు. ఉత్పత్తి ప్రక్రియలో ఉండే వారంతా శారీరక పరిపుష్టితో ఉంటేనే సమాజ పురోగతి సాధ్యమవుతుంది. ఆరోగ్యవంతులు సమాజ వికాసానికి చోదకులు. అలాంటి ఆరోగ్యం, అభివృద్ధి కోసం ప్రతి పౌరుడు శారీరక వ్యాయామాన్ని అలవాటు చేసుకోవాలని జీవితంలో భాగం చేసుకోవాలని ప్రధాని దేశ ప్రజలందరికీ పిలుపునిచ్చాడు.

ప్రతి పాఠశాలలో విధిగా వ్యాయామం, క్రీడలు నేర్పించాలని దానికోసం భారత ఒలింపిక్ అసోసియేషన్, క్రీడా మంత్రిత్వ శాఖ కృషి చేస్తుందని ప్రకటించాడు. ప్రతి పౌరుడు తనే కాకుండా తన ఇంట్లో వాళ్లకు కూడా చేయిస్తానని ప్రతిజ్ఞను కూడా చేయమని ఉద్బోధించాడు. ఆరోగ్యకరమైన సమాజ నిర్మాణం జరగాలంటే అనివార్యంగా ఇలాంటి కార్యక్రమాలు ఉండాల్సిందే. నిజానికి జూన్ 21న అంతర్జాతీయ యోగా దినం పాటిస్తూనే ఉన్నారు. యోగాతో సర్వరోగ నివారణ అనే ప్రచారాలు చాలా కాలంగా నడుస్తూనే ఉన్నాయి. సడెన్‌గా ఫిట్ ఇండియా ఎందుకు వచ్చింది అనేది కూడా ఆలోచించాల్సిందే!

ఆకర్షణీయమైన నినాదాలు పదబంధాలు సృష్టించడంలో మోడీ అందెవేసిన చెయ్యి! ఫిట్ ఇండియా నినాదం రాగానే ప్రధాన స్రవంతి మీడియా, ప్రత్యేకించి సామాజిక మాధ్యమాల్లో ఆర్థిక వ్యవస్థను 'ఫట్' చేసి పౌరులను ఫిట్‌గా ఉండమని కోరడం ఏమిటి అనే ప్రశ్నలు బాగానే వినపడ్డాయి. జీవనశైలికి సంబంధించిన జబ్బులు ప్రజారోగ్యాన్ని దెబ్బతీస్తూ వారి ఆర్థిక స్థితిని కూడా ఛిద్రం చేస్తున్నాయని వైద్య రంగం ఎప్పటినుండో మొత్తుకుంటూనే ఉంది. దేశ ఆర్థిక వ్యవస్థ ఆరోగ్యాన్ని జబ్బున పడేసి పౌరుల ఆరోగ్యం గురించి ప్రధాని పదేపదే మాట్లాడుతున్నాడు. దేశంలో స్త్రీలపై అత్యాచారాలు పెరిగిపోతున్న సమయంలో ప్రత్యేకించి తమ పార్టీ ఎంపిలు ఎంఎల్ఏలే అలాంటి కేసుల్లో దోషులుగా నిలబడిన నేపథ్యంలో బేటి బచావో బేటి పడావో నినాదాన్ని ముందుకు తీసుకువచ్చారు. దేశ వ్యాప్తంగా అనేక చోట్ల మైనారిటీలు దళితులపై దాడులు జరిగిన సందర్భంలో సబ్కా సాత్ సబ్కా వికాస్ ఈ మధ్య దానికి సబ్కా విశ్వాస్ అని మరొకటి కూడా తగిలించారు. ఒకే దేశం, ఒకే ఎన్నిక, ఒకే చట్టం, ఒకే పన్ను లాంటి వాటితో పాటు ఒకే భాష ఉండాలనే వాదాన్ని జాతీయవాదం, దేశభక్తి,

---

రాజ్యాంగంలోని ఆర్టికల్ 48ఎ ప్రకారం అడువులను, జంతువులను కాపాడాల్సిన బాధ్యత ప్రభుత్వానిదే. రాజ్యాంగ ఉల్లంఘనకు ప్రభుత్వం పాల్పడుతోంది. దేశీయంగా అడవులు భౌగోళిక విస్తీర్ణంలో 33 శాతం ఉండాలి. తాజా అటవీ నివేదిక 2013 ప్రకారం 21 శాతం మాత్రమే ఉన్నాయి. దీనివల్ల వర్షాభావ పరిస్థితులు ఏర్పడుతున్నాయి. డిబీర్స్ అనే కార్పొరేట్ సంస్థ ఇప్పటికే 430 బోర్లు వేసింది. బిజెపి ప్రభుత్వం ఈ బహుళజాతి సంస్థతో ఒప్పందం చేసుకుంది. అందుకే యురేనియం తవ్వకాలను రహస్యంగా జరపడానికి ప్రయత్నాలు చేసింది. విచ్చలవిడి బోర్లు వేస్తున్న డిబీర్స్ సంస్థ బోర్ల వాహనాలను ప్రజలు తనిఖీ చేయడంవల్లే అసలు విషయం బయటపడింది. భారత్ 16 దేశాలతో అణు ఒప్పందాలు చేసుకుంది. అణు రియాక్టర్ల దిగుమతికి సులభమైన మార్గదర్శకాలను రూపొందించుకుంది. కార్పొరేట్ కంపెనీల అణువిద్యుత్ ఉత్పత్తిలో భాగంగా అనర్థాలు జరిగితే, సదరు కంపెనీకి ఎటువంటి బాధ్యత లేనివిధంగా ఒప్పందాలు ఉన్నాయి. భారత్ తన ప్రజలవైపా, బహుళజాతి సంస్థల ప్రయోజనాల కోసమా అని సామాన్యుడు ప్రశ్నిస్తున్నాడు.

2015 పారిస్ ఒప్పందం ప్రకారం భారత్ పర్యావరణ కాలుష్యాన్ని తగ్గించాలి. కాని భారత్ స్వదేశంలో భిన్నంగా నడుచుకుంటోంది. జార్ఖండ్‌లోని జాదూగూడ ప్రాంతంలో యురేనియం వెలికితీత వల్ల పంట పొలాలు దేనికి పనికిరాకుండా పోయాయి. ప్రజలు క్యాన్సర్ బారిన పడుతున్నారు. పిల్లలు వికృతంగా పుడుతున్నారు. 60 శాతం ప్రజలు 55 సంవత్సరాల లోపే చనిపోయారు. భారతదేశానికి నల్లమల అమెజాన్ వంటిది. ప్రపంచంలో అతిపెద్దదైన అమెజాన్ కాలిపోతుంటే ప్రతి ఒక్కరు బాధపడుతున్నారు. అదే నల్లమల కనుమరుగై పోతుంటే ప్రజల్లో రావలసిన చైతన్యం రావడం లేదు. నల్లమల రెండు తెలుగు రాష్ట్రాల్లో నాగర్ కర్నూల్, నల్లగొండ, కర్నూలు, ప్రకాశం, గుంటూరు జిల్లాల్లో 2 లక్షల 75 వేల హెక్టార్లలో విస్తరించి ఉంది. జీవవైవిధ్యాన్ని కాపాడాలంటే నల్లమలను కాపాడుకోవాలి. అణు విద్యుత్‌ను నిలిపివేసి, ప్రత్యామ్నాయ మార్గాల ద్వారా విద్యుత్ ఉత్పత్తిని ప్రభుత్వం పెంచాలి. భారత్ విదేశాలతో చేసుకున్న అణు ఒప్పందాలను వెంటనే రద్దు చేసుకోవాలి. ప్రజా ఆందోళనల నేపథ్యంలోనే యురేనియం తవ్వకాల నిలిపివేత జరుగుతుంది.

*(రచయిత పౌరహక్కుల సంఘం సభ్యులు)* వీ

దేశసమగ్రత ముసుగులో ముందుకు తెస్తున్నారు. దేశంలోని సకల సహజ సంపదలను విదేశీ కంపెనీలకు అప్పనంగా అప్పగించి మార్కెట్ గేట్లు బార్లా తీసి మేకిన్ ఇండియా అని ఎత్తుకొన్న నినాదమూ ఆ కోవలోనిదే.

దేశంలో ఏదో ఒక ప్రజా సమస్య ముందుకు వచ్చినప్పుడల్లా అది ప్రక్కకు పోయేలా, ప్రజల దృష్టి మరల్చేలా ఏదో ఒక నినాదాయుధాన్ని వదలడం మీడియా వంత పాడడం నేటి ప్రభుత్వానికి పరిపాటి అయ్యింది. నోట్ బందీ పేరుతో పెద్ద నోట్ల రద్దుతో దేశ ఆర్థిక రంగం ప్రత్యేకించి అసంఘటిత రంగం ఎంతగా కుదేలైంది ఎన్ని లక్షల మంది ఉపాధిని కోల్పోయారు అనేది వర్తమానానికి మరింత దూరం అయినదేమి కాదు. ఒక వైఫల్యాన్ని కప్పిపుచ్చి మరుగునపరిచేందుకు ఏదో ఒక సెంటిమెంట్ ను రగిలించడం మోడీ ప్రభుత్వానికి అలవాటుగా మారిపోయింది.

ఫిట్ ఇండియా నినాదంలో రాజకీయాలు, సిద్ధాంత రాద్ధాంతాలు ఏమి ఉంటాయి? అవును అందరూ ఆమోదించాల్సినదే, ఆచరించాల్సినదే కదా! గత కొన్ని దశాబ్దాలుగా మరీ ముఖ్యంగా నూతన ఆర్థిక విధానాలు విజృంభించిన ఆధునిక నాగరికత నేపథ్యంలో శ్రమకు దూరమైన ఓ కొత్త లోకం నిర్మితమవుతూ వస్తున్నది. ఈ లోకం 'మేధో శ్రమ' తప్ప కాలికి మట్టి అంటని, ఒంటికి చమట పట్టని మృదువైన ఉపాధి రంగంలో నిమగ్నమైంది. అసలు భౌతిక శ్రమ, మేధో శ్రమ వేరనుకునే మేధో శ్రమ గొప్ప అనుకునే ఈ వర్గానికి భౌతిక శ్రమ నామోషి అయ్యి, ప్రపంచీకరణ అందించిన అనేక ఆహార రూపాల ఆస్వాదనలో జీవనశైలి రుగ్మతలు ఆరోగ్యాన్ని చెదలు పట్టిస్తున్నాయి. కంప్యూటర్ తెర మీద కళ్లు పెట్టి కీబోర్డుపై వేళ్లు పెట్టి షేర్ల జూదమాడే ఈ వర్గాలకు కాళ్లు ఒళ్లు కూడా కదిలించకుండా నోటికి పని చెప్పి యాజమాన్య వర్గాలకు ఈ ఫిట్‌నెస్ అవసరమయ్యింది. ఆరుగాలం వొళ్లు వంచే కర్షకులకు, కార్ఖానాలో కష్టపడే కార్మిక జీవికి ఈ అవసరం ఇప్పటివరకు పెద్దగా రాలేదు. ప్రపంచీకరణ తెచ్చిన యాంత్రీకరణ పరాయీకరణ వల్ల వారు జీవన శైలీ రుగ్మతలకు బాధితులు అవుతున్నారు. రోజూ వ్యాయామం క్రీడలు మాత్రమే సంపూర్ణ ఆరోగ్యాన్ని ఇస్తాయా? సరైన పోషకాహారం మాటేమిటి? పోషకాహారం ఇంటిల్లిపాదికి అందిపుచ్చుకునే కుటుంబ ఆర్థిక వ్యవస్థ పరిస్థితి ఏమిటి? ఆ స్థితిని కలిగించే వ్యవస్థీకృత ప్రయత్నాలు ఎక్కడ ఉన్నాయి? ఈ దేశంలో ఇప్పటికీ 37.4 శాతం మంది పిల్లలు పోషకాహార లోపంతో శారీరక ఎదుగుదల లేకుండానే పెద్దవాళ్లు అవుతున్నారు! 40 శాతానికిపైగా గ్రామీణ మహిళలు రక్తహీనతకు గురవుతున్నారు. జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే ప్రకారం 18 శాతం పిల్లలు తక్కువ బరువుతో పుడుతున్నారు. ది లాన్సెట్‌లో ప్రచురితమైన "గ్లోబల్ బర్డెన్ ఆఫ్ డిసీస్ స్టడీ" 1999- 2017 అధ్యయనం ప్రకారం పోషన్ అభియాన్ లేదా జాతీయ పౌష్టికాహార లక్ష్యం 10 కోట్ల మందికి పౌష్టికాహారం అందించే లక్ష్యంతో ప్రారంభించబడినప్పటికీ 2022 వచ్చేటప్పటికి దేశంలో ఎదుగుదల లేమిని 25 శాతంకి తగ్గించాలనుకున్నా అది 34.61 శాతం ఉంటుందని, అట్లాగే తక్కువ బరువు శిశువుల శాతాన్ని 22.7కి తగ్గించాలని అనుకున్నప్పటికి అది 27.5 శాతం ఉంటుందని, పుట్టినప్పుడే తక్కువ బరువు ఉండే శిశువులను 11.4 శాతంకు తగ్గించాలని లక్ష్యంగా పెట్టుకున్నా 20.3 శాతం, రక్తహీనత కలిగిన పిల్లలు 44.7 శాతం నుండి 56.4 శాతం, 49 ఏళ్ల మధ్య వయసు ఉన్న మహిళల్లో రక్తహీనత 39.4 శాతం నుండి 50. 32 శాతం పెరుగుతాయని తన అధ్యయనం ద్వారా అంచనా వేసింది.

మరోవైపు అమలవుతున్న అభివృద్ధి నమూనాతో ధ్వంసమవుతున్న పర్యావరణం ఫలితంగా ఏర్పడే దుష్పరిణామాలను సాధారణ ప్రజలే అనుభవించాల్సి వస్తుంది. దానిలో కూడా సామాజిక వర్గాల వారిగా ఆర్థిక స్థితిగతుల పరంగానూ నిమ్న వర్గాలు మరింత అనారోగ్యానికి గురయ్యే ప్రమాదం ఇవ్వాల నెలకొని ఉన్నది. ఆదివాసీల కైతే సాధారణ వైద్యం కూడ అందని ద్రాక్షగానే మిగిలిపోయింది. మరోవైపు పెరిగిపోతున్న ఆర్థిక అసమానతలు, ఉపాధి లేమీ, ఉన్న ఉపాధిలో కూడా భద్రత లేమి అన్నీ వెంటాడుతూ ఉంటే, మరోవైపు ఉద్యోగాలు రాక అభద్రతలో భవిష్యత్తు పట్ల తీవ్ర ఆందోళనలో ఉన్న యువత ఎంతో మానసిక సంక్షోభానికి గురవుతున్నది. కార్మిక చట్టాలను నిర్వీర్యం చేస్తూ కార్పొరేట్‌కు దాసోహం అవుతున్న కాలంలో నిత్యం ఒత్తిడికి లోనవుతూ ఫిట్‌గా ఎలా ఉంటారు? లాభాలే తప్ప కనీస భద్రతా ప్రమాణాలు పాటించని, పని ప్రదేశంలో ప్రత్యేకించి మహిళలు ఎదుర్కొంటున్న ఆరోగ్య సమస్యలు అంతాఇంతా కావు. వాటికి తోడు అసంఘటిత రంగంలో మహిళలు ఎదుర్కొంటున్న అనేక వేధింపులు హింసాయుత పరిస్థితులలో 'ఫిట్'గా ఎలా ఉండగలరు? ఫిట్‌గా ఉండడం అనేది కేవలం ఒక భౌతిక వ్యాయామ చర్యల ఫలితంగా మాత్రమే సాధ్యం అయ్యేది కాదు. అది ఒక సాంస్కృతిక పరమైన అంశం కూడా! అసహన పూరిత, ఆధిపత్య వాతావరణంలో మనుషులు ఫిట్‌గా ఉండి దేన్నయినా ఎదుర్కొనే స్థితిని పొందాలనుకోవడం భ్రమ మాత్రమే. ఫిట్ ఇండియా నేపథ్యంలోని పాఠశాలల్లో క్రీడా వాతావరణ పెంపుకై క్రీడా సామాగ్రి అందిస్తామని చెబుతున్నది ప్రభుత్వం.

ఇవాళ దేశంలో సంపన్న కుటుంబాల నుంచి వచ్చిన కొద్ది మంది మాత్రమే క్రీడల్లో అంతర్జాతీయంగా రాణించగలుగుతారు. ప్రపంచ స్థాయి విజయాల తర్వాత ప్రశంసలు, ప్రోత్సాహకాలు ప్రయోజితాలు తప్ప ప్రపంచ స్థాయికి ఎదగడానికి కావాల్సిన పరిస్థితిని ప్రభుత్వం ఎక్కడ సృష్టిస్తున్నది? గ్రామీణ ప్రాంతాల క్రీడా రంగం గురించి ఎంత తక్కువ చెప్పుకుంటే అంత మంచిది. ఏదో ఒక మారుమూల ప్రాంతం నుంచి సొంత కష్టంతో పైకి వచ్చిన క్రీడాకారులకు, పట్టణ ఉన్నత కుటుంబాల నుండి వచ్చిన వారికి లభించినంతటి ఆర్థిక తోడ్పాటు అసలు అందడం లేదు. పాఠశాలల్లో మొక్కుబడిగా వ్యాయామ, క్రీడా తరగతులు నిర్వహిస్తారు అనేది కాదనలేని వాస్తవం. కళాశాల విశ్వవిద్యాలయాల స్థాయిలో అయితే కనీస వ్యాయామ అధ్యాపకులను కూడా నియమించే పరిస్థితుల్లో ప్రభుత్వాలు లేవు. సగానికిపైగా విద్యా క్షేత్రాన్ని ఆక్రమించిన ప్రైవేటు విద్యాసంస్థల్లో అయితే ఆట స్థలాలు అంటే ఏమిటో కూడా తెలియదు! మార్కులు, ర్యాంకుల లోకాన్ని సృష్టించిన మార్కెట్ ప్రపంచంలో ప్యాకేజ్ ఉద్యోగాలే తప్ప ఫిట్నెస్ జీవితాలకు విలువ ఎక్కడుంది. వస్తు ప్రపంచంలో ప్రస్తుత ప్రపంచంలో, వినియోగదారు సంస్కృతి విచ్చలవిడిగా పెరిగిన మార్కెట్ మాయాజాలంలో ఆకర్షణీయమైన వస్తువులన్నీ ఇంటి నిండా నింపుకునే ఆర్థిక ఫిట్నెస్ కంటే, ఏటికి ఎదురీదే వెయ్యి తుఫానులు ముసిరినా నిబ్బరంగా నిలబడి మనిషిని మనిషిగా నిలబెట్టే ఫిట్నెస్ సంపాదించు కోవలసిన చారిత్రక అనివార్య సన్నివేశంలో మనిషున్నాడు.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

# మోడీ-2 : విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి

***పాలకులు అభివృద్ధి పేరుతో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు మార్కెట్‌ను బార్లా తెరిచి, స్థానిక చిన్న, మధ్యతరహా సంస్థలు దివాలాతీసి, లక్షల మంది ఉపాధి కోల్పోవడానికి కారణమవుతున్నారని అంటున్నారు* బి.ఎస్.రాజు**

మోడీ-2 ప్రభుత్వ ఆర్థిక మంత్రి, పార్లమెంట్‌లో 2019-20 వార్షిక బడ్జెట్ ప్రవేశపెట్టిన నాటి నుండి వరుస పిల్లిమొగ్గలు వేస్తూనే ఉన్నారు. మోడీ-1 ప్రభుత్వం చేసిన ఆర్థిక పొరపాట్ల, ప్రజా వెన్నుపోట్ల వరదలో ఇప్పటి ఆర్థిక మంత్రి చిక్కుకుని, కానరాని తీరానికి కొట్టుకు పోతున్నారా? అనే సందేహం ఎవరికైనా కలగక మానదు. ఈ పిల్లి మొగ్గల్లో ఓ పెద్ద మొగ్గ, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు (ఎఫ్‌డిఐ) గేట్లను నూటికి నూరు శాతం బార్లా తెరవడం. స్వతంత్రం తెచ్చుకున్న నాటినుండి (అది ఎటువంటిదైనా) గత ప్రభుత్వాలు కొద్ది కొద్దిగా, బెరుకు బెరుగ్గా విదేశీ పెట్టుబడులకు ద్వారాలు తెరుస్తూ వచ్చారు. 1991 తరువాత, సంస్కరణల పేరిట విదేశీ పెట్టుబడికి దేశాన్ని కుదువ బెట్టడం మరింతగా పెరిగి, మన దాసోహపు ఆర్థిక వ్యవస్థను జి.డి.పి ఎదుగుదల అనే అంకెల గారడీతో పాలకులు కప్పిపుచ్చుకుంటూ వస్తున్నారు.

ఎఫ్‌డిఐ ప్రవాహం దేశంలో ఎంత పెరిగితే అంత గొప్ప అభివృద్ధి సాధించినట్టు, దేశం అభివృద్ధి పథంలో దూసుకు వెడుతున్నట్లు రాజకీయ నాయకులూ, ఆర్థికవేత్తలూ ప్రజలను మభ్యపెడుతూనే ఉన్నారు. ఈ అప్పుల కుప్పలను పసిడి రాసులుగా, ఘన విజయాలుగా ఇపుడు మోడీ భాజా-భజంత్రీ మేళం బాకా ఊదుతూ రాజకీయ గారడీ చేస్తున్నది. 2014 నుండి మోడీ ప్రభుత్వం సాధించిన ఘన విజయాల చిట్టాలో ఎఫ్‌డిఐ పెట్టుబడుల వెల్లువ ఒకటని టముకు వేసుకుంటున్నారు. ఈ విజయ పథానికి ఉదాహరణగా చైనాను మన ముందు నిలబెడతారు. చైనా ప్రజలు ఏమి కోల్పోయారో చెప్పకుండా దాచిపెట్టి; చైనా ప్రభుత్వ, చైనా కమ్యూనిస్టు పార్టీ దొంగల ముఠా దోపిడీ విజయాలను ఇండియా కూడా ఆచరించదగ్గ అద్భుత మార్గంగా, మన ఆర్థిక పరమైన జబ్బులన్నిటికీ విరుగుడుగా, మంత్ర దండంగా చూపిస్తారు.

అసలు విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల చొరబాటు లేక ఆ పెట్టుబడికి ప్రభుత్వాల ఆహ్వానం మన దేశానికి మేలు చేస్తుందా? కీడు చేస్తుందా? ఇటువంటి పెట్టుబడులు దేశ ఆర్థిక వ్యవస్థకు బలాన్ని చేకూరుస్తాయా? లేక బలహీన పరుస్తాయా? దేశంలో 'ఎఫ్‌డిఐ' పెట్టుబడుల వెల్లువ దేశ పురోగతని తెలియచేస్తుందా? అధోగతిని తెలియచేస్తుందా? ఇది స్వతంత్ర ఆర్థిక వ్యవస్థ బలపడడానికి చిహ్నమా? లేక ఆర్థిక బానిసత్వానికి, ఆర్థిక పతనానికి సంకేతమా? ఈ ప్రశ్నలకు సమాధానాలు ఆర్థిక వేత్తల వ్యాఖ్యానాలతో పని లేకుండానే, ఇప్పుడు మన కళ్లముందే అనుదినం, అనుక్షణం వికృత నృత్యం చేస్తూనే ఉన్నాయి. అసలు విదేశీ పెట్టుబడితోనే మన దేశ ఆర్థిక వ్యవస్థకు పూచిన పువ్వు ఎందుకని ఎప్పుడూ వాడిపోయే ఉంటుంది?

ఇక 'విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి' విషయానికొస్తే, ఇది ఒక దేశం నుండి మరో దేశానికి తన వ్యాపార విస్తరణకై ప్రవేశిస్తుంది. కొత్త వ్యాపార నిమిత్తమై లేదా కొత్త పరిశ్రమ స్థాపనకై, లేక ఇక్కడ ఇప్పటికే నడుస్తున్న వ్యాపారంలోనో, పరిశ్రమలోనో భాగస్వామిగా అది ప్రవేశిస్తుంది. ఈ పెట్టుబడికి దాన, దయాగుణాలేమీ ఉండవు. కేవలం లాభార్జనకే, మార్కెట్ వాటాకోసమే అది ప్రవేశిస్తుంది తప్ప దానికి ఏ ఇతర ఆశయాలు ఉండవు. అయితే మన ప్రభుత్వాలు చెబుతున్నది ఏమంటే.. ఎఫ్‌డిఐని దేశంలోకి ఎంతగా అనుమతిస్తే అంతగా మన ఆర్థిక వ్యవస్థకు మేలు జరుగుతుందని, ఉత్పత్తి విస్తరించడమేగాక, ఉద్యోగ కల్పన, సాంకేతిక జ్ఞానం, నైపుణ్యాలు మెరుగవుతాయని, ఇవన్నీ మనకు లాభదాయకమనీ వాదిస్తూ ఉంటాయి.

ఈ వాదనలు నమ్మాలంటే ముందుగా మనం, అంటే మన దేశ ప్రజలు ఒక పచ్చి అబద్ధాన్ని నిజంగా స్వీకరించాలి. కళ్లకు గంతలు కట్టుకుని, ఆలోచించడం మానెయ్యాలి. మోడీ మూఢ భక్త గణంలో చేరిపోవాలి. అలా కాదంటే, అలా కుదరదంటే మనం ప్రశ్నల గోదాలోకి దిగాల్సిందే! కుస్తీ పట్టాల్సిందే!. ఈ విదేశీ పెట్టుబడులు, అవి ఏవైనా, ప్రత్యక్ష పెట్టుబడైనా, పరోక్ష పెట్టుబడైనా, అప్పైనా, సోప్పైనా- అదంతా నకిలీ అని, డొల్లనీ, మోసపూరితమనీ, మన దేశ ఆర్థిక వ్యవస్థకు, అంతిమంగా దేశ ప్రజలకు నష్టదాయకమని, ఇది దేశభక్తి కాదని, దేశద్రోహమని నిరూపించాలి.

విదేశీ పెట్టుబడులు ప్రధానంగా రెండు రూపాల్లో వస్తాయి, ఒకటి- విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి (ఎఫ్‌డిఐ) రూపంలో, రెండు- పోర్ట్‌ఫోలియో పెట్టుబడుల రూపంలో. ఈ రెండో రకం పెట్టుబడులు తిరిగి మూడు రకాలుగా ఉంటాయి. ఒకటి- విదేశీ వ్యవస్థాగత పెట్టుబడులు (ఎఫ్.ఐ.ఐ), రెండు- జిడిఆర్ (గ్లోబల్ డిపాజిటరీ రిసీట్స్), ఏడిఆర్ (అమెరికన్ డిపాజిటరీ రిసీట్స్), మూడు: విదేశాల్లో నివసించే భారతీయుల పెట్టుబడులు. ఇవికాక విదేశాలు ఇచ్చే వడ్డీతో కూడుకున్న రుణాలు, విదేశీ సహాయం. ఇవి విదేశీ రుణాల ఖాతాలోకి వస్తాయి.

బొగ్గు గనుల తవ్వకం, ఒప్పంద తయారీ (కాంట్రాక్టు మాన్యుఫాక్చరింగ్), ఒకే బ్రాండ్ చిల్లర వర్తకం(సింగిల్ బ్రాండ్ రిటైల్ ట్రేడింగ్) వంటి రంగాలకు సంబంధించి ప్రభుత్వం ఇటీవల విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను (ఎఫ్‌డిఐ) సడలిస్తూ తీసుకున్న నిర్ణయం తెలిసిందే! కేంద్ర ప్రభుత్వ వాణిజ్య, పరిశ్రమల మంత్రిత్వ శాఖకు చెందిన 'పారిశ్రామిక ప్రోత్సాహక, అంతర్గత వర్తక విభాగం (డి.పి.ఐ.ఐ.టి.)' ఈ ప్రభుత్వ పాలసీ అమల్లోకి వచ్చినట్లు అధికారికంగా ప్రకటన విడుదల చేసింది. డిజిటల్ మీడియాలో 26 శాతం ఎఫ్‌డిఐని అనుమతిస్తున్నట్లు కూడా ఈ ప్రకటనలో తెలిపింది.

మన దేశంలో ఇప్పుడు ఎఫ్‌డిఐ పెట్టుబడులు రెండు మార్గాల్లో అనుమతిస్తారు. ఒకటి ప్రభుత్వ ప్రమేయంలేని మార్గం(ఆటోమాటిక్ రూట్). రెండు ప్రభుత్వ ప్రమేయ మార్గం. ఆటోమేటిక్ రూట్‌లో, ప్రభుత్వ ప్రకటన ప్రకారం అర్హతగల రంగాల్లో పెట్టుబడులు పెట్టడానికి ప్రభుత్వం నుండి ముందస్తు అనుమతులు పొందాల్సిన పనిలేదు. ఈ రంగాలన్నిటిలో పెట్టుబడులు పెట్టాలనుకునే విదేశీ సంస్థలుగానీ, ఈ సంస్థల దేశీయ భాగస్వాములుగానీ, దేశీయ సంస్థలుగానీ ఈ మార్గాన్ని ఎంచుకోవచ్చు. గవర్నమెంట్ రూట్లో ప్రకటించిన రంగాల్లో మట్టుకు పెట్టుబడులు పెట్టాలంటే ప్రభుత్వ ముందస్తు అనుమతులు అవసరం.

ముందు బొగ్గుతో, బొగ్గు గనుల తవ్వకంతో మొదలు పెడదాం. ప్రభుత్వ నూతన విధాన ప్రకటనతో 'కోల్ ఇండియా' ప్రభుత్వ సంస్థకు ఇప్పటివరకు బొగ్గుపై ఉన్న గుత్తాధిపత్యం రద్దైపోతుంది. ఆదానీ, వేదాంత వంటి ఆశ్రిత ప్రయివేటు కంపెనీలు, ఇతర బహుళజాతి సంస్థలు ఎప్పటినుండో ఈ సదవకాశం గురించి ఎదిరిచూస్తూ కాచుకు కూర్చు న్నాయి. కోల్ ఇండియాను కుదేలు చేసి, దాన్ని ప్రయివేటు పరం చేసి కార్పొరేట్ రంగం యథేచ్ఛగా వ్యాపారం చేసుకోవడానికి ఇప్పటికే చట్టాలన్నిటినీ మార్చివేశారు.

దేశ సర్వోత్తమ న్యాయ స్థానం మెడలు వంచి, బూటకపు పర్యావరణ పరిరక్షణా సంస్థలైన కొన్ని ఎన్.జి.ఓలను రంగంలోకి దింపి, ఖనిజ తవ్వకాలకు ఆటంకంగా ఉన్న ఆదివాసులను కాళీచేయించే కుట్రను ఇప్పటికే సఫలం చేసుకున్నారు. మైనింగ్ చట్టాలను మార్చివేసి బొగ్గు తదితర ఖనిజాల తవ్వకాలపై ఉన్న ఆటంకాలన్నిటినీ తొలగించుకున్నారు. స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్‌ను అమ్మేసి ఖనిజాల యథేచ్ఛ వ్యాపారాలపై ప్రభుత్వ నియంత్రణ అంటూ లేకుండా చేసుకొని యావత్ మైనింగ్ రంగంపై గుత్తాధిపత్యం సాధించుకున్నారు.

దేశ ప్రజల ప్రయోజనాలను ధనస్వామ్య ప్రయోజనాలకు కైంకర్యం చేసి, మోడీ 1, 2 ప్రభుత్వాలు తమ స్వామి భక్తిని దేశభక్తి ముసుగులో నిరూపించుకున్నాయి. ఇపుడీ రంగాల్లో విదేశీ పెట్టుబడులకు నూరు శాతం ద్వారాలు తెరిచి ప్రయివేటు, కార్పొరేట్ కంపెనీలకు వరాల జల్లు కురిపించారు.

బొగ్గు తవ్వడానికి ఏ విదేశీ ప్రావీణ్యతలు కావాలి? మనకు తెలియని, మనకు లేని ఏ నైపుణ్యాలు, పరికరాలు, యంత్రాలు కావాలి? లక్షలాదిగా ఈ దేశ ప్రజలు నేర్వని గొప్ప విద్య ఈ విదేశీ పెట్టుబడులు మనకు సమకూర్చి మనను ఉన్నతీకరిస్తాయి? ఏరకంగా అవి మనలను అవి ఉద్ధరిస్తాయి? మన గని కార్మికులు భూగర్భాన్ని తొలిచి ఖనిజాలను బయటకు తీయడానికి ప్రధానంగా ఉపయోగించేది వారి దుర్భర శ్రమ. ఇక సాధారణ తట్ట బుట్ట, పారా పలుగు, డొలిచి ఎత్తే యంత్రాలు, పరికరాలు, పనిముట్లు, ప్రమాద నివారణా వ్యవస్థ వగైరా- ఇవన్నీ ప్రాంతీయంగా, దేశీయంగా లభ్యమౌతున్నవే కదా! వీటిని మెరుగు పర్చుకోవాలన్నా, నాణ్యతను పెంచుకోవాలన్నా, ప్రమాదాలను అరికట్టాలన్నా, ప్రాణనష్టం జరగకుండా ఉండాలన్నా, కార్మికుల ఆరోగ్యకర పని వాతావరణం కల్పించాలన్నా కావలసింది విదేశీ పెట్టుబడి కాదు. కావలసింది గని కార్మికులు ఏమి చెబుతున్నారో వినడం, వారి సలహాలను పట్టించుకుని వ్యవస్థాగత మార్పులు చెయ్యడం, గనుల నిర్వహణలో వారిని భాగస్వామ్యం చేయడం. అన్నిటికన్నా ముందు గనుల తవ్వకంలో పాతుకుపోయిన దళారీ వ్యవస్థను, కాంట్రాక్టర్ల అక్రమ దోపిడీని, హంతక ముఠాల ఆగడాలను అరికట్టడం. ఇది చెయ్యకుండా, బొగ్గు తవ్వకానికి, బొగ్గు వ్యాపారానికి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను ఆహ్వానించడమంటే, గేట్లు ఎత్తి వేయడమంటే మన దేశ వనరులను, మన ప్రజల శ్రమను, ఉద్యోగ భద్రతను పీక నులిమేయడమే! ప్రజల ఆస్తులను ప్రైవేటు పెట్టుబడి దారుల పాదాక్రాంతం చేసి దేశ ఆర్థిక వ్యవస్థను, ఇప్పటికే నాశనమైన పర్యావరణ వ్యవస్థను లాభాల బుల్డోజర్ల పాలు చేయడమే! అడవుల అతివేగ నిర్మూలనకు, ఆదివాసుల ఊచకోతకు, విస్థాపనకు, వినాశనానికి దారులు తెరవడమే!

విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి (ఎఫ్‌డిఐ) వల్ల దేశానికి వచ్చే లాభం కన్నా నష్టమే ఎక్కువ. ఎందుకంటే ఈ పెట్టుబడి ఆర్జించిన సొమ్ము లాభాల రూపంలో, టెక్నాలజీ రుసుం, స్పెషలిస్టుల జీతనాతాల రూపంలో పెట్టిన పెట్టుబడికన్నా నాలుగింతల సొమ్మును తరలించుకు పోతుంది. దీనివల్ల ఉద్యోగ కల్పన చేకూరుతుందనేదీ ఓ భ్రమ మాత్రమే! నిజంగా జరిగే ఉద్యోగ కల్పన నామమాత్రమే! ఇదేమన్నా కొత్త కొత్త పరిశ్రమలు పెద్ద ఎత్తున స్థాపిస్తుందా అంటే అదీ ఉండదు. ఇప్పటికే దేశంలో స్థాపించబడి నడుస్తున్న పరిశ్రమల్లోనో, వ్యాపారాల్లోనో వాటాలు కొననడం లేక మొత్తానికే స్వాహా చేసేయడమో ఈ ఎఫ్‌డిఐల నిర్వాకం. నూతన నిర్మాణం, పరిశ్రమల, వ్యాపారాల స్థాపన అన్నది కూడా నామ మాత్రమే! ఒకచోట అలా చేసినా ఇవి యాంత్రీకరణతో కూడుకున్న వ్యవస్థలే గాని అవి ప్రజలకు మేలు చేకూర్చేవి కావు. ఇంతకు మించి మోసపూరిత వ్యవహారమేమంటే నల్లధన శిభిరాల్లో (టాక్స్ హావెన్లలో) డొల్ల కంపెనీలపేర పన్నులు ఎగేసి కూడబెట్టిన ధనాన్ని ఎఫ్‌డిఐలుగా మార్చుకోవడం. ఈ విషయాన్ని అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (ఐఎంఎఫ్) ఈ మాయా కంపెనీల చిట్టా విప్పింది.

వివిధ దేశాల్లో బడా కంపెనీలు, దళారీలు, వ్యాపారస్తులు, మాఫియా ముఠాలు వక్రమార్గంలో పోగేసిన సొమ్ములో 85 శాతం ప్రధానంగా లుక్సెంబర్గ్, నెదర్లాండ్స్, హాంగ్కాంగ్, బ్రిటిష్ వర్జిన్ ఐలాండ్స్, బెర్ముడా, సింగపూర్, కేమన్ ఐలాండ్స్, స్విట్జర్లాండ్, ఐర్లాండ్, మారిషస్ దేశాలకు చేరుతుంది. 2017లో ప్రపంచ మొత్తం మీద 40 ట్రిలియన్ డాలర్ల ఎఫ్‌డిఐ లెక్కకు వస్తే, ఇందులో 15 ట్రిలియన్ డాలర్లు నేదర్ల్యాండ్, లక్సంబర్గ్‌లకు చేరింది. తతిమ్మా 25 ట్రిలియన్ డాలర్లు పైన ఉదహరించిన ఇతర దేశాలకు తరలించింది. ఇక మన దేశపు ఎఫ్‌డిఐ లెక్కల చిట్టా విప్పుతూ ఐఎంఎఫ్ ఈ కింది వివరాలు బయట పెట్టింది.

2019-20 సంవత్సరం మొదటి మూడు నెలల్లో 11 బిలియన్ డాలర్ల దగాకోరు విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి (ఎఫ్‌డిఐ) మూడు నల్లధన శిబిరాలైన సింగపూర్, నేదర్ల్యాండ్స్, మారిషస్ నుండి వచ్చింది. దేశంలో ప్రవేశించిన మొత్తం ఎఫ్‌డిఐలో ఇది 69 శాతం.. ఇందులో సింగపూర్ నుండి వచ్చిన సొమ్ము 5 బిలియన్ డాలర్లు. మారిషస్ నుండి వచ్చినది 4.7 బిలియన్ డాలర్లు. అదే 2018-19 లో సింగపూర్ నుండి 16 బిలియన్, మారిషస్ నుండి 8 బిలియన్, నెథర్ల్యాండ్ నుండి 4 బిలియన్ డాలర్లు ఎఫ్‌డిఐ రూపంలో వచ్చింది. ఆ సంవత్సరంలో ఇండియాకు వచ్చిన 44 బిలియన్ డాలర్లలో ఇది మూడోవంతు.

దేశంలోకి వచ్చిన ఎఫ్‌డిఐ పెట్టుబడులు ప్రధానంగా ఈ నల్లధన శిబిరాల నుండి వచ్చినవే! ఇదిలా ఉండగా, కేవలం 2019 ఏప్రిల్-

# అస్సాం జాతీయ పౌరసత్వ జాబితా

*బతుకుదెరువును వెతుక్కుంటూ జీవనోపాధి కోసం ఎన్నో సంవత్సరాల కింద వలస వచ్చిన వారిని ఇప్పుడు ఈ దేశ పౌరులు కాదనీ, లేదా ఈ దేశపౌరులుగా నిరూపించుకోవాలనీ అనడం దుర్మార్గమని అంటున్నారు* **బి. రామకృష్ణ**

**భా**రతదేశం మొత్తంలో ఎక్కడాలేని విధంగా జాతీయ పౌరసత్వ జాబితా అసోంలో నిర్వహించబడుతున్నది. బ్రిటిష్ వలసపాలన అనంతరం ఇండియా, పాకిస్తాన్‌లుగా విభజన జరిగిన సందర్భంలో ప్రజలు ఈ రెండు ప్రాంతాలలో అటు నుండి ఇటు, ఇటు నుండి అటు స్థిరపడే ప్రయత్నాలు జరిగాయి. ఈ సందర్భంగా ఎంతో హింస జరిగింది. అంతవరకు ఒకే ప్రాంతంగా నివసిస్తున్న వారు భిన్న ప్రాంతాల వారుగా విడిపోవడం ఉద్రిక్తంగా, వేదనగా, రక్తపాతంగా మారడం చరిత్రలో ఒక గాయంగా నిలిచిపోయింది. సరిహద్దు ప్రాంతాలలో ఎన్నో సున్నిత సమస్యలను ముందుకు తెచ్చింది. దీంట్లో భాగంగా అసోంలో ఇప్పటికీ పరిష్కరింపబడని సమస్యగా రగులుతూనే ఉన్నది.

1947లో కొంతమంది అసోం నుంచి తూర్పు పాకిస్తాన్ (బంగ్లాదేశ్) కు వలస వెళ్లారు. కాని వాళ్ల భూములు ఇక్కడే ఉండిపోయాయి. విభజన తరువాత కూడా ప్రజలు అక్కడి నుండి ఇక్కడకు, ఇక్కడ నుండి అక్కడికి వచ్చిపోయేవారు. దేశ విభజన తరువాత ఎవరెవరు ఎక్కడెక్కడ ఉన్నారు, అసోంలో ఎంతమంది ఉన్నారో నమోదు చేయడం కోసం 1951లో నేషనల్ రిజిస్టర్ ఆఫ్ సిటిజన్స్ (ఎన్ఆర్‌సి)ను మొదటిసారిగా రూపొందించారు. 1951 జనాభా లెక్కల తరువాత ఈ రిజిస్టర్‌ను తయారు చేశారు. 1951 తరువాత తూర్పు పాకిస్తాన్ నుండి అది 1971లో బంగ్లాదేశ్‌గా మారినప్పటి నుంచి కూడా జనం తరలిరావడం జరిగింది.

బంగ్లాదేశ్ నిర్మాణ సమయంలో (1970-71) చాలామంది బెంగాలీ మాట్లాడే హిందువులు భారత్‌లోకి వచ్చారు. 1950ల, 1960ల మధ్య తూర్పు పాకిస్తాన్ నుండి పెద్ద సంఖ్యలో పశ్చిమ బెంగాల్, త్రిపుర రాష్ట్రాలకు ప్రజలు వలసలుగా వచ్చారు. ఆ సమయంలో కేంద్ర ప్రభుత్వం హరితవిప్లవం సాధించే లక్ష్యంతో ఉన్నది. దాని కోసం వ్యవసాయ కూలీల అవసరం ఏర్పడింది. దాంతో పౌరసత్వాన్ని నిర్ణయించే విషయంలో ప్రభుత్వం కొంతమేరకు అయోమయానికి లోనయింది. ఈ పరిణామాలన్ని అసోంలో ఆందోళనలకు దారితీశాయి.

బంగ్లాదేశ్ నుంచి శరణార్థులుగా వచ్చిన పేద హిందువులు, ముస్లింల మధ్య విభేదాలు వచ్చాయి. ఈశాన్య భారత్‌లో అసోంను అత్యంత సారవంతమైన నేల కలిగిన రాష్ట్రంగా భావిస్తారు. అందువలన ఈ ప్రాంతానికి బతుకుదెరువు కోసం జరిగిన వలసలు ఓ సమస్యగా మారాయి. అధిక ఆహారాన్ని ఉత్పత్తి చేయండి అనే ఉద్యమంలో భాగంగా బీహార్, ఉత్తరప్రదేశ్‌ల నుండి వ్యవసాయ కూలీలుగా ఎంతోమంది ఇక్కడకు వచ్చారు. బ్రిటిష్ వారి పాలనలో అసోంలోని టీ తోటల్లో పనిచేసేందుకు జార్ఖండ్, ఛత్తీస్‌గఢ్ తదితర ప్రాంతాల నుండి ప్రజలను తరలించారు.

బంగ్లాదేశ్ నుండి సరహద్దు రాష్ట్రం అసోంలోకి వలసలు పెద్ద ఎత్తున జరిగాయని వాటి ఫలితంగా అసోం స్థానికుల రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక అస్తిత్వాలకు దెబ్బ తగులుతుందని అసోంలో 1979 నుండి 1985 మధ్య ఆరు సంవత్సరాలు తీవ్రమైన ఆందోళనలు జరిగాయి. వీటికి ఆల్ అస్సోం స్టూడెంట్స్ యూనియన్, ఆల్ అస్సోం గణ్ సంగ్రామ్ పరిషత్‌లు నాయకత్వం వహించాయి. ఈ ఆందోళనా కాలంలో అధికారికంగానే తొమ్మిది వందల మంది చనిపోయారు. 1985లో అప్పటి ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ సమక్షంలో ఒప్పందం (అస్సోం అకార్డ్ 1985) జరిగి ఆందోళనలకు తెరపడింది.

ఈ ఒప్పందం ప్రకారం అసోంలో విదేశీయులను గుర్తించడం, తొలగించడం 01-01-1966ను ప్రాతిపదిక తేదీగా గుర్తించారు. ఈరోజుకు ముందుగా వచ్చిన వాందరితో పాటుగా 1967 ఎన్నికల కోసం ఉపయోగించిన ఓటర్ లిస్టులో పేర్లు ఉన్న వారందరిని రెగ్యులరైజ్ చేయాలి. 01-01-1966 నుండి 24-03-1971 వరకు వచ్చిన విదేశీయులను విదేశీ చట్టం 1946, విదేశీ ట్రిబ్యునల్స్ ఆర్డర్, 1964 ప్రకారం గుర్తించాలి. ఇలా గుర్తించబడిన వారిని ఓటర్ జాబితా నుండి తొలగించాలి. వీరు రిజిస్ట్రేషన్ ఆఫ్ ఫారినర్స్ ఆక్ట్, 1939, రిజిస్ట్రేషన్ ఆఫ్ ఫారినర్స్ రూల్స్ 1939 ప్రకారం సంబంధిత జిల్లాలోని రిజిస్ట్రేషన్ ఆఫీసుల్లో రిజిస్టర్ చేయించుకోవాలి. ఓటర్ లిస్ట్ నుండి తొలగించబడిన వీరందరి పేర్లను పదేళ్ల తరువాత పునరుద్ధరించాలి. ఇంతకు ముందే

---

ఆగస్ట్ మధ్యకాలంలో తిరిగి ఇదే నల్లధన శిబిరాలకు మన దేశం నుండి ఒక బిలియన్ డాలర్ల సొమ్ము ఎఫ్‌డిఐ పెట్టుబడిగా తరలి వెళ్లింది. 2018-19 మధ్యకాలంలో నైతే దేశం నుండి బయటకు వెళ్లిన 13 బిలియన్ డాలర్ల ఎఫ్‌డిఐ పెట్టుబడుల్లో 5 బిలియన్ డాలర్లు ఈ నల్లధనం శిబిరాలకు చేరింది.

అంటే ఇది ఏమి తెలియ చేస్తోంది? మన దేశం నుండి దోచుకున్న ప్రజల సొమ్మును దొంగచాటుగా ఇటూ, అటూ తిప్పుతూ అక్రమ లాభార్జన ప్రవాహంతో దేశ ఆర్థిక వ్యవస్థను అతలాకుతలంచేసే మహమ్మారి ఈ ఎఫ్‌డిఐ పెట్టుబడులని తేలుతోంది. అయితే ఇది ఎర్ర కార్పెట్లు పరిచి ఆహ్వానించడాన్ని దేశ భక్తి, ఘన జాతీయత అనాలా? లేక నకిలీ హవాలా జాతీయత అనాలా? ఇటువంటి పెట్టుబడిని పార్లమెంటరీ రాజకీయ పార్టీలన్నీ ఆలింగనం చేసుకోవడమంటే దేశ ఆర్థిక వ్యవస్థను కావాలనే ఈ బూటకపు పెట్టుబడిదార్ల పాదాక్రాంతం చెయ్యడమే కదా!

*(రచయిత శ్రామిక నేస్తం సంపాదకులు)* వీ

తొలగించబడి, తిరిగి అక్రమంగా అసోంలోకి ప్రవేశించిన వారందరిని బహిష్కరించాలి. 24-03-1971 తరువాత వచ్చిన వారిని గుర్తించడం, తొలగించడం, బహిష్కరించడం అనేది చట్ట ప్రకారం కొనసాగాలి. భవిష్యత్‌లో చొరబాట్లు జరగకుండా సరిహద్దు ప్రాంతాన్ని కట్టుదిట్టం చేయాలి. గోడలు, ముళ్లకంచెలు నిర్మించడం, పెట్రోలింగ్, సరిహద్దు చెక్‌పోస్టులను సక్రమంగా నిర్వహించడం అనేవి ఈ ఒప్పందంలోని ప్రధానాంశాలు.

1985లో ప్రధామంత్రి సమక్షంలో జరిగిన ఒప్పందం సరిగ్గా అమలు జరిగిందో లేదోగాని సమస్య మాత్రం రగులుతూనే ఉన్నది. ఆందోళనలకు నాయకత్వం వహించిన వారు రెండుసార్లు శాసనసభ ఎన్నికల్లో గెలిచి అధికారం చేపట్టినప్పటికీ కూడా ఇప్పటికీ ఎన్నికల్లో ఇది ప్రచార అంశంగా నలుగుతూనే ఉన్నది.

1986లో భారతీయ వారసత్వ చట్టానికి సవరణ చేస్తూ అసోం కోసం ప్రత్యేక నిబంధనను చేర్చారు. 2005లో మరో పరిణామం జరిగింది. వలసదారుల, చొరబాటుదారుల నిర్ధారణ చట్టం ప్రామాణికతను కోర్టు రద్దు చేస్తూ వారసత్వాన్ని నిరూపించే బాధ్యతను రాష్ట్ర ప్రభుత్వం నుండి సామాన్య ప్రజలకు మార్చింది. సామాన్య ప్రజలు తాము భారత పౌరులమని నిరూపించుకోవడానికి కావాల్సిన ఆధారాలను, రుజువులను ప్రభుత్వానికి సమర్పించాల్సి ఉంటుంది. లేదంటే వారు విదేశీయులుగా, అక్రమ వలసదారులుగా, చొరబాటుదారులుగా గుర్తించబడతారు.

పాకిస్తాన్‌గా విభజన సమయంలో అటూ ఇటూ మైనారిటీ వర్గాలపై తీవ్రమైన హింసాకాండ జరిగింది. ఈ నేపథ్యంలో 1950 ఏప్రిల్ 8న భారత్, పాకిస్తాన్‌ల ప్రధానమంత్రులుగా ఉన్న నెహ్రూ, లియాఖత్‌ల మధ్య ఒక ఒప్పందం జరిగింది. దీనినే నెహ్రూ లియాఖత్ ఒప్పందం అని కూడా పిలుస్తారు. దీని ప్రకారం ఇరుదేశాల్లో కూడా మైనారిటీల హక్కులకు భంగం కలగకుండా ఆయా దేశాల్లోని మెజారిటీ ప్రజలతో సమానంగా మైనారిటీలను మతపరమైన వివక్షతలకు తావులేకుండా మైనారిటీలందరికి కూడా అన్ని రకాల హక్కుల విషయంలో ఇతరులతో సమానంగా గుర్తించాలి. తూర్పు బెంగాల్, పశ్చిమ బెంగాల్, అసోం, త్రిపురలలో జరిగిన వలసల సందర్భంగా చోటు చేసుకున్న హింస నేపథ్యంలో ఒక దేశం నుండి మరో దేశానికి స్వేచ్ఛగా మారడానికి వారి ఆస్తులకు రక్షణలుండాలి. పశ్చిమ బెంగాల్, అసోం, త్రిపుర రాష్ట్రాలు తూర్పు బెంగాల్ ప్రావిన్స్ (నేటి బంగ్లాదేశ్)ల ప్రభుత్వాల మధ్య అంగీకారం ఏర్పడింది. దాని ప్రకారం ఈ ప్రాంతాలన్నింటిలో సాధారణ పరిస్థితులు తిరిగి నెలకొనేలా చర్యలు తీసుకోవాలి. ఉద్రిక్తతలకు, హింసకు, ఆస్తుల విధ్వంసాలకు కారకులైన వారిపై చర్యలు తీసుకోవాలి. లూటీ చేయబడిన ఆస్తులను రికవరీ చేయాలి. అపహరించబడిన మహిళలను అప్పగించాలి. బలవంతపు మతమార్పిడిలను గుర్తించకూడదు. ఇటువంటి బలవంతపు మత మార్పిడీలకు పాల్పడిన వారిని శిక్షించాలి. మత కల్లోలాలను, మత ఘర్షణలకు దారితీసే పూకార్లను, ప్రజలను నిరోధించాలి. అలాంటి వ్యక్తులు, సంస్థలపై కఠిన చర్యలు తీసుకోవాలనీ తదితర అంశాలపై ఈ ఒప్పందం జరిగింది. ఒకప్పుడు ఒకే ప్రాంతంగా ఉన్న దేశాల మధ్య అటు ఇటుగా రాకపోకలు సహజంగానే జరిగాయి. ఈ క్రమంలో అటు ఇటు ప్రాంతంలో మెజారిటీ సమూహాలు మైనారిటీ సమూహాలపై హింసా దౌర్జన్యాలు జరుపుతున్న సమయంలో ఈ ఒప్పందం జరిగిందన్నది స్పష్టమే.

ఆ తరువాత తూర్పు పాకిస్తాన్ వివక్షకు గురవుతున్న కారణంగా పాకిస్తాన్ నుండి స్వతంత్రాన్ని కోరుతూ పోరాటాలు జరిగాయి. ఆ పోరాటాలపై పాకిస్తాన్ ప్రభుత్వం నిర్భంధాలను, అణచివేతను అమలు చేసింది. అక్కడి ఉద్యమకారులను, ప్రజలను పాకిస్తాన్ సైన్యం హింసించడం, తీవ్రమైన దాడులకు గురిచేయడం జరుగుతున్న సందర్భంలో తూర్పు పాకిస్తాన్ (ఇప్పటి బంగ్లాదేశ్) నుండి సరిహద్దు ప్రాంతమైన అసోం రాష్ట్రంలోకి వలసలు వెల్లువగానే జరిగాయి. ఒకప్పుడు అటు నుండి ఇటు, ఇటు నుండి అటు వెళ్లడానికి ఏ నిషేధాలు లేవు కాబట్టి దానికి కొనసాగింపుగానే ఇవి జరిగాయని అనుకోవచ్చు. 1971 మార్చ్ 25న బంగ్లాదేశ్‌ను సార్వభౌమ దేశంగా షేక్ ముజీబుర్ రహ్మాన్ ప్రకటించాడు. అయితే అధికార మార్పిడి ప్రకటన 1971 ఫిబ్రవరి 16న జరిగింది. దాంతో 1971, మార్చ్ 25 నుండి అసోంలోకి చట్ట వ్యతిరేకంగా బంగ్లాదేశ్ నుండి వచ్చే బెంగాలీలను చొరబాటుదారులుగా, విదేశీయులుగా గుర్తించాలనే డిమాండ్ ముందుకు వచ్చింది.

నేషనల్ రిజిస్టర్ ఆఫ్ సిటిజన్స్, 1951ను అప్‌డేట్ చేయాలని 2005లో అప్పటి ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్ అధ్యక్షతన ఆల్ అస్సోం స్టూడెంట్ యూనియన్, ఉన్నతాధికారుల సమావేశంలో నిర్ణయం జరిగింది. 2009లో మొదటిసారిగా సుప్రీంకోర్టు ఈ విషయంలో జోక్యం చేసుకుంది. 2014లోగా ఎన్ఆర్‌సి ప్రక్రియను పూర్తిచేయాలని అసోం ప్రభుత్వాన్ని ఆదేశించింది. ఆ తరువాత 2015లో ఈ ప్రక్రియ అంతా కూడా సుప్రీంకోర్టు పర్యవేక్షణలో జరగాలని సుప్రీంకోర్టు చెప్పింది. అప్పటి నుండి ఎన్ఆర్‌సిను అప్‌డేట్ చేయడం వేగవంతం అయింది.

2018 జనవరి 1న మొత్తం జనాభా 3.29 కోట్లలో, 1.9 కోట్ల మందిని ఎన్ఆర్‌సిలో నమోదు చేశారు. 2018 జూలై 30న 2.39 కోట్ల మందిని ఎన్ఆర్‌సిలో చేర్చారు. 2019 జూన్ 26న మరో లక్ష మందిని చేర్చారు. 2019 ఆగస్ట్ 31న విడుదల చేసిన ఎన్ఆర్‌సి ప్రకారం మొత్తంగా 19 లక్షల వరకు ప్రజలను విదేశీయులుగా ప్రకటించారు. గతంలో 40 లక్ష్య పైగా విదేశీయులున్నారని, వారందరినీ అసోం నుండి వెళ్లగొడతామని కనక తన ఎన్నికల ప్రచారంలో బలంగా చెప్పి ఉన్నది. 2016 అసెంబ్లీ ఎన్నికల్లో బిజెపి అసోంలో అధికారంలోకి వచ్చింది. నాడు 19 లక్షలే అనేసరికి అందులోనూ మెజారిటీగా హిందువులే ఉన్నారని తెలుస్తుండడంతో బిజెపికి గొంతులో వెలక్కాయ పడినట్లయింది.

ఈ నేపథ్యంలోనే బిజెపి పౌరసత్వ చట్ట సవరణ కోసం 2016లో పార్లమెంట్‌లో బిల్లు ప్రవేశపెట్టింది. ఈ బిల్లు 2019లో చట్టంగా రూపొందింది. దీని ప్రకారం పాకిస్తాన్, అఫ్ఘనిస్తాన్, బంగ్లాదేశ్‌లలోని హిందువులు, సిక్కులు, బౌద్ధులు, జైనులు, పార్శీలు, క్రిస్టియన్, మైనారిటీలు భారతదేశంలో కనీసం ఆరు సంవత్సరాలు (గతంలో 11 సంవత్సరాలు) నివాసం లేదా భారత ప్రభుత్వం సర్వీస్‌లో ఉన్నట్లైతే భారత పౌరసత్వానికి అర్హులు. ఇందులో ముస్లింలను చేర్చకపోవడం ద్వారా వారి పట్ల వివక్షతను ప్రదర్శించారు. దీంతో వారు ఈ దేశం వారు కాదనో, కాకూడదనో అనే అభిప్రాయాన్ని ఎగదోస్తున్నారు.

మొదటి నుండి నేటివరకు అసోంలో జరిగిన ఆందోళనల్లో చొరబాటుదారుల విషయంలో మతపరమైన వివక్షతలు చూపొద్దని, ఎవరి పౌరసత్వాన్నైనా సరే చట్ట ప్రకారమే గుర్తించాలనే డిమాండ్ ముందు కొచ్చింది. సంఘ్ పరివార్ దృష్టిలో బంగ్లాదేశ్ హిందువులు శరణార్థులు,

ముస్లింలు చొరబాటుదారులు. హిందు తదితర ముస్లిమేతర మత వర్గాలకు పౌరసత్వం పొందే విషయంలో వెసులుబాటు కల్పించి ముస్లింలకు కల్పించకుండా చేసే దురుద్దేశంతో బిజెపి ప్రభుత్వం పౌరసత్వ సవరణ చట్టం తీసుకొచ్చింది.

అసోంలో విదేశీ చొరబాటుదారులు చెదపురుగుల్లా దేశ సంపదను తినేస్తున్నారని అమిత్ షా చాలా చోట్ల ఎన్నికల ప్రచార సభలో మాట్లాడాడు. 2019 ఆగస్ట్ 31న విడుదల చేసిన చివరిదిగా చెప్పబడుతున్న జాతీయ పౌర రిజిస్టర్ ప్రకారం 19 లక్షల మందికి మాత్రమే భారత పౌరసత్వం నిరూపించబడలేదు. వీరందరూ కూడా ఫారిన్ ట్రిబ్యునల్‌ను, తరువాత హైకోర్టును, చివరకు సుప్రీంకోర్టును ఆశ్రయించి తమ భారత పౌరసత్వాన్ని నిరూపించుకునే అవకాశమున్నది. వీరిలో మరెంత మందికి పౌరసత్వం లభిస్తుందో వేచి చూడవల్సిందే. తీరా చివరకు తక్కువ మంది మాత్రమే ఎన్ఆర్‌సికి అవతల ఉండే అవకాశమున్నది.

ప్రస్తుతానికైతే అసోంలోని మొత్తం జనాభాలో 6 శాతం మంది మాత్రమే భారతీయులుగా గుర్తించబడలేదు. వీరేనన్న మాట బిజెపి అధ్యక్షుడు అమిత్ షా చెప్పినట్లు దేశ సంపదను విపరీతంగా తినేస్తున్నది, దోచేస్తున్నది. దేశ సంపదను, వనరులను కొల్లగొడుతున్న జాతీయ, అంతర్జాతీయ పెట్టుబడిదారీ శక్తులు, సామ్రాజ్యవాదులు వీరి దృష్టిలో దేశ సేవకులు. ఇదే మాటను స్వయంగా ప్రధానమంత్రి మోడీ ఆగస్ట్ 15న ఎర్రకోటపై జెండాను ఎగిరేసిన తరువాత చేసిన ఉపన్యాసంలో చెప్పాడు.

అందరికి విద్యా, ఉద్యోగ, ఉపాధి అవకాశాలను కల్పిస్తూ, భాషా సంస్కృతులను సమున్నతంగా ఎదిగేలా పాలనా విధానాలను ఆచరిస్తూ సాధించుకుంటూ పోతే గనుక అసోంలో ఇంతదాకా పరిస్థితి వచ్చేది కాదు అని చెప్పడం సత్యదూరం కాదు. ఇల్లు తగులబెట్టి చలికాచుకున్నట్లు అసోంలోని రాజకీయ పార్టీలు వ్యవహరిస్తూ వచ్చాయి. బిజెపి ప్రవేశించిన తరువాత మతం రంగు పులుమబడుతున్నది. పెద్ద ఎత్తున ఉద్యమం చేసిన ఆల్ అసోం స్టూడెంట్స్ యూనియన్ ఆ తరువాత అసోం గణపరిషత్‌గా ఏర్పడి రెండు దఫాలుగా ప్రభుత్వాధికారాన్ని చేపట్టిన సాధించిదేమిటన్నది పెద్ద ప్రశ్నగానే మిగిలిపోయింది.

అసలు బంగ్లాదేశ్ నుండి వలసలు ఎందుకు జరుగుతున్నాయి అనేది ముఖ్యమైనది. మత విశ్వాసాల నుండి దూరంగా ఉండడం, మంచి జీవన స్థితిగతుల కోసం, విద్యా, ఉద్యోగ, ఉపాధి అవకాశాల కోసం అన్నది ప్రతి వ్యక్తి భద్రమైన జీవికకు అవసరమైనవి. వీటిని పట్టించుకోకుండా ఎన్నికల్లో లబ్ధిపొందడానికి ఎన్ఆర్‌సిని ఉపయోగించుకుంటున్నారు. మౌలిక సమస్యల పరిష్కారాన్ని మరుగున పడేసి స్థానిక ప్రజల సమస్యలన్నీ కూడా బంగ్లాదేశ్ వలసదారుల వల్లనే వస్తున్నాయనే తప్పుడు అభిప్రాయాన్ని రెచ్చగొట్టడం జరుగుతున్నది. దీనికి తోడు మతం రంగు పులిమి బంగ్లాదేశ్ నుండి ముస్లిం వలసల వల్లనే సమస్యంతా వచ్చి పడుతున్నదని, ఇక్కడి సంపదను వీళ్లే దోచుకుంటున్నారనే వితర్క వాదనను బిజెపి చేస్తున్నది.

ప్రస్తుతం అసోంలో నివసిస్తూ, సరైన సాక్ష్యాధారాలు లేక చిన్న చిన్న సాంకేతిక లోపాలు, అచ్చు తప్పులు, అక్షరదోషాలు వంటి వాటివల్ల ఎంతోమంది తమ పౌరసత్వాన్ని గుర్తింప చేసుకోలేకపోతున్నారు. తద్వారా అటు బంగ్లాదేశ్‌లో పౌరసత్వం లేక ఇటు ఇండియాలో లేకుండా అటూ ఇటూ కాకుండా అభద్రతలో ఏ దేశానికి చెందని వారుగా మిగిలి పోతుండడం విషాదకరం. వీరిలో కొందరు ఇప్పటికే అన్ని రకాల హక్కులను కోల్పోయి డిటెన్షన్ కేంద్రాలలో ఖైదీలు కాని ఖైదీలుగా దుర్భర పరిస్థితులలో ప్రాణాలతో మిగిలి ఉన్నారు. వీరి కుటుంబాలు జీవనాదాయం కోల్పోయి, తీవ్రమైన మానసిక క్షోభను అనుభవిస్తూ సంక్లిష్టమైన పరిస్థితుల్లో ఉండడం ఎంతటి వేదనను కలిగిస్తుందో మాటల్లో చెప్పడం కష్టమే. అనుభవిస్తే గాని అర్థం కాదు. ఎన్ఆర్‌సిలో పేర్లు రాని వారిలో కొంతమంది చాలా తక్కువే కావచ్చు కాని బలవన్మరణాలకు పాల్పడ్డారు.

ఎన్ఆర్‌సిలో పేర్లు లేని అసోంలో నివసిస్తున్న ప్రజల పరిస్థితి ఏమిటి అన్నది క్లిష్టమైన ప్రశ్నగా ముందుకు వస్తున్నది. వారిని వెళ్లగొట్టడమా? ఏ దేశానికి పంపించేయడం? వారు ఏ దేశ పౌరులో గుర్తించి చెప్పే రుజువులేవి? ఇవేవీ లేకుండా నిర్దాక్షిణ్యంగా అసోం సరిహద్దులను దాటిస్తారా? ఏ దేశ సరిహద్దుల్లోకి పంపిస్తారు? అలా పంపితే ఆ దేశాలు వీరిని అంగీకరిస్తాయా? వంటి ప్రశ్నలకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల దగ్గర సమాధానాలు లేవు. ఎన్ఆర్‌సిలో చోటు దక్కని వారందరిని భారతదేశ పౌరులు కాదని ముద్రవేసి డిటెన్షన్ కేంద్రాలకు పంపిస్తారా? అక్కడ వీరందరిని ఉంచి ఏం చేస్తారో స్పష్టత లేదు. ఇక ఆ క్యాంపుల్లోనే వీరి జీవితం అంతం కావాల్సిందేనా? పౌరసత్వం ఇవ్వకుండానే వారి చేత పనిచేయించుకోవాలనే వాదనలు ఉన్నాయి.

భారతీయులు కాదని అదుపులోకి తీసుకునే వారిని ఉంచేందుకు శిబిరాలు ఏర్పాటు చేయడానికి చాలా చోట్ల భూసేకరణ చేస్తున్నారనే వార్తలు వస్తున్నాయి. ఇప్పటికే జోర్హాట్, డిబ్రూగఢ్, గ్వాల్‌పాడ్, సిల్చార్, తేజ్‌పూర్, కోక్రాఝర్‌లలోని జైళ్లలో కస్టడీ శిబిరాలు ఉన్నాయి. అందులో ఇలాంటి వారిని ఇప్పటికే నిర్బంధించి ఉంచారు.

ప్రస్తుతం 19 లక్షల మందిని విదేశీయులాగ చూపెట్టారు. వీరందరూ విదేశీ ట్రిబ్యునల్స్‌కు దరఖాస్తులు పెట్టుకోవచ్చని, అక్కడ తమ పౌరసత్వాన్ని నిరూపించుకోవచ్చని, అక్కడ తేలకుంటే హైకోర్టులో, చివరకు సుప్రీం కోర్టులో తేల్చుకోవచ్చని చెబుతున్నారు. పేదలు, వ్యవసాయ కూలీలు, నిరక్షరాస్యులు, శ్రామికులు ఈ తతంగాన్నంతా పూర్తి చేసుకుంటూ తమ పౌరసత్వాన్ని నిరూపించుకోవడం సాధ్యమయ్యే పనేనా? కార్యాలయాల చుట్టూ, కోర్టుల చుట్టూ తిరగడం, అందుకు అయ్యే ఖర్చులను భరించడం, లాయర్లకు ఫీజులు చెల్లించుకోవడం సాధ్యపడుతుందా? చదువుకుని, ప్రభుత్వ ఉద్యోగం చేస్తున్నవారు, ఇండియన్ ఆర్మీలో పనిచేసి రిటైర్ అయిన వారిని కూడా విదేశీయులుగా ప్రకటిస్తున్న నేపథ్యంలో సామాన్య ప్రజానీకం పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించడం కష్టమేమి కాదు.

గతంలో అసోంలోని విదేశీయులు కోటికి పైగా అన్నవారు 2018లో 40 లక్షలన్నారు. నేడు 19 లక్షలు అంటున్నారు. పోనీ ఈ 19 లక్షల మందే అని అనుకుంటున్నప్పటికీ వారంతా భారత సరిహద్దులను దాటి లోపలికి ఎలా రాగలిగారు? ఆ అవకాశం ఇచ్చిందెవరు? అక్కడ కట్టుదిట్టమైన రక్షణ చర్యలు ఎందుకు తీసుకోలేకపోయారు? ఈ అసమర్థత ఎవరిది? దాన్ని సరిచూసుకోవాలి. అసలు సరిహద్దు వద్ద సరైన భద్రతా చర్యలు తీసుకొని ఉంటే ఈ సమస్య వచ్చేదే కాదు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# కశ్మీర్ దుర్మార్గంపై మహిళల నివేదిక

*ఢిల్లీ నుంచి మూడు మహిళా సంఘాలకు చెందిన* **ఐదుగురు మహిళల బృందం** *కశ్మీర్‌లో పర్యటించి ప్రకటించిన నిజనిర్ధారణ కమిటీ నివేదిక*

*"వసంతకాలపు మొగ్గలు వికసిస్తాయి*
*కోయిలల వేదన అంతమవుతుంది*
*ప్రేమికుల గాయాలు మానడం మొదలవుతుంది*
*వ్యాధి పీడితులను వదిలిపోతుంది రోగం*
*రంజూర్ హృదయాకాంక్ష నెరవేరుతుంది*
*అట్టడుగు పేద మనిషి పాలించినప్పుడు*
*వైభవ కిరీటం ధరించినప్పుడు"*

మూసివేసి, తాళాలు బిగించిన కశ్మీర్ అనే నేల మీద మా నాలుగు రోజుల పర్యటనలో మాకు కరదీపికగా నిలిచినవి 1990లో హత్యకు గురైన కామ్రేడ్ అబ్దుల్ సత్తార్ రంజూర్ రాసిన ఈ కవితాపాదాలే.

నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ విమెన్ తరఫున ఆనీ రాజా, కవల్ జిత్ కౌర్, పంఖురి జహీర్, ప్రగతిశీల్ మహిళా సంఘటన్ తరఫున పూనమ్ కౌశిక్, ముస్లిం విమెన్స్ ఫోరమ్ తరఫున సయిదా హమీద్ – ఐదుగురు మహిళల బృందంగా మేం సెప్టెంబర్ 17 నుంచి 21 వరకు కశ్మీర్ లో పర్యటించాం. నలభై మూడు రోజుల దిగ్బంధం కశ్మీర్ ప్రజల మీద, ముఖ్యంగా స్త్రీల మీద, పిల్లల మీద ఎటువంటి ప్రభావాన్ని వేసిందో మాకళ్లతో మేం చూడదలిచాం.

మా పర్యటనలో శ్రీనగర్‌లో కొంత సమయం గడిపాం. షోపియన్, పుల్వామా, బండిపొరా జిల్లాల్లో ఎన్నో గ్రామాలకు వెళ్లాం. గ్రామీణ ప్రాంతాల్లోనూ, పట్టణ ప్రాంతాల్లోనూ ఆసుపత్రులకు, పాఠశాలలకు, ఇళ్లకు వెళ్లి ఎందరో పురుషులతో, స్త్రీలతో, యువతతో, పిల్లలతో మాట్లాడాం. ఉక్కుపాదం కింద నిర్బంధంలో 43 రోజులుగా జీవిస్తున్న సాధారణ ప్రజల బాధలకూ, గాథలకూ మా ప్రత్యక్ష సాక్షి కథనం ఈ నివేదిక.

మేం విమానాశ్రయంలో దిగి నగరంలోకి వాహనంలో వెళ్తూ ఉంటే కొట్టవచ్చినట్టు కనిపించిన దృశ్యం మూసి ఉన్న దుకాణాలు, మూసి ఉన్న హోటళ్లు, మూసి ఉన్న పాఠశాలలు, కళాశాలలు, విద్యాసంస్థలు, విశ్వవిద్యాలయాలు, నిర్జనమైన వీథులు. స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకోవడాన్ని కూడ అడ్డుకుంటున్న శిక్షా వాతావరణం అక్కడ నెలకొని ఉన్నదని మాకు అనిపించింది.

మా కళ్ల ముందు కనిపించినది కశ్మీర్ అంటే సాధారణంగా ఉండే చిత్రం కాదు. శికారాలు, హౌజ్ బోట్లు, తామర పూలు, దాల్ సరస్సు అనే సాధారణ చిత్రం ఇప్పుడక్కడ లేదు. తమ వాళ్ల కోసం ఎదురుచూస్తూ గుమ్మంలో నిలబడి ఉన్న జుబేదా, షమీమా, ఖుర్షీదా వంటి స్త్రీలు మాకక్కడ కనిపించారు. వాళ్లు కళ్లు కాయలు కాచేట్టు ఎదురుచూస్తున్నది తమ పద్నాలుగేళ్ల, పదిహేనేళ్ల, పదిహేడేళ్ల, పందొమ్మిదేళ్ల కొడుకుల కోసం. ఆ యువకులు తమ తల్లులను వదిలిపోయినప్పటి చిట్టచివరి దృశ్యం, చిట్టచివరి చూపు ప్రతి హృదయం మీద చెక్కి ఉంది. ఏమి జరిగినా ఆ తల్లులు తమ ఆశ వదులుకోదలచలేదు. చిత్రహింసలకు గురైన తమ బిడ్డల శరీరాలనో, మృతదేహాలనో చూడడానికి ఎంతో కాలం ఎదురు చూడాలని వాళ్లకు తెలుసు. అసలెప్పటికైనా చూస్తారో లేదో కూడ వాళ్లకు తెలియదు.

"మమ్మల్ని బోనులో బంధించారు" అనే మాటే మాకు ఎక్కడికి వెళ్లినా వినబడింది. "మీ ఢిల్లీలో ఇంటర్నెట్ ను ఐదు నిమిషాల పాటు లేకుండా చేస్తే మీరేం చేస్తారు" అని మమ్మల్ని డాక్టర్లు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, కార్మికులు అడిగారు. మా దగ్గర జవాబు లేదు.

మేం తిరిగిన నాలుగు జిల్లాల్లోని అన్ని గ్రామాల్లోనూ ప్రజల అనుభవం ఒకే రకంగా ఉంది. రాత్రి ఎనిమిదింటికి, మగ్రిబ్ ప్రార్థన అయిపోగానే ఇళ్లలో లైట్లు ఆర్పేసి చీకటి చేయాల్సి ఉంటుందని వాళ్లందరూ చెప్పారు. బడి మళ్లీ తెరుస్తారేమో, పరీక్షలకు చదువుకోకపోతే ఎట్లా అని బండిపొరాలో ఒక అమ్మాయి లైటు ఆర్పకుండా తప్పు చేసింది. అలా కర్ఫ్యూ నిబంధనలను ఉల్లంఘించినందుకు సైనికులకు చాల కోపం వచ్చింది. గోడ దూకి ఇంట్లోకి తోసుకొచ్చారు. ఇంట్లో ఉన్న ఇద్దరు మగవాళ్లను, తండ్రినీ కొడుకునూ ప్రశ్నించడానికనే పేరుతో తీసుకుపోయారు. ఏం ప్రశ్నించడానికి అని ప్రశ్నించే సాహసం ఎవరికీ లేదు. అప్పటి నుంచి ఆ తండ్రీకొడుకులను నిర్బంధంలోనే ఉంచారు. "సాయంత్రం ఆరింటికల్లా మా మగవాళ్లందరినీ ఇంటిలోపలికి వచ్చెయ్యమంటున్నాం. మగవాళ్లు పెద్దవాళ్లైనా, పిల్లవాళ్లైనా చీకటిపడ్డాక వీథుల్లో కనబడడం చాల పెద్ద ప్రమాదం. అత్యవసరమైతే, మేం స్త్రీలమే బైటికి వెళ్తున్నాం" అన్నది బండిపొరా జిల్లా కేంద్రానికి పొరుగున ఉన్న ఒక గ్రామంలో జరీనా అనే స్త్రీ. "మాకిది ఎంత అలవాటై పోయిందంటే చీకటి పడ్డాక బైట వీథిలో కుక్క మొరగగానే నా నాలుగేళ్ల కూతురు వెంటనే మూతి మీద వేలు పెట్టుకుని నిశ్శబ్దం అని సూచిస్తుంది. కుక్కలు మొరుగుతున్నాయంటే సైనికులు రాబోతున్నారని అర్థం. చివరికి నా చిన్నారిని మూత్రానికి తీసుకుపోవడానికి నా ఫోన్ లైట్ వేయడానికి కూడ వీల్లేదు. అటువంటి వెలుగురేఖ దూరానికి కూడ కనబడుతుంది. అది కనబడిందంటే మా మగవాళ్లు తమ ప్రాణాలతో మూల్యం చెల్లించవలసి వస్తుంది" అందామె.

బతికి ఉన్నవాళ్లను చనిపోయినవాళ్లు కూడ హింసకు గురిచేస్తున్నారు. "మనుషులు చెప్పి, హెచ్చరించి, ఏడ్చి చచ్చిపోతారా? ఊరికే చచ్చి పోతారంతే. అమ్మ చచ్చిపోయిందని నేను నా అక్కచెల్లెళ్లకు కబురు ఎట్లా పంపను?" అంటున్నప్పుడు గులామ్ అహ్మద్ గొంతు దుఃఖంతో పూడుకుపోయింది. "నా అక్కచెల్లెళ్లు ట్రాల్‌లో, పట్టన్‌లో ఉంటారు. కన్నబిడ్డలు రాకుండానే నేను మా అమ్మ అంత్యక్రియలు నిర్వహించవలసి వచ్చింది" అన్నాడాయన.

మేం ఎక్కడికి వెళ్లినా ఇదే కథ. అత్యంత ప్రియమైన తమ సమీప బంధువులకు కబురు పంపించడానికి మార్గమేమీ లేదు. ఈ నలభై మూడు రోజులూ మృత్యు శాంతి తాండవించింది.

ప్రజా రవాణా వ్యవస్థ పూర్తిగా రద్దయిపోయింది. తమ సొంత కార్లున్నవాళ్లు కూడ అత్యవసరమైన పనుల కోసం మాత్రమే వాటిని బైటికి తీస్తున్నారు. స్త్రీలు రోడ్ల పక్కన నిలబడి వచ్చిపోయే కార్లనూ, బైక్ లనూ లిఫ్టు ఇమ్మని అడగడం కనబడుతున్నది. సాధారణంగా అలా వాహనాల మీద వెళ్లేవాళ్లందరూ ఆగి సహాయం చేస్తున్నారు. లిఫ్టు ఇచ్చేవారినీ, లిఫ్టు అడిగేవారినీ కూడ ఇద్దరమూ నిస్సహాయులమే అనే పైకి చెప్పని బంధమే కలుపుతున్నది. "నేను నా బైక్ మీద అవంతిపోరా వైపు వెళ్తున్నాను. ఒక స్త్రీ నన్ను ఆపమని చెయ్యి ఊపింది. ఆమెను ఎక్కించుకున్నాక కొంత దూరంలో ఒక స్పీడ్ బ్రేకర్ దగ్గర నా బైక్ ఎగిరిపడి ఆమె కింద పడిపోయింది. నేనామెను దగ్గర్లోని ఆస్పత్రికి తీసుకువెళ్లాను. ఆమె కోమా లోకి వెళ్లింది. నా ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రమే. ఆమెకు నేనెట్లా చికిత్స చేయించగలను? ఆమె ఎవరో కూడ నాకు తెలియదే. ఎవరికి ఎట్లా చెప్పగలను?" ఇటువంటి రోజువారీ ఘటనల గురించి మేం వెళ్లినచోటల్లా విన్నాం.

అధికరణం 370 రద్దు జరిగిననాటి నుంచీ తమకు ఎదురవుతున్న ఇబ్బందుల గురించి శ్రీనగర్ లో లాలా దేడ్ ఆస్పత్రిలో యువ మహిళా డాక్టర్లెందరో తమ నిరాశానిస్పృహలను మాతో పంచుకున్నారు. "ప్రసవానికి స్త్రీలను తగిన సమయంలో తీసుకురాలేకపోయిన సందర్భాలున్నాయి. చాల తక్కువ అంబులెన్సులున్నాయి. ఉన్న కాసిన్నిటిని కూడ దారిలో సైనిక పికెట్ల దగ్గర అడ్డగిస్తున్నారు. దాని ఫలితం ఏమిటి? ప్రసవం ఆలస్యం కావడం వల్ల జనన సమయంలో అంగవైకల్యంతో, ఇతర రకాల సమస్యలతో పిల్లలు పుడుతున్నారు. అది ఆ పిల్లలకు జీవితాంతం ఉండే సమస్య. తల్లిదండ్రులకైతే జీవన్మరణమే. మరొకపక్క, చాల మంది స్త్రీలు ప్రస్తుత స్థితిలోని ఒత్తిడి వల్ల, భయం వల్ల సమయానికి ముందే ప్రసవిస్తున్నారు" అన్నారొక డాక్టర్. "ప్రభుత్వం మమ్మల్ని గొంతు నులిమి చంపాలని అనుకుంటున్నదని అనిపిస్తున్నది. అలా గొంతు నొక్కుతూనే రాక్షసానందంతో మమ్మల్ని మాట్లాడమని కూడ అంటున్నది" అంటూ ఒక యువ మహిళా డాక్టర్ తన గొంతు నొక్కుకుంటూ చెప్పింది.

బండిపోరా ఆస్పత్రిలో ఒక సీనియర్ డాక్టర్ తమ ఆస్పత్రికి కుల్గాం, కుప్వారా, తదితర జిల్లాల నుంచి కూడ జనం వస్తున్నారని అన్నారు. తన అనుభవం మొత్తంలోనూ ఎన్నడూ చూడనన్ని మానసిక వ్యాధుల, గుండెపోట్ల కేసులు వస్తున్నాయన్నారు. అత్యవసరమైన కేసులలో సాధారణంగా జూనియర్ డాక్టర్లు తమ సీనియర్ల కోసం చూస్తారు. కాని సీనియర్ డాక్టర్లను సంప్రదించడానికి ఫోన్ సౌకర్యం లేదు. సీనియర్లు దగ్గర్లోనే ఉన్నారని తెలిస్తే వీథుల్లో అరుస్తూ, వెతుకుతూ, పిలుస్తూ జూనియర్ డాక్టర్లు పరుగెత్తుతున్న సందర్భాలు ఉన్నాయి. విధి నిర్వహణ కోసం వెళ్తుండగా స్కిమ్స్ లోని ఒక ఆర్థోపెడిక్ డాక్టర్‌ను సైనికులు ఆపేసి ఆయనను ఏడు రోజులు నిర్బంధంలో ఉంచుకున్నారు.

షోపియన్ లో కాన్సర్ కోసం శస్త్రచికిత్స చేయించుకున్న సఫియా "కాన్సర్ తిరగబెట్టిందా పరిశీలించడానికి నేను తప్పనిసరిగా చెకప్ చేయించుకోవాలి. అక్కా, నేను నా డాక్టర్ ను కలవడానికి, మాట్లాడడానికి వీలే లేదు. నగరానికి వెళ్లడం ఒకటే మిగిలిన మార్గం. కాని ఎట్లా వెళ్లాలి? ఒకవేళ కష్టపడి వెళ్లినా, ఆయన ఆ సమయానికి ఉంటారా?" ఇంటర్నెట్ మీద మాత్రమే పనిచేసే ఆయుష్మాన్ భారత్ అనే పథకాన్ని వాడుకోవడానికి డాక్టర్లకూ, రోగులకూ కూడ అవకాశం లేదు.

గ్రామాల్లో మా ముందు నిలబడిన మహిళల కళ్లలో శూన్యం కొట్టవచ్చినట్టు కనబడింది. "వాళ్లు ఎక్కడున్నారో మాకెట్లా తెలుస్తుంది? మా పిల్లలను తీసుకుపోయారు. మా ఇళ్లలోనుంచి ఎత్తుకుపోయారు. మా మగవాళ్లు పోలీస్ స్టేషన్‌కు వెళ్లి అడిగితే అక్కడ ప్రధాన కార్యాలయానికి వెళ్లి అడగమంటున్నారు. ఎవరో ఒకరిని లిఫ్టు ఇమ్మని బతిమిలాడి, బొమాలి ఏదో ఒకరకంగా ప్రధాన కార్యాలయానికి చేరితే, అక్కడ 'రాళ్లు విసిరినవాళ్లు' అని బోర్డుల మీద జాబితాలు పెట్టారు. ఆ జాబితాల్లో ఉన్నవాళ్లు ఆగ్రా, జోద్‌పూర్, అంబేడ్కర్, జజ్జర్ జైళ్లలో ఉన్నారు" అన్నారొకరు. "అక్కా, మమ్మల్ని తొక్కేశారు. బతిమిలాడో, అప్పుచేసో, మాలో కొద్దిమంది అన్ని వందల మైళ్లు ప్రయాణం చేసి వెళ్లినా, మాకు ఎంతమాత్రం తెలియని ఆ నగరాల్లో మేమంటే పడని జైలు గార్డులు మమ్మల్ని తోసేస్తారు. అంతే" అన్నాడు పక్కన నిలబడిన వ్యక్తి.

తాము ఎల్లప్పుడూ కశ్మీర్ లో సురక్షితంగా ఉన్నామని గురుద్వారాల్లో కలిసిన స్త్రీలు అన్నారు. "మిగిలిన భారతదేశంలో విపరీతంగా మహిళల మీద అత్యాచారాల వార్తలు వస్తుండగా, అలాంటివి కశ్మీర్‌లో మేమెప్పుడూ వినలేదు" అన్నారు వాళ్లు. సైనికులు తమను వేధిస్తున్నారని, చివరికి తమ ముఖం మీది ముసుగును తొలగించి చూపమని ఒత్తిడి చేస్తున్నారని కొందరు యువతులు అన్నారు.

"యువకులు, ఇప్పుడిప్పుడే యవ్వనంలోకి ప్రవేశిస్తున్న పిల్లలు కనబడ్డారంటే సైనికులు వారి మీద విరుచుకుపడతారు. అసలు వాళ్లను చూస్తేనే సైనికులకు ద్వేషం పొంగుకొస్తుంది. తమ పిల్లలను కాపాడడానికి తండ్రులు వెళ్లగానే వాళ్లనుంచి డబ్బులు లాగడం మొదలుపెడతారు. ఒక్కొక్కరి దగ్గర ఇరవై వేల నుంచి అరవై వేలు వసూలు చేస్తారు." కశ్మీరీ యువత పట్ల సైనికుల ద్వేషం ఎంత సుప్రసిద్ధమైనదంటే, ఇంటి తలుపు తట్టిన చప్పుడు వినబడగానే, ఇంట్లోని వృద్ధుడిని మాత్రమే తలుపు తీయడానికి పంపుతారు. "వృద్ధుడిని, పెద్దమనిషిని చూస్తే వాళ్లు వదిలేస్తారని ఆశిస్తాం, వదిలేయాలని ప్రార్థిస్తాం. కాని ఎదురుగా ఉన్నది వృద్ధుడైనా, యువకుడైనా, చివరికి చిన్నపిల్లవాడైనా సరే చెంపదెబ్బలు, ముఖం మీద పిడిగుద్దులు తప్పవు. అయినా, అక్కా అసలు మా తలుపుల గొళ్లాలు ఎంత వదులుగా పెడతామంటే సైనికులు ఒక్క తన్ను తన్నగానే తలుపులు ఊడిపోతాయి!" ఈ మామూలు మాటల్లో ఎంత వ్యంగ్యం, విషాదం వ్యక్తమవుతున్నాయి!

పద్నాలుగు, పదిహేనేళ్ల పిల్లలను కూడ తీసుకుపోతున్నారు. చిత్రహింసలు పెడుతున్నారు. కొందరినైతే 45 రోజులుగా నిర్బంధంలోనే ఉంచుకున్నారు. వారికి సంబంధించిన పత్రాలన్నీ తీసుకుపోయారు. కుటుంబాలకు కనీస సమాచారం కూడ లేదు. పాత ఎఫ్ఐఆర్‌లు తవ్వి తీస్తున్నారు. వాళ్ల ఫోన్లు లాక్కుపోతూ, సైన్యం క్యాంపుకు వచ్చి తీసుకొమ్మంటున్నారు. సైనికుల గురించి తెలిసినవాళ్లెవరూ, అది ఎంత ఖరీదైన ఫోన్ అయినా సరే, తెచ్చుకోవడానికి క్యాంపుకు వెళ్లలేదు. తన 22 ఏళ్ల కొడుకును తీసుకుపోవడానికి సైనికులు ఎలా వచ్చారో ఒక మహిళ చెప్పింది. ఆ సమయానికి ఆ అబ్బాయి చెయ్యి విరిగి కట్టుతో ఉన్నాడు. అందుకని పద్నాలుగేళ్ల తమ్ముడిని తీసుకువెళ్లారు. మరొక గ్రామంలో ఇద్దరు పురుషులను తీసుకువెళ్లి ఎట్లా విపరీతంగా కొట్టారో విన్నాం. కొట్టడానికి కారణమేమీ లేదు. ఆ ఇద్దరిలో ఒకరు ఇరవై రోజుల తర్వాత వెనక్కి వచ్చారు గాని శరీరమూ మనసూ పచ్చి పుండు అయిపోయి ఉంది. మరొకరు ఇంకా నిర్బంధంలోనే ఉన్నారు. ఒక అంచనా ప్రకారం ఈ నిర్బంధకాలంలో మొత్తం 13,000 మంది మగ పిల్లలను

తీసుకుపోయారుని తెలుస్తున్నది. చివరికి ఇంట్లో ఉన్న తిండి దినుసులను కూడ సైనికులు వదలలేదు. అర్ధరాత్రి, అపరాత్రి ఇళ్లమీద జరిగే దాడుల్లో, సోదాల్లో సైనికులు ఇళ్లలో ప్రవేశించి, కుటుంబాన్ని బైటికి వెళ్లగొడతారు. "ఎప్పుడెలా ఉంటుందో అని మేం బియ్యం, పప్పులు, నూనె కాస్త ఎక్కువగానే నిలువ ఉంచుకుంటాం. ఆ దినుసుల డబ్బాల్లో కిరసనాయిలు గుమ్మరించారు. కొన్నిచోట్ల బొగ్గుపొడి కలిపారు."

"ఇంకో బిడ్డను కందాం. మన ఫైజ్ ను వాళ్లు చంపేస్తే కనీసం మనకు మరొక బిడ్డ అయినా ఉంటాడు" అని అనంతనాగ్ లో తెహ్మీనా తన భర్తతో అంది. భర్త అబ్దుల్ హమీద్ నిశ్శబ్దంగా ఉండిపోయాడు. ఆ మాటలు వింటుంటేనే ఆయనకు తన చేతుల్లో తన చిన్నారి కొడుకు మృతదేహం ఉన్నట్టనిపించింది. "ఆ మాట నా చెవిన పడగానే నా హృదయం బద్దలయింది" అన్నాడాయన.

కర్నాలో ముప్పై ఏళ్ల వయసున్న ఒక న్యాయవాది అద్దెకు ఉంటున్న ఇంట్లో మృతదేహంగా మిగిలాడు. ఆయన అంతకు ముందు తీవ్రవిచారంలో ఉన్నట్టు కనిపించాడని చూసినవాళ్లన్నారు. స్థానిక న్యాయవాదుల సంఘం కార్యదర్శి ఒక సంతాప ప్రకటన విడుదల చేశాడు. ఆ ప్రకటన విడుదల కాగానే ఆ కార్యదర్శిని అరెస్టు చేశారు. ఎందుకు?

మేమొక జమ్ము కశ్మీర్ పోలీసును కూడ కలిశాం. వారి దగ్గిరి నుంచి తుపాకులు తీసేసుకుని లాఠీలు ఇచ్చారు. "తుపాకి వెనక్కి తీసుకున్నారంటే, మీకేమనిపిస్తున్నది?" అని అడిగాం. "దాంట్లో మంచీ ఉంది, చెడూ ఉంది" అన్నాడాయన. "ఎందుకు?" "వాటిని ఎప్పుడు ఎవరు ఎత్తుకుపోతారో అని భయపడుతూ ఉండేవాళ్లం, అందువల్ల అది లేకపోవడమే మంచిది. కాకపోతే ఇప్పుడు కాల్పులు జరిగితే మమ్మల్ని మేం రక్షించుకోవడానికి కూడ అవకాశంలేదు. అది చెడ్డది" అన్నాడాయన. "భారత ప్రభుత్వం మమ్మల్ని పాలస్తీనా లాగ మార్చదలచుకుంది. మేం, కశ్మీరీలం దాన్ని ఎదిరిస్తాం" అన్నది ఒక మహిళా సెక్యూరిటీ గార్డ్. "మాకు స్వేచ్ఛ కావాలి. మాకు భారత దేశమూ వద్దు, పాకిస్తానూ వద్దు. మా స్వేచ్ఛ కోసం మేం ఎంత మూల్యమైనా చెల్లిస్తాం. ఇది కశ్మీరీ రక్తం. ఎంత త్యాగమైనా చేస్తుంది" అన్నాడు ఒక యువ నిపుణుడు.

మేం ఎక్కడికి వెళ్లినా రెండు భావోద్వేగాలు కొట్టవచ్చినట్టు కనిపించాయి.

మొదటిది, ఆజాదీ కోసం, స్వేచ్ఛ కోసం తపన. వాళ్లకు ఇటు భారతదేశమూ వద్దు, అటు పాకిస్తానూ వద్దు. డెబ్బై సంవత్సరాల పాటు వాళ్లు అనుభవించిన అవమానాలూ చిత్రహింసలూ ఇక వెనక్కి తిరగలేని దశకు చేరాయి. అధికరణం 370 రద్దుతో భారతదేశంతో వారికి ఉన్న చిట్టచివరి బంధం తెగిపోయిందని కొందరన్నారు. ఇంతకాలమూ ప్రతి సందర్భంలోనూ భారత రాజ్యాన్ని సమర్థించినవాళ్లను కూడ ఇప్పుడు ప్రభుత్వం తిరస్కరించింది. "అంటే, మేం సాధారణ కశ్మీరీలం, వాళ్ల కంటికి ఆనుతామా?" అంటున్నారు వాళ్లు. వాళ్ల నాయకులందరినీ ప్రజాభద్రతా చట్టం కింద అరెస్టు చేయడమో, గృహ నిర్బంధంలో పెట్టడమో జరిగింది గనుక, సాధారణ ప్రజలే తమకు తాము నాయకులయ్యారు. వాళ్లు అనుభవిస్తున్న వేదన చెప్పరానిది, వాళ్ల ఓపిక కూడ అంతే.

ఇక రెండోది, తల్లుల విషాద విలాపాలు. ఆ తల్లులు ఎందరో పిల్లల మృతదేహాలను, చిత్రహింసల గాయాల మృతదేహాలను చూశారు. వారు ఈ అమాయకుల మీద జరుగుతున్న పాశవిక దాడి తక్షణమే ఆగిపోవాలని కోరుతున్నారు. తుపాకుల కింద, జాక్ బూట్ల పదఘట్టనల కింద తమ పిల్లల జీవితాలు అంతరించిపోగూడదని వాళ్లు కోరుతున్నారు.

కశ్మీర్ లో మా పర్యటన అనుభవాలను, పరిశీలనలను నివేదిస్తున్న క్రమంలో, రెండు నిర్ధారణలతో మేమీ నివేదికను ముగించదలచాం:

ఒకటి, గత యాభై రోజుల్లో భారత ప్రభుత్వమూ సైన్యమూ సాగించిన పాశవికత్వం ముందు, నిర్బంధకాండ ముందు కశ్మీరీ ప్రజలు ఆశ్చర్యకరమైన పద్ధతిలో తమ ఓరిమిని ప్రదర్శించారు. వారు మాకు చెప్పిన సంఘటనలు వింటుంటే మా ఒళ్లు జలదరించింది. ఈ నివేదిక వారు చెప్పినవాటిలో కొన్నిటి సారాంశం మాత్రమే. కశ్మీరీ ప్రజల ధైర్య సాహసాలకు, దృఢ చిత్తానికి మేం మా అభినందనలు తెలియజేస్తున్నాం.

రెండవది, అక్కడి పరిస్థితి ఎంతమాత్రం ప్రశాంతంగా లేదని మేం మరొకసారి నొక్కి చెప్పదలచాం. పరిస్థితి క్రమంగా ప్రశాంతత దిశగా సాగుతున్నదని ప్రకటిస్తున్న వాళ్లందరూ వాస్తవాల వక్రీకరణతో తప్పుడు ప్రకటనలు చేస్తున్నారు.

కవులు మానవత్వం గురించి, మొత్తంగా మానవజాతి గురించి మాట్లాడతారు. మేం ఈ నివేదికను కశ్మీరీ కవి రంజూర్ కవితా పాదాలతో ప్రారంభించాం. హిందీ కవి దుష్యంత్ కవితా పాదాలతో ముగించదలచాం. ఈ రెండు కవితా చరణాలూ కశ్మీర్ లో ఏం జరగవలసి ఉన్నదో సూచిస్తున్నాయి.

*కొండలా ఘనీభవించిన ఈ వేదన కరగవలసిందే*
*ఈ హిమాలయాల నుంచి ఏదో ఒక గంగ ప్రవహించవలసిందే*

**మా డిమాండ్లు:**

1. **ప్రశాంత పరిస్థితి నెలకొనేందుకు:** తక్షణమే సైన్యాన్ని, అర్ధసైనిక బలగాలను ఉపసంహరించాలి.
2. **ప్రజలలో విశ్వాసం నెలకొనేందుకు:** తక్షణమే అన్ని కేసులనూ ఎఫ్ఐఆర్‌లనూ రద్దు చేయాలి. అధికరణం 370 రద్దు నాటినుంచీ నిర్బంధంలో, జైలులో ఉంచిన అందరినీ, ప్రత్యేకించి యువకులను తక్షణమే విడుదల చేయాలి.
3. **న్యాయాన్ని నెలకొల్పేందుకు:** సైన్యమూ, ఇతర భద్రతా బలగాలూ అమలు చేసిన విస్తృతమైన హింస మీద, చిత్రహింసల మీద విచారణ జరిపించాలి.
4. **నష్టపరిహారం:** రవాణా సౌకర్యాలు, సమాచార సంబంధాలు లేనందు వల్ల తమ సన్నిహితుల ప్రాణాలు కోల్పోయిన కుటుంబాలన్నిటికీ నష్టపరిహారం ఇవ్వాలి.

**అదనంగా:**

- కశ్మీర్‌లో ఇంటర్నెట్, మొబైల్ నెట్ వర్క్స్ తో సహా అన్ని సమాచార సంబంధాల వ్యవస్థలనూ తక్షణమే పునరుద్ధరించాలి.
- అధికరణం 370, 35ఎ లను పునరుద్ధరించాలి.
- జమ్ము కశ్మీర్ రాజకీయ భవిష్యత్తు గురించి తీసుకోనున్న నిర్ణయాలన్నిటినీ జమ్ము కశ్మీర్ ప్రజలతో సంభాషణా ప్రక్రియ ద్వారా మాత్రమే తీసుకోవాలి.
- జమ్ము కశ్మీర్ పౌర ప్రాంతాలన్నిటి నుంచీ సైనికాధికారులను ఉపసంహరించాలి.
- సైన్యం జరిపిన అత్యాచారాలన్నిటిమీద విచారణ జరపడానికి నిర్ణీత వ్యవధి విచారణ సంఘాన్ని నియమించాలి.

*(మేం కలిసిన వ్యక్తుల భద్రత దృష్ట్యా వారి పేర్లను మార్చడం జరిగింది. ఆ కారణం వల్లనే మేం పర్యటించిన గ్రామాల పేర్లు కూడ రాయడం లేదు.)* వీ

# పిల్లల దృష్టిలో కశ్మీర్ దుర్మార్గం

***కశ్మీర్‌లో చిన్నారి పిల్లల పరిస్థితిపై వచ్చిన హమీద్, తహాన్ అనే రెండు సినిమాల ద్వారా కశ్మీర్ గురించి తెలుసుకోవచ్చు నంటున్నారు* బాలూ**

రాళ్లు విసురుతున్న కశ్మీరీ యువకులను చెదరగొట్టడానికి పోతున్న సిఆర్ఎఫ్ జవాన్ తోవలో కనిపించిన ఒక ఏడేళ్ల బాలుడు హమీద్‌తో 'నువ్వు కూడా పోలీసు మీద రాళ్లు విసరడానికి పోతున్నావా?'

'నేను రాళ్లు విసరను. నువ్వు రాళ్లు విసిరితే వాళ్లు బుల్లెట్లు విసురుతారు. రాళ్లు బుల్లెట్లతో పోటీపడలేవు అని మా అబ్బా (నాయన) చెప్పాడు'.

'మీ తండ్రి సరిగ్గా చెప్పాడు' ఆమోదపూర్వకంగా అన్నాడు సైనికుడు.

'ఎవరికీ మనుషుల ప్రాణాలు తీసుకునే హక్కులేదు – ప్రాణమిచ్చిన అల్లాకు తప్ప అని కూడా మా అబ్బా చెప్పాడు'. సంభాషణ పొడిగిస్తూ హమీద్ సైనికున్ని అడిగాడు. 'మీరెవరినైనా చంపారా?' అని అడిగాడు.

ప్రసన్నంగా బాలుని సంభాషణ వింటున్న సైనికుడు ఇబ్బంది పడ్డాడు.

హమీద్ తాను ఫోన్‌లో అల్లాతో మాట్లాడుతున్నాననుకుంటున్నాడు. హమీద్ అల్లాతో మాట్లాడాలని అంత తీవ్రంగా అనుకుంటున్నాడు. ఒక సంవత్సరం నుంచి కనిపించకుండా పోయిన తన తండ్రిని తన దగ్గరికి పంపించమని అడగాలనుకుంటున్నాడు. తన తండ్రి అల్లా దగ్గర ఉన్నాడనే ఆ బాలుని దృఢ విశ్వాసం.

ఆ పిల్లవాడు అబ్బాతో మాట్లాడేవాడు. అబ్బా అదృశ్యమయ్యాక ఒంటరి అయి అబ్బాను పంపించమని అల్లాతో మాట్లాడాలనుకున్నాడు. అందుకని ఎదురుపడిన సైనికునితో మాట్లాడాడు.

ఆ ఏడేళ్ల పిల్లవానికి కూడా మాట్లాడితే ప్రాణాలు నిలుస్తాయనే ఆశ ఉంది.

ప్రశ్న లేనప్పుడు జవాబు కూడా ఉండదు. ప్రశ్నకు తిరుగులేని జవాబు వచ్చినప్పుడు ఇంక సమాధానం ఉండదు. జవాబు అపరాధాన్ని ఒప్పుకోవడంగా ఉండొచ్చు. పిల్లలను అటువంటి జవాబుతో బుకాయించలేం. ఆ ప్రశ్న రేకెత్తించిన అపరాధ భావంతో బయట పడనూ లేము.

అప్పుడే సంభాషణకు అవకాశం లేని అధికార దుర్వినియోగం అమలవుతుంది. ఇపుడింక కశ్మీర్ ప్రజలు వేస్తున్న ప్రతీ ప్రశ్నకు అధికారం ఎదురు ప్రశ్న వేయడం కూడా అయిపోయింది. కశ్మీరీలతో సంభాషణ మాత్రమే కాదు కశ్మీరీల స్వరాన్ని కూడా కత్తిరించింది. ఇప్పుడు కశ్మీర్‌లోయలో నుంచి ప్రతిధ్వని తప్ప ధ్వనిలేదు.

ఫిర్యాదూ దుఃఖమూ అధికార దర్పం బుల్‌డోజర్ కింద అణచబడినాయి. ఆ స్వరం ఆ నేల మాత్రమే వినగలదు.

తల్లి మిగిలిన తహాన్‌కు తల్లితో పాటు తండ్రిని వెతికే పనిమాత్రమే కాదు, ఆ ఎనిమిదేళ్ల పిల్లవానికి తమ జీవనాధారమైన గాడిదను వ్యాపారి నుంచి తిరిగి తెచ్చుకోవాలనే ఆకాంక్ష అవసరం ఉన్నాయి. ఎందుకంటే తనను వెంటేసుకొని తండ్రి కోసం ఎక్కిన గడప దిగిన గడపగా ఉన్న తల్లికి ఆశలు కరిగిపోతున్నట్టుగానే ఆర్థిక వనర్లు లేకుండాపోయాయి.

అయితే ఆ పిల్లవానికి తమ గాడిద అప్పుకింద వ్యాపారి బలవంతంగా తోలుకపోయాడని తెలుసు కానీ, ఆ తల్లికి తన భర్తను వెతికే క్రమంలో వేల మంది తమవంటి కోల్పోయిన మనుషులు కనిపించారు. ఒకరి భర్త, ఒకరి తండ్రి, ఒకరి కొడుకు, ఒకరి భార్య, ఒకరి కూతురు – ప్రతీ ఒక్కరికీ ఎవరో ఒక రక్తబంధువు.

ఒకరు కాదు, ఇద్దరు కాదు పదివేల మంది – పదివేల మంది అదృశ్యమైతే ఎన్నివేల కుటుంబాల కన్నీటి సెలయేర్లు ప్రవాహమవుతాయి. దుఃఖమైనా అన్వేషణలో దృఢపడి, ఒంటరి దుఃఖం సామూహిక డిమాండు అయితే, ప్రవాహమైతే దానిని అరికట్టడం ఎవరితరం?

అప్పుడు తండ్రిని, గాడిదను పోగొట్టుకున్న ఆ ఎనిమిదేళ్ల బాలుని చేతికి గ్రెనేడ్ వస్తుందా? ఎవరు చెప్పగలరు? రావలసిన న్యాయం రావాల్సిన రీతిలో, రావాల్సిన సమయంలో రాకపోతే పది సంవత్సరాలు గడిచాక హమీద్ తన తండ్రి, అతని తల్లి తన భర్త తిరిగి వస్తాడన్న ఆశలు వదులుకున్నారు.

తిరిగిరారని తెలిసిన పదివేల మంది కుటుంబాలు మిగిలిన మనుషులకు న్యాయం జరగాలని డిమాండు చేస్తున్నారు. ఎవరు వాళ్లను అదృశ్యం చేశారో చెప్పమంటున్నారు. ఆ అదృశ్యం చేసే అధికారం ఎవరిచ్చారని అడుగుతున్నారు.

ఆ ప్రశ్న వేస్తున్న హమీద్ పాత్రదారి అర్షద్ రెషీకి జాతీయ అవార్డు ఇవ్వడంతోను, ఆగస్ట్ 5న 370, 35ఎ రద్దుచేసి జమ్ము కశ్మీర్ శరీరాన్ని రెండుగా చీల్చి కేంద్రం – అది తన అధీనంలోకి వచ్చిన భూభాగం అని ప్రకటించడం వల్లనో జవాబు లభించినట్లేనా?

షట్‌డౌన్‌లో, లక్షల సైనిక ఉక్కుబూట్ల పదఘట్టనల్లో, కర్ఫ్యూలో, బ్లాక్ అవుట్‌లో, ఫోను, సామాజిక మాధ్యమాలు, ఇంటర్నెట్, ప్రసార, ప్రయాణ సాధనాలు రద్దు చేసి ప్రశ్నించే ప్రతి ఒక్కరినీ, అనుమానించే ప్రతి ఒక్కరినీ బంధించడం జవాబవుతుందా?

ఆజాదీ కశ్మీరు ఆకాంక్షలు గల యువతరం నాయకుడు బుర్హాన్ వనీని ఎన్‌కౌంటర్ పేరుతో భారత సైన్యం చంపేసిన తర్వాత 133 రోజులు కశ్మీరు లోయలో ఇదే స్థితి ఏర్పడింది. ఆ తర్వాత ఒక రిపోర్టర్ ఆరుగురు పిల్లలను ఇండియా గురించి మీరేమనుకుంటున్నారు అని అడిగాడు.

'ఇండియా అంటే పోలీసు. అది పిల్లలను కొడుతుంది'.

అంతర్జాతీయం

# స్టీఫెన్ హాకింగ్ హెచ్చరికల సారాంశం

***యుద్ధ అవసరాల కోసం సామ్రాజ్యవాద దేశాలు భూగ్రహంపై చేస్తున్న ప్రకృతి విధ్వంసాల వల్ల భవిష్యత్‌లో మానవ మనుగడే ప్రశ్నార్థకమయ్యే ప్రమాదం ఉందని స్టీఫెన్‌హాకింగ్ హెచ్చరిస్తున్నారని అంటున్నారు*** **సత్యం**

ప్రముఖ థియరెటికల్ ఫిజిసిస్ట్, కాస్మాలజిస్ట్, రచయిత స్టీఫెన్ హాకింగ్ శాస్త్రరీత్యా ఈ భూమండలం గురించి చేసిన వ్యాఖ్యానాలు ముఖ్యమైనవి. సమకాలీన పరిస్థితులపై ఆయన చేసిన ప్రకటనలు చూడండి.

'మానవజాతి చరిత్రలోనే ఇది అత్యంత గడ్డు పరిస్థితి. ముందు మానవుడి ఉనికే ప్రశ్నార్థకమయ్యే ముప్పు పొంచి ఉంది. ప్రకృతితో పాటు సాంకేతిక సమస్యలనూ ఎదుర్కోవాల్సి వస్తుంది. భూగోళాన్ని సమూలంగా నాశనం చేసే సాంకేతికతను అభివృద్ధి చేసుకోగలిగాం. కాని మరో ఆవాసాన్ని వెతుక్కునే శక్తిని మాత్రం సంపాదించుకోలేక పోయాం.

మనకున్నది ఒకే ఒక గ్రహం. దీన్ని రక్షించుకోవడానికి కృషి చేయాలి. ప్రస్తుత రాజకీయాలపై సామాన్యుడు మండిపడుతున్నాడు. కృత్రిమ మేధస్సుతో ఆటోమేషన్ పెరిగి ప్రజల ఉపాధిని లాగేసుకుంటోంది. మేధావులంతా ఏకమైతే ఈ సవాళ్లను అధిగమించడం అసాధ్యమేమీ కాదు'.

విశ్వం - మానవాళి పుట్టుక అనే అంశంపై ఆయన ఆక్స్‌ఫర్డ్ యూనియన్ డిబేటింగ్ సొసైటీలో మాట్లాడుతూ...

'పతనావస్థకు చేరిన ఈ భూమిపై నుంచి మరో గ్రహానికి వెళ్లకుంటే మరో వెయ్యేళ్లు ఇక్కడ మానవాళి మనుగడ ఉంటుందని నేను అనుకోవడం లేదు. గత 50 ఏండ్లుగా భూమిపై అత్యుత్తమ ఆవిష్కరణలు జరిగాయి. శాస్త్ర పరిశోధనలకు 2016 ఒక గొప్ప సంవత్సరం. మానవులం కూడా ప్రకృతి వనరులమే. కాకుంటే ప్రకృతిని మనం బాగా అర్థం చేసుకోగలం. హిగ్స్ బోసాన్‌ను కనుగొన్నాం. (గాడ్ పార్టికల్) గురుత్వాకర్షణ తరంగాలను ఆవిష్కరించాం. బిగ్ బ్యాంగ్ థియరీని అర్థం చేసుకోవడానికి గురుత్వాకర్షణ తరంగాలను వినియోగించుకునే స్థాయికి చేరుకున్నాం. అయితే కొత్తగా వస్తున్న సాంకేతిక పరిజ్ఞానాన్ని సరిగ్గా వినియోగించకోకపోతే ముప్పు వాటిల్లుతుంది' అని అన్నారు.

పారిస్‌లో జరిగిన వాతావరణ ఒప్పందం నుంచి వైదొలగాలని అమెరికా అధ్యక్షుడు ట్రంప్ నిర్ణయించారు. ఈ నిర్ణయం భూమిని మండించడమేనని స్టీఫెన్ హాకింగ్ హెచ్చరించారు.

'ట్రంప్ నిర్ణయంతో తిరిగి కాపాడుకోలేనంత తీవ్ర స్థాయిలో భూమి వాతావరణంలో మార్పులు సంభవించే ప్రమాదముంది. భూతాపాన్ని తగ్గించలేని స్థాయిలో చివరి స్థితి (టిప్పింగ్ పాయింట్)కి అతి చేరువలో ఉన్నాం. ట్రంప్ నిర్ణయం భూమిని ఆ చివరి పాయింట్ నుండి తోసివేయడం వంటిదే. దీనితో భూమి, శుక్రగ్రహం (వీనస్) ఉష్ణోగ్రత 250 సెల్సియస్‌కు చేరుకుంటుంది. ఈ అమెరికా విధానాలు భావితరాలకు భూమి లేకుండా చేయడమే' అని అన్నారు.

గత దశాబ్ద కాలం నుండి ప్రపంచ దేశాలలో మితవాద ప్రభుత్వాలు గణనీయంగా అధికారంలోకి వచ్చాయి. మరీ ముఖ్యంగా అమెరికా, యూరప్‌లలో. ఇటు భారతదేశంలో కూడా మితవాద, మతవాద శక్తులు అధికారంలోకి వచ్చాయి. వరల్డ్ ట్రేడ్ ఆర్గనైజేషన్ (డబ్ల్యుటిఒ) పెట్టుబడిదారీ ప్రధాన దేశాలు వ్యాపారాన్ని ప్రపంచీకరణ చేశాయి.

---

'ఇండియా మోసకారి దేశం. అది మా దేశమే అయితే ఇంతమంది మనుషుల్ని చంపేదా? మా దేశంలో మా మనుషుల్ని మేము చంపుతామా? మా దేశం కాని ఇండియాలో మేం ఉండలేము'.

'ఇండియా నియంత. ఇండియా మనుషుల్ని చంపుతుంది. మాయం చేస్తుంది. నేను ఆజాదీ కశ్మీరు కోరుకుంటున్నాను. నేను ఇండియాతోనో, పాకిస్తాన్‌తోనో ఉండాలనుకోవడం లేదు. నేను బయటికి పోవడానికి భయపడుతున్నాను. బయటికిపోతే పోలీసులు నన్నేమైనా చేయవచ్చు. నేను వాళ్లను నమ్మలేను. వాళ్లు నన్ను చంపేయవచ్చు. నేను బయట ఆడుకోలేను. నేను ఎవరితో ఆడుకోవాలి? బయట వీధుల నిండా భారత సైనికులు ఉన్నారు" అన్నారు వాళ్లు.

ఇప్పుడు ఫోన్ కనెక్ట్ అయినా హమీద్ సిఆర్‌పిఎఫ్ పోలీసుతో మాట్లాడాలనుకోడు. తృషా గుప్తా వలె ఆగస్టు నుంచి మీలో చెలరేగుతున్న భావాలను మేం రాయలేకపోవచ్చు. రాయడానికి ధైర్యం చేయకపోచ్చు.

అంతర్జాతీయ సినిమా ఉత్సవాల్లో ఆంద్రే టార్కోవిస్కీ ఇవాన్స్ చైల్డ్‌హుడ్ (1962), జియాద్ దౌరీ వెస్ట్ బీరూట్ (1998), కుర్దిష్ దర్శకుడు బిహ్మన్ ఘొబాడ్ 'టర్ట్స్ కెన్‌ఫ్లై' (2004), కాబూల్ నేపథ్యంతో యూసుఫ్ బరానే 'మినావాకింగ్' (2015) చూసే ఉంటారు.

కశ్మీర్ గురించి మాత్రం అటువంటి సినిమాలు థియేటర్‌లోనూ, టీవిల్లోనూ చూసి ఉండరు. 'దేశభక్తి'ని, ద్వేషాన్ని ప్రబోధించేవేతప్ప.

కనుక కనీసం ఈ నిశ్శబ్ద వాతావరణంలో ఐజాజ్‌ఖాన్ 'హమీద్', సంతోష్ శివాన్ 'తహాన్' సినిమాలను ఆన్‌లైన్‌లో చూడండి తలుపులు బిగించుకొని, ఊపిరి బిగబట్టి - ఆ పిల్లలు మీ ఆత్మలనేమైనా స్పృశిస్తారేమో.

*(రచయిత సామాజిక కార్యకర్త)*

వీ

దీన్నే గ్లోబలైజేషన్ అంటున్నారు.

మల్టీనేషనల్స్ లాభాలను, వాటి పట్టును పెంచడానికి పెట్టుబడిదారీ వర్గం చివరి అస్త్రంగా దీన్ని కొంతమంది ఆర్థిక వేత్తలు పేర్కొంటున్నారు. మల్టీనేషనల్స్ పట్టును పెంచడమంటే ప్రపంచ పరివ్యాప్తంగా పెట్టుబడిదారీ విధానాన్ని నిలదొక్కుకునేలా చేసి అమెరికా ప్రాబల్యాన్ని బలోపేతం చేయడమే తప్ప వేరేమీకాదు. అయితే ఈ లక్ష్యానికి ప్రాంతీయ దేశాల నుండి, మరీ ముఖ్యంగా అరబ్ దేశాల నుండి, తూర్పు ఆసియా నుండి తీవ్రమైన ప్రతిఘటన ఎదురవుతూ ఉంది.

లాభాపేక్షతో ఉత్పత్తి సాధనాలను సమాజపరం చేయకుండా ఉండలేని పరిస్థితి, పెట్టుబడికి, శ్రమకు మధ్య ఉన్న వైరుధ్యాన్ని పరిష్కరించలేని పాలకవర్గాల చేతగానితనం ఆర్థిక సంక్షోభాలకు దారితీస్తోంది. 2019 డిసెంబర్ నుండి పెట్టుబడిదారీ దేశాలలో ప్రారంభమవుతుందని ఊహించిన ఆర్థిక మాంద్యం లక్షణాలు ఇండియాలో ముందుగానే బహిర్గతమయ్యాయి.

ఆటోమొబైల్ రంగం అతలాకుతలం అవుతోంది. లాకౌట్లు, నిరుద్యోగం, రిట్రెంచ్‌మెంట్లు సర్వసాధారణమయ్యే పరిస్థితి రూపొందింది. ఇదిలా ఉండగా అణ్వాయుధాలను అదుపులో పెట్టడం కోసం ఉత్తర కొరియా లాంటి చిన్న దేశంతో రెండు మూడు దఫాల చర్చలకు ట్రంప్ సమాయత్తమయ్యాడు.

అమెరికా డ్రోన్‌లను ఇరాన్ సముద్రంలో ముంచివేసినా, ప్రతీకారంగా సైబర్ అటాక్ గురించి అమెరికా మాట్లాడుతోందే గాని సైనిక చర్యలకు, మరో యుద్ధ రంగాన్ని ప్రారంభించడానికి వెనకాడుతోంది.

ఉత్తర కొరియా లిబియా లాగా మారుతుందని హెచ్చరికలు చేసినప్పటికీ సైనిక దాడికి వెనుకంజ వేస్తోంది. అయితే ఆ దేశాలకు అమెరికా నుండి యుద్ధ ప్రమాదం లేదని కొట్టివేయలేము. సామ్రాజ్యవాదమంటే యుద్ధమే. చైనా, రష్యా నుండి తీవ్రమైన అననుకూల పరిస్థితులు అమెరికాను చుట్టుముట్టాయి.

వ్యాపార యుద్ధాన్ని, వ్యాపార చర్చలను మిలటరీ ఆధిక్యత ప్రభావితం చేస్తోంది. చైనాతో వ్యాపార చర్చలు కొనసాగేప్పుడు చైనా సముద్ర ప్రాంతం దగ్గరలో అమెరికా తన యుద్ధ నౌకలను మోహరించింది. చైనా ఈ చర్యపై తీవ్రంగా ప్రతిస్పందించింది.

సామ్రాజ్యవాదుల చేతుల్లో మరీ ముఖ్యంగా అమెరికా, యూరప్ గుప్పెట్లో అత్యున్నత సాంకేతికత ఉన్నప్పటికీ వాటి ప్రయోగానికి, ప్రధానంగా ప్రపంచ ప్రజల వ్యతిరేకతను ఎదుర్కోవలసి వస్తుందనే భీతితోనే ఆయా దేశాలు వెనకాడుతున్నాయి. అంతేకాదు, స్టీఫెన్ హాకింగ్ చెప్పినట్లుగా భూమిని సమూలంగా నాశనం చేసే ఉన్నత సాంకేతిక విజ్ఞానం కూడా ఒక కోణంలో వారిని కట్టడి చేస్తోంది.

స్టీఫెన్ హాకింగ్ సరియైన పరిస్థితులలో తన అభిప్రాయాలను నిర్మొహమాటంగా చెప్పడం హర్షణీయం. నేటి పరిస్థితిని తీవ్రంగా నిరసిస్తూ ఆయన ఇలా అన్నారు.

'మనకు అవసరమున్నన్ని యంత్రాలు ఉత్పత్తి చేస్తే దాని ఫలితం అవి ఎట్లా పంపిణీ అవుతాయో అనేదాని మీద ఆధారపడుతుంది. యంత్రాలు ఉత్పత్తి చేసే సంపదను అందరూ పంచుకుంటే ప్రతి ఒక్కరూ సుఖమైన, విశ్రాంత జీవితాన్ని అనుభవించొచ్చు. లేకపోతే యంత్రాల యజమానులు సంపద పునఃపంపిణీకి వ్యతిరేకంగా వ్యవస్థను తిప్పుకుంటే ఎక్కువ మంది ప్రజలు పేదరికంలో మగ్గుతారు. ఇప్పటివరకు రెండవ దానిపైనే నడిచే ధోరణి కనిపిస్తుంది. సాంకేతిక పరిజ్ఞానం నానాటికీ అసమానత పెరగడం వైపే దారితీస్తోంది'.

ఈనాడు ఉనికిలో ఉన్న వర్గ సమాజంలో విజ్ఞాన శాస్త్రం అధికారిక, ఉదారవాద విజ్ఞాన శాస్త్రంగా రూపొందిన పరిస్థితులలో ఒక శాస్త్రవేత్త ప్రజల పక్షాన ఇంత స్పష్టంగా మాట్లాడడం జె.డి. బెర్నాల్ తర్వాత ఇదే మొదటిసారి.

గెలిలియో కాలంలోనూ (16వ శతాబ్దం) 18వ శతాబ్దం వరకు కూడా విజ్ఞాన శాస్త్రం మతధర్మ శాస్త్రం (థియోలజీ)తో కట్టివేయబడి ఉండేది. శాస్త్రవేత్తలు వ్యక్తులుగా తమ పరిశోధనలు కొనసాగించేవారు. ఇప్పటి పరిస్థితి వేరుగా ఉంది.

మార్క్స్ – సైన్స్ గ్రంథంలో జె.డి. బెర్నాల్ ఇలా వివరించారు.

"విజ్ఞాన శాస్త్రంలో సంక్లిష్టత పెరగడంతో దాని వ్యయం ఎంతగా పెరిగిపోయిందంటే ఆ రంగం సహాయం కోసం దాదాపు పూర్తిగా ప్రభుత్వం పైన గాని లేక గుత్త సంస్థల పైన ఆధారపడవలసి వచ్చింది. ఈ ప్రభుత్వాలు ఇప్పుడు సహాయాన్ని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో మిలటరీ లక్ష్యాల కోసం ఇస్తున్నాయి.

అమెరికా, బ్రిటన్‌లలో ఇప్పటికే విజ్ఞాన శాస్త్రంపై ప్రభుత్వ ఖర్చులలో 80 శాతం యుద్ధ అవసరాల కోసమే కేటాయిస్తున్నారు. ఆ నిష్పత్తి ఎంత వేగంగా పెరుగుతుందంటే వెనకబడిన దేశాలలో చివరికి అభివృద్ధి చెందిన దేశాలలో కూడా ప్రజల స్థితిగతులు మెరుగు పరచడం కోసం జరిగే పరిశోధన ఖర్చులలో కోత విధించబడుతున్నది, లేక పూర్తిగా నిలిపివేయబడుతున్నది.

మిలటరీ లక్ష్యాల కోసం విజ్ఞాన శాస్త్రాన్ని ఉపయోగించడం అనివార్య ఫలితంగా పరిశోధన వివరాలను రహస్యంగా ఉంచాలనీ శాస్త్రవేత్తలను వేధించడం జరుగుతోంది. స్వేచ్ఛగా పరిశోధనలు చేయడం, పరిశోధనా ఫలితాలను ప్రచురించడం అనే పాతకాలం ఆలోచనలు క్రమంగా అణిచివేయడం జరుగుతున్నది. వాటి స్థానంలో తనిఖీలు, పోలీసుల పర్యవేక్షణ, డిస్‌మిస్‌లు, నిర్బంధించడం మొదలైంది. దీనితో ఆధునిక శాస్త్రవేత్తలు ఎంతమాత్రం స్వేచ్ఛగా లేకపోగా వాళ్లు రోమన్ కాలంలో అత్యధిక ఖర్చుతో శిక్షణ పొందిన గ్రీకు బానిసలకంటే ఏమీ మెరుగ్గా లేరు".

అయితే రెండు సంవత్సరాల క్రితం అమెరికా, పశ్చిమ దేశాలు, ఇండియాలో కూడా శాస్త్రవేత్తలు, సైన్స్ రీసర్చ్ స్కాలర్స్ కొన్ని డిమాండ్లను ముందుకు తెచ్చి వీధుల్లోకి వచ్చారు. ఆ డిమాండ్ల తీరుతెన్నులు ఏమైనప్పటికీ లాబరేటరీల నుండి బయటకు వచ్చి వీధుల్లో ప్రదర్శనలు చేపట్టడం ముదావహం.

ఈ పరిణామాలపై స్టీఫెన్ హాకింగ్ ప్రభావం తక్కువేమీ కాదు. స్టీఫెన్ హాకింగ్ ఇప్పుడు మనమధ్య లేరు. అయినప్పటికీ ఆయన చేసిన హెచ్చరికలు సామ్రాజ్యవాదుల పట్ల నిరంతర అప్రమత్తతను ప్రజలకు చెబుతున్నాయి. భూతలంపై సామ్రాజ్యవాదాన్ని తుదముట్టించితే గాని మానవాళి మనుగడకు ముప్పు తొలగదని ఆ హెచ్చరికల సారాంశం.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# నూతన వైద్య కమిషన్ - ఒక సమీక్ష

***కేంద్ర ప్రభుత్వం తెచ్చిన జాతీయ మెడికల్ కౌన్సిల్ బిల్లుతో పాలకుల నియంత్రణ వల్ల వృత్తిపరమైన నాణ్యత కొరవడుతుందనీ, ఇది వైద్యరంగాన్ని ప్రైవేట్‌పరం చేయడంలో భాగమేననీ అంటున్నారు* కేశవ్**

ఆగస్ట్ 10న పశ్చిమ బెంగాల్‌లోని జూనియర్ వైద్యులు కొత్తగా వచ్చిన భారతీయ వైద్య కమిషన్ బిల్లుకి వ్యతిరేకంగా తమ నిరసనను తెలుపుతూ ర్యాలీలో పాల్గొన్నారు. ప్రఖ్యాత కలకత్తా నేషనల్ మెడికల్ కాలేజిలో ఈ ర్యాలీ ఆరంభమై అక్కడే ముగిసింది. ఈ బిల్లు వైద్య విద్య ప్రైవేటీకరణకు దారి తీస్తుందనీ, వైద్యంలో నాటు వైద్యానికి ప్రోత్సాహం ఇస్తుందనీ, లంచాలతో మరిన్ని ప్రైవేటు వైద్యశాలలు అవిర్భవిస్తాయనీ వైద్యులు అభిప్రాయపడుతున్నారు. ఇంతకు ముందు, ఈ బిల్లుకి వ్యతిరేకంగా భారతీయ మెడికల్ అసోసియేషన్ ఆధ్వర్యంలో వైద్యుల సమ్మె కూడా దేశం మొత్తం మీద నిర్వహించారు. ఈ ఏడాది ఆగస్ట్ 1న కేంద్ర ప్రభుత్వం భారతీయ వైద్య కమిషన్ బిల్లుని ప్రతిపాదించింది. ఇంతకు ముందున్న భారత వైద్య మండలి చట్టానికి బదులుగా ఈ చట్టం కార్యరూపంలోకి వస్తుంది. ఈ కొత్త బిల్లుకి వ్యతిరేకంగానే వైద్యులు సమ్మె చేశారు. బిల్లులోని ప్రతిపాదనలు వైద్యులకు మాత్రమే వర్తించవు. సాధారణ ప్రజల మీద కూడా పరోక్షంగా వీటి ప్రభావం ఉంటుంది.

**కొత్త చట్టానికి నేపథ్యం**

ప్రభుత్వం వాదన ప్రకారం చూస్తే, ఇప్పుడున్న మెడికల్ కౌన్సిల్ నిర్వహణలో, వైద్య విద్యలో నాణ్యత కనిపించడం లేదు. అవినీతిని అరికట్టలేకపోతున్నాం. మేధావులు మాత్రమే, వైద్యవిద్యలో చేరేలా లేదు. విజ్ఞాన శాస్త్రం మీద నిజమైన ఉత్సాహం ఉన్న విద్యార్థులు మాత్రమే వైద్య విద్యలోకి చేరేలా ఇప్పుడున్న చట్టాలు లేవు. వైద్య విద్య మీద నియంత్రణ అవసరం. దీన్ని నిరోధించడానికి చట్టంలోనే సమూలమైన మార్పులు అవసరం. ఈ మార్పు దేశం మేలు కోసమే చేయడమవుతుంది. వైద్య విద్యను మరింత నాణ్యతగా మార్చడానికి మాత్రమే ఈ మార్పు అనివార్యం అవుతుంది. లోప బూయిష్టమైన వైద్య విద్య దేశం మేలు కోసం, దేశ ప్రజల మేలు కోసం పనికొచ్చేలా ఈ కొత్త చట్టం అవసరం. ప్రభుత్వం మరో వాదన ప్రకారం, గ్రామీణ ప్రాంతాల్లో వైద్యుల సంఖ్య చాలా తక్కువ. ఉన్న కాస్తా వైద్యులంతా పట్టణాల్లోనూ, నగరాల్లోనే కేంద్రీకృతమై ఉన్నారు. అందుకే కొత్తరకం వైద్యుల్ని సృష్టించాల్సి ఉంది. కొత్తరకం అల్పకాలీన తర్ఫీదునిచ్చి కొత్తరకం వైద్యుల్ని సృష్టిస్తే, కొన్ని వేలమంది వైద్యుల్ని సునాయాసంగా దేశానికి అందివ్వగలం. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలకు ఇవ్వగలం. వైద్యుల కొరతకు పరిష్కారం దొరుకుతుంది. ఈ ఆలోచనలు సఫలీకృతం ఎంతవరకు అవుతాయనే విషయం సమీక్షించే ముందు కొత్త చట్టం ప్రకారం భారతీయ వైద్య కమిషన్ రూపురేఖలు ఎలా ఉంటాయో ఓసారి చూద్దాం.

**ఉన్నత వైద్య మండలి– మారిన వైద్య కమిషన్**

ఇప్పటివరకు ఉన్న ఇండియన్ మెడికల్ కౌన్సిల్ యాక్ట్, 1956కు ప్రత్యామ్నాయంగా ఇప్పుడు నేషనల్ మెడికల్ కమిషన్ బిల్-2019 అమల్లోకి వచ్చింది. ముందున్న మండలిలో ఎన్నికల ద్వారా రాష్ట్రాల నుండి వచ్చిన సభ్యులు ఎక్కువ. మారిన కమిషన్‌లో నామినేట్ అయిన వైద్యుల సంఖ్య ఎక్కువ. కొత్త చట్టం ప్రకారం, అధికారాలు కేంద్రానికే ఉంటాయి. ప్రజాస్వామ్యబద్ధమైన మెడికల్ కౌన్సిల్ ఎన్నికల విధానంలో సమూలమైన మార్పు ఉంటుంది. 25 శాతం సభ్యులు మాత్రమే ఎన్నికల ద్వారా చేరతారు. కొత్త చట్టం ప్రకారం, ఇదే సంస్థను జాతీయ మెడికల్ కమిషన్ అంటారు. ఇందులో మెజారిటీ సభ్యులు ప్రభుత్వం ద్వారా నామినేట్ అవుతారు. కొత్త బిల్లులోని సెక్షన్ 4 ప్రకారం ఇందులో 26 మంది సభ్యులుంటారు. అందులో 21మందిని కేంద్రమే నామినేట్ చేస్తుంది. ముందున్న కౌన్సిల్‌లో మొత్తం 100 మంది రాష్ట్రాల నుండే ఎన్నికై వచ్చేవారు. ఈ వందమంది నామినేట్ అయ్యే ప్రసక్తే లేదు. కానీ, కొత్త చట్టంలో ఎన్నికల ప్రజాస్వామ్యం గాలికొదిలేశారు. సెక్షన్ 10 ప్రకారం, 50 శాతం సీట్లను యాజమాన్యం స్వేచ్ఛగా అమ్ముకోవచ్చు. మిగిలిన మరో 50 శాతం సీట్ల విషయంలో కూడా ప్రభుత్వం మార్గ దర్శకత్వం చూపిస్తుంది. ఫీజులు ఎంత తీసుకోవాలి, ఎంత తీసుకోకూడదు అనే విషయంలో గరిష్ట పరిమితి లేదు. దేశంలో 40 వేల అండర్ గ్రాడ్యుయేషన్‌లు, 20 వేల పోస్ట్ గ్రాడ్యుయేషన్‌లు అందుబాటులో ఉన్నాయి. ఇందులో 85 శాతం ప్రభుత్వం నియంత్రించేది. ఇప్పుడు కొత్త చట్టం ప్రకారం, ప్రభుత్వం చేతిలో ఎన్ని ఉంటాయనేది సందేహమే. సెక్షన్ 15 ప్రకారం, మెడికల్ కోర్సు కోసం అయిదున్నర సంవత్సరాలు శ్రమించిన తర్వాత ఎగ్జిట్ పరీక్ష ఇకనుండి రాయాల్సి ఉంటుంది. ఎంబిబిఎస్ పరీక్ష పాసయినట్టు సర్టిఫికేట్ కావాలన్నా, పిజి కోర్సు చెయ్యాలన్నా, వైద్య వృత్తికోసం లైసెన్సు, రిజిస్ట్రేషన్ కావాలన్నా ఈ పరీక్ష తప్పనిసరి.

పాత చట్టం ప్రకారం కౌన్సిల్ కాల వ్యవధి ఐదు సంవత్సరాలు. కొత్త చట్టం ప్రకారం ఇది నాలుగు సంవత్సరాలు. ముందున్న కౌన్సిల్‌లో ఉన్న సభ్యులు అందరూ వైద్యులే. వింతైన విషయం ఏమిటంటే, కొత్తగా ఏర్పడబోతున్న వైద్య కమిషన్‌లో, ఇరవై అయిదు మంది సభ్యుల్లో ముగ్గురు మాత్రం వైద్య రంగానికి సంబంధం లేని సభ్యులు ఉంటారు. ఛైర్మన్ ను ప్రభుత్వం నామినేట్ చేస్తుంది. మెంబర్లను కూడా ప్రభుత్వం నామినేట్ చేస్తుంది. బోర్డు మెంబర్లలో అయిదు మంది ఎన్నికయి వస్తారు. పన్నెండు మంది ఎక్స్ అఫిసియోలు ఉంటారు. ఎన్నికయిన వారు తక్కువ ఉంటారు. ఎంపికైన వారు ఎక్కువ ఉంటారు. చట్టం వచ్చిన మూడు సంవత్సరాల్లోగా రాష్ట్రాలు తమ రాష్ట్ర వైద్య కమిషన్లు ఏర్పాటుచేసుకోవాలి. మొదటి చట్టం ప్రకారం ఎంసిఐలో 15 శాతం సీట్లు ప్రైవేటు వైద్యశాలలు అమ్ముకోవచ్చు. కొత్త చట్టం ప్రకారం, ఎన్ఎంసిలో 50 శాతం సీట్లు ప్రైవేటు వైద్య శాలలు అమ్ముకోవచ్చు. ఎన్ఎంసి కింద గుర్తింపు పొందిన

కాలేజీలు సీట్లను పెంచుకోగలవు. ఎవరి అనుమతి కూడా అవసరం లేదు. పిజి కోర్సులు కూడా పెట్టుకోగలవు. ఎన్ఎంసిలో వైద్యులు మైనారిటీగానే ఉంటారు. తీసుకున్న నిర్ణయాలను వారు వ్యతిరేకించినా మెజారిటీ నిర్ణయానికి కట్టుబడాల్సిందే. ఈ మెజారిటీలో వైద్యంలో ఓనమాలు తెలీని బ్యూరోక్రాట్లు ఉంటారు. విచిత్రమేమిటంటే, వీరే వైద్యశాలల గురించి నిర్ణయాలను చేస్తారు. వైద్య చరిత్రను ప్రభావితం చేసే కీలకమైన నిర్ణయాల మీద వైద్యం తెలీని ఈ ఆఫీసర్ల స్టాంపు మాత్రమే ఉంటుంది. ఏటా 68 వేల మంది ఎంబిబిఎస్ పరీక్ష పూర్తి చేస్తున్నారు. అందులో 23 వేలమంది పి.జి.లో చేరుతున్నారు. మిగిలిన వారు సాధారణమైన ఎంబిబిఎస్ వైద్యులే. అయితే ఎన్ఎంసి ప్రకారం వీరు ఫైనల్ ఇయర్ లో ఎగ్జిట్ పరీక్ష రాయాల్సి ఉంటుంది. అందులో ఉత్తీర్ణులు అయితేనే వైద్యం చెయ్యడానికి అర్హులు అవుతారు. కాకపోతే, పనికి రానట్టే. బిహెచ్ఎంఎస్, బిఎఎంఎస్, సిద్ధ, యునాని, ప్రకృతి వైద్య కళాశాలల్లో ఫిజియాలజీ, అనాటమీ లాంటివి నేర్చిన ప్రత్యమ్నాయ వైద్యులకు ఆరు మాసాల బ్రిడ్జి కోర్సు నిర్వహిస్తారు. ఇది పాసయితే, ఆధునిక వైద్యం చేసుకోవచ్చు. ఇలా మూడున్నర లక్షల కమ్యూనిటీ వైద్యులు ముందుకొస్తారు.

**వైద్యుల వ్యతిరేకత ఎందుకు?**

కొత్త చట్టంలో ప్రజాస్వామ్య వ్యతిరేక లక్షణాలు స్పష్టంగా వైద్యులకూ, కార్యకర్తలకూ కనిపిస్తున్నాయి. ఎన్నికై కమిషన్‌లోకి చేరిన సభ్యుల సంఖ్య గణనీయంగా తగ్గించేశారు. ప్రభుత్వం చాలా సునాయాసంగా వైద్య విద్యను నియంత్రించగలిగే సూచనలు వైద్యులకు కనిపిస్తున్నాయి. కమిషన్‌లో వైద్య రంగానికి సంబంధంలేని సభ్యుల అవసరం ఏమిటో, వారెలా వైద్య రంగంలోని విషయాల పట్ల నిర్ణయాలు తీసుకోగలరో వైద్యులకు అర్థం కావడం లేదు. ప్రభుత్వం నామినేట్ చేసే సభ్యులు ఎవరి ప్రయోజనాల కోసం పనిచేస్తారో వైద్య రంగానికి అర్థం అవుతూనే ఉంది. ఎంబిబిఎస్ పూర్తిచేసిన తర్వాత కూడా ఎగ్జిట్ పరీక్ష పాసయితేనే ప్రాక్టీస్‌కి అవకాశం ఉంటుంది. ఈ కొత్త పద్ధతి వైద్యులకు తలనొప్పి వ్యవహారంగా ఉంది. ఆధునిక వైద్యంలో అవగాహన లేని సిద్ధ, యునాని ఆయుష్ వైద్యులు కూడా బ్రిడ్జి కోర్సు చేసి ఆధునిక వైద్యంలో ప్రాక్టీసు చెయ్యొచ్చు. గ్రామీణ ప్రాంతాల్లో వైద్యులు లేని సమస్యను ఇది పరిష్కరిస్తుందా? కొత్త రకం తప్పుడు వైద్యానికి పునాది వేస్తుందా? అనేది సందేహమే.

**ప్రపంచీకరణలో భారతీయ వైద్య కమిషన్**

మిగిలిపోయిన రెండో విడత స్వేచ్ఛా వాణిజ్యం, ఆర్థిక సరళీకరణల కోసం కార్పొరేటు శక్తులు మోడీ ప్రభుత్వానికి మరోసారి ఎన్నికల మార్గం సుగమం చేశాయి. విపరీతమైన డబ్బుని ప్రచారాల కోసం సోషల్ మీడియాలోనూ, టెలివిజన్ లోనూ వెదజల్లాయి. అబద్ధాలూ, అవాస్తవాలూ దేశభక్తి పేరు మీద సోషల్ మీడియాను ఆక్రమించాయి. దేశం మొత్తాన్ని ఒక్క బలమైన నాయకుడు మాత్రమే నడిపించగలరనే తప్పుడు సందేశాన్ని నింపేశాయి. ఆర్థిక సరళీకరణల మరో విడతకు ఇప్పుడు రంగం సిద్ధమయింది. విద్య, వైద్యం విపరీతమైన లాభాల పంటను తీసుకొచ్చే రంగం. మందులు, వైద్యం డయాగ్నోస్టిక్ సేవలు మొదలైనవి ప్రపంచీకరణ గుప్పెట్లోకి ఏనాడో వెళ్లిపోయాయి. అనవసరమైన వైద్య పరీక్షలు లేనిదే ఈ రోజు వైద్యులు ట్రీట్ మెంటు ఇవ్వని పరిస్థితి ఉంది. ఈ వైద్య పరీక్షల్లో విపరీతమైన కమిషన్లు. వైద్యం చదువు కోసం లక్షలు, కోట్లు ఖర్చు పెట్టి చదివి స్టెతోస్కోపు పట్టుకొని, సూటు, బూటు వేసుకుని రోగుల కోసం కూర్చున్న వైద్యునిలో వైద్యసేవను ఎంతవరకు ఆశించగలం? మెడికల్ చదువు కోసం విపరీతంగా ఖర్చుపెట్టాం. ఇప్పుడు ఉన్నత విలువలు పాటించి ఇంకా దివాలా తీసుకోమంటారా? అంటారు. పెట్టిన డబ్బుకి నాలుగురెట్లు సంపాదించుకోవాలి. ఇది ఇప్పుడు నడుస్తున్న నీతి.

సాధారణ ప్రజలకు మరింత మెడికల్ పావర్టీలోకి నెట్టేస్తూ ధనిక వర్గాలకి లాభాల సంచుల్ని అందించే ఈ ప్రక్రియ ఏనాడో ఆరంభమైంది. మంచి వైద్యులూ,ఉన్నత విలువల్ని అలవర్చుకుంటూ వైద్యాన్ని పవిత్రమైన సేవగా భావించే వైద్యులూ లేకపోలేదు. కానీ, ప్రపంచీకరణ పవనాలు ఇలాంటి వైద్యుల సంఖ్యను తగ్గించేస్తున్నాయి. ఇప్పుడు, మెడికల్ విద్యలోకి ఈ గాలులు ప్రవేశించబోతున్నాయి. అధికార వికేంద్రీకరణ నుండి కేంద్రీకరణ నేటి ప్రభుత్వం అంతర్గత ఉద్దేశం. ప్రభుత్వం ఒక్కో అంగం నేడు ప్రభుత్వం బ్యూరోక్రాట్ల చేతుల్లోకి మరలిపోతోంది.

ఆర్‌బిఐ, సిబిఐ, ఎన్నికల కమిషన్ మొదలైన సంస్థల మీద ప్రభుత్వం నియంత్రణ పెరుగుతోందని మేధావులు భావిస్తున్నారు. ఎన్ఎంసి పేరు మీద వైద్య విద్యలో నాణ్యతను తేనున్న కొత్త చట్టం పూర్తిగా వైద్య విద్యను ప్రభుత్వం అజమాయిషీలోకి నెట్టేస్తుంది. ఇప్పుడున్న మెడికల్ కౌన్సిల్‌లో ఎన్నికల ద్వారా వచ్చిన వైద్యులు ఎక్కువ. అవినీతి ఉన్నా సరే, ప్రజాభిప్రాయానికి అవకాశం ఉంది. చర్చకు అవకాశం ఉంది. వ్యతిరేక అభిప్రాయానికి అవకాశం ఉంది. వాద వివాదాలకు అవకాశం ఉంది. నిరసనకు ఆవకాశం ఉంది. ఇలాంటి వాతావరణమే ప్రజాస్వామ్యాన్ని బలపరుస్తుంది.

కానీ, భారత మెడికల్ కౌన్సిల్‌లో ప్రజాస్వామ్యబద్ధమైన వాతావరణం ఎక్కడ ఉంటుంది? వైద్యం తెలీని ఆఫీసర్లతో నియంత్రణ సంస్థ నిండిపోతుంది. ఇక్కడ వాద ప్రతివాదాలు ఉండవు. నిరసించే స్వరాలు కనిపించవు. పై నుండి ఆజ్ఞలు శిరసావహించడమే ఉంటుంది. ఒకవేళ భిన్న స్వరాలు ఉన్నా, గొంతెత్తాలని ధైర్యం చేసినా నిర్ణయాలను ఇవి ప్రభావితం చెయ్యలేవు. ప్రభుత్వం వాదన ప్రకారం, వైద్యంలో నాణ్యత పోతుందని అందుకే ఈ సరంజామా అంతా అని. అదే నిజమైతే, ఇలా మాత్రం నాణ్యత వస్తుందని గ్యారంటి ఏమిటి? ప్రైవేటు కాలేజీలు లంచాలు ఇచ్చి లైసెన్సులు పొందే విధానం, సీట్లు పెంచుకొని అమ్ముకొనే విధానం, లాభాల సంచుల్ని మోసుకొనే విధానం కొత్త చట్టం ద్వారా అంతమవుతుందా?

గ్రామాలకు వైద్యులు వెళ్లడం లేదనీ, అందువల్ల గ్రామాల్లో వైద్య సేవలు అందడం లేదనీ, అందుకే బ్రిడ్జి కోర్సుల్ని యునాని, సిద్ధలాంటి వైద్యులకు అందించి ఆధునిక ఎల్లోపతీ కమ్యూనిటీ వైద్యంలో అవగాహన కల్పిస్తే గ్రామాల సమస్య పరిష్కారమవుతుందని మరో వాదన. ఒక చిన్న ఆరు మాసాల బ్రిడ్జి కోర్సు ద్వారా ఆధునిక వైద్యంలో పరిజ్ఞానం ఎలా వస్తుంది? ప్రాథమిక పరిజ్ఞానమైనా అందుతుందా అనేది వైద్యులు వేసే ప్రశ్న. వైద్యం తెలీని వాడు,వైద్యం గురించి మిడి మిడి జ్ఞానం ఉన్నవాడు మందులు ప్రిస్క్రైబ్ చేసే పరిస్థితి మరో కొత్త సమస్యలకు పునాది వెయ్యదా? కొండ నాలుకకు మందు వేస్తే ఉన్న నాలుక పోయినట్టు, ఒక సమస్యకు పరిష్కారం చెయ్యాలనుకొని మరికొన్ని కొత్త సమస్యలకు పునాది వెయ్యొచ్చు. మెడికల్ కోర్సు ఫైనల్ ఇయర్ లో నిర్వహిస్తున్న ఎగ్జిట్ పరీక్ష థియరీ, ప్రాక్టికల్ పరిక్షల సిలబస్ ఎంతమందికి గుర్తుంటుంది? పదో క్లాసులో తొంభై ఏడు శాతం మార్కులు సంపాదించి, పన్నెండో క్లాసు పూర్తిచేసి డిగ్రీలో చేరిన విద్యార్థికి తొమ్మిదో క్లాసు నుండి

పన్నెండో క్లాసు వరకు చదివిన చదువు మీద పరీక్ష పెట్టి పాసయితే డిగ్రీ ప్రోగ్రెస్ రిపోర్టు ఇస్తామంటే మార్కుల కోసమే తయారైన ఈ విద్యావిధానంలో ఎంతమంది పాసవుతారు?

మరి మెడికల్ విద్యలో కొత్తగా నిర్వహించే ఈ ఎగ్జిట్ పరీక్ష కూడా అలాంటిదే. ఈ పరీక్ష కోసం కోచింగ్ సెంటర్లు పుట్ట గొడుగుల్లా పుట్టుకొస్తాయి. విద్యార్థుల అస్థిరతనీ, ఆందోళననీ, భయాన్నీ సొమ్ము చేసుకుంటాయి. కొత్త చట్టం ఇలా కార్పొరేటు కోచింగు సెంటర్లకు బంగారు లాభాల పంటల్ని అతి త్వరలో ఇవ్వబోతుంది.

మెడికల్ విద్యలో నాణ్యతా, వైద్యుల సంఖ్యలో పెరుగుదలా ఇలా ఎన్నో మంచిమాటలు మనకి వినిపిస్తున్నా అంతర్గత ఉద్దేశాలూ, వ్యూహాలూ ఇందుకు భిన్నంగా ఉంటాయి. ఫలితాలు కూడా కార్పోరేట్లకు అనుకూలం గా ఉంటాయి. భారత దేశంలోని ప్రభుత్వ మెడికల్ కాలేజీలు పటిష్టంగా నడుస్తున్నాయి. సబ్సిడీలతో దేశం వైద్యుల్ని తయారు చెయ్యగలుగుతుంది. సాధారణ మధ్యతరగతి కుటుంబాల నుండి కూడా మెడిసిన్ చదవగలిగే అవకాశం ఉంది. ద్రవ్య నిధి, ప్రపంచ బ్యాంకుల నుండి విపరీతంగా అప్పుల్ని తెస్తోన్న ప్రభుత్వాలు ఒక్కో రంగం నుండి సబ్సిడీలను ఉపసంహరించుకునే విధానం ఏనాడో ఆరంభమైంది. ఈ పరిస్థితి ఎల్‌పిజి సిలిండర్ల సబ్సిడీల ఉపసంహరణలో చూశాం. పబ్లిక్ సెక్టార్ అండర్ టేకింగ్‌లలో చూశాం. ఇప్పుడు రైల్వే పరిశ్రమలోనూ, ఆర్డినెన్స్ కర్మాగారాల్లోనూ కూడా చూడబోతున్నాం.

ప్రభుత్వం నడిపే మెడికల్ కాలేజీలలోను, ప్రైవేటు మెడికల్ కాలేజీల లోను నియంత్రణ ఉండకూడదు. మార్కెట్ అంతా చూసుకుంటుంది అనేది ప్రపంచీకరణ ముఖ్య సూత్రం. స్వేచ్ఛా వాణిజ్యం ముఖ్య సూత్రం ఇదే. నియంత్రణలు స్వేచ్ఛా వాణిజ్యానికి అడ్డుగోడలు. మొదట ఉన్న మెడికల్ కౌన్సిల్ ఎన్నికల ప్రాతిపదికన ఏర్పడిన సంస్థ. ప్రపంచీకరణకు ఇలాంటి ప్రజాస్వామ్య వాతావరణం గిట్టదు. ప్రత్యక్షంగా అధికారం కేంద్రీకృతం కావాలి. నామినేట్ అయిన బ్యురోక్రాట్ల ద్వారా ప్రభుత్వాలు తమ పనుల్ని ఎంత సులభంగా చేయించుకోగలరో, ఎన్నికల ప్రాతిపదికన వచ్చిన వైద్యుల నుండి అంత నేర్పరితనంతో నిర్వహించలేరు. అందుకే ప్రతి సంస్థ కూడా మెల్ల మెల్లగా కేంద్ర ప్రభుత్వం నియంత్రణలోకి నడుస్తోంది. ప్రజాసామ్య వాతావరణానికి ఇది పెద్ద అఘాతం.

**అనైతిక ధోరణులు**

ఒకవేళ వైద్యరంగంలో అవినీతి అనేది ఉంది అని మనం ఒప్పుకుంటే, అది ప్రభుత్వ వైద్య శాలల వల్ల కాదు కదా! ప్రభుత్వ వైద్యశాలలు సీట్లు పెంచడానికో, వైద్య శాలలు కట్టడానికో లంచాలు ఇవ్వవు కదా. అవినీతి అనేది ఉంది అని మనం ఒప్పుకుంటే, అది చట్టం మార్చినంత మాత్రాన పోతుందా? అవినీతి మరో మార్గంలో రావడం సహజమే కదా. నల్ల ధనం రూపుమాపేస్తామని ఉన్న నోట్లనే రద్దు చేసేశాం. రాత్రికి రాత్రి కరెన్సీ మాయమైంది. ఒక చిన్న నోటు కోసం గంటలకు గంటలు క్యూ కట్టాం. మహా యజ్ఞం కోసం సహకరించాం. ఫలితం ఏమైంది? నోట్లన్నీ తిరిగి వచ్చేశాయని ఇంకెవరో కాదు, రిజర్వు బ్యాంకే స్వయంగా చెప్పింది. మరి ఈ ప్రయత్నం ఏమైంది? అనుభవం మనకు చెప్పనే చెప్పింది. మొత్తం నోట్లన్నీ తిరిగి వచ్చేశాయి. నల్ల ధనం లేనట్టా లేదా ఉన్న నల్ల ధనమంతా తెల్లధనంలోకి రూపాంతరం చెందినట్టా? సోషల్ మీడియా పరిజ్ఞానంలోంచి బయటికొచ్చి వాస్తవాలు చూస్తే తేటతెల్లమవుతుంది.

ఇలానే, వైద్య రంగం ప్రపంచీకరణలో పడి వ్యాపార సరుకై పోయింది. వైద్య రంగంలో ఇప్పుడు కొట్నిస్‌లు, నార్మన్ బెతూన్‌లు చేరడం లేదు. విపరీతమైన డబ్బు సంపాదించవచ్చు అనే ఆలోచనతో చేరే వారే ఎక్కువ. మంచి ఉద్దేశం తో చేరేవారు లేరని కాదు. కానీ వారి సంఖ్య ప్రపంచీకరణ మాయలో తగ్గిపోయింది. ఒకవేళ మంచి వైద్యులున్నా వారిని కలుషితం చెయ్యడానికి మందుల కంపెనీలు ఎలానూ ఉన్నాయి. వైద్యరంగంలో నాణ్యత కోసం ఈ ప్రయత్నాలు ఒక్క చట్టం మార్చినంత మాత్రాన నాణ్యత తిరిగి రాదు.

వైద్య రంగాన్ని పూర్తిగా వ్యాపారమయం చేసేది, వైద్యరంగం సేవ నుండి వ్యాపార సరుకైపోయిన తర్వాత ఈ వైద్య విద్యను నియంత్రించే సంస్థలు మరి న్యాయంగా పని చేస్తాయా? విపరీతమైన వ్యాపార పవనాలు ఈ సంస్థల్లోకి కూడా చేరవని గ్యారంటి ఏమిటి? ఇప్పుడున్న చదువుల్లో సృజనాత్మకత ఎంతవరకుంది?

పిల్లలు చిన్నప్పటినుండే కార్పొరేట్ విద్యాసంస్థల ఆవిర్భావం తర్వాత మార్కుల కోసం వేటలో పడ్డారు. మొదట కూడా ఇలా ఉన్నా కార్పొరేట్ విద్య ఆవిర్భావం తర్వాత ఈ పరిస్థితి మరింత పెరిగింది. బట్టీపట్టి చదివే విద్యల్లో నాణ్యత ఎంతవరకుంటుంది? మరి ఇదే పరిస్థితి వైద్య విద్యలోకి కూడా పాకుతుంది కదా? లంచాలిచ్చి మెడికల్ సీటు తీసుకొనే విద్యార్థి చదువులో నాణ్యతను ఊహించగలమా?

వైద్యవిద్యలో ప్రైవేటీకరణ అక్కడితోనే ఆగదు. విపరీతమైన ఖర్చుతో వైద్యం చదివిన వైద్యులు కోర్సు పూర్తయిన తర్వాత తమ ఆర్థిక భారాన్ని ప్రజల మీద వేస్తారు. ఫలితంగా, వైద్యుల ఫీజులు పెరుగుతాయి. ఇప్పటికే, వైద్యంలో నెలకొన్న అనైతిక ధోరణులు మరింత పెరుగుతాయి. ప్రజలు బలవుతారు. అందరికీ ఉద్యోగాలు, అభివృద్ధి అన్న కేంద్ర ప్రభుత్వం మొదటిసారి వచ్చి ఉద్యోగాల మాట మరచిపోయింది. అందుకు సంబంధించిన సంస్థల రిపోర్టులను ఎన్నికల ముందు విడుదల కానివ్వలేదు. ప్రజలు అత్యంత నిరుద్యోగాన్ని గత అయిదు సంవత్సరాల్లో చవిచూశారు. రెండోసారి నిరుద్యోగం, అభివృద్ధి అంశాలను పక్కన పెట్టి పుల్వామా, బాలాకోట్, దేశభక్తి అంశాలను ఎన్నికల వ్యూహంగా మార్చి బహుమానంగా రైల్వే, ఆర్డినెన్స్ కర్మాగారాల ప్రైవేటీకరణకు బడ్జెట్‌లో రంగం సిద్ధం చేసింది.

ఇప్పటికే జియో రాకతో బిఎస్ఎన్ఎల్ ఉద్యోగులు జీతాలకు నోచుకోవడం లేదు. ఐఎల్ఎఫ్ఎస్ దివాలాతీసింది. మరో బహుమానంగా, జమ్ము కశ్మీర్‌కి నిజమైన స్వాతంత్ర్యం ఇచ్చేశామని ప్రింట్ మీడియా, ఇంటర్నెట్, టెలివిజన్, మొబైల్‌లను బ్లాకవుట్ చేసేసి అక్కడి ప్రజల అభిప్రాయం, నాయకుల అభిప్రాయం తెలుసుకోకుండా అత్యంత పెద్ద విశాల ప్రజాస్వామ్యం అయిన భారతదేశం చరిత్రాత్మకమైన ఆర్టికల్ 370ని రద్దు చేసేసింది. అత్యంత ఘన విజయంగా దీన్ని పేర్కొంది. రాష్ట్రాన్ని వార్తలు లేకుండా చీకటి చేసేసి, పత్రికలను మూసేసి, కళ్ల ముందు నిజాల అక్షరాలు కనిపించకుండా చేసేసి, చెవిలోకి వార్తలు ప్రవేశించకుండా చేసేసి ఇది ఘన విజయం ఎలా అవుతుందో మెదడున్న భారతీయుడికి అర్థం కాలేదు.

ఇప్పుడు మరో బహుమానంగా ఈ కొత్త మెడికల్ బిల్లు స్వేచ్ఛా వాణిజ్యం రెండో విడత కార్యక్రమంలోని అంతర్భాగమే. ఇది వైద్య విద్యనూ, ప్రజలకు అందాల్సిన వైద్యాన్నీ మరింత ఖరీదు చేసేసి సామాన్యుని తలపై మరింత భారాన్ని మోయబోతోంది.

*(రచయిత ఉపాధ్యాయులు. 'జాగృతి సమీక్ష' త్రైమాసిక పత్రిక సంపాదకులు)*

వీ

# జాతీయ విద్యా విధానం - 2019

***నూతన జాతీయ విద్యా విధానం ముసాయిదాలో కేవలం కొన్ని కంటితుడుపు సిఫారసులు తప్ప ఆచరణీయమైన, పటిష్టమైన, నిర్దిష్టమైన పరిష్కారాలేవీ ప్రతిపాదించలేదనీ అంటున్నారు భైరి సత్యనారాయణ***

ఏ రంగంలోనైనా ఒక విధానం అమలులో ఉండగానే మరొక కొత్త విధానాన్ని రూపొందించాల్సిన అవసరము ఎప్పుడు వస్తుంది? పాత విధానమో, దాని ఆచరణనో లోపభూయిష్టమైనప్పుడు గానీ; ప్రస్తుత సమస్యలను పరిష్కరించటంలో పాత విధానం వైఫల్యం చెందినప్పుడు గానీ; సమాజంలో ఎప్పటికప్పుడు వస్తున్న నూతన పోకడలను పరిష్కరించే మార్గాలు పాత విధానంలో లేనప్పుడు గానీ; వేగంగా మారే సమకాలీన సామాజిక పరిస్థితులకు అనుగుణంగా పాత విధానం స్పందించజాల నప్పుడు గానీ; ఆ రంగంలో తక్షణం ఒక తీవ్ర సంక్షోభం తలెత్తినప్పుడు గానీ వస్తుందనేది అందరికీ తెలిసిన సాధారణ అంశం. ఈ మధ్యే కేంద్ర ప్రభుత్వం విడుదల చేసిన 2019 జాతీయ విద్యా విధానం ముసాయిదాకు ఈ అవసరాలేవీ వున్నట్లు కనపడదు. మరిప్పుడు మరొక విద్యా విధానాన్ని రూపొందించాల్సిన ఆవశ్యం ఏమి వచ్చిందనే సందేహానికి 484 పేజీల కస్తూరి రంగన్ జాతీయ విద్యా విధానం-2019 ముసాయిదాలో స్పష్టమైన, సమర్థనీయమైన సమాధానం ఎక్కడా కానరాదు. అయినప్పటికినీ, ముసాయిదా పీఠిక, పాఠశాల విద్య, ఉన్నత విద్య విభాగాలలో కొన్ని చోట్ల ప్రత్యక్షంగా మరికొన్ని చోట్ల పరోక్షంగా ప్రస్తావించిన అంశాలను బట్టి, కమిటీ ప్రస్తుత కొత్త విద్యా విధానం ఆవశ్యకత ఎందుకనుకుంటుందో ఇలా గ్రహించవచ్చు.

ఇంకా, ఆర్థికంగా అభివృద్ధి చెందిన దేశాల్లో ప్రస్తుతం 6వ స్థానంలో ఉన్న భారత దేశాన్ని 2030-2032 వరకల్లా మొదటి, రెండవ స్థానంలో ఉన్న అమెరికా, చైనాల సరసన మూడవ స్థానంలో నిలబెట్టి సుస్థిర పరచడానికి; అభివృద్ధి కార్యక్రమాల్లో ప్రజల్ని భాగస్వాముల్ని చేసేందుకు, న్యాయం సమభాగస్వామ్యం సాధించటానికి; భారతీయ విలువలు, సాంప్రదాయాన్ని కాపాడుకుంటూనే విద్యార్థుల్లో 21వ శతాబ్దపు నైపుణ్యాల అభివృద్ధి చేయడానికి; సుస్థిర అభివృద్ధి కోసం 2030-ఎజెండా, సుస్థిర అభివృద్ధి లక్ష్యాలు-4 లోని అన్నివర్గాలవారిని కలుపుకునే, సమ భాగస్వామ్య నాణ్యమైన విద్యను అందించడం, జీవితాంతము నేర్చుకొనే అవకాశాన్ని కల్పించడం; జ్ఞాన సమాజాన్ని జ్ఞానాధారిత ఆర్థిక వ్యవస్థను నిర్మించడం కోసం.

నిజానికి తమ ప్రత్యేకరాజకీయ సిద్ధాంతాలకనుకూల భావాలను మొగ్గదశలో పిల్లల్లో ప్రవేశపెట్టి సమాజంలో వ్యాపింపజేయటం వంటి స్వప్రయోజనాల కోసం కూడా సాధారణ పాలకపార్టీలకు విద్యారంగం ఒక బలమైన సాధనంగా అనుకూలిస్తుంది. నిశితంగా పరిశీలించినప్పుడు ప్రస్తుత విద్యావిధాన ముసాయిదా అందుకు మినహాయింపు అనుకోజాలం.

ఇప్పటి వరకూ ఏ ప్రభుత్వమైనా ఏ కమిటీ నివేదికనైనా ఉన్నదున్నట్లు గానీ, అవసరమనుకున్న సవరణలతో గానీ పూర్తిగా అమలు చేసిన దాఖలాలు గత చరిత్రలో లేవు. అంటే ప్రజాధనం, మేధావుల శ్రమ, శ్రమకాలం సద్వినియోగం కానట్టే. ఇదంతా గతంలోని వాస్తవానుభవం.

కమిటీలపేరిట తమ రాజకీయ ఆర్థిక మత భావజాల పరిధిలోని ప్రణాళికలనే ప్రభుత్వపు పార్టీలు అమలు చేస్తాయి. కొన్నిసార్లు తమ సొంత ఎజెండాను అమలు చేయడానికి ఆమోదించబడిన కమిటీ ప్రతిపాదనలు అనేది ఒక సాకుగా పనికిరావొచ్చు. ఒకవేళ అలా కాదంటే ప్రభుత్వాలు కమిటీల ప్రతిపాదనలన్నింటినీ పూర్తిగా అవి సూచించిన విధంగానే అమలుచేయాలి. ఆమోదించబడిన కమిటీ ప్రతిపాదనల సాకుతో తమకనుకూలమైన ఒక్కటి రెండింటినీ అమలు చేయడం కాదు. కాస్తో-కూస్తో రూపంలోనైనా ప్రజానుకూలంగా ఉన్న ఒక్కటీ రెండు ప్రతిపాదనలు ఎప్పుడూ అమలుకే నోచుకోవు. ఇంకా అనేకం కూడా అమలుకు నోచుకోకుండా పడి ఉంటాయి.

విద్యావిధాన కమిటీల చరిత్రలో, ప్రజానుకూలమైన ఒక్కటీ రెండూ కమిటీలు తప్ప, అనేక సందర్భాల్లో తమను ఎంపిక చేసిన ప్రభుత్వాలకు దాసోహమైన కమిటీలే ఎక్కువగా ఉన్నాయి. అనేక కమిటీలు ప్రభుత్వ పాలకపార్టీల, ఆధిపత్యవర్గాల భావజాలాన్ని, భాషను బాహాటంగానే నిర్మొహమాటంగానే ప్రతిపాదిస్తాయి. మరికొన్ని కమిటీలు ప్రజానుకూల ప్రతిపాదనల ముసుగులో అంతిమంగా సారాంశంలో ఆధిపత్య వర్గాల భావాల్నే ప్రకటిస్తాయి. వాటిని ప్రజలు లేదా లబ్ధిదారులు జాగ్రత్తగా గమనిస్తేగానీ అర్థంకాదు. కస్తూరి రంగన్ కమిటీ ఈ కోవకు చెందదని చెప్పటానికి ముసాయిదాలో ఆధారాలు కనపడవు. పైగా అది ఆ కోవకే చెందుతుందని చెప్పడానికి మాత్రం అనేక ఆధారాలు కనపడతాయి.

ఎంతో సమయాన్ని కేటాయించి, దేశవ్యాప్తంగా ఎన్నో విలువైన సంప్రదింపులు జరిపిన కమిటీ సభ్యుల పరిశీలనలో, నేడు అన్నిస్థాయిల విద్య సంక్షోభంలో ఉన్నదనీ, ఆ సంక్షోభం కాలక్రమేణా తీవ్రమవుతున్నదని గానీ, దానికి కారణం విద్య అమ్మకపు సరుకుగా మారడమేననిగానీ, దానికి బీజాలు ఆర్థిక సరళీకరణ-ప్రైవేటీకరణ-ప్రపంచీకరణతో మొదలయ్యి, గాట్స్ ఒప్పందాలతో తీవ్రమయ్యా యనిగానీ తేలకపోవడ మంటూ ఉండనే ఉండదు. నిజాలను గుర్తించడానికి కావాలనే నిరాకరిస్తే తప్ప! వాస్తవాలను ఇష్టపూర్తిగానే కప్పి ఉంచాలనీ భావిస్తే తప్ప!

ముసాయిదాలో అక్కడక్కడ ప్రైవేటు విద్యాలయాలు అధిక ఫీజులు వసూలు చేయరాదు, లాభాలార్జించరాదు, విద్యలో వ్యాపారీకరణ ఉండరాదని చెప్పడాన్నిబట్టే ఈ విషయం అర్థమవుతూ ఉంటుంది. ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా ప్రపంచమంతటా విద్యార్థులు, అధ్యాపకులు, విద్యావేత్తలు, ప్రజలు, ప్రజా మేధావులు బలంగా నినదిస్తున్న ఈ

కాలంలో, కమిటీ సభ్యులకు ఈ విషయం తట్టనే లేదనీ, ఈ ఆలోచనే లేకపోయిందనీ, వారి అధ్యయన కాలంలో విద్యలో మితిమీరిన ప్రైవేటీకరణ, కార్పొరేటీకరణ పర్యవసానాలు వారికి కనపడనేలేదని అనుకోలేము. ముసాయిదాను ప్రజాక్షేత్రంలో పెట్టిన రోజు నుండి స్థానిక, జాతీయస్థాయి మీడియాలో ప్రజల నుండి, ప్రజామేధావుల నుండి వస్తున్న ఏ నాలుగైదు అభిప్రాయాలను ఒక్కదగ్గర పెట్టిచూసినా, ప్రైవేటీకరణను లేదా కార్పొరేటీకరణను నిరసిస్తూ వాళ్ళ అభిప్రాయ పడుతున్న విషయాలు స్పష్టమవుతాయి. తెలపదల్చుకున్న వాళ్లు మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వశాఖకు కూడా అవే అభిప్రాయాలను రాస్తారు.

అప్పుడిక, ఈ విద్యా సంక్షోభానికి విద్యావ్యాపారం అనే అసలు కారణాన్ని వదిలివేసి, సాధారణ అంశాలను ఎంత జనరంజకంగా గుర్తించినట్లు ప్రయత్నించినా; ఎన్ని సర్వేలను, అధ్యాయనాలను, రాజ్యాంగాన్ని, అరకొరగా, సంకుచితంగా ప్రస్తావించినా ఆ విధానం ప్రజలకు ఏమీ మేలుచేయదు. పైగా అది ప్రజలకు దీర్ఘకాలంలో కోలుకోలేని అత్యంత హాని కూడా తలపెట్టగలదు.

మానవజాతి తను సృష్టించిన జ్ఞాన, సాంస్కృతిక, నాగరీక వారసత్వాన్ని భవిష్యత్తరాలకు అందించాల్సిన విద్య నేర్పించడం అనే మానవ బాధ్యతను నిర్దిష్టధరకు అమ్ముకుంటుందా! అన్ని ఇతర వ్యాపార వస్తువులు, సేవల వలెనే, చదువు అనే మానవీయ, సామాజిక బాధ్యతను కూడా అమ్ముకోవడం–కొనుక్కోవడం విచ్చలవిడిగా జరుగుతున్న సమాజము అంత ఉన్నత నాగరీకమైనదేమీ కాదని చెప్పజాలని, కనీసంగానైనా ఆ ఆలోచనే చేయలేని విద్యావిధానం ఇంకా ఏమి చెప్పినా ప్రజలకు అంతగా ప్రయోజనం ఉండదు.

ముసాయిదా సారాంశం, మొత్తం విద్యాలక్ష్యమే ప్రపంచంలో ఆర్థికంగా అభివృద్ధి చెందిన అగ్రదేశాలు అమెరికా, చైనాల సరసన నిలబడాలన్నట్లుంటుంది. ఆర్థికంగానైనా అనుకున్నంత అభివృద్ధి చెందిన తర్వాతనైనా కూడా ప్రభుత్వం తనదేశ భావిపౌరులకు ఉచితంగా విద్యనందించ గలదని ప్రతిపాదన చేయలేదా? అప్పుడు, ఇక ప్రైవేట్‌విద్య ఉండనే ఉండదు, అన్నిరకాల అన్నిస్థాయిల విద్యను మొత్తము ప్రభుత్వమే ఉచితంగా స్వయంగా తన పిల్లలకందిస్తుందని ప్రతిపాదించలేమా? అలా అందించలేకపోతే దేశము ఆర్థికంగా ప్రపంచంలో 6వ స్థానంలో ఉంటే ఏమిటి, 3వ స్థానంలో ఉంటే ఏమిటి, 1వ స్థానంలో ఉంటే ఏమిటి? దానివల్ల సాధారణ ప్రజలకు ఏమి ప్రయోజనం? ఆ ఆర్థికాభివృద్ధి ఆకాంక్ష ఏ పిరికెడుమంది ప్రయోజనాలకో ఇప్పుడే అర్థమవుతుందికదా!

టి.ఎస్.ఆర్.సుబ్రహ్మణ్యం కమిటీ, తదనంతరం మానవవనరుల మంత్రిత్వశాఖ విడుదల చేసిన సమ్ ఇన్‌పుట్స్ ఫర్ డ్రాఫ్ట్ నేషనల్ ఎడ్యుకేషన్ పాలసీ–2016 కోసం సంప్రదింపులు జరుగుతున్న సందర్భంలో విద్యార్థులు, అధ్యాపకులు, విద్యావేత్తలు, ప్రజలు, ప్రజా మేధావులు, అనేక సంఘాలు, సంస్థలు అందించిన సూచనలను, సలహాలను పొందుపరుస్తూ, విమర్శించిన వాటిని తొలగిస్తూ నివేదికను రూపొందించటంవల్ల ఈ కొత్త ముసాయిదాలోని అంశాలు సహజంగానే ప్రజాకర్షణకు గురియైనాయి. దానివల్ల చాలామంది ఈ ముసాయిదా విద్యారంగ సమస్యలను సరిగ్గానే గుర్తించిందనే భ్రమపూరిత సంతోషానికి గురికావడం జరిగింది. ఆ సంతోషంలో, సమస్యల పరిష్కారానికి ఆ ముసాయిదా సూచించిన ప్రతిపాదనలు నిశితంగా పరిశీలించడం మరిచిపోవడం తగదు.

సారాంశంలో ఎక్కడా ప్రజామోదిత సిఫారసులను కూడా పకడ్బంధీగా అమలుచేసే నిర్దిష్ట కార్యాచరణను ప్రతిపాదించే రిస్క్‌ను ముసాయిదా తీసుకోలేదు. కంటితుడుపు పరిష్కారాలే తప్ప ఎక్కడా ముసాయిదా ఆచరణీయమైన పటిష్టమైన నిర్దిష్టమైన పరిష్కారమును ప్రతిపాదించలేదు. చిత్తశుద్ధితో కూడిన సరియైన శాశ్వత పరిష్కారాన్ని బలంగా ప్రతిపాదించకుండా సమస్యను సుందరంగా వర్ణించడంవల్ల ప్రజలకేమీ ఉపయోగముండదు. ముసాయిదాలో అనేకచోట్ల సంబద్ధతాలేమి, సమన్వయ లోపం విపరీతంగా కనిపిస్తుంది. అనేక అంశాల్లో, ఒకచోట చెప్పిన దాన్ని మరొకచోట చెప్పినదానితో కలిపిచూస్తే పొంతన కనపడదు. ముసాయిదా ఆసాంతము వైరుధ్యాలే కనిపిస్తాయి. ఇవి ముసాయిదా నిజమైన స్ఫూర్తిని, ఉద్దేశ్యాలను, దార్శనీకతను సరిగ్గా అర్థం చేసుకోవడంలో అత్యంత గందరగోళాన్ని కలిగిస్తాయి. వచ్చే రెండు దశాబ్దాలలో యాభై శాతం దేశ ప్రజల భవిష్యత్తును, తద్వారా ఈ శతాబ్దపు దేశ సామాజిక మేథోపర వాతావరణాన్ని తీవ్రంగా ప్రభావితం చేయగల (చేయగలదని భావించ బదుతున్న) ముసాయిదాను సమగ్రంగా దోషరహితంగా ఉండాలను కోవడం తప్పుకాదు కదా! కాబట్టి అత్యంత కీలకమైన వైరుధ్యాల్లో కొన్నింటినైనా ఇక్కడ పరిశీలించే ప్రయత్నం చేద్దాం. ముసాయిదాలో పొందుపరిచిన క్రమంలో కాకుండా విషయ ప్రాధాన్యతా క్రమంలో కొన్నింటిని పరిశీలిస్తే చాలు మొత్తం ముసాయిదా స్వభావం అర్థమవుతుంది.

మొత్తం ముసాయిదాకు విద్యా సంక్షోభం (క్రైసిస్ ఇన్ ఎడ్యుకేషన్) కాకుండా అభ్యసన సంక్షోభం (క్రైసిస్ ఇన్ లర్నింగ్) కేంద్ర బిందువవుతుంది. దాని కోసం పుంఖానుపుంఖాల వర్ణనాత్మక రాత. ఈ ముసాయిదా, అభ్యసన సంక్షోభాన్ని, విద్యా సంక్షోభమనే పెద్ద సమస్యలో భాగంగా చూడదు. ముసాయిదా మొత్తం విద్యా సంక్షోభం గురించి మాట్లాడకుండా విద్యా సంక్షోభంలో ఒక చిన్న భాగమైన అభ్యసన సంక్షోభంను గురించి మాట్లాడుతుంది. అభ్యసన సంక్షోభం దానికదే విడిగా పరిష్కారం కాదు. మొత్తం విద్యారంగ సంక్షోభ పరిష్కారంలో భాగంగానే దాని పరిష్కారం ఉంటుందిగానీ విడిగా ఉండదు (విస్తృతార్థంలో, విద్యారంగ సంక్షోభం కూడా దానికదే పరిష్కారం కాదని, దాని పరిష్కారం కూడా ఆర్థిక సామాజిక రాజకీయ చట్రం పరిమితుల్లోనే ఉంటుందనే ఉన్నత అవగాహన దిశలోనే దీని తాత్కాలిక పరిష్కారం చూడాల్సి ఉంటుంది). ముసాయిదా విద్యారంగ సంక్షోభాన్ని గురించి ప్రత్యేకంగా ఎక్కడా మాట్లాడదు. పైగా అభ్యసన సంక్షోభాన్నే విద్యారంగ సంక్షోభంగా భావిస్తున్నట్లు కూడా కనపడుతుంది. అవి రెండింటిని వేరుపరిచి చూసిన దాఖలాలు లేవు.

ఇవ్వాళ భారతదేశంలో అన్నిరకాల, అన్నిస్థాయిల విద్య, యాభై శాతానికి పైగా, ప్రైవేటు–కార్పొరేటు విద్యాసంస్థల ద్వారానే అందించబడుతుంది. ప్రవేశ, ఉద్యోగ పరీక్షలకు శిక్షణపేరిట విద్యావ్యాపారము ఎట్లాంటి నియంత్రణ లేకుండా విచ్చలవిడిగా జరుగుతున్నది. ప్రభుత్వాధికారులు, రాజకీయనాయకుల అండదండలు లేకుండానే ఇవన్నీ జరుగవు. ప్రైవేటు అనే పదాన్ని ముసాయిదాలో అనేక చోట్ల (184 సార్లు) వాడినా, అది ప్రభుత్వాలు, ప్రైవేట్ విద్యాసంస్థలను కూడా ప్రభుత్వ విద్యాసంస్థలతో సమానంగా చూడాలనే అర్థంలోనే వాడబడింది తప్ప వాటికి వ్యతిరేకార్థంలో కాదు. కొన్నిచోట్ల వాటిపైన తీవ్రకోపాన్ని, నిరసనను ప్రదర్శిస్తుంది (నటిస్తుంది) కూడా. ఉదాహరణకు, ప్రస్తుతం దేశంలో

ఉపాధ్యాయ విద్య తీవ్ర సంక్షోభంలో ఉంది. దాదాపు 17,000 ఉపాధ్యాయ విద్యా కళాశాలల్లో 92 శాతం అనగా 15,640 కళాశాలలు పట్టాకు ఇంత ధర అని నిర్ణయించి అమ్ముకునే దుకాణాలే అంటుంది. అప్పుడు ఎవ్వరైనా వాటిని వెంటనే నిషేధించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తారు. కమిటీ కూడా అలాగే సిఫారసు చేస్తుందని భావిస్తారు. కానీ, వింతగా ఈ కమిటీ మాత్రం ప్రైవేటు ఉపాధ్యాయ విద్యాసంస్థల్లో ఈ చెడు సాంప్రదాయాన్ని అరికట్టకుండా ఉపాధ్యాయ విద్యలో సమగ్రతను సాధించలేమనే ఒక ఉచిత సలహాను మాత్రమే విసురుతుంది.

నాణ్యమైన విద్యనందించడం జాతీయ విద్యా విధానం-2019 ముఖ్యలక్ష్యాల్లో ఒక్కటనీ, మొత్తం విద్యా నాణ్యతకు ఉపాధ్యాయ విద్య చాలా కీలకమనీ, ఇప్పుడది తీవ్ర సంక్షోభంలో ఉన్నదనీ, దానికి కారణం నాసిరకపు ప్రైవేటు ఉపాధ్యాయ కళాశాలలనీ గుర్తించిన కమిటీ, ఆ కళాశాలల్ని వెంటనే నిషేధించ మనకుండా, పూలతో కొట్టినట్లుగా వాటిలోని ఆ దురాచారాన్ని మాత్రమే అరికట్టమంటుంది. అక్కడ తప్పుడు సాంప్రదాయం కొనసాగుతుందని తేల్చినంత మాత్రాన ప్రజలకు ఒరిగేదేముంది? వాటిని కనీసం మూసివేయాలనో వాటి గుర్తింపు రద్దుచేయాలనో కూడా ప్రతిపాదించజా లని కమిటీ బలహీనత సర్వత్రా బహిర్గతమవుతూనే ఉంటుంది. దీనినిబట్టి ప్రైవేటు కళాశాలలపైన కమిటీకిగల భక్తిప్రపత్తులు, గౌరవం తెలుస్తూనే ఉంటుంది. ప్రైవేటు విద్యాసంస్థలు లేకపోతే, వాటిని ప్రభుత్వాలు వెన్నుతట్టి ప్రోత్సహించకపోతే ప్రజలకు ఎంతో అన్యాయం జరుగుతుందన్నట్లు ఉంటుంది కమిటీ సిఫారసుల స్వభావం. అన్నిరకాల అన్నిస్థాయిల ప్రైవేటు విద్యాలయాల పైనా ముసాయిదాది ఇదే ధోరణి.

విద్యలో నాణ్యత-ప్రమాణాల క్షీణతకు ప్రైవేట్ విద్యాలయాలే కారణమని గుర్తించినట్లు కనపడుతున్నా, వాటిని నిషేధించమనకుండా కొనసాగనివ్వ మనడం అత్యంత ప్రధాన వైరుధ్యం. ప్రస్తుత నియంత్రణ వ్యవస్థలు విద్యావ్యాపారీకరణను, ఆర్థిక దోపిడీని అరికట్టలేకపోయాయని వాపోయే ఈ కమిటీ, దానికోసము సూచించిన పటిష్ట చర్యలేమీ లేవు (పేజి-178). ప్రైవేట్ విద్యాలయాల మీద పరిమితుల మేరకు నియంత్రణ ఉండాలే తప్ప, అధికంగా ఉండొద్దని మాత్రమే చెబుతుంది ఈ కమిటీ. అలా అయితే వాటి స్వయంప్రతిపత్తికి (వాటి విచ్చలవిడి విద్యా వ్యాపారానికి) భంగం కలుగుతుందని కమిటీ భయం. ప్రైవేట్ విద్యాలయాల్లో అత్యధిక ఫీజుల వసూలు, లాభాలు ఆర్జించడం, వ్యాపారీకరణ వంటి చిట్టిపొట్టి అంశాలకు మాత్రమే ఈ కమిటీ, రూపంలో వ్యతిరేకము తప్ప మొత్తం ప్రైవేట్ విద్యాలయాల ఉనికిమీద కాదు. మిగతా అన్ని విషయాల్లో వాటిపైన కమిటీకి అత్యంత ప్రేమ, ఆదరణ ఉంటుంది. ధార్మిక, దాతృత్వ విద్యాసంస్థలపైనైతే మరీనూ.

ఈ కమిటీ తల్లిభాషకు, స్థానికభాషకు మధ్య తేడాను పట్టించుకున్నట్లు కనపడదు. పిల్లలు ఆరంభస్థాయిలో తల్లిభాష/స్థానికభాష ద్వారానే పరిపూర్ణంగా నేర్చుకోగలరని బలంగా విశ్వసించే ఈ కమిటీ, వీలయితే కనీసం 5వ గ్రేడు వరకు లేదా 8వ గ్రేడు వరకు తల్లిబాష/స్థానికభాషలో విద్యాబోధన ఉంటుంది. ఆ తర్వాత గ్రేడులలో అది ఒక పాఠ్యాంశంగా కొనసాగుతుంది అంటుంది. దేశవ్యాప్తంగా విద్యామాధ్యమం తప్పనిసరిగా తల్లిబాష/స్థానికభాష అయ్యిఉండాలని మాత్రము సిఫారసు చేయలేకపోతుంది. మాటిమాటికీ వీలయితే, సాధ్యమయితే, సాధ్యమైన చోటల్లా అంటుంది. వీలుకాకపోతే విద్యామాధ్యమం తల్లిబాష/స్థానికభాష ఉండనవసరం లేదన్నట్లే కదా! మరి విద్యావ్యాపారానికి వీలుకాకనే, ప్రైవేటు పాఠశాలలు ఆంగ్లమాధ్యమాన్ని ప్రవేశపెట్టాయను కుంటే సరి! దాని అమలు బాధ్యత ఆయా రాష్ట్రాల పాఠశాల విద్యావ్యవస్థదే అంటుంది ముసాయిదా.

భారతీయ భాషలు సంపద్వంతమైనవనీ, శాస్త్రీయమైనవనీ, సుందర వ్యక్తీకరణ కలిగినవనీ చెప్పే కమిటీ, వాటిని విద్యా మాధ్యమంగా తప్పనిసరి అని ఎక్కడా చెప్పదు. కానీ, ఒకపక్క- ఆంగ్లం దేశంలో కేవలం 15 శాతం ప్రజలు మాత్రమే మాట్లాడే భాష. అది సంపన్నుల భాష, ఆదిపత్య వర్గాల భాష, కలోనియల్ భాష, అంత గొప్పదేమీకాని భాష అని తులనాడుతూ, మరొక పక్క చిన్నపిల్లల భాషలు నేర్చుకొనే సామర్థ్యం దృష్ట్యా, ఆర్థికసంపన్నుల, నిర్భాగ్యుల మధ్య వ్యత్యాసాన్ని తొలగించటం దృష్ట్యా, భారతీయ భాషలతో పాటు ఆంగ్లాన్ని అన్ని ప్రభుత్వ, ప్రభుత్వేతర పాఠశాలల్లో తప్పక అత్యంత నాణ్యతతో నేర్పించాలి అంటుంది. ఆరంభ స్థాయిలో పిల్లలు నేర్చుకోవడానికి నూరుశాతం తల్లిభాష/స్థానికభాష మాధ్యమమే శాస్త్రీయమైనదని, సరియైనదని ఏకరువుపెట్టి, అంతిమంగా తల్లిభాష/స్థానికభాష మాధ్యమాన్ని ఒక మోస్తరు తరగతి వరకైనా తప్పనిసరి అని ప్రతిపాదించకుండా, తను నిరసించే ఆంగ్లభాషను మాత్రం తప్పక అత్యంత శ్రద్ధతో నేర్పించమనడం మరొక ప్రధాన వైరుధ్యం.

ముసాయిదా పొడవునా అందరికీ విద్య, సమభాగస్వామ్య విద్య, నాణ్యమైన విద్య అనే పదాలే తారసపడుతాయి. ఏ రకమైన అణగారిన వర్గాల పిల్లలకైనా, ఆర్థికంగా స్తోమత కలిగిన పిల్లలతో పాటు సమానంగా రాణించటానికి కొన్ని ప్రత్యేక అవకాశాలు, ప్రోత్సాహకాలు, రిజర్వేషన్లను కల్పించడానికి మించిన సరియైన ప్రణాళికా ఏమీ ఉండదు. ముసాయిదాలో ఈ మాటలు ఎక్కడా ఉండవు. పైగా ఆ వర్గాల పిల్లలను, ప్రజలను మరింత భయభ్రాంతులకు గురిచేసేటట్టు అడుగడుగునా మెరిట్, మెరిట్ అంటుంది. ఉత్తమ అవకాశాలను కొనుక్కోగలిగిన వారికి మెరిట్ ఎలాగూ ఉంటుందని ఆ ముసాయిదానే పేర్కొంటుంది. మరి అలా కొనుక్కోలేని అసంఖ్యాక బలహీనవర్గాల పిల్లల సంగతేమిటి? ఆ అవకాశాలను వారికి ఉచితంగా అందించే బాధ్యతను ప్రభుత్వమే తీసుకోవాలని సూటిగా విస్పష్టంగా చెప్పజాలదు.

సామాజిక న్యాయం కోసమైనా, ఇన్‌పుట్ అప్రోచ్ దృష్ట్యానైనా విద్యావకాశాల్లో రిజర్వేషన్ అనేది ప్రస్తుతం ఒక విడదీయలేని ముఖ్య సాధనం. లేని ఏకరూప భారతీయ సంస్కృతి, ప్రాచీన భాషలు, కళల సంరక్షణ కోసం ప్రిజర్వేషన్ అనే పదానికి ముసాయిదాలో పదిసార్లు స్థానం లభించినా, అన్నిరకాలుగా వెనుకబడిన వర్గాల ప్రజలకు బాసటగా నిలిచే రిజర్వేషన్ అనే పదానికి మాత్రం ముసాయిదాలో తగినచోటు దొరకలేదు. అంబేద్కర్ తన జీవితాంతం ఈ అంశాలతో పాటు చెప్పిన అనేక విలువైన అంశాలను వదిలి, తమకవసరమైన చోట అంబేద్కర్‌ను సౌకర్యవంతంగా ప్రస్తావించడం మరొక వైరుధ్యం.

రాజ్యాంగం ఎంత బాగున్నా దానిని అమలుచేసే ప్రజలు చెడ్డవాళ్లైతే అది విఫలమవుతుంది; అలాగే , రాజ్యాంగం ఎంత చెడ్డగున్నా దానిని అమలుచేసే ప్రజలు మంచివాళ్లైతే అది సఫలమవుతుంది; అంటే రాజ్యాంగం పనితీరు పూర్తిగా దాని స్వభావం మీదనే ఆధారపడదు, అని అంబేద్కర్ రాజ్యాంగాన్ని ఉద్దేశించి మాట్లాడింది ఈ ముసాయిదాకు కూడా వర్తిస్తుందని భావం. అంటే ప్రస్తుత ప్రతిపాదిత విద్యావిధాన

పర్యవసానాలు, దాన్ని రచించిన కమిటీ చేతిలో గానీ, ఆ కమిటీని నియమించి విధాన రచనను నిర్దేశించిన ప్రభుత్వ పాలకపార్టీ చేతిలోగానీ ఏమీ ఉండదనీ అర్థం. అవి కేవలం విధానాన్ని అమలు చేసుకొనే ప్రజల(కర్మ)పైన మాత్రమే ఆధారపడి ఉంటాయని భావం.

మాటిమాటికీ భారతీయ సంస్కృతీసాంప్రదాయాలు అని గొప్పగా ప్రస్తావించే ముసాయిదా తన పిల్లల విద్యకు సంబంధించిన ఏదేని ప్రతిపాదనకు మద్ధతుగా భారతదేశంలో జరిగిన అధ్యయనాలను సర్వేలను పరిశోధనలను కాకుండా, విదేశాల్లో జరిపిన వాటిని ఎక్కువగా ప్రస్తావిస్తుంది. అవి మన దేశ పిల్లలకు సరిగ్గా పూర్తిగా వర్తిస్తాయా లేదా అనే చర్చ లేకుండానే! ఉదాహరణకు, అది ఎన్‌సిఇఆర్‌టి వంటి ఒకటి రెండు స్వదేశీ అధ్యయనాలతో పాటు, యునెస్కో-1996 విడుదల చేసిన లర్నింగ్: ద ట్రెజర్ వితిన్, ఒఇసిడి, వరల్డ్ బ్యాంక్, వరల్డ్ ఎకనామిక్ ఫోరమ్, బ్రూకింగ్స్ సంస్థల వంటి విదేశీ అధ్యాయనాలను పేర్కొంటుంది. దేశీయ పిల్లల విద్యకు పరదేశ అధ్యయనాలకంటే మనదేశ అధ్యయనాలే సరియైన ఫలితాలు ఇస్తాయి కదా! ఇది మరొక వైరుధ్యం. అవకాశవాదంగా కాకుండా, తన సొంత అవసరాల కోసం కాకుండా, మంచి ఎక్కడున్నా తీసుకోవడం, చెడు ఎక్కడున్నా వదిలివేయడం అన్న దృక్పథంతోనైతే, అది సరియైనదే.

ఒకవైపు-విశ్వవిద్యాలయాలు అంటే, అండర్ గ్రాడ్యుయేట్, గ్రాడ్యుయేట్, పిఎచ్‌డి స్థాయిలలో బహుళ-కోర్సువిషయాల్లో, నాణ్యమైన బోధనను, పరిశోధనను ప్రోత్సహించేవి మాత్రమే అని అర్థం; దాని నిర్వచనం ప్రపంచవ్యాప్తంగా ఒక్కటే విధంగా ఉంటుంది; ప్రస్తుతం మన దేశంలో డీమ్డ్ టు బి యూనివర్సిటీ, అఫ్లియేటింగ్ యూనివర్సిటీ, యూనిటరీ యూనివర్సిటీ వంటి అనేక రకాలు ఉండవు – అని చెబుతూ; మరొకవైపు – ప్రస్తుత ముసాయిదా ప్రకారం, పబ్లిక్, ప్రైవేటు, ప్రైవేట్-ఎయిడెడ్ విశ్వవిద్యాలయాలు, ఒకటవ రకం (బహుళకోర్సుల పరిశోధన) విశ్వవిద్యాలయాలు, రెండవ రకం (సమగ్ర బోధన) విశ్వవిద్యాలయాలు మాత్రమే ఉంటాయని తిరిగి సౌకర్యవంతంగా అనేక రకాల విశ్వవిద్యాలయాలను ప్రతిపాదించడం మరొక వైరుధ్యం.

ప్రభుత్వ, ప్రైవేట్ ఉన్నత విద్యాసంస్థలకు స్వయంప్రతిపత్తి ఉంటేనే అవి జ్ఞాన సమాజాలను జ్ఞానాధారిత ఆర్థికవ్యవస్థలను నిర్మించగలవని చెప్పే ముసాయిదా, రాజ్యాంగ ఫెడరల్ స్ఫూర్తిని బలహీనపరుస్తూ, మళ్లీ వాటిపై దాదాపు నాలుగైదు కేంద్ర ప్రభుత్వ సంస్థల పర్యవేక్షణ, నియంత్రణ ఉంటుందని ప్రతిపాదిస్తుంది. ఒకవైపు కొత్తగా స్థాపించబడనున్న అనేక కేంద్ర ప్రభుత్వ సంస్థలు ఉన్నతవిద్యాసంస్థలను నియంత్రిస్తాయనీ, పర్యవేక్షిస్తాయనీ చెబుతూ, మరొకవైపు అవి స్వయం ప్రతిపత్తి గలవని జపించటం మరొక వైరుధ్యం.

తన పీఠికలో, ఈ నూతన జాతీయ విద్యా విధానం గత రెండు జాతీయ విద్యా విధానాలకు (1968 జాతీయ విద్యా విధానం, 1986/92 జాతీయ విద్యా విధానాలకు) కొనసాగింపు అని చెబుతుంది. పాత రెండు విద్యా విధానాల్లో అమలు పూర్తికాకుండా వున్న కార్యక్రమాలను ముందుకు తీసుకొని పోతుందని చెప్పే ఈ కొత్త విధానం 1968 జాతీయ విద్యావిధానాన్ని సౌకర్యవంతంగా వదిలివేసి ప్రైవేటీకరణకు, కార్పొరేటీకరణకు ద్వారాలు తెరచిన 1986/92 విద్యావిధానాన్ని మాత్రమే ప్రస్తావిస్తుంది. దేశ విద్యార్థులందరికీ సమాన అవకాశాలతో కూడిన విద్యనందించడానికి మొట్టమొదటి సారిగా 1968 జాతీయ విద్యా విధానంలో ప్రతిపాదించబడిన ప్రస్తుత విద్యాసంక్షోభాన్ని చాలావరకు పరిష్కరించగల కామన్ స్కూల్ భావనను ఉద్దేశ్యపూర్వకంగానే ముసాయిదా ఆసాంతం ప్రస్తావించలేదనుకోవచ్చు. ప్రారంభంలో, ఈ విద్యావిధానం గత రెండు విద్యావిధానాలకు కొనసాగింపు అని చెబుతూ; కొంత ప్రజానుకూలత కలిగిన మొదటివిద్యావిధానాన్ని సౌకర్యవంతంగా వదిలివేసి, కేవలం తమకు అనుకూలమైన, ప్రైవేటీకరణకు ద్వారాలు తెరచిన రెండవ విద్యావిధానాన్ని మాత్రమే ముసాయిదా మొత్తం ప్రస్తావించటం మరొక వైరుధ్యం.

ఒకవైపు-ప్రాథమిక తరగతులల్లో పిల్లల కొనసాగింపుపైన పూర్వ ప్రాథమిక విద్య ప్రభావం అనే అంశంపై 1992లో ఎన్‌సిఇఆర్‌టి చేసిన అధ్యయనం, పూర్వప్రాథమిక విద్యకు, ప్రాథమిక, ప్రాథమికానంతర తరగతుల్లో పిల్లల కొనసాగింపునకు, హాజరుకు, అభ్యసన సామర్థ్యాలకు మధ్య ప్రయోజనకర సంబంధాన్ని తెలియజెప్పిందని చెబుతూ; మరోపక్క -ప్రారంభ శిశు విద్య ప్రభావం అనే అంశంపైన ఈ మధ్యే 2017 లో ఢిల్లీలోని అంబేద్కర్ విశ్వవిద్యాలయం చేసిన అధ్యయనం ప్రభుత్వ ప్రైవేట్ విద్యాలయాల్లో పూర్వప్రాథమిక విద్యను పొందిన అనేక మంది పిల్లలు ప్రాథమిక పాఠశాలకొచ్చేసరికి తగినంత సంసిద్ధత, అభ్యసన సామర్థ్యాలు గాని ఉండటంలేదని తేల్చిందని చెబుతుంది. పరస్పర విరుద్ధాంశాలను ప్రస్తావించి సౌకర్యవంతంగా తనకు కావల్సిన ప్రారంభ శిశు సంరక్షణ విద్యను ప్రతిపాదించడమే వైరుధ్యం.

ఇంకా అనేకానేక విషయాల్లో కూడా ఈ వైరుధ్యాల వల్ల, తను అభిప్రాయపడే ప్రతిపాదనను ఖచ్చితంగా, తప్పకుండా అమలు చేయాలనీ స్పష్టంగా నిర్దిష్టంగా ముసాయిదా కావాలనే చెప్పలేదన్పిస్తుంది. ఇంత వైవిధ్యం గల పెద్ద దేశానికి, ఎవ్వరికీ ఇబ్బంది కలగకుండా, అందరికి సమన్యాయం జరిగేటట్టు విద్యా విధానం రూపొందించడం అంత సులువేమీ కాదు అనే సాకు అసలే పనికిరాదు. ఎంత కష్టమైనా ఎంత సమయం వెచ్చించైనా చేయాల్సిన పని అదే.

అనేక ముఖ్య అంశాల ప్రతిపాదనల సందర్భంలో ఈ విరుద్ధాంశాలవల్ల కమిటీ నిర్దిష్టంగా ఏమి చెప్పదల్చుకుందో బోధపడదు. ఒకచోట ఔనన్న విషయం మరొక చోట కాదనీ, ఒకచోట కాదన్న విషయం మరొక చోట ఔననీ, ఒకేచోట ఒకే విషయాన్ని ఔననీ కాదనీ చదువుతాం. మళ్లీ జాగ్రత్తగా పరిశీలిస్తే, మొదట్లో ప్రజలమెప్పు కోసం ప్రజాభిప్రాయాల్నే ప్రతిపాదించాల్సి వచ్చినా, వెనువెంటనే లేదా ప్రజల దృష్టిపడని మరొకచోట పాతప్రతిపాదనను రద్దుపరిచే లేదా బలహీనం చేసే మరొక కొత్త ప్రతిపాదన చేయబడుతుంది. అంతపెద్ద ముసాయిదాలో ఒకటీఅరా అలా జరిగితే పొరపాటున జరిగిందనుకోవచ్చునేమో కానీ, అత్యంత ప్రధానమైన అనేక విషయాల్లో మాత్రం అలా అనుకోగలమా? ముఖ్యవిషయాల్లో నిజానికి అత్యంత స్పష్టత, జాగరూకత అవసరం కదా! ప్రజల్ని మభ్యపెట్టడానికే తప్ప, కమిటీ సభ్యులకు ఆ విషయాలపైనా నిజాయతీగా ఆమోదంగానీ అంగీకారంగానీ ఉన్నాయనుకునే జాడలు కనపడవు. నిర్దిష్ట ఆదేశాలు, నియంత్రణ, పరిమితుల మేరకే ఈ ముసాయిదా రచన జరిగిందని అన్పించక మానదు. పైపైన చూసినప్పుడు ప్రజలకు అనుకూలంగా, లోతుగా చూసినప్పుడు అంతిమంగా ప్రభుత్వాలకు అనుకూలంగా ఉండాల్సిన సాధారణ ప్రభుత్వాల విధాన రచనా సుగుణం ఈ ముసాయిదాలో అడుగడుగునా ద్యోతకమవుతూనే ఉంటుంది.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్ ఆఫ్ ఫిజిక్స్,*
*సొసైటీ ఫర్ ఛేంజ్ ఇన్ ఎడ్యుకేషన్ ప్రిసీడియం సభ్యుడు)* వీ

# అమెజాన్ కార్చిచ్చుకు అసలు కారణం

*అమెజాన్ అడవుల్లో సామ్రాజ్యవాదుల బహుళజాతి కంపెనీల పెట్టుబడి కార్చిచ్చు కారణంగానే అడవులు దగ్ధమై పర్యావరణానికి పెను ప్రమాదం జరుగుతుంది తప్ప అడవిని రక్షించే ఆదివాసుల నుంచి కాదని అంటున్నారు* **పి. వరలక్ష్మి**

ఆగస్టు 19న బ్రెజిల్ నగరాలపై అలముకున్న దట్టమైన పొగ ప్రపంచాన్నే ఉక్కిరిబిక్కిరి చేసింది. ప్రపంచంలోని అతి పెద్ద ఉష్ణమండల వర్షారణ్యం దారుణంగా తగలబడిపోతోందని సోషల్ మీడియాలో ప్రకంపనలు మొదలయ్యాయి. అమెజాన్ అడవులను కాపాడండని ట్యాగ్‌లైన్లు, సెలబ్రిటీల ప్రకటనలు హోరెత్తాయి. కార్చిచ్చు పడిన భూమిని అంతరిక్షం నుండి చూపించే ఉపగ్రహ చిత్రాలను నాసా విడుదల చేసింది. ఊరేగింపులు, నిరసన ప్రదర్శనలు వెల్లువెత్తాయి. బహుషా మొదటిసారి ప్రపంచమంతా ఒక్కటై పర్యావరణం కోసం గొంతువిప్పిన సందర్భం ఇదేనేమో. జి7 దేశాల కూటమి కూడా ఈ కార్చిచ్చును గురించి చర్చించింది. ఇది తక్షణ తాత్కాలిక ప్రతిస్పందనే, కాని ఈ వార్తా సంచలనం పర్యావరణ స్పృహను ఎంతో కొంత పెంచగలిగింది. పర్యావరణ సమతుల్యత కోసం అడవుల పరిరక్షణ ఎంత ముఖ్యమో అందరూ మాట్లాడుతున్నారు. భూమ్మీద ప్రాణులకు 20 శాతం ఆక్సీజన్ అమెజాన్ నుండే వస్తుందనే అతిశయోక్తులు చక్కర్లుకొట్టాయి. ప్రపంచానికి ఊపిరితిత్తుల వంటి అమెజాన్ అడవులు ఈ స్థాయిలో తగలబడడానికి కారణం బ్రెజిల్ ప్రభుత్వ పర్యావరణ వ్యతిరేక విధానాలని ఆ దేశాధ్యక్షుడు బొల్సొనారోపై విమర్శలు వెల్లువెత్తుతున్నాయి. అయినా సెప్టెంబర్ చివరి వారానికి కూడా అడవి మండుతూనే ఉంది. తాజా సమాచారం ప్రకారం ఇంకా 1,31,600 కార్చిచ్చులు మండుతూనే ఉన్నాయి.

భూగోళానికి అమెజాన్ అడవుల ప్రాధాన్యత చిన్నది కాదు. అమెజాన్ ఉష్ణమండల వర్షారణ్యాలలో అతి పెద్దది. ఉష్ణమండల వర్షారణ్యాలు భూవాతావరణాన్ని, జీవసమతుల్యతను కాపాడడంలో కీలక పాత్ర వహిస్తాయి. ఎంత దట్టంగా చెట్లు పెరిగి ఉంటాయంటే ఇక్కడ 2 శాతానికి మించి సూర్యరశ్మి నేలను తాకదు. ఏడాది పొడవునా పచ్చగా ఉండే ఈ అడవులు ఆరు శాతం భూమిని ఆక్రమించుకుని ఉంటే, ఇక్కడ 50 శాతం జీవులు నివసిస్తున్నాయని శాస్త్రవేత్తలు అంచనా వేస్తున్నారు. ప్రపంచంలోని నాలుగోవంతు ఔషధ మొక్కలు ఇక్కడే ఉన్నాయి. అమెజాన్ అడవులు 55 లక్షల చదరపు కిలోమీటర్ల వైశాల్యంతో (ఇండియా వైశాల్యం 32.8 లక్షల చ.కి.మీ.) ఎనిమిది దేశాలలో నిరంతరాయంగా విస్తరించి ఉన్నాయి. సుమారు 60 శాతం అమెజాన్ అడవి బ్రెజిల్‌లోనే ఉంది. ప్రపంచానికి ఊపిరితిత్తులు అనడం అతిశయోక్తి ఏమోగాని అమెజాన్ భూతాపాన్ని చల్లార్చే ఏసీలాగా అయితే పనిచేస్తుంది. కాలుష్యం, ఇతరేతర కారణాల వల్ల భూ ఉపరితలం మీదికి విడుదలయ్యే కొన్ని కోట్ల టన్నుల కర్బన ఉద్గారాలను పీల్చుకునే స్థాయి ఈ దట్టమైన అడవులకు ఉంది. ఈ ఉద్గారాలు భూమి వేడెక్కడానికి ప్రధాన కారకాలు. అమెజాన్ అడవుల విధ్వంసం వల్ల భూతాపం మునుపటి కన్నా తీవ్రంగా పెరిగిపోతుంది.

నిజానికి అడవుల్లో కార్చిచ్చులు కొత్త కాదు. ఈ ప్రాంతంలో జూలై నుండి అక్టోబర్ వరకు ఉండే పొడి కాలంలో మంటలు చెలరేగడం సహజం. పిడుగుపాటు వల్ల కూడా మంటలు వస్తాయి. అయితే ఇక్కడ ఎగసే మంటలకు ప్రధాన కారణం ఎక్కువగా పంటలు సాగు చేసుకోవడం కోసం రైతులు అడవిని నరికి తగలబెట్టడమే. ఇది ప్రతి ఏడాదీ బ్రెజిల్‌తో పాటు పెరు, బొలీవియా, కాంగో, అంగోలా, జాంబియా వంటి దేశాలలో ఉండేదే. కానీ బ్రెజిల్‌లో ఈ ఏడాది జనవరి నుండి ఆగస్టు వరకు 85 శాతం అధికంగా మంటలు చెలరేగినట్లు ఆ దేశ అంతరిక్ష పరిశోధన సంస్థ నివేదించింది. జనవరిలో అధికారంలోకి వచ్చిన జైర్ బొల్సొనారో విధానాలే ఇందుకు కారణమని ప్రపంచమంతా అతన్ని తిట్టిపోస్తోంది. ఇందులో వాస్తవం ఉంది కానీ బొల్సొనారో ఒక్కడే విలన్ కాదు. ఇంకా చెప్పాలంటే ఇతను మెయిన్ విలన్ కాదు. ఇప్పుడు పర్యావరణ చర్చంతా బ్రెజిల్ కేంద్రంగా, ఆ దేశ 'పొగరుబోతు' అధ్యక్షుడి కేంద్రంగా జరుగుతుండడంతో అసలు చర్చనీయాశం ముందుకు రావడం లేదు.

ఇవాల్టి సంక్షోభం అర్థం కావాలంటే బ్రెజిల్‌లో యాభై ఏళ్లుగా అమలవుతున్న రాజకీయార్థిక విధానాల గురించి కనీసంగానైనా తెలుసుకోవాలి. 1964 నుండి 1985 వరకు బ్రెజిల్ సైనిక పాలన కింద ఉన్నప్పుడు బహుళ జాతి సంస్థలు ఇక్కడ ప్రయోగాలు చేయడం మొదలు పెట్టాయి. బ్రెజిల్‌ను 'అభివృద్ధి' చేయడానికి ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు ఆ దేశంలో విస్తారంగా రోడ్లు, భారీ డ్యాముల వంటి నిర్మాణాలకు సహకారం అందించాయి. ప్రపంచ బ్యాంకు అభివృద్ధి పథకంలో భాగంగా బ్రెజిల్ ప్రభుత్వం కార్పొరేట్ సంస్థలకు సబ్సిడీలు ఇచ్చి గనుల తవ్వకాలను ప్రోత్సహించింది. ఇదంతా జరిగింది అమెజాన్ అడవి ప్రాంతంలోనే. 1972లో బి.ఆర్. 230 అనే 4 వేల కిలోమీటర్ల జాతీయ రహదారి అమెజాన్ అడవిని చీలుస్తూ నిర్మాణమైంది. 1960లలో ప్రారంభమై 1980లో పూర్తయిన మరో రహదారి 4,325 కిలోమీటర్ల మేరా అమెజాన్ పరీవాహక ప్రాంతంలో ఉన్న రాష్ట్రాలను అనుసంధానించింది. ఇవి అడవి సంపదను తరలించే రహదారులని వేరే చెప్పనక్కర్లేదు. ఇనుము, రాగి, బంగారం తదితర గనుల నుండి ముడిసరుకు ప్రపంచ మార్కెట్‌కు సులువుగా చేరే మార్గం పడింది. వ్యాపార పంటలు వ్యవసాయంలోకి ప్రవేశించాయి. సోయాబీన్, చెరకు, కాఫీ, కోకో, పామ్ ఆయిల్ పంటలు, బీఫ్ పరిశ్రమకు అవసరమయ్యే పశువుల కోసం పచ్చిక బయళ్లు విస్తరించే కొద్దీ అడవి తరుగుతూ వచ్చింది.

1970ల ప్రాంతంలోనే చాలా మంది మైదాన ప్రాంతపు చిన్న రైతులు అడవుల్లోకి తరలిపోయి చెట్లు నరికి వ్యవసాయం చేసుకోవడం మొదలైంది. ప్రపంచ మార్కెట్ అవసరాల కోసం వెలిసిన ఆధునిక వ్యవసాయ క్షేత్రాలు, యంత్రీకరణ వల్ల చాలా మందికి పనిలేకుండా పోయి ప్రజలు వలసలు పోవలసి వచ్చింది. భూమి అంతకంతకూ కొద్దిమంది చేతుల్లో కేంద్రీకరించబడింది. వలసలు పెరుగుతూపోయి నగరాలు పట్టకుండా అయిపోయాయి. మురికివాడలు విస్తరించాయి. ఇట్లా వలస వచ్చిన జనాభాను నగరాలు పోషించలేకపోయాయి. ఆర్థిక సంక్షోభం, సైనిక పాలన బ్రెజిల్‌ను అశాంతితో కుదిపేశాయి. అలజడులు రేగాయి. ప్రజలకు ఉపాధి కల్పించలేని పాలకులు అనివార్యంగా కొంత జనాభాను అడవులవైపు పంపాల్సి వచ్చింది. అమెజాన్ అడవుల్లోకి రోడ్లు కూడా పడడంతో సులభంగా మైదాన ప్రాంతం వాళ్లు లోలోపలికి వెళ్లగలిగారు.

ఎగుమతుల కోసం పండించే పంటలకు ప్రోత్సాహకాలు, అటవీ ప్రాంతంలో నివాసాలు, వ్యవసాయ క్షేత్రాల కోసం కూడా ప్రపంచ బ్యాంకు సహకారం ఉంది. ఇటువంటి అభివృద్ధి ప్రణాళికలే బొలీవియా, మొజాంబిక్, ఇండొనేషియా, వియత్నాం వంటి దేశాల్లో కూడా రచించారు. మౌలిక సదుపాయాలు మెరుగుపరిచి పేద దేశాలను అభివృద్ధి వైపు నడిపించే ఘనమైన లక్ష్యాలు ప్రకటించే ప్రపంచ బ్యాంకు మొదట భారీ రోడ్ల ప్రాజెక్టుతో బయలుదేరుతుంది. సులభంగా ముడిసరుకులు తరలించేందుకు మార్గాలనేర్పరచుకుంటుంది. తమ పరిశ్రమలకు విద్యుత్తు, నీటి సౌకర్యం కోసం పెద్ద పెద్ద డ్యాములు కట్టించుకుంటుంది. తిరిగి తానే సాయం చేస్తున్నట్లు భ్రమింపజేస్తుంది. ఇది ఎప్పటి నుండో నడుస్తున్న పాత కథే. ఈ బలిసిన బహుళజాతి సంస్థలే పర్యావరణ పరిరక్షణ కోసం కూడా సాయం చేస్తామంటాయి.

పెద్ద పెద్ద మైనింగ్ సంస్థలు, ప్లాంటేషన్ల దగ్గరి నుండి భూమి, భుక్తి కరువై నిలువనీడ లేక అడవుల్లోకి వలసపోయి సాగు చేసుకుంటున్న పేద రైతుల దాకా అందరూ అడవినే ఆధారం చేసుకున్నారు. అడవిలో పెట్టుబడి కార్చిచ్చు ఎప్పుడో పడింది. అది దశాబ్దాలుగా పర్యావరణాన్ని దహిస్తూనే ఉంది. కానీ మంటల పాపం రైతులు మోస్తున్నారు. ఇదంతా ఇలా ఉంటే ఆదివాసులు అత్యంత దారుణమైన దోపిడికి గురవుతున్నారు. సుమారు పది లక్షల మంది ఆదివాసులు ఎప్పటి నుండో ఈ అడవుల్లో ప్రకృతితో మమేకమై జీవిస్తున్నారు. ప్రపంచంలో ఎక్కడైనా వీరి ఉనికి అడవికి, పర్యావరణానికి ఎన్నడూ హాని చేయదు. పైగా అడవులను పరిరక్షించేది కూడా ఆదివాసులే.

సాధారణంగా ఆదివాసుల పోడు వ్యవసాయం ఎలా ఉంటుందంటే ఒకసారి నరికిన అడవి పునరుద్ధరణ చెందే కాలం కన్నా వేగంగా వాళ్లు అడవిని కొట్టివేయరు. ప్రకృతి సహజ పునరుత్పత్తి క్రమానికి, వీరి ఉత్పత్తి క్రమానికి సుమారుగా వైరుధ్యం ఉండదు. దీనికి విరుద్ధంగా విశాలమైన అటవీ ప్రాంతాలను ధ్వంసం చేసే భారీ ప్రాజెక్టులకు, మైనింగ్ కార్యకలాపాలకు వ్యతిరేకంగా అమెజాన్ ఆదివాసులు పోరాడుతున్నారు. వీరి ప్రాచీన ఉత్పత్తి విధానం ప్రకృతితో స్నేహపూరితంగా ఉంటుంది కానీ, భారీ లాభాలనాశించే వ్యవసాయ పరిశ్రమ అవసరాలకు అది తగనిది. కాబట్టి పెట్టుబడిదారీ విధానం ఆదివాసీ ప్రాంతాల్లోకి మైదాన ప్రాంతాల వాళ్లను తరలించి ఆధునిక వ్యవసాయ పద్ధతుల్ని అమలుజరుపుతుంది. ఫలితంగా ఆదివాసీ సమాజం సంక్షోభాన్ని ఎదుర్కొంటోంది. అడవి తగలబడుతుంటే నిస్సహాయంగా పరుగులు తీసిన వన్యప్రాణుల అవస్థా, వీరి అవస్థా ఒకటే.

ప్రపంచానికి మా దేశపు అడవులే ఎందుకు ఊపిరినందించాలి అని బొల్సొనారో వితండవాదం చేస్తుండొచ్చు. తమకు అవసరమైనదానికన్నా ఎక్కువ అడవే ఉందని, కానీ వ్యవసాయానికి అవసరమైన భూమి కొరత ఉందని, అయినా గ్లోబల్ వార్మింగ్ వంటి ట్రాష్ మాట్లాడుతూ తమ అభివృద్ధికి అడ్డంపడే హక్కు ఎవరికీ లేదని అతను నోరు పారేసుకోవచ్చు. కానీ ఈ తరహా అభివృద్ధి విధానం, అభివృద్ధి వాదన ఎవరు ప్రవేశపెట్టారు? పర్యావరణ పరిరక్షణ గురించి యూరప్ మాకు పాఠాలు నేర్పుతుందా అని అతను అడగడంలో అసలే లాజిక్ లేదంటామా? అమెజాన్ తగలబడడానికి బ్రెజిల్ రైతులు కారణమా? అటవీ చట్టాలు అమలు చేయని ప్రపంచ పెట్టుబడి సేవకుడైన అధ్యక్షుడు కారణమా? ఆ ఒక్కడిని విలన్ను చేసి తప్పించుకుంటున్న సామ్రాజ్యవాదుల మాటేమిటి? ప్రపంచవ్యాప్తంగా దేశాలను తమ అదుపాజ్ఞల్లో పెట్టుకొని, పర్యావరణ చట్టాలను బలహీనపరిచి తమ పెట్టుబడులకు ప్రోత్సాహకాలిమ్మని ఒత్తిడి చేస్తున్న సామ్రాజ్యవాదులు అడవిని కాపాడ్డానికి సహాయం చేస్తామని అంటున్నారు. ఎంత విచిత్రం కదూ!

(రచయిత విరసం కార్యవర్గ సభ్యురాలు) వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. – సం.*

# డేవిడ్ హార్వే: పెట్టుబడి - 7 ప్రధాన వైరుధ్యాలు

***పెట్టుబడిదారీ వ్యవస్థ తనలోని పదిహేడు అంతర్ వైరుధ్యాల వల్ల పతనం దిశగా పయనిస్తుందని డేవిడ్ హార్వే చేసిన విశ్లేషణలోని ఏడు ప్రాథమిక వైరుధ్యాలను వివరిస్తున్నారు రమేష్ పట్నాయక్***

*(...గత సంచిక తరువాయి భాగం)*

**వైరుధ్యం - 6**

పెట్టుబడి ఒక ప్రక్రియనా లేక ఒకానొక ఘటక స్థితియా?

ఈ అధ్యాయంలో డేవిడ్ హార్వే పెట్టుబడిని ఒక ప్రక్రియగానూ అదే సందర్భంలో ఒకానొక ఘటక స్థితి(స్టేట్) గానూ పరిశీలిస్తాడు. పెట్టుబడికి ఈ రెండు లక్షణాలు ఒకే సమయంలో వర్తిస్తాయని అంటాడు. డేవిడ్ హార్వే తత్వశాస్త్రంలోనూ, భౌతిక శాస్త్రంలోనూ ఈ ద్వంద్వత్వానిక సామ్యాలను చూపిస్తాడు. మనం మన పరిశీలనలను పెట్టుబడికే పరిమితం చేద్దాం. స్టేట్ అనే ఇంగ్లీష్ పదానికి స్థితి అని కూడా అనువాదం చేయవచ్చు. అయితే స్థితి అనే పదానికి భావవాద అర్థాన్ని తీసుకునే అవకాశం ఉంది. అంతర్నిర్మాణం లేని స్థితిలో అంటే ఆంతరంగిక వైరుధ్యం లేని స్థితిలో మార్పు సాధ్యం కాదు. ఘటక స్థితి అనే పదబంధం వివిధ అంశాలు వివిధ పరిమాణాలలో, సంబంధాలలోనూ ఉన్న ఒకానొక స్థితిని స్ఫురింపజేయగలదనే ఉద్దేశ్యంతో ఆ పదబంధాన్ని వాడడం జరిగింది. స్థితిలో ఒకానొక అంతర్నిర్మాణం, ఆంతరంగిక ఘర్షణ ఉంటాయని చెప్పడం ఇక్కడ ఉద్దేశ్యం. ఈ విషయాన్ని ఒక్కసారి వివరించుకున్న తరువాత స్థితి అనే పదాన్ని వాడినా ఇబ్బంది లేదు.

పెట్టుబడి అనేది అవినీతి, అక్రమాలు, మోసాలు, కబ్జాలు, దోపిడీ, దౌర్జన్యాలతో పుట్టి పెరిగి విస్తరిస్తుందని గత అధ్యాయంలో డేవిడ్ హార్వే వివరించిన విషయం పాఠకుడికి గుర్తుండాలి. అంతేకాదు, అవి ఆచరణలో వచ్చిన సమస్యలు మాత్రమే కాదని పెట్టుబడి నుండి విడదీయరాని లక్షణాలని డేవిడ్ హార్వే చెప్తాడు. అయితే ఈ అధ్యాయంలో చేపట్టిన చర్చ అవసరం కొరకు నిజాయితీ కలిగిన పెట్టుబడినే తీసుకుంటాడు. విశ్లేషను సులభతరం చేయడానికి ఆ విధంగా నిజాయితీ కలిగిన పెట్టుబడిని తీసుకుంటాడు గానీ పెట్టుబడి నిజాయితీగా ఉంటుందని గానీ లేదా ఉండగలుగుతుందని గానీ డేవిడ్ హార్వే నమ్ముతాడని కాదు. పెట్టుబడిని ఒక ప్రక్రియగానూ అదే సందర్భంలో ఒక ఘటక స్థితి గానూ పరిశీలించిన తరువాత దానిని పైన పేర్కొన్న అవలక్షణాలతో కలగలపవచ్చు. పెట్టుబడి అనగానే మనకు డబ్బు రూపంలో కట్టలు కనిపిస్తాయి. అయితే, పెట్టుబడి వివిధ రూపాలలో ఉండగలుగుతుంది. ఉదాహరణకు యంత్రాలుగా ఉండవచ్చు. భవనాలుగా ఉండవచ్చు ఉపయోగంలో ఉన్న లేదా ఉపయోగానికి సిద్ధంగా ఉన్న రవాణా సౌకర్యాలుగా ఉండవచ్చు. ముడి సరుకులుగా ఉండవచ్చు. తయారైన సరుకులుగా ఉండవచ్చు. ఇవన్నీ పెట్టుబడి రూపాలే.

డేవిడ్ హార్వే తన చర్చలో టర్నోవర్ కాలాన్ని ఒక దినంగా తీసుకున్నాడు. ముడి సరుకులు వస్తువులుగా తయారయ్యే కాలాన్ని టర్నోవర్ కాలం అంటారన్న విషయం తెలిసిందే. అయితే ప్రస్తుత విషయం టర్నోవర్ కాలంతో సంబంధమున్నది కాదు. టర్నోవర్ కాలాన్ని ఒక దినంగా లేదా ఒక వారంగా లేదా ఒక నెలగా తీసుకున్నా ప్రస్తుత చర్చలో తేడా రాదు. డేవిడ్ హార్వే ఇలా అంటాడు : "పెట్టుబడిదారుడు చేతిలో డబ్బుతో ఒక రోజు తన కార్యకలాపాలు ప్రారంభిస్తాడు... తన వద్ద ఉన్న ధన రూప పెట్టుబడితో ఆ వ్యక్తి వాడడానికి భూమిని, యంత్రాలను, ముడి సరుకులను, నీరు, విద్యుత్తు వంటి సహాయ సరుకులను కొనుగోలు చేస్తాడు. ఉత్పత్తిదారుల (కార్మికుల) శ్రమ శక్తిని కొనుగోలు చేసి వారిని పనిలోకి దించుతాడు. ఒక్క మాటలో చెప్పాలంటే శ్రమ శక్తితో సహా ఉత్పత్తి కారకాలన్నింటిని కొనుగోలు చేస్తాడు. ఈ విధంగా ఆ వ్యక్తి దగ్గర ఉన్న పెట్టుబడి ఖర్చయిపోతుంది. ఉత్పత్తి ప్రక్రియ ప్రారంభమవుతుంది. దినం చివరికి సరుకులు ఉత్పత్తి అవుతాయి. అంటే పెట్టుబడి ధన రూపం నుండి వివిధ ఉత్పత్తి కారకాలుగా మారింది. మరల ఉత్పత్తి జరిగింది కనుక ఉత్పత్తి కారకాల రూపంలో ఉన్న పెట్టుబడి సరుకులుగా మారింది. ఇప్పుడు పెట్టుబడి సరుకుల రూపంలో ఉంది. ఈ తయారయిన సరుకులు అమ్ముడు పోతే ఆ వ్యక్తికి తిరిగి పెట్టుబడి ధన రూపంలో చేతికి వస్తుంది. అయితే, ఈసారి లాభంతో కలసి ఎక్కువ ధనం వస్తుంది. ఈ మొత్తం ప్రక్రియనే పెట్టుబడి ప్రక్రియ అని పెట్టుబడి ప్రవాహం అని అంటాడు. ఈ ప్రవాహంలో పెట్టుబడి ఏదో ఒక రూపంలో మనకు దర్శనమిస్తుంది. అంతేకాదు, ఉత్పత్తి జరుగుతున్న పరిశ్రమకు వెళ్లి చూస్తే ఒకవైపు ముడి సరుకులు ఖర్చవుతూ ఉండడం, ముడి సరుకులు వివిధ స్థాయిలలో రూపం మార్చుకుంటూ ఉండడం, నీరు, విద్యుత్తు వంటి సహాయక సరుకులు ఖర్చవుతూ ఉండడం, పనిచేస్తూ ఉన్న శ్రామికుల శ్రమ శక్తి ఖర్చవుతూ ఉండడం, రెండవ వైపు వస్తువులు తయారవుతూ ఉండడం గమనిస్తాము. ఈ మొత్తాన్ని పరిశీలించినప్పుడు డబ్బుకి, డబ్బుకి మధ్య మనకు వివిధ స్థితులలో ఉన్న పదార్థాలు, లేదా వివిధ ప్రక్రియలలో మారుతూ ఉన్న పదార్థాలు కనిపిస్తాయి. దీనినే డేవిడ్ హార్వే దృగ్విషయం స్థితులలోనూ, ప్రక్రియలలోనూ ఒకే సందర్భంలో ఉండడం అన్నాడు. ఇందులో స్థితులు, ప్రక్రియలు ఒకదానితో ఒకటి విడదీయరాని విధంగా వస్తూ ఉంటాయి. ఒక దానిని వెన్నంటి ఒకటి వస్తూ ఉంటాయి. నిజానికి పెట్టబడి ఈ విధంగా నిరంతరంగా విలువల చలనంగా ఉండాలి, అటువంటి చలనం లేకపోతే పెట్టుబడి మరణిస్తుంది. ఒక పెట్టుబడిదారుడు ధనాన్ని తన చేతులలో ఉంచుకుని పరిశ్రమ పెట్టకపోతే అది మృత పెట్టుబడే కదా! ఇంకొక రకంగా చెప్పాలంటే అది డబ్బు మాత్రమే అవుతుంది గాని పెట్టుబడి అవ్వదు. అలాగే పెట్టుబడి దారుడు కార్మికుల శ్రమ శక్తితో పాటు ఉత్పత్తి కారకాలన్నీ కొనుగోలు చేసి ఉత్పత్తి ప్రారంభించకపోతే అప్పుడు కూడా అవి మృత పెట్టుబడిగానే ఉంటాయి కాని సజీవమైన పెట్టుబడిగా ఉండవు. అలాగే శ్రమ ప్రక్రియ పూర్తి అయిన తరువాత అంటే సరుకులు తయారయిన తరువాత కూడా వాటిని అమ్మకుండా ఎత్తిపెడితే అప్పుడు కూడా ఆ సరుకులు మృత పెట్టుబడి మాత్రమే అవుతాయి. సరుకులు అమ్మిన తరువాత వచ్చిన ధనాన్ని చేతిలో పెట్టుకుని కూర్చున్నా అది మృత పెట్టుబడి మాత్రమే

అవుతుంది. పెట్టుబడి సజీవంగా ఉండాలంటే నిరంతరం అది వివిధ స్థితుల మధ్య మారుతూ ఒక ప్రక్రియలో ఉండవలసిందే.

డబ్బు ఉత్పత్తి కారకం కాదు, ఉత్పత్తి దారుడూ కాదు, అలాగే ఉత్పాదక వస్తువూ కాదు. అయితే, ఇందులో ప్రతి ఒక్కదాని విలువకు (అందులో ఇమిడి ఉన్న సామాజిక శ్రమ విలువకు) అది చిహ్న రూపం అయిన వ్యక్తీకరణగా ఉంటుంది. కాబట్టి పెట్టుబడిదారుడు ఉత్పత్తి కారకాలను కొనుగోలు చేయకముందు లేదా ఉత్పాదితాలను అమ్మివేయ గలిగిన తరువాత ఆయన వద్ద ఉన్నది ధన రూప పెట్టుబడి మాత్రమే. ఈ మొత్తం దృగ్విషయాన్ని మరొక్కసారి చెప్పుకుంటే పెట్టబడి ధన రూపంలో ప్రారంభమై, ఉత్పత్తి కారకాలుగా మారి, ఉత్పత్తి ప్రక్రియలో వివిధ రూపాలు పొందుతూ, తయారయిన సరుకులుగా మారి, తిరిగి ధనంగా, కొంత ఎక్కువ ధనంగా మారుతుంది (మనీ– కమోడిటీ–మనీ లేదా ధనం – సరుకు – ధనం). ఈ విషయంపై మార్క్స్ విస్తృతంగా వివరించిన విషయం తెలిసిందే. మార్క్స్ చెప్పిన విషయాలను డేవిడ్ హార్వే అనేక మార్లు మార్క్సను ఉటంకించకుండా చెప్తాడు. వ్యక్తీకరణ సరళత్వం కొరకే అలా చేసి ఉంటాడనుకుందాం. లేదా మార్క్స్‌తో పాటు ఇతరులు కూడా అదే విషయాన్ని చెప్పిఉన్న కారణంగా కూడా కొన్ని మార్లు మార్క్సను ఉటంకించి ఉండకపోవచ్చు. మనం కూడా ఈ వ్యాసంలో మార్క్స్ చెప్పిందేమిటి, హార్వే జోడించేదిమిటి అన్న విషయాలు విడివిడిగా చూపించడం లేదు. ఆ విషయం అలా ఉంచితే మన పెట్టుబడిదారుడు కొంత ధనం పెట్టుబడిగా పెడితే అంతకంటే ఎక్కువ ధనం వచ్చింది. అదే లాభం. ఆ లాభంలో కొంత భాగాన్ని తొలిపెట్టుబడికి కలిపి మరసటి దినం ఎక్కువ పెట్టబడితో తన వ్యాపకం ప్రారంభిస్తాడు. ఈ విధంగా పెట్టుబడిదారుడి పెట్టుబడి పెరుగుతూ ఉంటుంది. వ్యష్టి పెట్టుబడిదారులు అనేక సందర్భాలలో దివాళా కూడా తీయవచ్చు. కాని, పెట్టుబడిదారీ వర్గం లాభాలు ఈ విధంగానే పెరుగుతాయి. ఈ అన్ని విషయాలను ప్రక్కన పెట్టి పెట్టుబడి ఒక ప్రక్రియగా అదే సందర్భంలో ఒకానొక ఘటక స్థితిగానూ ఉండడాన్ని పరిశీలిద్దాం.

డేవిడ్ హార్వే, 'పెట్టుబడిమాత్రమే కాదు, ప్రతీది ఒక సందర్భంలో వస్తువుగానూ అంటే ఒకానొక ఘటక స్థితిని కలిగినదిగానూ అదే సందర్భంలో ప్రక్రియగానూ అంటే మార్పుగానూ ఉంటుంది... నేను కూడా ఒక పేరుతోనూ, సంఖ్యతోనూ ప్రభుత్వం గుర్తించదగ్గ ఒక ఉనికిగానూ అదే సందర్భంలో ఒక మారుతూ ఉన్న ప్రక్రియగానూ ఉంటాను....' అంటాడు. ఈ తాత్విక భావన కమ్యూనిస్టు విద్యార్థులందరికీ పరిచయం ఉన్నదే. ఒక మొగ్గ పువ్వు అవుతూ ఉండడాన్ని ఒక కాయ పండు అవుతూ ఉండడాన్ని గమనిస్తాం. ఈ మార్పు మొత్తం క్రమంలో అది వివిధ ఘటక స్థితులను దాటుతూ ఉంటుంది. ప్రతి క్షణం ఏదో ఘటక స్థితిలో ఉంటుంది. మరుసటి క్షణం మరొక ఘటక స్థితిలో ఉంటుంది. ఇది ఎలా సాధ్యం? ఒక ఘటక స్థితిలో ఉంది అని మనం అనుకున్నప్పుడు అది మారుతూకూడా ఉందన్న మాట. ఈ విశ్వంలో ప్రతీది ఒక సందర్భంలో ఒకానొక ఘటక స్థితిలో ఉండడం అలాగే మార్పు కలిగించే ప్రక్రియలో ఉండడం అనే ద్వంద్వంగా ఉంటుంది. ఈ విషయాన్నే డేవిడ్ హార్వే పెట్టుబడికి అన్వయించి పైన వివరించినట్లు వివిధ వస్తువుల మధ్య, ప్రక్రియల మధ్య విలువ అనేది నిరంతరాయమైన ప్రవాహంగా ఉండడాన్ని, అటువంటి ప్రవాహం ఎక్కడ ఆగిపోయినా అది మృత పెట్టుబడిగా మారిపోవడాన్ని వివరించాడు. తన వివరణను కొనసాగిస్తూ డేవిడ్ హార్వే పెట్టుబడి వివిధ స్థితుల, ప్రక్రియల మధ్య విలువ అనేది నిరంతరాయమైన ప్రవహించడమే కాదు అది వేగంగా ప్రవహించాలంటాడు. ఎవరి పెట్టుబడి వేగంగా ప్రవహిస్తుందో వారికి పోటీలో ఆధిక్యత ఉంటుందని వివరిస్తాడు. ఒకే సరుకు తయారుచేసే సమానమైన పెట్టుబడితో ప్రారంభమయిన రెండు ఫ్యాక్టరీలు తీసుకుంటే ఏ ఫ్యాక్టరీలో టర్నోవర్ నిడివి తక్కువ ఉంటుందో పెట్టుబడిదారుడు ఆ ఫ్యాక్టరీ పెట్టుబడిదారుడు ఎక్కువ లాభాన్ని పొందుతాడు అని వివరిస్తాడు. పెట్టుబడి అభివృద్ధి చరిత్రలో వేగాన్ని పెంచడం గురించి జరిగిన ప్రయత్నాలను మనం ఎక్కువగానే చూడవచ్చని అందుకొరకు సాంకేతిక రంగంలోనూ అలాగే నిర్వహణ రంగంలోనూ చాలా కొత్త పద్ధతులు ఆవిష్కరణ జరిగిన విషయం తెలిసిందేనని చెప్తాడు. పరిశ్రమలలో ఉత్పత్తి వేగాన్ని పెంచడమే కాకుండా ముడి సరుకులు పరిశ్రమల వద్దకు తీసుకురావడానికి, తయారయిన సరుకులు దూరతీరాలలో ఉన్న కొనుగోలుదారుని వద్దకు తీసుకుపోవడానికి రవాణా సౌకర్యాలు అభివృద్ధిచేయడం పెట్టుబడి వేగాన్ని పెంచడానికి జరిగినవేనని చెప్తాడు. అయినా పెట్టుబడి అనేక సమస్యలను ఎదుర్కొంటుందని తన వేగాన్ని పెంచుకోవడం అంత మీటమీద ఉన్న పనికాదని పెట్టుబడి ఎదుర్కొన్న సమస్యలను, ఫలితంగా వచ్చే సంక్షోభాన్ని వివరిస్తాడు.

డేవిడ్ హార్వే, 'నాదగ్గర డబ్బు ఉంది, నేను ఉక్కు ఉత్పత్తి చేయాలనుకుంటున్నాను. అందుకవసరమైన ఉత్పత్తి కారణాలను (ఉత్పత్తి సాధనాలు, కార్మికులు) నేను సమీకరించాలి. కాని ఉక్కు తయారు చేయడానికి అవసరమైన ఇనుప ఖనిజం, బొగ్గు భూమిలో ఉన్నాయి. వాటిని తవ్వి బయటకు తీయాలి, అయితే గనులకు దగ్గరలో అవసరమైనంత మంది కూలీలు ఉండకపోవచ్చు, ఇక నేను బ్లాస్ట్ ఫర్నేస్ ఏర్పాటు చేయాలి. అందుకు చాలా కాలం పడుతుంది... ఇలా అన్ని ఉత్పత్తి కారకాలను ఏర్పాటు చేసుకోవడానికి చాలా కాలం పడుతుంది. అంతకాలం నా పెట్టుబడి పనిలేనిదిగా ఉంటుంది. అంటే మృత ప్రాయంగా ఉంటుంది. అంతేకాదు, దాని విలువ తరుగుతూ ఉంటుంది. ఈ ఆటంకాలన్నీ తొలగినప్పుడే నా పెట్టబడి ఉత్పత్తి ప్రారంభించ గలుగుతుంది' అంటాడు. అలాగే 'ఉత్పత్తి ప్రక్రియలో కూడా వేగాన్ని పెంచడానికి ఎన్ని ఆవిష్కరణలు జరిగినా వేగానికి ప్రతి సందర్భంలో ఒక పరిమితి ఉంటుంది. అలాగే, పరిశ్రమలో పనిచేసే కార్మికులు పెట్టుబడిదారునితో ఉన్న ఘర్షణలవలన కావాలని పనివేగాన్ని తగ్గించవచ్చు లేదా మొత్తం సమ్మె చేయవచ్చు. ఉత్పత్తి కొనసాగించడానికి వారితో సమస్యలు పరిష్కరించుకోవాలి... స్టీలు తయారయిన తరువాత కూడా అది అమ్ముడు పోకపోతే, అంటే చలనం లేకపోవడం వలన ఉత్పత్తి రూపంలో ఉన్న పెట్టుబడి మృత ప్రాయం అవుతుంది.' అంటాడు. పాఠకుడు ఇవన్నీ చదివి డేవిడ్ హార్వే పెట్టుబడిదారుల కష్టాలు ఏకరువు పెడుతున్నాడని అనుకోవలసిన అవసరం లేదు. ఎందుకంటే పెట్టుబడికి చారిత్రక పాత్ర అయిపోయిందని, అందుకే అది ఒకటి తప్పిస్తే మరొక సంక్షోభంలో కూరుకుపోతున్నదని చెప్పడానికి ఈ విషయాలన్నీ చెప్తాడు. పెట్టుబడి తన వేగాన్ని పెంచుకోవడానికి ఎన్ని అడ్డదారులు తొక్కుతుందో డేవిడ్ హార్వే ఈ కింద చెప్పాడు.

వ్యాపార మెళుకువల గురించి డేవిడ్ హార్వే చెప్తూ 'స్టీలులో అంతగా సాధ్యం కాదుగాని సెల్‌ఫోన్లు, ఎలక్ట్రానిక్ వస్తువుల విషయంలో కొత్త కొత్త డిజైన్‌లు తీసుకువస్తూ కొత్త కొత్త ప్రయోజనాలు కల్పిస్తూ ఒక సారి కొన్న కొనుగోలుదారులే తిరిగి తిరిగి అదేవస్తువును కొనేటట్లు పెట్టుబడిదారులు చేస్తున్నారని' వివరిస్తాడు. అయితే ఇక్కడ మనం హార్వేని పక్కన పెట్టి చెప్పుకోవలసిందేమంటే వ్యాపారాన్ని పెంచుకునే ఈ మెళుకువలు సార్వత్రికంగా ఉపయోగపడవు. సమాజాన్ని పెట్టుబడి దారులు, కార్మికులు, మధ్యతరగతి వారిగా చూస్తే, పెట్టుబడిదారుల శాతం చాలా తక్కువగా ఉంటుంది. వారు ఒక్కొక్క కుటుంబం ఎన్నిసార్లు కొన్నా వారు కొనగలిగే కార్ల సంఖ్య తక్కువగా ఉంటుంది. కార్మికుల

# డానీ వ్యాసం: గురి చట్టంపై, ప్రభుత్వంపై ఉండవలసింది

- జి. సత్యనారాయణ రెడ్డి

'**త**లాఖ్ పరిష్కారమా? నేరమా' పేరుతో రచయిత డానీ రాసిన వ్యాసం 'వీక్షణం' సెప్టెంబర్ సంచికలో ప్రచురించారు. నరేంద్రమోడీ ప్రభుత్వం రెండవ సారి ఎన్నికైన నాటి నుండి ముస్లిం సమాజాన్ని వేధించడానికి దూకుడుగా వ్యవహరిస్తూ వేధింపులు కొనసాగిస్తున్నదనీ, దానిలో ఒక భాగంగానే ప్రభుత్వం పార్లమెంట్ తొలి సమావేశంలోనే ముమ్మారు తలాఖ్ చెప్పిన భర్తల మీద నాన్ బెయిలబుల్ కేసు నమోదు చేసి మూడేళ్ల వరకు శిక్షను విధించే వివాదాస్పద (ముస్లిం మహిళల వైవాహిక హక్కుల పరిరక్షణ) బిల్లు – 2019ను ఆమోదించిందనే విషయాన్ని వివరించి, విమర్శించడం ఆయన వ్యాసం ప్రధాన ఉద్దేశం. అయితే రచయిత దానికే పరిమితం కాకుండా ఆయన ముస్లిం మత ఆవిర్భావ చరిత్ర, దీనిలోని మంచి గురించి, తర్వాత కాలక్రమంలో ఆ మతంలో తప్పుడు ఆచారాలు, పద్ధతులు, ఆచరణలు ఎలా పెంపొందుతూ వచ్చాయో అనేదానిపైన ఒక సుదీర్ఘమైన వివరణను ఇచ్చారు. ఆ వివరణ సారాంశం – ఇతర ప్రపంచ స్థాయి మతాలైన బౌద్ధం, క్రైస్తవం కన్నా ఆధునిక భావాలు కలదనీ పేర్కొంటూ, ఇస్లాం మతం ఏకంగా ఒక సామాజిక విప్లవం అని సూత్రీకరించేదాకా వెళ్లారు. ముస్లిం మత ఔన్నత్యాన్ని సమర్థించడం కోసం ముస్లిం సమాజంలోని పురుషులు మహిళల పట్ల ప్రదర్శిస్తున్న వివక్షను, అసమానతలను, అణచివేతలను తగ్గించి చూపే ప్రయత్నం చేశాడు రచయిత.

ఇస్లాం ఒక సామాజిక విప్లవం అనేది ఒక అతిశయోక్తితో కూడిన అవాస్తవం. అసలు ఏ మతం అయినా కూడా ఒక సామాజిక విప్లవం కాలేదు. మార్క్స్ మతాన్ని ఒక మత్తు మందుగా ఒక్క మాటలో దాని పాత్రను నిర్వచించాడు. అధికారంలో కొనసాగే పాలకులు ప్రజల్లో శాస్త్రీయమైన భావనలు అభివృద్ధి చెందనీయకుండా మత భావనలు పెంపొందించే చర్యలు చేపట్టి ప్రజలను ఆ ప్రాతిపదికపైన చీల్చడానికి ప్రయత్నిస్తూ వచ్చారు. బ్రిటిష్ వలస పాలకులు తమ విభజించు పాలించు అనే విధానానికి మతాన్ని చక్కగా వాడుకొని భారతదేశాన్ని రెండుగా విభజించి శాశ్వతమైన అశాంతికి బలమైన పునాదిని వేశారు. అదే ఇప్పుడు మనదేశంలో మరోసారి చాలా పెద్ద ఎత్తున కొనసాగుతున్నది.

ముస్లిం సమాజంలో వివాహ బంధం నుండి విడిపోయే హక్కు భార్యా భర్తలు ఇద్దరికి ఉంటుందని వివరిస్తూ రచయిత భర్త భార్యకు ఇచ్చే విడాకులకు (తలాఖ్‌కు) భార్య అంగీకారంతో పనిలేదనీ, ఆయన

---

వద్ద కొనుగోలు శక్తి తక్కువగా ఉంటుంది. వారు ఖరీదైన సెల్ ఫోన్లు కొనే సందర్భం ఉండదని కాదు, కాని వారు ఆవిధంగా ఖరీదైన సెల్ ఫోన్ కొనుగోలుచేయడానికి విద్య, వైద్యం, ఆహారం, వసతి వంటి వాటిమీద వ్యయాన్ని బాగా తగ్గించుకుంటారు. ఫలితంగా లేబర్ గూడ్స్‌కు మార్కెట్ తగ్గుతుంది. వాటిని ఉత్పత్తిచేసే పరిశ్రమలకు మార్కెట్ తగ్గిపోతుంది. అంటే పెట్టుబడిదారీ వర్గాలలో ఒక సెక్షన్ సరుకులు అమ్ముకోగలిగితే మరొక సెక్షన్ సరుకులను అమ్ముకోలేని పరిస్థితి ఏర్పడుతుంది. అందుకే హార్వే పైన చెప్పిన మెళుకువలు సార్వత్రిక పరిష్కారం కానేరవు. ఇంక మిగిలినది మధ్యతరగతి వర్గమే. వీరి ఆదాయాలు కాస్తా మెరుగ్గా ఉంటాయి. ఉదాహరణకు పబ్లిక్‌రంగ కార్మికులు. వారు బలమైన ట్రేడ్ యూనియన్ ఉద్యమాల కారణంగా శ్రమ శక్తి విలువ మాత్రమే కాక తాము ఉత్పత్తిచేసిన అదనపు విలువలో కూడా కొంత భాగాన్ని వేతనంగా పొందగలుగుతారు. దీనిని అధికాధికంగా వ్యాపారం అవుతున్న విద్య, వైద్యం, గృహవసతి వంటివాటికి ఖర్చుచేస్తారు. ఆ పరిశ్రమలకు వీరు డిమాండు కల్పిస్తారు. కాస్మాటిక్స్‌కు, లగ్జరీ గూడ్సుకు వీరు ఖర్చుచేస్తారు. బ్యాంకు వడ్డీ రేట్లు తక్కువ ఉన్నందున వీరు బంగారం, భూములు కొనుగోలు చేస్తారు. అయితే వీరి కొనుగోలు శక్తికి కూడా చాలా పరిమితులున్నాయి. ప్రభుత్వ యంత్రాంగంలో పనిచేసి బాగా లంచాలు తినేవారికి కొనుగోలు శక్తి ఎక్కువ ఉంటుంది. వారికి లంచాలుగా అందుతున్నది అదనపు విలువలో భాగమే. పెట్టుబడిదారులు, వ్యాపారులు, కాంట్రాక్టర్లు ఈ లంచాలు ఇస్తారు. కార్మికులను దోపిడీ చేయగా వచ్చిన లాభంలో కొంత భాగాన్ని పెట్టుబడిదారులు రాజకీయ నాయకులకు, అధికారులకు లంచాలుగా ఇస్తున్నందున, లంచాలందుకున్న రాజకీయ నాయకులు, అధికారులు లగ్జరీ గూడ్సు కొనుగోలుచేసి పెట్టుబడి ప్రవాహానికి కొంత అవకాశం కల్పిస్తున్నారు. సంవత్సరానికి ఒక కొత్త కారు, కొత్త మొబైల్ కొనేది ఇటువంటి ఉన్నత మధ్య తరగతి వర్గమే. అలాగే కొన్ని పరిశ్రమలలో, ఉదాహరణకు సాఫ్ట్‌వేర్ రంగంలో ఒక స్థాయి ఉద్యోగులు కొత్త కొత్త కార్లు కొనలేకపోయినా సెల్ ఫోన్లు మార్చగలుగుతారు, స్టార్ హోటళ్లు నడవడానికి మార్కెట్ కల్పించగలుగుతారు. ఏది ఏమైనా మొబైల్ ఫోన్లు కార్లు వంటివి తిరిగి తిరిగి కొనగలిగే కొనుగోలుదారులు తక్కువగానే ఉంటారు. ధనిక, ఉన్నత మధ్య తరగతి వర్గాల వారు మాత్రమే అలా కొనగలుగుతారు. భారత దేశంలో ఇటువంటి వర్గం మొత్తం జనాభాలో 10 శాతం మాత్రమే. లగ్జరీ గూడ్స్ మార్కెట్‌కు చాలా పరిమితి ఉంటుందని చెప్పడమే ఇక్కడ ఉద్దేశ్యం. డేవిడ్ హార్వే చెప్పిన మెళుకువలు (ఒకే వస్తువును తిరిగి తిరిగి కొనిపించే టిక్నిక్) ఈ అధికాదాయ వర్గాల వద్ద మాత్రమే పనిచేస్తుంది. భారత దేశం వంటి దేశాలలో 80 శాతం ప్రజలకు కనీస అవసరాలు – పౌష్టికాహారం, నాగరికంగా జీవించే ఇల్లు, విద్య, వైద్యం, పరిశుభ్రమైన తాగునీరు, – అందడం లేదు. ఈ పరిస్థితులలో కార్లు, మొబైల్ ఫోన్లు వంటివాటిని తిరిగి తిరిగి కొనిపించే మార్కెట్ టెక్నిక్‌లు అధికాదాయ వర్గాలను మాత్రమే మార్కెట్‌కు తీసుకురాగలవు. ఈ పద్ధతిని ఒక సార్వత్రిక పరిష్కారంగా చూడలేము. అది పెట్టుబడిదారీ వర్గాల మధ్య జరిగే పోటిని మాత్రమే ప్రభావితం చేయగలుగుతుంది. అధికాదాయ వర్గాల కుటుంబాలలో పెద్దలు ఇంటి స్థలాలు, బంగారం కొందామంటారు, పిల్లలు కొత్త డిజైన్ కారు కొందామంటారు. ఆ కుటుంబంలో సంబంధాలను బట్టి బయట ప్రచార హోరునుబట్టి ఆ కుటుంబం బంగారం కొంటుందా, కారు కొంటుందా లేక ఇంకేమి కొంటుంది అన్న విషయం నిర్ణయమవుతుంది. ప్రచారహోరు వలన కుటుంబాల కొనుగోలుశక్తి పెరగదు. కుటుంబాల వ్యయ ప్రాధాన్యతలు మారుతాయి. డేవిడ్ హార్వే మార్కెట్ మెళుకువలు ప్రాధాన్యతను ఎక్కువచేసి చూపించినట్లు కనిపిస్తున్నది.

*(రచయిత ఆంధ్రప్రదేశ్ విద్యా పరిరక్షణ కమిటీ నాయకులు)* వీ

ఏకపక్షంగానే విడాకులు ఇవ్వవచ్చునీ, కాని భార్య, భర్తకు ఇచ్చే విడాకులకు (ఖులాకు) భర్త అంగీకారం కావాలనే విషయాన్ని పేర్కొని ఇదొక 'పరిమితి' అని అంటాడు. విడాకుల విషయంలో స్త్రీ, పురుషుల మధ్య ఇంత స్పష్టంగానూ, నగ్నంగానూ ఉన్న అసమానతను, వివక్షను వ్యాస రచయిత అదొక 'పరిమితి'గా మాత్రమే పేర్కొనడం గమనార్హం. ఈ విధమైన వివక్షతలను రచయిత తగ్గించి చూపడాన్ని వ్యాసంలో మరికొన్ని చోట్ల కూడా చూడవచ్చును. ముస్లిం సమాజంలో గల బహు భార్యాత్వాన్ని గురించి చర్చించిన భాగంలో 'ఇస్లాం బహు భార్యత్వాన్ని ఆమోదిస్తున్నప్పటికీ దానికి కొన్ని పరిధులు, పరిమితులున్నాయంటూ మరో వైపున వివాహం చేసుకోకుండా లైంగిక సంబంధాలు పెట్టుకోవడం మీద నిషేధం ఉందనీ, వివాహేతర లైంగిక సంబంధాన్ని ఇస్లాం చాలా తీవ్రమైన అంశంగా పరిగణిస్తుందనీ, అది ఇస్లాంలోని బలమైన అంశంగా రచయిత నొక్కి చెప్పాడు. ముస్లిం సమాజంలోని బహు భార్యత్వాన్ని నిర్ద్వంద్వంగానూ, సూటిగానూ ఖండించాల్సిన సందర్భంలో రచయిత ఆ విధంగా చేయకుండా బహు భార్యత్వాన్ని ఆమోదిస్తున్నప్పటికీ' అంటూ సన్నాయి నొక్కులు నొక్కి ఆ తప్పుడు ఆచారపు తీవ్రతను తగ్గించి చూపే ప్రయత్నం చేశాడు.

పైన పేర్కొన్న రెండు ఉదాహరణలు కూడా రచయిత అభిప్రాయమైన ఇస్లాం ఒక సామాజిక విప్లవం అనే మౌలిక భావనకు అనుగుణంగానూ, దాన్ని సమర్థించే విధంగానూ ఉన్నాయి.

తలాఖ్ ఒక సుదీర్ఘ ప్రక్రియ అనీ, ఇస్లాం ప్రమాణాల ప్రకారం ముస్లిం దాంపత్య జీవితంలో విడాకుల వ్యవహారం చాలా సుదీర్ఘకాలం పాటు సాగే ప్రక్రియగా ఉంటుందనీ దానిలోని దశల గురించి రచయిత సుదీర్ఘమైన వివరణ ఇచ్చాడు. ఆ తర్వాత భాగంలో విడాకుల విషయంలో ముస్లిం సమాజంలో ప్రస్తుతం జరుగుతున్న దాన్ని చర్చించిన చోటే అవి నడిమంత్రపు విడాకులనీ 'టెక్కి తలాకులనీ' అంటూ ఆ విషయంలో ముస్లిం ధార్మిక సంస్థల తప్పిదాల గురించి వివరించాడు. వివాహం విషయంలో ఉన్నతమైన ఇస్లామిక్ వివాహ సాంప్రదాయాలు వేటిని కూడా ఈ తరం యువకులు పాటించడం లేదని వివరిస్తూ, ఈ విధమైన వివాహాలు, విడాకులు అన్ని కూడా ఇస్లాం వ్యతిరేకమైనవేనని రచయిత అంటాడు.

ఈ పరిస్థితికంతా ముస్లిం ధార్మిక సంస్థల తప్పిదమే కారణమనీ, ఆ సంస్థల పెద్దలు ఎక్కువ మంది పురుషాధిక్య భావజాలాన్ని కలిగి ఉంటారనీ, విడాకుల సమస్యల విషయంలో వారు పురుష పక్షపాతంతో తీర్పులు చెపుతుంటారని రచయిత అంటారు. స్మార్ట్ ఫోన్ విడాకుల వ్యవహారం తమ దృష్టికి రాగానే వాటిని ఇస్లాం వ్యతిరేకమని పేర్కొంటూ జమాతులు తక్షణం ఫత్వాలు (ప్రకటనలు) జారీ చేసుంటే బాగుండేదనీ, వాళ్లాపని చేయకుండా నిర్లిప్తంగా ఉండిపోయి వారొక చారిత్రక అపచారం చేశారనేది ఈ వ్యాస రచయిత అభిప్రాయం. ఆ విధమైన చారిత్రక తప్పిదం ద్వారా మొత్తం భారత ముస్లిం సమాజాన్ని రక్షణాత్మక స్థితిలోకి నెట్టివేశారనీ, తద్వారా ముస్లింలను వేధించడానికి సంఘ్‌పరివార్‌కు వారు కొత్త అవకాశాలు కల్పించారనీ అంటూ ఈ పాపం నిస్సందేహంగా ముస్లిం జమాతులదేనని అంటాడు వ్యాస రచయిత. ఇస్లాం ఒక సామాజిక విప్లవమనీ, దాని ఔనత్యం గురించి తన వ్యాసం ప్రారంభంలో ఎంతో గొప్పగా వివరించిన రచయిత ప్రస్తుతం దాని ఆచరణ ఏ విధంగా దిగజారిపోయిందో రచయిత తన పై మాటల్లో స్పష్టంగా పేర్కొన్నాడు.

పై విధంగా రచయిత తన చర్చనంతా పక్కదారి పట్టించాడు. రచయిత విమర్శించదల్చుకున్నది బిజెపి ప్రభుత్వం హిందూ మతతత్వ దృష్టితో ముస్లిం పురుషులను వేధించడానికి తెచ్చిన కొత్త చట్టం గురించి. ఈ వ్యాస రచయిత తన విమర్శను దానిపైన కేంద్రీకరించకుండా ఇస్లాం మతం ఔనత్యం గురించి, ఆచరణలో ప్రస్తుతం అది ఏ విధంగా దిగజారిపోయిందన్న దాని గురించే సుదీర్ఘంగా వివరించాడు.

బిజెపి ప్రభుత్వం అమలు పరుస్తున్న హిందూత్వ విధానాలు అవి ఏ విధంగా ముస్లిం సమాజానికి వ్యతిరేకమో, అవి వారిని ఏ విధంగా వేధిస్తున్నాయో, వేధిస్తాయో అనేదానిపైన కేంద్రీకరించి వివరించి, విమర్శించడం సరైనదిగా ఉంటుంది. వ్యాస రచయిత ఆ విధంగా చేయకుండా పైన వివరించినట్లుగా చర్చను పక్కదారి పట్టించాడు.

ముస్లిం మతం చాలా ఉన్నతమైనదనే భావనలో బిజెపి హిందూత్వ దురహంకారాన్ని ఏ విధంగా ఎదుర్కోగలుగుతాం? హిందూమత ప్రభావంలో ఉన్నవారిని సరైన మార్గంలో ఏ విధంగా ఆలోచింపచేయగలుగుతాం? ఆ మార్గంలో వారిని ఎట్లా ప్రేరేపించగలుగుతాం?

రచయితకు ఇస్లాం మతం మీద బలమైన సానుకూలత ఉండడం ఆయన వ్యక్తిగత విషయం. ఆ సమాజంలోని దిగజారుడుకు వ్యతిరేకంగా ఆయన కృషి చేయవచ్చును. అది ఆయన అభీష్టానికి సంబంధించిన విషయం. బిజెపి వారు హిందూమత విద్వేషాలను విమర్శించే సందర్భంగా రచయిత ఇస్లాంపైన తన అభిప్రాయాలను సుదీర్ఘంగా వివరించడం పూర్తిగా అనుచితం. ఈ రచయితనే తన వ్యాసంలో మరోచోట పేర్కొన్నట్లుగా సంఘ్‌పరివార్‌కు ఆయన ఒక కొత్త అవకాశాన్ని కల్పించడమే. అంతేకాక, హిందూమత ప్రభావంలో ఉన్న ప్రజలను ఆలోచింప చేయడానికి (హిందూత్వ శక్తుల విద్వేష చర్యలపైన) అది ఏ విధంగాను తోడ్పడకపోగా చర్చను పూర్తిగా పక్కదారి పట్టిస్తుంది.

బిజెపి ప్రభుత్వం తెచ్చిన కొత్త చట్టంలోని అసలు సమస్య – సుప్రీంకోర్టు ఒక పౌర వ్యవహారంగా నిర్వచించిన విడాకుల సమస్యను కేంద్ర ప్రభుత్వం ఒక నేరపూరిత చర్య (క్రిమినల్ చర్య)గా పరిగణిస్తూ చట్టం తేవడం. దాని ద్వారా ముస్లిం మతానికి చెందిన పురుషులను మూడు సంవత్సరాల వరకు జైల్లో నిర్బంధించడం, ఆ సమాజంలోని స్త్రీలను తమ పార్టీకి అనుకూలంగా మార్చుకొని వారి ఓట్లు పొందడమే ఈ చట్టం అసలు లక్ష్యం అనేది స్పష్టమే.

విడాకుల కారణంగా జైలుకు పంపడం అనేది ఏ మత సమాజంలోనూ లేదు. రచయిత ఈ అసలు సమస్యపై కేంద్రీకరించి, దానికి పరిమితమై కేంద్ర ప్రభుత్వంపైన, అది తెచ్చిన కొత్త చట్టంపైన విమర్శిస్తూ వివరించి ఉంటే బాగుండేది. ఆ విధంగా కాకుండా పైన వివరించిన విధంగా చర్చను పక్కదారి పట్టించడంతో ఆయన విమర్శ పూర్తిగా గురితప్పింది.

రచయిత నా వివరణను, విమర్శను సానుకూల దృక్పథంతో స్వీకరించి పునరాలోచించాలని కోరుతున్నాను. బిజెపి హిందూత్వ శక్తుల విద్వేషపూరిత విధానాలకు వ్యతిరేకంగా అన్ని మతాలకు చెందిన ప్రజలు ముందుకు వచ్చి ఉమ్మడిగా పోరాడవలసిన చారిత్రక అవసరం, అవశ్యకత నేడు ఎంతైనా ఉంది. ఈ సమస్యపై రచనలు దానికి తోడ్పడే విధంగా ఉండాలే కానీ, సమస్యను పక్కదారి పట్టించే విధంగా ఉండకూడదనేది నా అభిప్రాయం.

*(రచయిత సంపాదకుడు, పోరునేల ప్రచురణ సంస్థ)* వీ

## ఉపాధ్యాయ సంఘాల రాష్ట్రవ్యాప్త ధర్నాలు

ఉపాధ్యాయ, విద్యారంగ సమస్యల పరిష్కారంలో ప్రభుత్వం నిర్లక్ష్యం వహిస్తుందంటూ రాష్ట్ర వ్యాప్తంగా సెప్టెంబర్ 1న ఉపాధ్యాయ సంఘాల సంయుక్త కార్యాచరణ సమితి ఆధ్వర్యంలో బహిరంగ సభలు, ధర్నాలు, నిరసన ర్యాలీలు చేపట్టాయి. హైదరాబాద్‌లోని ఇందిరాపార్క్ వద్ద ధర్నాచౌక్‌లో ధర్నా చేశాయి. సిపిఎస్‌ను రద్దు చేయాలని, పిఆర్‌సి, ఐఆర్ ప్రకటించాలని, సిఎం గతంలో ఇచ్చిన హామీలను నెరవేర్చాలని డిమాండ్ చేశాయి. ఈ కార్యక్రమానికి వందలాది మంది ఉపాధ్యాయులు హాజరయ్యారు.

## కుల, మత రహిత అంశం పై సదస్సు

కులం, మతం లేని వారికోసం ప్రత్యేక చట్టం తెచ్చి జనగణనలో చేర్చాలని తమిళనాడుకు చెందిన న్యాయవాది స్నేహ డిమాండ్ చేశారు. సెప్టెంబర్ 3న హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో రాంకి, డేవిడ్, రూపలు కుల, మతరహిత అస్తిత్వం అంశంపై సమావేశాన్ని ఏర్పాటు చేశారు. క్రైస్తవులు, ముస్లింల తర్వాత కుల మతాలు చెప్పుకోలేనివారు ఉన్నారని, వారిని గుర్తించి ప్రభుత్వం విధానపరమైన నిర్ణయం తీసుకోవాలని డిమాండ్ చేశారు.

## కాలుష్య నియంత్రణ మండలి ముందు బాధితుల ధర్నా

విజయవాడలోని పిసిబి కార్యాలయంలో సెప్టెంబర్ 5న న్యాయ విచారణ జరిగింది. కడప జిల్లా తుమ్మలపల్లెలోని యురేనియం శుద్ధి కార్మాగారం పరిసర గ్రామాల బాధితులు, ప్రజా సంఘాల నాయకులు హాజరై బాధితుల తరఫున మానవహక్కుల వేదిక అధ్యక్షురాలు తదితరులు మాట్లాడారు. యురేనియం కార్పొరేషన్ ఇండియా లిమిటెడ్ అధికారులు పదిరోజుల పాటు తమ గ్రామాల్లో ఉండి, తాము తాగుతున్న నీరు తాగాలని, యురేనియం వ్యర్థాల వల్ల భూగర్భ జలం కలుషితమై పంటలు, పశు సంపద దెబ్బ తింటోందని, చర్మ, కీళ్ల సమస్యలు వస్తున్నాయని ఆవేదన వ్యక్తం చేశారు.

## నిర్వాసిత రైతుల నిర్బంధం

భూసేకరణ కోసం సర్వేకు ముందు నాగర్‌కర్నూలు జిల్లా కొల్లాపూర్ మండలం కుడికిళ్లకు సెప్టెంబర్ 5న 400 మంది పోలీసులు వచ్చి కొద్దిమంది ఇళ్లపై దాడిచేసి 40–50 మందిని కొల్లాపూర్ పోలీస్‌స్టేషన్‌కు తరలించారు. ఆ తరువాత రెవెన్యూ అధికారులు భూ సేకరణ కోసం సర్వేకు సిద్ధపడ్డారు. మిగిలిన రైతులు దీన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. చివరికి ఆత్మహత్యా యత్నానికి పాల్పడ్డారు. పాలమూరు-రంగారెడ్డి ఎత్తిపోతల పథకం భూ సేకరణలో అధికారులు, పోలీసుల తీరు ఇది. 2009లో కల్వకుర్తి ఎత్తిపోతల పథకం నిర్మాణానికి ఒకసారి సేకరించారు. మిషన్ భగీరథ పథకంలో భాగంగా మరికొన్ని భూములు సేకరించారు.

## శ్రీభాగ్ ఒప్పందం అమలు కోసం ర్యాలీ

శ్రీభాగ్ ఒప్పందం అమలు చేయాలంటూ ప్రజా సంఘాల ఆధ్వర్యంలో సెప్టెంబర్ 13న ప్రొద్దుటూరులోని గాంధీపార్కు నుండి పుట్టపర్తి సర్కిల్ సమీపంలో ఏర్పాటు చేసిన బహిరంగసభ వరకు ర్యాలీ కొనసాగింది. సభలో వక్తలు అభివృద్ధి కేంద్రీకృతమైందన్నారు. రాయలసీమ ఎడారిసీమగా మారకముందే ప్రజలు మౌనం వీడాలన్నారు. రాజధాని ప్రాంతం రాష్ట్రాల మధ్యలోనే ఉండాలనే పెద్దమనుషులు దేశంలోని 12 రాష్ట్రాల్లో వాటి రాజధాని మధ్యలో లేదనే విషయం గుర్తులేదా అని ప్రశ్నించారు. నాగార్జునసాగర్ డ్యాం కట్టినప్పుడే రాయలసీమ వాసులకు అన్యాయం జరిగిందన్నారు. ఉద్యమాలతోనే హక్కులను సాధించుకోవాలన్నారు.

## కశ్మీర్‌పై పౌరహక్కుల సంఘం సభ

'ఆర్టికల్ 370 రద్దు, కశ్మీర్ సమస్యకు పరిష్కారమా' అన్న అంశంపై బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో సెప్టెంబర్ 14న పౌరహక్కుల సంఘం ఆధ్వర్యంలో సభ జరిగింది. కశ్మీర్ ప్రత్యేక ప్రతిపత్తిని రద్దుచేసి సర్దార్ వల్లభాయ్‌పటేల్, శ్యామ్‌ప్రసాద్ ముఖర్జీ కలలు నిజం చేశామని సంఘ్ పరివార్ శక్తులు గొప్పలు చెప్పుకుంటున్నాయని, కశ్మీర్ ప్రజల కలను సాకారం చేశారో లేదో ఒక్కసారి ఆత్మ పరిశీలన చేసుకోవాలన్నారు. మోదీ ప్రభుత్వం కశ్మీర్ భూభాగాన్ని భారత్‌లో విలీనం చేసిందే తప్ప అక్కడి ప్రజల హృదయాలను గెలుచుకోలేక పోయిందని ప్రొ. హరగోపాల్ అన్నారు.

## పిల్లి సుభాష్‌కు నిరసన

1996లో వెంకటాయపాలెం శిరోముండనం కేసులో ఎ1 ముద్దాయి తోట త్రిమూర్తులును వైఎస్ఆర్‌సి పార్టీలో చేర్చుకోవడాన్ని నిరసిస్తూ దళిత ఐక్య పోరాట వేదిక ఆధ్వర్యంలో సెప్టెంబర్ 18న ద్రాక్షారామం వచ్చిన వైఎస్ఆర్‌సిపి నాయకుడు పిల్లి సుభాష్‌ను ఘెరావ్ చేశారు. తోట త్రిమూర్తులును పార్టీలోకి తీసుకుని శిరోముండనం బాధితులకు ఏ విధంగా న్యాయం చేస్తారని నిలదీశారు. ఈ కేసులో రాజీపడే ప్రసక్తే లేదన్నారు. అనంతరం అక్కడి నుండి 200 మందికి పైగా వివిధ సంఘాల కార్యకర్తలు, నాయకులు యానాం రోడ్డులోని అంబేద్కర్ విగ్రహం వరకు ర్యాలీ నిర్వహించి బాధితులకు న్యాయం జరిగేవరకు పోరాడతామని నినాదాలు చేశారు.

## యురేనియం తవ్వకాలతో సాగర్ కలుషితం

నల్లమలలో యురేనియం తవ్వకాలను వెంటనే నిలిపివేయాలని నల్లగొండ జిల్లా దేవరకొండలో విద్యార్థి జెఎసి ఆధ్వర్యంలో సెప్టెంబర్ 14న భారీ ర్యాలీ, రాస్తారోకో నిర్వహించారు. ఈ సందర్భంగా జెఎసి నాయకులు పెద్దగట్టు, నంభాపురం, చిత్రియాల గుట్టల్లో యురేనియం తవ్వకాలను చేపడితే నాగార్జునసాగర్, ఇఎంఆర్‌పి ప్రాజెక్టుల్లో నీరు పూర్తిగా కలుషితమయ్యే ప్రమాదం ఉందన్నారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు యురేనియం తవ్వకాల అనుమతులపై మొండి వైఖరిని వీడాలని డిమాండ్ చేశారు.

## పడవ ప్రమాదం

తూర్పుగోదావరి జిల్లా దేవిపట్నం మండలం కచ్చులూరు వద్ద సెప్టెంబర్ 15న వసిష్ట పున్నమిరాయల్ పడవ ప్రమాదంతో నీట మునిగింది. గోదావరిలో వరద నీటి ఉధృతికి బోటు తిరబడి నీటిలో మునిగింది. నదిలో నుంచి 26 మందిని గ్రామస్తులు, జాలర్లు రక్షించారు. పడవలో 8 మంది జాలర్లతో కలిపి 75 మంది ఉన్నట్లు తెలిపారు. సెప్టెంబర్ 21 నాటికి 34 మంది చనిపోయినట్లుగా గుర్తించారు. మిగతావారి జాడ తెలియలేదు.

## హిందుత్వ దాడి ఫాసిస్టు వ్యతిరేక వేదిక సదస్సు

హిందూ మతోన్మాద ఫాసిస్టు దాడికి వ్యతిరేకంగా సాంస్కృతిక, ప్రజా ప్రతిఘటన ఉద్యమాలు జరగాలని ఢిల్లీ యూనివర్సిటీ ప్రొ. షంషుల్ ఇస్లాం పిలుపునిచ్చారు. హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో 'హిందుత్వ ఫాసిస్టు దాడి వ్యతిరేక వేదిక' ఆధ్వర్యంలో సెప్టెంబర్ 22న ప్రదర్శనలు, సదస్సు జరిగింది. వక్త ప్రొ. షంషుల్ మైనారిటీలను, బిన్నాభిప్రాయాలు కలవారిని అణచివేస్తున్నారన్నారు. ఆచార, వ్యవహారాలను మెజారిటీ మతానికి అనుగుణంగా మార్చుకున్నారని ఆరోపించారు. ఇందులో దేశ వ్యాప్తంగా ఉన్న ఎనిమిది కళా సంఘాలు పాల్గొని ప్రదర్శనలిచ్చాయి.

## ఏజెన్సీలో ఎన్‌కౌంటర్‌లు

విశాఖ ఏజెన్సీలో సెప్టెంబర్ 22న గూడెంకొత్తవీధి మండలం గసడగుడ అటవీ ప్రాంతంలో పోలీసులకు మావోయిస్టులకు మధ్య జరిగిన కాల్పుల్లో ముగ్గురు మవోయిస్టులు మృతిచెందగా అందులో ఇద్దరు మహిళలు ఉన్నారు. ఈ ఎన్‌కౌంటర్ నుంచి తప్పించుకున్న మావోయిస్టులను పోలీసులు వెంబడించడంతో సెప్టెంబర్ 23న కొండజర్తి గ్రామానికి ఎగువన పేముల గొంది అటవీ ప్రాంతంలో కాల్పులు జరిగి మరో ఇద్దరు మావోయిస్టులు మృతిచెందారని చింతపల్లి ఎఎస్‌పి సతీష్‌కుమార్ తెలిపారు. వీ

### విలీనం పై బ్యాంకు ఉద్యోగుల దేశవ్యాప్త నిరసన

ప్రభుత్వ రంగ బ్యాంకులను విలీనం చేసి కుదించడం పట్ల బ్యాంకింగ్ ఉద్యోగ, కార్మిక సంఘాలు దేశ వ్యాప్తంగా అగస్ట్ 31న వివిధ బ్యాంకుల ప్రధాన కార్యాలయాలు, ప్రాంతీయ కార్యాలయాల ముందు ఆందోళన చేశాయి. తొమ్మిది బ్యాంకు ఉద్యోగ సంఘాలు కలిసి ఆందోళనచేశాయి. 27 ప్రభుత్వ రంగ బ్యాంకులను 12కు కుదించి విలీనం చేయడం వల్ల ఆర్థిక స్థిరత్వం ఏర్పడుతుందని, ఆర్థిక వ్యవస్థ ఆరోగ్యంగా ఉంటుందంటూ ప్రభుత్వం చేస్తున్న వాదనలను జెఏసి నాయకులు తప్పుపట్టారు.

### విలేకరిపై యుపి ప్రభుత్వం వేధింపులు

ఉత్తరప్రదేశ్ మిర్జాపూర్ జిల్లా సెయూర్‌లోని ప్రభుత్వ పాఠశాలలో మధ్యాహ్న భోజన పథకంలో జరుగుతున్న అన్యాయాన్ని వీడియో తీసిన పాత్రికేయులు పవన్ జైస్వాల్‌ను యుపి ప్రభుత్వం వేధింపులకు గురిచేస్తుంది. స్కూల్‌లోని చిన్నారులు మధ్యాహ్న భోజన సమయంలో రొట్టెముక్కలను ఉప్పుతో నంజుకొని తింటున్న దృశ్యాన్ని జైస్వాల్ వీడియోలో చిత్రించారు. దీంతో ప్రభుత్వం కక్షగట్టి జైస్వాల్‌తో పాటు గ్రామ ప్రధాన్ మరికొందరిపై ఐపిసి సెక్షన్ 186, 193 సెక్షన్లు పెట్టి కేసు బనాయించి వేధిస్తున్నారు. జర్నలిస్టులపై అక్రమకేసులు పెట్టి భయపెట్టే చర్యలు మానుకోవాలని ఢిల్లీ యూనియన్ ఆఫ్ జర్నలిస్ట్ అధ్యక్షులు ఎస్‌కె పాండే సెప్టెంబర్ 3న తెలిపారు.

### దేశద్రోహ చట్టం రద్దుచేయాలి !

దేశద్రోహ చట్టాన్ని రద్దుచేయాలని సుప్రీంకోర్టు న్యాయమూర్తి జస్టిస్ దీపక్‌గుప్తా అన్నారు. ప్రభుత్వం తీరుపై విమర్శలు చేసేవారిని అణచివేయాలని చూస్తే ఇండియా పోలీస్ రాజ్యంగా మారుతుందని ఆందోళన వ్యక్తంచేశారు. దేశద్రోహ చట్టం చాలా సందర్భాల్లో దుర్వినియోగం అవుతోందన్నారు. అధికారంలో ఉన్నవారిని విమర్శిస్తే అరెస్ట్ చేయడం పోలీసులకు ఆనవాయితీగా మారిందన్నారు. భావ ప్రకటన స్వేచ్ఛ ఉన్న చాలా దేశాల్లో దేశద్రోహ చట్టం రద్దయిందన్నారు. సెప్టెంబర్ 8న అహ్మదాబాద్‌లో ప్రలీమ్ పబ్లిక్ చారిటెబుల్ ట్రస్ట్ ఆధ్వర్యంలో 'ది లా ఆఫ్ సెడిషన్ ఇన్ ఇండియా అండ్ ఎక్స్‌ప్రెషన్' అనే అంశంపై జస్టిస్ దీపక్‌గుప్తా ప్రసంగించారు.

### భీమా కోరేగాం కేసులో ప్రొఫెసర్ ఇంట్లో సోదాలు

భీమా కోరెగాం కేసులో ఢిల్లీ యూనివర్సిటీ అసిస్టెంట్ ప్రొఫెసర్, సామాజిక కార్యకర్త డా. హనీబాబు ఇంట్లో పుణె పోలీసులు సెప్టెంబర్ 10న సోదాలు నిర్వహించారు. నోయిడాలోని హనీబాబు నివాసం నుంచి మూడు పుస్తకాలు, ల్యాప్‌టాప్, మొబైల్ ఫోన్, పెన్‌డ్రైవ్స్ స్వాధీనం చేసుకున్నామని ఎసిపి తెలిపారు. భీమా కోరెగాం కేసులో సంబంధం ఉందన్న అనుమానంతో పోలీసులు ఈ సోదాలు చేసినట్లు తెలిపారు.

### ఛత్తీస్‌గఢ్‌లో ఎన్‌కౌంటర్

ఛత్తీస్‌గఢ్ దంతేవాడ జిల్లాలోని కిరందోల్ పరిధిలోని కుటేరాం అటవీ ప్రాంతంలో కూంబింగ్‌కు వెళ్లిన పోలీసులకు మావోయిస్టులకు సెప్టెంబర్ 14న జరిగిన కాల్పుల్లో ఇద్దరు మావోయిస్టులు మృతిచెందారని అదే రోజు బీజాపూర్ ఆవుపల్లి పరిధిలోని పున్నూర్ అటవీ ప్రాంతంలో జరిగిన పోలీసు కాల్పుల్లో ఒక మావోయిస్టు మృతిచెందారని పోలీసు అధికారులు తెలిపారు.

### తబ్రేజ్ హత్య నిందితులపై కేసు కొట్టివేత

తబ్రేజ్ అన్సారీ మూక హత్య కేసులో పోస్ట్ మార్టం తుది నివేదికలో తాబ్రేజ్ అన్సారీ చనిపోవడానికి కారణం గుండెపోటు అని అ నివేదిక తెలిపింది. నివేదిక ఆధారంగా ఈ కేసులో 11 మందిపై ఉన్న హత్యారోపణ లను పోలీసులు సెప్టెంబర్ 10న కొట్టివేశారు. ఈ మేరకు చార్జిషీటును పోలీసులు న్యాయస్థానంలో సమర్పించారు. సెక్షన్ 302 కింద కాకుండా సెక్షన్ 304 కింద కేసు విచారణ చేయాలని పోలీసులు అందులో ప్రతిపాదించారు. పోస్టుమార్టం నివేదికపై తాబ్రేజ్ కుటుంబీకులు, సామాజిక కార్యకర్తలు ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. దీని వెనుక రాజకీయ ఒత్తిడి ఉందనే అనుమానాలు వ్యక్తం చేస్తున్నారు.

### జార్ఖండ్‌లో మరో మూక దాడి

జార్ఖండ్‌లోని సాహిబ్‌గంజ్ జిల్లా కుచిపహాడ్‌లో చిన్న పిల్లలను ఎత్తుకెళ్తున్నాడనే అనుమానంతో సెప్టెంబర్ 19న ఓ వృద్ధుడిని కట్టేసి కొట్టారు గ్రామస్తులు. ఆయన తీవ్రంగా గాయపడడంతో ఆసుపత్రికి తీసుకెళ్లేలోగానే మృతిచెందాడు. ఆయన ఎవరనేది తెలుసుకోగా గ్రామాల్లో తిరుగుతూ భిక్షాటన చేస్తుంటాడని తెలిసింది. కుంతి జిల్లా జల్టండ్ సోరీలో సెప్టెంబర్ 22న గోవధకు పాల్పడ్డారంటూ పుకార్లతో గోరక్షకులు కలంతుస్ బర్ల, ఫిలిప్ హోరొ, పాగు కచ్‌చాప్‌లను మూకలు చితకబాదారు. తీవ్రంగా గాయపడిన వారిని స్థానికులు ఆసుపత్రికి తీసుకెళుతుండగానే కలంతుస్ బర్ల మృతిచెందారు. మిగిలిన ఇద్దరు ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు.

### జాదవ్‌పూర్ యూనివర్సిటీలో కేంద్ర మంత్రికి నిరసన

కేంద్ర మంత్రి బాబుల్ సుప్రియోను పశ్చిమ బెంగాల్‌లోని జాదవ్‌పూర్ విశ్వవిద్యాలయంలోకి రాకుండా సెప్టెంబర్ 19న విద్యార్థి సంఘాలు అడ్డుకున్నాయి. నల్లజెండాలు చూపించి వెనక్కి వెళ్లిపోవాలని నినాదాలు చేశారు. ఇక్కడ ఎబివిపి ఏర్పాటు చేసిన సదస్సులో పాల్గొనేందుకు బాబుల్ సుప్రియో వచ్చారు. ఆయన్ని వామపక్ష విద్యార్థి సంఘాలు అడ్డుకోవడంతో ఈ విషయం తెలిసిన గవర్నర్ విశ్వవిద్యాలయానికి వచ్చారు. ఆయనను కూడా విద్యార్థులు అడ్డుకుని నినాదాలు చేశారు. ఎబివిపి విద్యార్థులు విశ్వవిద్యాలయంలోని ఫర్నిచర్‌ను ధ్వంసం చేశారు.

### బొగ్గు గని కార్మికుల సమ్మె

బొగ్గు తవ్వకాలు, అమ్మకాల్లో నేరుగా 100 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల (ఎఫ్‌డిఐ)ని అనుమతిస్తూ కేంద్ర ప్రభుత్వం నిర్ణయం తీసుకున్నది. ఈ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ సెప్టెంబర్ 24న దేశ వ్యాప్తంగా బొగ్గు గని కార్మికులు చేపట్టిన సమ్మె విజయవంతమైందని సెంటర్ ఆఫ్ ట్రేడ్ యూనియన్స్ (సిఐటియు) పేర్కొంది. సమ్మెతో కోల్ ఇండియా లిమిటెడ్ (సిఐఎల్), సింగరేణి కాలరీస్‌లో ఉత్పత్తి పూర్తిగా నిలిచిపోయిందని కార్మిక సంఘాలు ప్రకటించాయి. బొగ్గు గనులను ప్రైవేటు సంస్థలకు అప్పగించాలనే ప్రభుత్వ నిర్ణయం ద్వారా దేశీయ, విదేశీ కార్పొరేట్ యాజమాన్యాలకు మాత్రమే మోడీ ప్రాధాన్యత అనేది మరోసారి స్పష్టమైందని, దేశభక్తి, జాతీయవాదం అనేవి ప్రజలను మోసగించేందుకు అని సిఐటియు పేర్కొంది. ఐదు లక్షల మంది కార్మికులతో కూడిన సిఐఎల్, సింగరేణి కాలరీస్‌కు చెందిన ఐదు ఫెడరేషన్లు సమ్మెకు పిలుపునిచ్చాయి. అస్సాం నుండి సింగరేణి వరకు ఉన్న అన్ని గనుల్లో ఉత్పత్తి రవాణా, పంపిణీ పూర్తిగా నిలిచి పోయిందన్నారు.

### మహారాష్ట్ర, హర్యానా అసెంబ్లీ ఎన్నికలు

మహారాష్ట్ర, హర్యానా అసెంబ్లీ ఎన్నికలను అక్టోబర్ 21న పోలింగ్ నిర్వహించి, అదే నెల 24న ఫలితాలను వెల్లడిస్తారు. ఈ రెండు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలతో పాటు దేశంలోని 18 రాష్ట్రాల్లో 64 అసెంబ్లీ స్థానాలు, బీహార్‌లోని ఒక పార్లమెంట్ స్థానానికి ఎన్నికల షెడ్యూల్ కేంద్ర ఎన్నికల సంఘం ఖరారు చేసింది. ఈ విషయాన్ని ఢిల్లీలోని కేంద్ర ఎన్నికల సంఘం కార్యాలయంలో సెప్టెంబర్ 21న ఎన్నికల కమిషనర్లు విలేకరుల సమావేశంలో తెలిపారు. మహారాష్ట్రలో 288, హర్యానాలో 90 అసెంబ్లీ స్థానాలకు ఎన్నికలు ఒకే దశలో నిర్వహిస్తామన్నారు. వీ

### బ్రిటన్‌లో ప్రతిష్టంభన

యురోపియన్ యూనియన్ నుంచి బ్రిటన్ ఎలాంటి ఒప్పందం కుదుర్చుకోకుండా వైదొలగాలనే ప్రతిపాదన (బ్రెగ్జిట్)పై తీవ్ర ప్రతిష్టంబన నెలకొన్నది. ప్రధాని బోరిస్ జాన్సన్ 'నో డీల్' పై బ్రిటన్‌లో తీవ్ర నిరసన వ్యక్తమవుతోంది. బ్రెగ్జిట్‌పై పార్లమెంట్‌లో చర్చ జరగాలని ప్రతిపక్షాలు పట్టుబట్టాయి. అక్టోబర్ 14 వరకు పార్లమెంట్ సమావేశాలను రద్దు చేసి అక్టోబర్ 15న పార్లమెంట్‌కు ఎన్నికలు జరిపాలని ఆగస్ట్ 28న జాన్సన్ ప్రతిపాదించారు. దీన్ని ప్రతిపక్షాలు తిరస్కరించాయి. బ్రెగ్జిట్‌పై పార్లమెంట్‌లో చర్చ జరగాలని పట్టుబట్టాయి. పార్లమెంట్ సమావేశాల రద్దు రాజ్యాంగ విరుద్ధమని, దీన్ని వ్యతిరేకిస్తూ కోర్టులో ప్రతిపక్షాలు పిటిషన్లు దాఖలు చేశాయి. దీనిపై యుకె కోర్టు తీవ్రంగా స్పందించింది. పార్లమెంట్ సమావేశాలను రద్దు చేయడం చట్టవిరుద్ధమని, ప్రజా ప్రయోజనాల దృష్ట్యా ఎలాంటి ఆటంకం కల్గించకుండా నిర్వహించాలని ఆదేశించింది. అక్టోబర్ 31 లోపు ఇయు నుంచి బ్రిటన్ వైదొలగాల్సి ఉంది.

### అమెజాన్ అడవిని బుగ్గిచేస్తున్న కార్చిచ్చు

బ్రెజిల్‌లోని అమెజాన్ అడవుల్లో రెండు నెలలుగా కార్చిచ్చు దావాలనంలా చెలరేగుతోంది. ఇప్పటి వరకు దాదాపు లక్షల ఎకరాల్లో అడవి బుగ్గిపాలైంది. ఎన్నో జీవజాతులు, వృక్షాలు కాలిపోయాయి. ముందుగా ఎటువంటి విదేశీ ఆర్థిక సాయాన్ని తిరస్కరించిన బ్రెజిల్ ప్రజల నుంచి వచ్చిన తీవ్ర ఒత్తిడి కారణంగా అంగీకారం తెలిపింది. ఈ మేరకు అధ్యక్షుడు బొల్సోనారో అధికారిక ప్రకటన చేశారు. మంటలను ఆర్పేందుకు జీ-7 దేశాలు ప్రత్యేక హెలికాప్టర్‌లు, 22 మిలియన్ డాలర్ల సహాయాన్ని అందజేశాయి.

### పర్యావరణ పరిరక్షణకు విద్యార్థుల నిరసన ర్యాలీ

పర్యావరణ పరిరక్షణ కోసం విద్యార్థులు న్యూయార్క్‌లోని ఐక్యరాజ్య సమితి కార్యాలయం ఎదుట నిరసన ప్రదర్శనలు నిర్వహించారు. వినాశకరమైన వాతావరణ మార్పులను నిరోధించేందుకు పటిష్టమైన చర్యలు చేపట్టాలని డిమాండ్ చేస్తూ ఆగస్ట్ 29న 'ఫ్రైడే ఫర్ ఫ్యూచర్' పేరుతో ఉద్యమాన్ని ప్రారంభించారు. భవిష్యత్ గురించి జాగ్రత్తలు తీసుకోవాలనే ప్రతి ఒక్కరూ ఈ ఉద్యమంలో పాల్గొనాలని నిరసనకారులు పిలుపునిచ్చారు.

### చిలేలో ప్రాథమిక హక్కులకై పోరాటం

చిలేలో ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రజా వ్యతిరేక విధానాలను నిరసిస్తూ ప్రజలు ఆందోళన బాటపట్టారు. విద్యా, ఆరోగ్యం, నివాసం, ఉపాధి, పింఛన్ లాంటి ప్రాథమిక హక్కులను పౌరులకు కల్పించాలని డిమాండ్ చేస్తూ సెప్టెంబర్ 5న వేలాది మంది రాజధాని శాంటియాగోలో నిరసన ప్రదర్శనలు నిర్వహించారు. ఈ నిరసనలో అనేక సామాజిక సంఘాలు, కార్మిక సంఘాలు, ప్రతిపక్ష పార్టీలు పాల్గొన్నాయి. ఆందోళనకారులను పోలీసులు అడ్డుకొని వందలాది మందిని అరెస్టు చేశారు. చిలే అధ్యక్షుడు సెబాస్టియన్ పినెరా ప్రవేశపెట్టిన మూడు కార్మిక వ్యతిరేక బిల్లులను తీరస్కరిస్తూ ప్రజలు ఈ ఆందోళనల్లో పాల్గొన్నారు.

### అఫ్ఘనిస్తాన్‌లో చర్చలు రద్దు

అఫ్ఘనిస్తాన్‌లో దశాబ్దాలుగా కొనసాగుతున్న అంతర్యుద్ధానికి తెరదించి శాంతి పునరుద్ధరణకు తాలిబన్లతో ప్రారంభించిన చర్చలను రద్దు చేస్తున్నట్లు అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ ప్రకటించారు. దీంతో మళ్లీ యుద్ధ ఛాయలు అలుముకున్నాయి. అఫ్ఘనిస్తాన్, అమెరికా భద్రతా దళాలకూ, తాలిబన్‌లకూ మధ్య తీవ్ర పోరు నడుస్తోంది. అఫ్ఘనిస్తాన్‌లో తాలిబన్ల ఏరివేతకు అమెరికా, నాటోకు చెందిన 17 వేల మంది సైనికులు ఉన్నారు. అమెరికా జరిపిన వైమానిక దాడుల్లో వేలాది మంది పౌరులు మరణించారు. అనేక మంది తీవ్రంగా గాయపడ్డారు. మరోవైపు అఫ్ఘనిస్తాన్ నుంచి విదేశీ వైదొలగేంత వరకు తమ దాడులు కొనసాగుతాయని తాలిబన్ దళాలు ప్రకటించాయి.

### సౌదీ అరేబియాలో ఆయిల్ కంపెనీలపై దాడి

సౌదీ అరేబియాలోని ప్రభుత్వ ఆయిల్ కంపెనీ ప్లాంట్‌లపై దాడులు జరిగాయి. సెప్టెంబర్ 14న తూర్పు సౌదీ అరేబియాలోని సౌదీ ఆరాంకో ప్రాసెసింగ్ ప్లాంట్‌లను లక్ష్యంగా చేసుకొని డ్రోన్లతో దాడి జరిగింది. ఈ దాడికి పాల్పడింది తామేనని హౌతీ తిరుగుబాటుదారులు ప్రకటించారు. బుఖ్యాక్‌లోని ప్రపంచంలోనే అతిపెద్ద చములు శుద్ధి కేంద్రం ఈ దాడిలో బాగా దెబ్బతిన్నది. ఈ ప్రాంతం నుంచి రోజుకు దాదాపు 70 లక్షల బ్యారెళ్ల క్రూడ్ ఆయిల్ శుద్ధి జరుగుతుంది.

### ట్యునీషియాలో అధ్యక్ష ఎన్నికలు

ట్యునీషియాలో సెప్టెంబర్ 15న అధ్యక్ష పదవికి ఎన్నికలు జరిగాయి. అధ్యక్ష పదవి కోసం 24 మంది పోటీ పడ్డారు. 70 లక్షల మంది తమ ఓటు హక్కును వినియోగించుకున్నారు. అధ్యక్షుడు బెజీ సైడ్ ఎస్సెబ్సీ జూలై 25న మరణించడంతో అధ్యక్ష పదవికి పోటీ ఏర్పడింది. అధ్యక్ష పదవి చేపట్టాలంటే అభ్యర్థికి యాభై శాతానికి పైగా ఓట్లు రావాలి. ఈ ఎన్నికల్లో అత్యధికంగా స్వతంత్ర అభ్యర్థి కైస్ సయీద్‌కు 18 శాతం ఓట్లు రాగా, ప్రముఖ జర్నలిస్టు నబీల్ కరౌవీకి 16 శాతం ఓట్లు వచ్చాయి. ఏ అభ్యర్థికి పూర్తి మెజారిటీ రాకపోవడంతో అక్టోబర్‌లో మరోమారు ఎన్నికలు నిర్వహించాలని నిర్ణయించారు.

### ఇజ్రాయిల్‌లో ఎన్నికలు

ఇజ్రాయిల్ పార్లమెంట్‌కు సెప్టెంబర్ 15న ఎన్నికలు జరిగాయి. మొత్తం పార్లమెంట్‌లో 120 సీట్లు ఉండగా ప్రధాని బెంజిమెన్ నెతన్యాహూ నేతృత్వంలోని లికుడ్ పార్టీకి 32 సీట్లు లభించగా, ఆయన ప్రత్యర్థి బెన్నీ గాంట్జ్ పార్టీ బ్లూ అండ్ వైట్ పార్టీకి కూడా అన్నే సీట్లు వచ్చాయి. ప్రధాన ప్రతిపక్షం అరబ్ జాయింట్ లిస్ట్ అలయెన్స్‌కి 12 స్థానాలు, నేషనలిస్ట్ ఇజ్రాయిల్ బీటెన్యూకు 9 స్థానాలు లభించాయి. ఏ పార్టీకి సంపూర్ణ మెజారిటీ రాకపోవడంతో సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటు అయ్యే అవకాశాలు ఉన్నాయి.

### ఈజిప్ట్‌లో నిరసనలు

ఈజిప్ట్ అధ్యక్షుడు అబ్దేల్ ఫతా అల్ సిసికి వ్యతిరేకంగా దేశంలో నిరసన ప్రదర్శనలు జరిగాయి. సెప్టెంబర్ 20న రాజధాని కైరో నగరంలో వేలాది మంది ప్రజలు వీధుల్లోకి వచ్చి ఆందోళనలు చేశారు. అధ్యక్షుడు సిసి పాలనలో అవినీతి, అణచివేత తీవ్రమయ్యాయనీ, ప్రశ్నిస్తున్న వారినీ అన్యాయంగా జైళ్లలో పెడుతున్నారనీ ఆరోపించారు. సిసినీ వెంటనే అధ్యక్ష పదవి నుంచి తొలగించాలని డిమాండ్ చేశారు.

### థామస్ కుక్ దివాలా

ప్రముఖ బ్రిటిష్ పర్యాటక సంస్థ థామస్ కుక్ తీవ్ర సంక్షోభంలో చిక్కుకుంది. 178 ఏళ్ల చరిత్ర కలిగిన ఈ కంపెనీ తీవ్ర నష్టాలతో దివాలా తీసింది. దీనికి పరోక్షంగా బ్రెగ్జిట్ కూడా కారణమని ఆ సంస్థ చీఫ్ ఎగ్జిక్యూటివ్ పీటర్ ఫాంక్‌హౌజర్ అన్నారు. నష్టాల నుంచి గట్టెక్కాలంటే థామస్ కుక్‌కు 227 మిలియన్ యూరోలు అవసరమని అన్నారు. సంస్థ మూతపడడంతో 16 దేశాల్లో పనిచేస్తున్న ఇరవై రెండు వేల మంది ఉద్యోగులు రోడ్డున పడ్డారు. ప్రపంచవ్యాప్తంగా తన విమాన సేవలను నిలిపివేస్తున్నట్లు బ్రిటిష్ సివిల్ ఏవియేషన్ అథారిటీ ప్రకటించింది. 1841లో థామస్ కుక్‌ను ఇంగ్లండ్‌లో ప్రారంభించారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగానూ వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(ఆగస్ట్ 1 నుండి ఆగస్ట్ 31, 2019 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (976), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (954) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1930)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | - | 1 | - | 17 | 12 | 9 | 6 | 7 | 2 | 1 | 2 | 3 | 1 | 2 | 28 | 31 | - | - | - | 2 | 3 |
| హైదరాబాద్ | - | - | - | 11 | 10 | 6 | 8 | 4 | 4 | 5 | 5 | 7 | 5 | 5 | 41 | 17 | - | - | - | - | - |
| కరీంనగర్ | - | 2 | - | 6 | 11 | 3 | 4 | 3 | 2 | 3 | 2 | 3 | 3 | 4 | 17 | 9 | - | - | - | - | 3 |
| ఖమ్మం | - | 1 | - | 4 | 12 | 3 | 11 | 3 | - | - | 1 | 1 | 1 | 4 | 13 | 16 | 1 | - | - | - | - |
| మహబూబ్‌నగర్ | - | - | 1 | 2 | 4 | 1 | 1 | 3 | 2 | 2 | 4 | 1 | 4 | 11 | 39 | 1 | - | - | - | - | 3 |
| మెదక్ | 1 | 9 | 2 | 6 | 9 | 9 | 4 | 8 | 2 | 3 | 4 | 4 | 2 | 17 | 17 | 23 | - | - | - | 5 | 3 |
| నల్గొండ | - | 3 | - | 5 | 7 | 4 | 7 | 2 | 2 | 4 | 2 | 4 | 3 | 5 | 28 | 11 | - | - | - | - | 3 |
| నిజామాబాద్ | - | 4 | - | 8 | 8 | 3 | 5 | 2 | 3 | 4 | 3 | 4 | - | 5 | 16 | 12 | - | - | - | - | 4 |
| వరంగల్ | - | 3 | 6 | 3 | 5 | 3 | 2 | 3 | 1 | 2 | 2 | 5 | 9 | 11 | 18 | 20 | - | - | - | 1 | 2 |
| వికారాబాద్ | - | 3 | - | 6 | 8 | 4 | 6 | 4 | 2 | 4 | 4 | 5 | 8 | 6 | 23 | 16 | - | - | - | - | 2 |
| **తెలంగాణ** | **1** | **26** | **9** | **68** | **86** | **45** | **54** | **39** | **20** | **28** | **29** | **37** | **36** | **70** | **240** | **156** | **1** | **-** | **-** | **8** | **23** |
| అనంతపురం | - | 7 | - | 10 | 29 | 1 | 1 | 3 | 1 | 3 | 1 | 8 | 10 | 9 | 39 | - | - | - | - | - | - |
| చిత్తూరు | - | - | - | 7 | 7 | - | - | - | - | 5 | 7 | 2 | 1 | 5 | 31 | 2 | - | - | - | - | - |
| కడప | - | 3 | - | 3 | 10 | - | - | - | - | 5 | 1 | 1 | 1 | 3 | 5 | 7 | - | - | - | - | - |
| గుంటూరు | - | 5 | - | 4 | 6 | 4 | 3 | - | 2 | 4 | 4 | 5 | 2 | 5 | 16 | 13 | - | - | - | - | - |
| కృష్ణా | - | - | - | 6 | 7 | 4 | 5 | 2 | 2 | 4 | 2 | 4 | - | 5 | 13 | 10 | - | - | - | - | 3 |
| కర్నూలు | - | 2 | - | 5 | 6 | 4 | 4 | - | 2 | 4 | 2 | 4 | - | 7 | 13 | 11 | - | - | - | - | 2 |
| తూర్పు గోదావరి | - | - | - | 1 | 4 | 7 | 4 | 2 | 1 | 2 | 2 | 3 | 5 | 13 | 16 | 22 | 1 | - | - | - | - |
| ప్రకాశం | - | 6 | - | 6 | 8 | 2 | 5 | 2 | 1 | 2 | 1 | 3 | 1 | 11 | 37 | 15 | - | - | - | - | - |
| శ్రీకాకుళం | - | 1 | - | 2 | 3 | 5 | 6 | 3 | 1 | 6 | - | 1 | 2 | 6 | 11 | 15 | - | - | - | - | 6 |
| పశ్చిమ గోదావరి | - | 2 | - | 4 | 5 | 3 | 4 | 1 | 2 | 4 | 1 | 3 | 1 | 3 | 13 | 12 | - | - | - | - | 5 |
| నెల్లూరు | - | 2 | - | 7 | 6 | 4 | 3 | 2 | - | - | 1 | 4 | - | 2 | 24 | 10 | - | - | - | - | - |
| విజయనగరం | - | - | - | 3 | 4 | 3 | 6 | 3 | 1 | 2 | 1 | 1 | - | 2 | 14 | 15 | - | - | - | - | 4 |
| విశాఖపట్నం | - | - | - | 7 | 11 | 2 | 4 | - | - | 4 | 2 | 2 | 7 | 3 | 22 | 12 | - | - | - | 6 | - |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **28** | **-** | **65** | **106** | **39** | **45** | **18** | **13** | **45** | **25** | **41** | **30** | **74** | **254** | **144** | **1** | **-** | **-** | **6** | **20** |

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 219 - October 2019 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/9/2019 • Postal Regn. No. HD/1100/2017-19

Date of Posting : 29th, 30th



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao